# విజ్ఞప్తి

భగవత్సాక్షాత్కారమే జీవితోద్దేశమని శ్రీరామకృష్ణపరమహంస ఉపదేశించారు. అది అందరికీ సాధ్యమే అని ఆయన నొక్కి వక్కాణించారు. అంతే గాక సాకారంగా భావించబడే భగవంతుడూ, నిరాకార బ్రహ్మమూ – రెండూ ఒక్క తత్త్వమే అని ఆయన ఉద్ఘాటించారు. మన శాస్త్రాలు కూడా ప్రతిదినం సకల జనులు బ్రహ్మమును అనుభూతి చెందుతూనే ఉంటారు. కాని వారు దానిని గుర్తించకపోవడం చేత, బ్రహ్మాన్ని సాక్షాత్కరించుకోవడానికి యత్నించరు. ఆహా! ఏమి ఈ అద్భుతమైన మాయా ప్రభావం అని విస్తుపోతారు.

ఉపనిషత్తులను పరిశీలిస్తే ఆ కాలంలో బ్రహ్మ సాక్షాత్కారం మనదేశంలో సిద్ధాంతంగానూ, అనుభవంగానూ – అందరికీ అందుబాటులో ఉండేదని తెలుస్తుంది. శ్రీ శంకరభగవత్పాదులు మరల అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించిన కొద్ది శతాబ్దాలకే అనుభవం మీది శ్రద్ధ పోయి ప్రత్యర్థి పరాభవం పైన, సిద్ధాంత ప్రతిష్ఠాపనం పైన మనస్సు కేంద్రీకృతమైంది. కాగా ద్వైతానుభవాన్ని బోధించే సిద్ధాంతాలు కూడా బహుళములయ్యాయి.

ఆధునిక కాలంలో భౌతికవిజ్ఞాన విజృంభణ వల్ల మరల అద్వైత తత్త్వానికి, అనుభవ ప్రాముఖ్యతకు కూడా పరపతి పెరుగుతోంది. భారతదేశంలో విజ్ఞాన శాస్త్రానికి, తత్త్వశాస్త్రానికి ఏనాడూ విరోధం లేదు. కాగా అవి పరస్పర సహకార కాలై వర్ధిల్లాయి. అట్టి అద్వైత తత్త్వమును బోధించే గ్రంథాలలో పంచదశి ప్రాశస్త్యం సర్వజన విదితమే. కాని ఇప్పటివరకు అది వాదప్రతివాద యుద్ధరంగంలో పాల్గొనే యోద్ధలకు మాత్రమే పరిమితమైంది తప్ప, సాధారణ జనులకు అద్వైతానుభవానికి దారి చూపే మార్గదర్శిగా ఎవరూ దానిని గమనించలేదు.

ఎల్లరకు నిత్యం అనుభవంలో ఉండే 'అహం' 'నేను' అనే భావంతో మొదలు పెట్టి శ్రద్ధతో అభ్యాసం చేస్తే ప్రత్యగాత్మ అందరికీ అనుభవగతమవుతుంది. అదే పరబ్రహ్మమని దైవానుగ్రహంతో యథాకాలంలో బోధపడగలదు.

వివేకం గలవారంతా ఈ ప్రయత్నం చేసి భగవత్కృపా బలంతో పురుషార్థ సిద్ధిని పొందుతారనే విశ్వాసంతో సరళ సుందరమైన ఈ గ్రంథాన్ని పాఠక జనులకు సమర్పిస్తున్నాము.

**– ప్రకాశకులు**

# విషయ సూచిక

# ఉపోద్ఘాతము

శ్రీరామకృష్ణులు పంచదశి మొదలైన గ్రంథాలను సాధకులు మిక్కిలిగా అధ్యయనం చేయడాన్ని ప్రోత్సహించేవారు కాదు. ఈ గ్రంథాలన్నీ ఔపోశన పట్టితే గాని మోక్షం సిద్ధించదు అనే వాదాన్ని ఆయన పూర్తిగా వ్యతిరేకించేవారు. శాస్త్రాధ్యయనపు ఉపయోగమంతా ఉత్తరం యొక్క ఉపయోగం వంటిదే అని వారి ఉపదేశం (P.729). ఏవైనా వస్తువులు కావాలని ఎవరైనా మనకు ఉత్తరం వ్రాస్తే, ఆ ఉత్తరం చదివి అవతల పడేస్తాం. బజారుకు పోయి ఆయా వస్తువులు సేకరించే ప్రయత్నం చేస్తాం. అంతేగాని రోజూ ప్రొద్దున్నే లేచి ఆ ఉత్తరాన్ని పారాయణ చేస్తూ కూచోం కదా! అలాగే శాస్త్రాలన్నీ మోక్షమార్గమేమిటో మనకు చెపుతాయి. ఆ మార్గం తెలుసుకున్నాక నడుం బిగించి ఆ మార్గాన్ని అనుసరించితేనే ప్రయోజనం గాని, ఆ మార్గాన్ని గూర్చి తర్క వితర్కాలూ వాదోపవాదాలూ చేస్తూ కాలహరణం చేయడం నిరర్థకమే కదా. మహా అయితే పై జెప్పిన ఉత్తరంలోని విషయాలు మరచిపోతే కంగారుగా ఆ ఉత్తరం కోసం మళ్ళీ వెదికి దానిని ఎలాగ చదువుతామో అలాగే మోక్షమార్గాన్ని అవలంబి స్తున్నపుడు మనకు కలిగే సంశయాలను తీర్చుకోడానికి శాస్త్రగ్రంథాలను పునః పునః పరిశీలించవచ్చు.

మోక్షమార్గాన్ని అవలంబించేవారికి, అంటే సాధకులకు, సంశయ నివృత్తికీ మార్గనిర్దేశానికీ ఉపయోగ పడడమే శాస్త్రగ్రంథాల ఉద్దేశం. సాధనలో సిద్ధిపొందిన గురువు యొక్క ఉపదేశాలనూ శాస్త్రవాక్యాలనూ సమన్వయం చేసుకుంటూ వానిపై శ్రద్ధ ఉంచి దీక్షతో సాధనచేయడం అవసరం. చిత్తశుద్ధి లేనిదే శాస్త్రవాక్యాలు సులభంగా మనసు కెక్కవు, నూనె అంటిన కాగితం మీద సిరా అంటనట్లు. గురువులు వాత్సల్యంతో అనుగ్రహించి విషయాలను ఎత్తి చూపి వివరించగలరు. కానీ "ఊరికే మాటలు విని ఏమి లాభం? ఏమైనా చేయి." (P.902) కొంత సాధన చేస్తే అపుడు క్రమంగా అన్నీ తెలుస్తాయి. గురువుల నుండి శాస్త్రం వింటే మరింత చక్కగా అర్థమవుతుంది. (P.476) అలాంటి సద్గురువులు దొరకనపుడు శాస్త్ర గ్రంథాలను మళ్ళీ మళ్ళీ చదివి సరిగ్గా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించవలసి ఉంటుంది. కాని సాధన లేకపోతే ఆ శాస్త్రోపదేశాలను సరిగ్గా గ్రహించలేము. మరి ఈ విషవలయం నుండి బయటపడడం ఎలాగ? శాస్త్రం అర్థమై మార్గం తెలిస్తే గాని సాధన చేయలేం. సాధన చేస్తేగాని శాస్త్రం అర్థం కాదు. మరి? దీనికి సమాధానం;

రెండూ ప్రక్కప్రక్కనే నడవవలసి ఉంటుంది. ఎంతగా సాధన చేస్తుంటే అంతగా శాస్త్రవాక్యాలు అవగాహన అవుతాయి. అర్థమైన ఆ శాస్త్రజ్ఞానాన్ని సాధనలో ఎంతగా అమలు చేస్తూ ఉంటే అంతగా సాధన మెరుగు పడుతుంది, శీఘ్రంగా ఫలవంత మవుతుంది. "ఊరికే శాస్త్ర గ్రంథాలు చదివితే చాలదు. ప్రపంచం పట్ల ఆసక్తి (attachment to the world) ఉంటే ఆ గ్రంథాల అసలు ఉద్దేశం అర్థం కాదు" (P.200) అని శ్రీరామకృష్ణులు. ఉత్కంఠతో ఏకాంతంలో భగవత్ప్రార్థన చేస్తుంటే తప్ప శ్రీరామకృష్ణుల మాటలు కూడా అర్థం కావు. (P.844)

శ్రీరామకృష్ణులూ, రమణమహర్షి వంటి సద్గురువులు లభించనపుడు ఇక మనకు శాస్త్రగ్రంథాలే శరణ్యాలవుతాయి. అయితే గురూపదేశాలను కాలక్షేపం కోసం కాక సాధన కోసం విన్నట్లే శాస్త్రాధ్యయనం కూడా కేవలం ఆనందం కోసం కాక సాధనకై చేసినపుడే ఆ అధ్యయనం సార్థకమవుతుంది. గురువాక్యాల పట్ల శ్రద్ధ ఉంచి వారు చెప్పే విషయాలను విశ్వసించినట్లే శాస్త్రవాక్యాలపై విశ్వాసంతో వాటిని ఆచరించవలసి ఉంటుంది. "గురువును కేవలం మానవమాత్రుడుగా భావించ రాదు. ఆ సచ్చిదానందబ్రహ్మమే గురువై కనిపిస్తుంది" (P.1016) అలాంటి విశ్వాసమే శాస్త్రం పట్ల కూడా అవసరమవుతుంది.

అలాగ సాధనకు ఉపయోగపడే గ్రంథాలలో విద్యారణ్యుల పంచదశి ప్రశస్తి బహు జనవిదితమే. మరింతగా సిద్ధాంత స్థాపనకైన తర్కానికి దిగకుండానే, సాధకులకు సాధారణంగా ఎదురయ్యే సంశయాలను తగినంతగా చర్చిస్తూ గమ్యాన్నీ మార్గాన్నీ ప్రయోజనాన్నీ చక్కగా వివరిస్తారు రచయిత. అలాగే అద్వైత సిద్ధాంతానికీ తదితర సిద్ధాంతాలకూ గల సంబంధాన్ని విద్యారణ్యులు స్పష్టం చేస్తారు.

విద్వాంసులలో అగ్రగణ్యులైన విద్యారణ్యుల మాటలతో స్వానుభవం ద్వారా శ్రీరామకృష్ణులు చేసే ఉపదేశాలు ఎలాగ కలుస్తున్నవో గమనిస్తే మనకు సాధన పట్ల శ్రద్ధ, అభిలాష పెరిగే అవకాశం ఉన్నది.

కేవలం శాస్త్రాధ్యయనం వలన మోక్షం సిద్ధించదనీ శమదమాదుల శ్రవణ మననాదుల అభ్యాసం ద్వారానే బ్రహ్మజ్ఞానసిద్ధి అనీ పంచదశి చెపుతుంది. (IX 40,44.) అభ్యాసం ఎలా చేయాలో అభ్యాసం అంటే ఏమిటో వివరిస్తుంది. (IX 77-83). శుద్ధమైన మనస్సు అశుద్ధమైన మనస్సు, (XI.116) చెప్పబడ్డాయి. అర్థం సరిగ్గా నిర్ధారణ చేసుకోవడానికే తర్కం ఉపయోగించాలిగాని తర్కమే పరమార్థంగా

భావించి కుతర్కంలోకి దిగరాదనీ (VI 30) హెచ్చరిస్తుంది. తర్కాన్ని సహాయంగా తీసుకున్నా విశ్వాసమే శ్రద్ధయే ముఖ్యమని (VIII 68) వక్కాణిస్తుంది.

అద్వైత సిద్ధాంతం ప్రకారం, ఉన్నది బ్రహ్మమే. అదే తన మాయాశక్తి వలన జీవుడుగానూ, ప్రపంచంగానూ భాసిస్తూ ఉంటుంది. ఈ మాయా వశుడై ఉన్న జీవుడు మాయ నుండి తప్పించుకోగలిగితే, ఉపాధులను తొలగించుకో గలిగితే అతడు అంతా బ్రహ్మమే అనీ ప్రపంచమనేదే లేదనీ దర్శించగలడు. అత్యున్నతమైన అద్వైతస్థితిలో జీవుడు కూడా బ్రహ్మమే గనుక దర్శించబడే ప్రపంచగానీ దర్శించే జీవుడుగానీ మిగలరు. కేవలం సచ్చిదానంద ఘనమైన బ్రహ్మమే ఉంటుంది (I.48) ఈ విషయాన్ని సహజసుందర ధోరణిలో శ్రీరామకృష్ణులు ఇలా వర్ణిస్తారు "ఒకసారి ఒక ఉప్పుబొమ్మ సముద్రపులోతు కొలవడానికి పోయింది... నీళ్ళలో దిగగానే అది కరిగి పోయింది. ఇక సముద్రపు లోతు చెప్పడానికి ఎవరున్నారు?" (P.103). ఇలా బ్రహ్మరూపంగా ప్రపంచాన్ని దర్శించే జీవుడిని శ్రీరామకృష్ణులు విజ్ఞాని అంటారు. సమాధిలోని సచ్చిదానంద ఘనమైన బ్రహ్మానుభూతిని పొంది మరల ఈ వ్యావహారిక జగత్తుకు వచ్చేటప్పుడు అలా ప్రపంచాన్ని బ్రహ్మంగానే చూడగలడం జరుగుతుందని వారి అనుభవం (P.104).

జీవుడంటే ఎవరు? అధిష్ఠానమైన చైతన్యమూ, సూక్ష్మశరీరమూ, అందు ప్రతిఫలించిన చిచ్ఛాయ, ఈ మూడు కలిసి జీవుడనబడుతాడు (IV.11) మలిన సత్త్వప్రధానమైన మాయ (అదే అవిద్య) యందు ప్రతిఫలించిన బ్రహ్మమే జీవుడు (I 16-48). శ్రీరామకృష్ణుల మాటలలో: "సూర్యుడినీ, నీళ్ళు నింపిన పదికుండలనూ ఊహించు. ప్రతికుండలోనూ సూర్యుడు ప్రతిఫలిస్తాడు. మొదట నువ్వు నిజమైన సూర్యుడినీ పదిప్రతిఫలనాలనూ చూస్తావు. తొమ్మిది కుండలను పగలగొడితే ఒక సూర్యుడూ ఒక ప్రతిఫలనమూ ఉంటుంది. ఒక్కొక్క కుండా ఒక జీవుడిని సూచి స్తుంది... ఆఖరి కుండ కూడా పగిలితే ఏమి మిగులుతుందో వర్ణించ సాధ్యం కాదు" (P.404) వేదాంత పరిభాషలో దీనిని ప్రతిబింబవాదమని చెప్పవచ్చు. "అహంకారం కుండ వంటిది. బ్రహ్మము సముద్రము వంటిది – అన్ని దిక్కులా అంతులేని జల మయం. ఈ సముద్రంలో కుండ ముంచబడింది. కుండలోపలా వెలుపలా కూడా ఉన్నది సముద్రజలమే. సర్వత్రా సముద్రజలమే. అయినా కుండ ఉండనే ఉంటుంది. ఈ కుండయే 'భక్తుడి అహంకారం'. అహంకారం ఉన్నంత వరకూ 'నీవు' 'నేను' అనేవి ఉండనే ఉంటాయి. 'ఓ దేవా, నీవే ప్రభువవు. నేను నీ భక్తుడిని.

నీవే యజమానివి, నేను నీ సేవకుడను' అన్న భావం కూడా ఉంటుంది. లక్షసార్లు వివేచించినా దీనిని వదులుకోలేవు. అయితే కుండయే లేకపోతే, ఆ సంగతి వేరు." (P.708-9) దీనికి అవచ్ఛేదవాదం అని పేరు. విద్యారణ్యులు చెప్పే 'చిదాభాస' కొద్దిగా మార్పు చెందిన ప్రతిబింబవాదం. అయితే ఈ చిదాభాస వారి కపోల కల్పనయా? అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పడం కష్టం. ఒక జీవుడే ప్రతిబింబమూ అవచ్ఛేదమూ కూడా కాగలిగినప్పుడు ఆభాస కూడా ఎందుకు కాకూడదు? ఇవన్ని సాధన చేసి అనుభవం పొందినప్పుడు మాత్రమే తొలిగే సంశయాలు. భగవంతుడి సాకార నిరాకార తత్త్వాలను గూర్చి చెపుతూ ఆయన "ఈ విషయాలు భగవంతుడిని సాక్షాత్కరించుకొంటేనే తప్ప స్పష్టం కావు" (P.858) అంటారు. అదే జీవుడికి కూడా వర్తిస్తుంది, జీవుడూ దేవుడూ భిన్నం కారు గనుక.

మరి ఈ జీవుడు చూచే ప్రపంచమేమిటి? సాంప్రదాయికంగా "అహం మమాత్మకం సంసారం", నేను నాది అనే భావమే ప్రపంచం. ఇది సులభంగా అర్థమయ్యే నిర్వచనం కాదు కనుక తమఃప్రధానమైన మాయ యొక్క వికారమే ప్రపంచంగా చెప్పబడినది (I.18-32). వాస్తవంగా మాయ కూడా బ్రహ్మము కంటే భిన్నం కాదు గనుక ప్రపంచం కూడా బ్రహ్మమే. "(సాధనలో) ఎంతగా ముందుకు పోతే అంతగా భగవంతుడే సర్వమూ అయ్యాడని నీవు గుర్తించగలవు" (P.843) అంటారు శ్రీరామకృష్ణులు. ఈశ్వరకోటులను గురించి చెపుతూ ఆయన ఇలా అంటారు, "మొదట అతడు ప్రపంచాన్ని నిషేధిస్తాడు, ఇది బ్రహ్మము కాదు, ఇది బ్రహ్మము కాదు అంటూ తరువాత (బ్రహ్మ సాక్షాత్కారం తరువాత) ఆ ప్రపంచాన్నే అతడు బ్రహ్మము యొక్క అభివ్యక్త రూపంగా దర్శిస్తూ ఇది (ప్రపంచం) సత్యమే అంటాడు." (P.708). సాధకుల గురించి వారు ఇచ్చిన వివరణలో ప్రపంచం ఒక్కొక్కరికి వారి వారి పురోగతిని బట్టి ఒక్కొక్కలా కనిపిస్తుందని మనకు తెలిసి వస్తుంది. "భక్తులు మూడు రకాలవారు : ఉత్తములు మధ్యములు అధములు అని. అధమ భక్తుడు 'భగవంతుడు అక్కడెక్కడో ఉన్నాడు' అంటాడు. అతని దృష్టిలో భగవంతుడు వేరే, ఆ భగవంతుడి సృష్టి వేరే. మధ్యమభక్తుడు 'భగవంతుడు అంతర్యామి. లోపలి నుండి మనలను నియంత్రిస్తాడు. అందరి హృదయాలలోనూ భగవంతుడు నివసిస్తాడు' అంటాడు. ఇతడు (మధ్యమ భక్తుడు) హృదయంలోనే భగవంతుని దర్శిస్తాడు. కాని ఉత్తముడైన భక్తుడు సర్వమూ భగవంతుడే అని దర్శిస్తాడు. భగవంతుడే ఇరవై నాలుగు (సృష్టి) తత్త్వాలు అయ్యాడు. అంతటా,

పైనా క్రిందా, భగవంతుడే నిండి ఉన్నాడని అతడు కనుగొంటాడు" (P.909-10) ఇలాంటి ప్రపంచాన్ని ఎవరు మాత్రం? ఇదమిత్థంగా ఎలా చెప్పగలరు? కనుక, ఎక్కడో ఒక చోట మొదలు పెట్టాలి గనుక, ఎవరి మనఃస్థితికి తగినట్లు వారు ప్రపంచం జీవుడు భగవంతుడు ఇలాంటి పదాలన్నింటికీ ఏదో అర్థం చెప్పుకుని సాధనచేస్తూ ఉంటే క్రమంగా అన్నీ ఒకటే, ఉన్న తత్త్వంలో ఏ విధమైన భేదమూ లేదు, అని మనకు తెలిసివస్తుంది. "కామినీ కాంచనాలే ప్రపంచం" అని శ్రీరామకృష్ణ వచనం (P.958).

భగవంతుడంటే? అద్వైత సిద్ధాంతంలో శుద్ధ సత్త్వ ప్రధానమైన మాయ యందు ప్రతిఫలించిన బ్రహ్మమే ఈశ్వరుడు (I.16). అశుద్ధ సత్త్వప్రధానమైన మాయలో. జీవుడు కూడా ప్రతిఫలనమే, కనుక జీవుడి భావనను అనుసరించే భగవంతుడి భావన కూడా ఉంటుంది. జీవభావం పూర్తిగా నశిస్తే భగవంతుడనే భావన కూడా దానితోపాటు పోతుంది. ఉన్న అద్వయసత్తయే బ్రహ్మమై మిగులు తుంది. దాన్ని వేరు వేరు పేర్లలతో వ్యవహరిస్తూ 'భగవంతుడంటే అది కాదు ఇది', అనీ 'ఇది కాదు, అది' అనీ తగవులాడటం పనిలేని మంగళ్లు చేసేపని. "వివిధ జనులు అతడిని వేరు వేరు పేర్లతో వ్యవహరిస్తారు. కొందరు అల్లా అనీ మరి కొందరు భగవంతుడు (God) అనీ ఇతరులు కృష్ణుడూ శివుడూ బ్రహ్మమూ అనీ అంటారు." (P.264) శ్రీరామకృష్ణులు స్పష్టంగా భగవంతుని గూర్చి "భగవంతుడు ఒకడే. ఇద్దరు (రెండు) కాదు" అని ఈ సందర్భంలోనే చెపుతారు. ఇక్కడ భగవంతుడూ అవతారమూ మానవుడి గురించి వివరించడం గ్రంథ విస్తరణమే అవుతుంది గనుక శ్రీరామకృష్ణుల దివ్య సూక్తిని మరొకదానిని మాత్రం గుర్తుకు తెచ్చుకుందాం. 'భగవంతుడే మానవరూపంలో క్రీడిస్తూ ఉంటాడు. ప్రతిమల ద్వారా భగవంతుని ఆరాధించ గలిగినపుడు మానవుడి ద్వారా ఎందుకు ఆరాధించరాదు?" (P.407)

అద్వైత సిద్ధాంతం సరిగా అర్థం కాకపోతే అది మాయావాదం అని భ్రమ పడడం జరుగుతుంది. మాయ అంటే ఏమిటి? అది అనిర్వచనీయమైన శక్తి అని వేదాంతం. దేశకాలనిమిత్తాలకు అతీతమైనదీ, శుద్ధమూ అసంగమూ నిర్వికారమూ అయినదీ అయిన బ్రహ్మము దానికి పూర్తిగా విరుద్ధమైన ఈ జీవుడూ జగత్తుగా ఎలా ఏర్పడింది? అన్న సందేహానికి సమాధానమే మాయ. నిజానికి ఈ సమాధానానికి అర్థం 'నాకు తెలియదు' అనే (VI 1 46). భగవల్లీల అన్నా అదే అర్థం. విద్యారణ్యులు

మాయను గూర్చి వివరిస్తూ, మాయను గూర్చి చర్చించడం కంటే సాధన ద్వారా మాయను తొలగించుకొనడం ముఖ్యమని హెచ్చరిస్తారు (VI 128-138). శ్రీరామకృష్ణులు కూడా మనం బ్రహ్మదర్శనం చేయలేకపోవడానికి కారణం మాయ అని చెపుతారు" సచ్చిదానంద బ్రహ్మము జలాశయంలోని జలము వంటిదనీ ఆ జలాన్ని కప్పి ఉన్న పాచి మాయవంటిదనీ నాకు గోచరించింది. ఈ మాయ వలన సచ్చిదానంద బ్రహ్మము జలాశయంలోని జలము వంటిదనీ ఆ జలాన్ని కప్పి ఉన్న పాచి మాయవంటిదనీ నాకు గోచరించింది. ఈ మాయ వలన సచ్ఛిదానంద బ్రహ్మము (మనచే) చూడబడదు." (P.831) "భగవత్సాక్షారం కలిగిన తరువాత ఆ భగవంతుడే మాయ ప్రపంచము, సకలప్రాణులూ అయ్యాడని గుర్తిస్తాం" (836) మాయ ఒక తెరవంటిదనీ భగవద్దర్శనానికి అడ్డుపడుతుందనీ వారు చెపుతారు. జీవన్ముక్తికి సహాయపడేదీ, జీవన్ముక్తులు ఈ ప్రపంచంలో ఉండి దారి చూపడానికి వారు ఆశ్రయించేదీ, అయి విద్యామాయనూ సామాన్య జనులను సంసారంలో బంధించి ఉంచే అవిద్యామాయనూ శ్రీరామకృష్ణులు వివరిస్తారు (P.1014) విద్య అవిద్యలను పంచదశి కూడా చెపుతుంది (VI 10,11). బహుశా శ్రీరామకృష్ణులు విద్యామాయ అని చెప్పేదే పంచదశిలోని సంవాదిభ్రమ (IX.1) కామినీ కాంచనాలే మాయ అనీ, అహంకారమే మాయ అనీ (P.168), శ్రీరామకృష్ణులు చెపుతారు. పంచదశీ శ్రీరామకృష్ణులూ కూడా బ్రహ్మమూ దాని శక్తియైన మాయ అభేదమే అని ఉద్ఘాటిస్తారు.

జీవన్ముక్తి అద్వైతసిద్ధాంతపు విశిష్టత. ప్రతివారు, అంటే తగినంత ప్రయత్నం చేసిన ప్రతివారూ, బ్రహ్మజ్ఞానాన్ని పొంది ఈ లోకంలో ఉండగలరని పంచదశి చెపుతుంది. శ్రీరామకృష్ణులు కూడా భగవత్సాక్షాత్కారం ప్రతివారికీ, అంటే కావాలనుకున్న ప్రతివారికీ లభ్యమేనంటారు. "నేను గెలవలేను అనేవాడు ఎన్నటికీ గెలవలేడు. తాను ముక్తుడనని భావించేవాడు నిజంగానే ముక్తుడు. తాను బద్ధుడననుకునే వాడు బద్ధుడుగానే ఉండిపోతాడు" (P.706) "అయ్యో, ఇక్కడ అందరూ తుచ్ఛమైన మినప పప్పునే కోరుకుంటున్నారు. ఎవరూ కామినీ కాంచనాలను వదలడానికి ఇష్టపడరు." (P.710) జీవన్ముక్తి కలిగినా దాన్ని మరచిపోవడం సంభవమే. (VII 246) (P. 831)

మరి దాన్ని సాధించే మార్గమేమిటి? అభ్యాసమూ వైరాగ్యమూ, చిత్త పరిశుద్ధత, కామినీ కాంజనాల పట్ల కామనారాహిత్యమూ ఉంటే గాని భగవంతుని

యందు నిజమైన భక్తి, ఆదర్శం పట్ల తత్పరాయణత కలుగవు. మనస్సు వివిధ విషయాలపైకి చెదిరిపోతూ ఉంటుంది (P.710). నరేంద్రనాథ దత్త (వివేకానంద స్వామి)తో, "నాయనా, కామినీ కాంచనాలను వదలకుండా భగవంతుని పొంద లేవు." (P.711) అంటారు శ్రీరామకృష్ణులు. "కావలసింది తీవ్రమైన వైరాగ్యం. ఒరదీసిన కత్తిలాగా ఉండాలి. అలాంటి వైరాగ్యం కలిగిన మానవుడు తన బంధువులను నల్లత్రాచులుగానూ ఇంటిని ఒక అగాధమైన నుయ్యి(బావి)గానూ చూస్తాడు. (P.703). భగవంతుడిపైన మనసు నిలపడం ఎలాగ? "అభ్యాసమనే యోగము. భగవంతుని స్మరించడం ప్రతి రోజూ అభ్యసించాలి. ఒక్కరోజులోనే గెలవడం సంభవం కాదు. నిత్యమూ భగవంతుని ప్రార్థించడం వలన భగవంతుడి కొరకు తపన కలుగుతుంది." (P.703) అవిచారము, అంటే వివేచనను అభ్యసించక పోవడం మాత్రమే అపరోక్షబ్రహ్మజ్ఞానానికి ప్రతిబంధకమని పంచదశి (IX.31). వైరాగ్యము, బోధ (వివేకము), ఉపరతి పరస్పర సహకారాలు (VI.276). భోగవాంఛ తీరిపోతే తప్ప మోక్షానికై అసలు ప్రయత్నమే జరగదంటారు శ్రీరామకృష్ణులు. ఈ విషయం అద్వైత సిద్ధాంతలో మొదటనే చెప్పబడింది. సాధన చతుష్టయం, అంటే నిత్యమూ అనిత్యముల వివేచన ఇహలోక పరలోకములలో భోగవాంఛ లేకుండుట శమాదమాది షట్కమూ మోక్షం పట్ల కోరిక, ఉంటే తప్ప అద్వైతశాస్త్రం వినడానికే అధికారం లేదు. ఎందుకంటే అద్వైతాన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలంటే తీక్షణమైన బుద్ధికావాలి. మనసులో కోరికలుంటే బుద్ధి మొద్దుబారి పోతుంది. వివేచనకు అసమర్థమవుతుంది. అలాంటి వారు ఉపాసన ప్రార్థన నిష్కామకర్మ ఇత్యాదులను అవలంబించి బుద్ధిని సరిగ్గా తయారుచేసుకోవలసి ఉంటుంది. వీటన్నిటినీ పంచదశి కూడా అంగీకరిస్తుంది (VII 105). ఊరికే వాద ప్రతివాదాలు చేయడం వలన ఫలితం కంఠశోష మాత్రమే (VII 107). "వేదమూ పురాణాలు చెప్పేది విని దానిని జీవితంలో ఆచరించాలి." (P.609).

ఇక అద్వైత సిద్ధాంతానికీ భగవదారాధన పరములైన ఇతర సంప్రదాయా లకూ గల సంబంధమంతా 'నేను' పైననే ఆధారపడి ఉంటుంది. ఈ 'నేను' సమూలంగా నశించితే అది అద్వైతం. లేశమాత్రమైనా మిగిలి ఉంటే అపుడు 'భగవంతుడు' కూడా ఉంటాడు, అద్వైతస్థితియే సర్వోత్కృష్టమైన స్థితి అని శ్రీరామకృష్ణులు విస్పష్టంగా చెపుతారు. ఆ అద్వైతానుభూతిని పొందిన పిదప తిరిగి ఈ వ్యావహారిక జగత్తుకు రాగలిగిన వారినే ఆయన 'విజ్ఞాను'లు అని చెపుతారు.

విద్యారణ్యులు అలాంటి వారినే జీవన్ముక్తులని అంటారు. ఆ జీవన్ముక్తులూ విజ్ఞానులూ భగవంతుడితో తమ పక్వ అహంకారంద్వారా ఏదో ఒక సంబంధం ఏర్పరుచుకొని జగత్కళ్యాణానికై తమ శరీరాలను నిలుపుకుంటారు.

సామాన్యులు అద్వైత స్థితికే చేరుకోలేరు గనుక, చేరుకున్నా ఆ తరువాత శరీరాన్ని నిలుపుకోలేరు గనుక, పక్వ అహంకారం సంపాదించే ప్రయత్నంలో భగవంతుడితో ఒక సంబంధాన్ని ఏర్పరుచుకొని జీవించ వలసిందిగా శ్రీరామకృష్ణుల ఆదేశం. పంచదశి కూడా విచారం సాధ్యం కాకపోతే ధ్యానమూ ఉపాసనా పూజ ఇలాంటివన్నీ చేయవచ్చు అంటుంది.

అయితే అన్ని వంటకాలూ అందరికీ జీర్ణం కావు. ఎవరికి చక్కగా జీర్ణమయ్యే వంటకం వారికి సర్వశ్రేష్ఠం. దురహంకారానికి పోయి 'ఆఁ, అద్వైతమే సర్వ శ్రేష్ఠమైతే మేం దాన్నే పాటిస్తాం' అని జీవితాన్ని శుష్కతర్కంలో వ్యర్థం చేయకుండా, మనం జీవితంలో అమలు పరచి లాభం పొందగలిగే మార్గాన్ని అవలంబించడం బుద్ధిమంతుల లక్షణం. అత్యంతమూ స్థూలమని భావించబడే విగ్రహారాధన ద్వారా కూడా బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందవచ్చునని శ్రీరామకృష్ణులు తమ జీవితం ద్వారా ఉపదేశించారు గదా!

ఇంతవరకూ చదివిన పాఠకులకు ఒక సంశయం కలుగవచ్చు. పంచదశి ఉపోద్ఘాతంలో శ్రీరామకృష్ణుల ప్రస్తావనయే ఎక్కువగా ఉన్నదే? అని కారణం ఇది: అద్వైతగ్రంథాలు ఇప్పటి వరకూ వాదప్రతివాదాలకు ఉపయోగపడ్డాయేగాని సాధనకు ఉపయోగపడలేదు. శ్రీరామకృష్ణ ఉపదేశాల ద్వారా అద్వైతాన్ని అర్థం చేసుకోగలిగితే సాధనవైపు మనస్సు మొగ్గుతుంది, దారీ స్పష్టతరంగా తెలుస్తుంది.

కనుక ఎల్లరకూ సాధ్యమైన భగవత్సాక్షాత్కారాన్ని అందరూ పొందడానికి సహాయపడే ఈ ఉత్తమగ్రంథాన్ని పాఠకులు సదుపయోగం చేస్తే ఋషి ఋణం తీర్చినట్లవుతుంది. ప్రకాశకుల ఆశయం నెరవేరుతుంది.

ఇందులో సూచించబడిన పుట సంఖ్యలు "The Gospel of Sri Ramakrishna", 1981 ed., Sri Ramakrishna Math, Madras-4 లోనివి.

ఇక మిగిలింది ఈ వ్యాఖ్యారచనకు మిక్కిలిగా సహకరించిన రామకృష్ణ టీకకూ (సంస్కృతం), స్వాహానంద స్వామి వారి పంచదశి అనువాదానికీ (ఆంగ్లం) కృతజ్ఞతలు చెప్పడమే.

**– వ్యాఖ్యాత**

### శ్రీమద్విద్యారణ్యముని విరచిత
# వేదాంత పంచదశి

## ప్రథమము: తత్త్వవివేక ప్రకరణము

**నమః శ్రీ శంకరానందగురు పాదాంబుజయుగ్మే ।**
**సవిలాస మహామోహగ్రాహగ్రాసైక కర్మణే ॥1॥**

*1. గురుదేవులైన శ్రీ శంకరానందుల పాదపద్మాలకు నమస్కారము. మూలాజ్ఞానమనే మొసలిని, దాని కార్యవర్గమగు ఈ దృశ్య ప్రపంచము నంతటితో సహా, మ్రింగివేయుటయే వారి ముఖ్యకార్యము.*

**వ్యాఖ్య:** ప్రారంభింప దలచిన గ్రంథం నిర్విఘ్నంగా పరిసమాప్తి చెంది, బహుళ ప్రచారం పొందదానికి, తాను ఆచరించి చూపడం వల్ల శిష్యులకు మార్గదర్శక మవడానికి గ్రంథకర్త మంగళాచరణ శ్లోకాన్ని రచించారు. పనిలో పనిగ గ్రంథ విషయాన్ని, ప్రయోజనాన్ని కూడా సూచిస్తున్నారు.

'శం' అనగా సుఖమును కలిగించేవాడు – శంకరుడు, జగదానందకరుడైన పరమాత్మ. 'ఆనందు'డనగా నిరతిశయ ప్రేమాస్పదమవడం చేత పరమానంద రూపమైన ప్రత్యగాత్మ. శంకరుడు ఆనందుడును అగుట చేత శంకరానందుడు, అనగా ప్రత్యగాత్మతో అభిన్నమగు పరమాత్మ. ప్రత్యగభిన్నమగు ఆ పరమాత్మయే గురువు. 'శ్రీ' అనగా విభూతి, దివ్యశక్తి. గురుభక్తి కలవారికి ఇష్ట సిద్ధి నొసగే సామర్థ్యమును సూచిస్తోంది.

అజ్ఞానము మొసలి వలె దుఃఖమును కలిగిస్తుంది. ఆ మూలాజ్ఞానము యొక్క విలాసమే, కార్యరూపమే – ఈ 'దృశ్యమాన జగత్తు'. శ్రీ గురుదేవుల ముఖ్యకార్యము ఈ మూలజ్ఞాన మకరమును సవిలాసముగ మ్రింగి వేయుటయే. ఇట్లు జీవ బ్రహ్మముల ఏకత్వమే గ్రంథమునకు విషయము. సమూలముగ దుఃఖ నాశము, నిస్సీమమగు సుఖ ప్రాప్తియే గ్రంథ ప్రయోజనం.

**తత్పాదాంబురుహద్వంద్వ సేవానిర్మల చేతసామ్ ।**
**సుఖబోధాయ తత్త్వస్య వివేకోఽ యం విధీయతే ॥2॥**

*2. శ్రీ గురుదేవుల పాద పద్మాలను సేవించుట చేత చిత్తశుద్ధి కలిగిన వారికి అసలు తత్త్వం సులభంగా అర్థమవడానికి ఈ వివేచన చేయబడుతోంది.*

**వ్యాఖ్య:** సులభంగా అర్థమవడం గ్రంథానికి అవాంతర ప్రయోజనం. జీవ బ్రహ్మముల ఏకత్వం అసలు తత్త్వం. దానిపై ఆరోపించబడిన జగత్తు యొక్క నానాత్వాన్ని విచారణ చేసి తొలగించడమే వివేకం. యుక్తి (తర్కం), అనుభవం అనే రెండింటిని ఆశ్రయించి సిద్ధాంతం చేయబడుతోంది. ఆ తరువాత మాత్రమే ఉపోద్బలకముగ శ్రుతి ప్రస్తావించబడుచున్నది.

**శబ్దస్పర్శాదయో వేద్యా వైచిత్ర్యాత్ జాగరే పృథక్ ।**
**తతోవిభక్తా తత్సంవిదైకరూప్యాన్న భిద్యతే ॥3॥**

*3. శబ్దస్పర్శాదులైన ఇంద్రియ విషయాలు జాగ్రదవస్థలో వేరు వేరుగా తెలియబడుతున్నాయి. వాటికి ఆయా ప్రత్యేకతల వల్ల భేదం ఉంది. కాని వీటిని గూర్చిన జ్ఞానములన్ని జ్ఞానమే అవడం చేత జ్ఞానంలో భేదం లేదు. కాబట్టి జ్ఞానం ఏకరూపమే.*

**వ్యాఖ్య:** ఇంద్రియాల ద్వారా విషయ గ్రహణం జాగ్రదవస్థకు గల లక్షణం. విషయాలను గ్రహించే జ్ఞానం విషయాల నుండి భిన్నం. కాని శబ్ద జ్ఞానం, స్పర్శ జ్ఞానం, అశ్వ జ్ఞానం, గజ జ్ఞానం మొదలైన అన్ని విషయ జ్ఞానాలలోను ఉన్నది జ్ఞానం ఒకటే కనుక జ్ఞానంలో భేదం లేదు. అది ఏకస్వరూపమే.

'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని శ్రుతి. సత్ చిత్ ఆనంద స్వరూపముగ బ్రహ్మం చెప్పబడుతోంది. జీవస్వరూపం కూడా అదే అని చూపడానికి ప్రథమముగ జీవుని జ్ఞాన స్వరూపం చూపబడుతోంది. సంవిత్, చిత్, (చైతన్యం), జ్ఞాన శబ్దాలు సమానార్థకాలు.

**తథా స్వప్నేఽ త్ర వేద్యం తు న స్థిరమ్ జాగరే స్థిరమ్।**
**తద్భేదోఽ తస్తయోః సంవిదేకరూపా న భిద్యతే ॥4॥**

*4. స్వప్నావస్థలో కూడా అట్లే. స్వప్నవిషయాలు అస్థిరమైనవి. జాగ్రత్ విషయాలు స్థిరమైనవి. జాగ్రత్ స్వప్నాలకు భేదం ఇంత మాత్రమే. జాగ్రత్ జ్ఞానం, స్వప్నజ్ఞానం రెండింటిలో జ్ఞానం ఏకస్వరూపమే. దానిలో భేదం లేదు.*

**వ్యాఖ్య:** ఇంద్రియాలు ఉపసంహరించినప్పుడు జాగ్రదవస్థలో సంస్కారాల నుండి జనించిన ప్రత్యయాలే విషయంగా గలది స్వప్నం. స్వప్న విషయాలు భిన్నమైనవి అయినా కూడా ఆ జ్ఞానం ఒకటే.

అయినచో స్వప్న జాగ్రత్తులు ఒకటి ఏల కాగూడదు? కాలాంతరంలో కూడా కనిపించడం చేత జాగ్రద్విషయాలు స్థిరమైనవి. ఎన్ని పర్యాయాలు మేల్కొన్నప్పటికీ జాగ్రదవస్థలోని విషయాలు మారడంలేదు. ఒక స్వప్నంలోని విషయాలు రెండవ స్వప్నంలో ఉండడం లేదు. స్వప్నంలోనైనా, జాగ్రత్తులోనైనా విషయాలను గ్రహిస్తున్న జ్ఞానం ఒకటే. దానిలో భేదం లేదు.

**సుప్తోత్థితస్య సౌషుప్తతమోబోధో భవేత్ స్మృతిః ।**
**సాచావబుద్ధ విషయాఽవబుద్ధం తత్తదా తమః ॥5 ॥**

*5. సుషుప్తి నుండి మేల్కొన్న వ్యక్తి తానేమీ గ్రహించలేదని (తనకేమీ తెలియ లేదని) జ్ఞాపకం తెచ్చుకుంటాడు. జ్ఞాపకం (స్మృతి) అనగా మునుపు అనుభవించిన విషయాన్ని ఆ విషయం లేని తరువాతి కాలంలో అనుభవించడం. కనుక సుషుప్తిలో 'గ్రహింపమి'ని గూర్చిన (అనుభవించిన) జ్ఞానం ఉండనే ఉన్నది.*

**స బోధో విషయాద్భిన్నో న బోధాత్ స్వప్న బోధవత్।**
**ఏవం స్థానత్రయేఽప్యేకా సంవిత్తద్వద్దినాంతరే ॥6॥**

*6. సుషుప్తిలో ఉన్న ఆ జ్ఞానం సుషుప్తిలోని విషయమైన 'గ్రహింపమి' నుండి భిన్నమైనది. కాని జ్ఞానంలో భేదమేమీ లేదు, స్వప్న జ్ఞానం వలెనే. కనుక జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు మూడింటిలో ఉన్న జ్ఞానం ఒకటే. అట్లే వేరు వేరు దినములలో జ్ఞానం కూడ ఒకటే.*

**వ్యాఖ్య:** మూడు అవస్థలలోనూ ప్రతిదినమూ ఆయా విషయాలను గ్రహించే జ్ఞానం ఎల్లప్పుడూ ఒకటే.

**మాసాబ్ద యుగ కల్పేషు గతాగమ్యేష్వనేకధా।**
**నోదేతి నాస్త మేత్యేకా సంవిదేషా స్వయంప్రభా ॥7॥**

*7. నెలలు, సంవత్సరాలు, యుగాలు, కల్పాలలో గతించిన కాలంలోను రాబోవు కాలంలోను ఈ జ్ఞానం ఒకటే. దానికి ఉత్పత్తి లేదు వినాశం లేదు. అది స్వప్రకాశమైనది. అది నిత్యమైనది.*

**వ్యాఖ్య:** సర్వకాలాల్లోను జ్ఞానం ఒకటే. అది మరొక వస్తువు నుండి జనించ డానికి 'మరొకటి' అనునదే లేదు కనుక దానికి ఉత్పత్తి లేదు. దాని వినాశనాన్ని చూడగలిగే మరొకటి లేదు కనుక వినాశం లేదు. జ్ఞానం తనను తానే గ్రహిస్తుంది అని అంటే కర్మ-కర్తృ దోషం వస్తుంది. ఏ క్రియకైనా కర్మయే కర్త అవడం అసంభవం కదా. మరొక జ్ఞానం గ్రహిస్తుంది అని అంటే ఇట్లు ఒకదానినొకటి గ్రహించే జ్ఞానాలకు అంతం లేదు. ఇది అనవస్థా దోషం. కనుక వెలుగుతున్న దీపాన్ని చూడడానికి మరొక దీపం అవసరం లేనట్లే, జ్ఞానం స్వయం ప్రకాశం. నిత్యమవడం చేత అది సత్యం, సత్ పదార్థం. నిత్యమై ఉండే వస్తువును మించిన వేరొక సత్ పదార్థం ఉండజాలదు కదా.

**ఇయమాత్మా పరానన్దః పర ప్రేమాస్పదం యతః ।**
**మా న భూవం హి భూయాస మితి ప్రేమాత్మనీక్షతే ॥8॥**

*8. ఆ ఈ ఆత్మ ఆనందస్వరూపం. ఏలన అది పరమ ప్రేమకు విషయం. 'నేను లేకపోదును గాక' అని ఎవడూ భావింపడు. 'నేను శాశ్వతంగా ఉందును గాక' అను ప్రేమయే ఆత్మలో కనిపిస్తోంది.*

**వ్యాఖ్య:** పై జెప్పిన ఆ జ్ఞానమే ఈ చెప్పబడుచున్న ఆత్మ. ఆత్మ స్వప్రకాశం. తమ ఉనికిని గురించి తెలుసుకోవడానికి ఎవరికిని మరొకరి సహాయం అవసరం లేదు. ఆత్మ నిత్యం, సత్యం. తాను పూర్వం లేకపోవడం గాని, ఇక మీద లేకుండడం గాని ఎవరూ ఊహించ లేరు. తన శరీరం పూర్వం లేదని, ఇక మీద ఉండదని ఊహించి చూసేది కూడ 'తానే'. అన్నింటిని గ్రహించేది కూడ 'తానే'. ఇలా అన్ని లక్షణాలు సరిపోవడం చేత ఇంతవరకు విమర్శించి చూచిన ఆ జ్ఞానమే ఆత్మయని తెలుస్తోంది. ఎవనికైనా తనకంటె ప్రేమించ దగిన విషయం మరొకటి ప్రపంచంలో లేకపోవడం చేత, మరియూ ఆనందం కలిగించని వస్తువును ఎవరూ ప్రేమించ జాలరు - కనుక ఆత్మ పరమానంద స్వరూపమని సిద్ధిస్తోంది. తమను తాము ద్వేషించుకొంటూ ఆత్మహత్య చేసికొనేవారు కలరు కదా అని అంటే... వారు ఆత్మపై ఆరోపించుకొన్న దుఃఖాలను మాత్రమే ద్వేషిస్తున్నారని కొద్దిపాటి విచారణతోనే తెలియగలదు. చనిపోతే దుఃఖాలు తీరి 'సుఖింపగల' మనే కదా ఆత్మహత్య చేసుకోవడం! కనుక ఎవరి ఆత్మ వారికి పరమ ప్రేమ విషయమవడంలోను పరమానంద రూపమనడంలోను ఏ సంశయమూ లేదు.

ఈ ఆత్మయే బ్రహ్మమనీ, దానిపై కారణ శరీరం మొదలైన శరీరాలను ఆరోపించి జీవుడనీ, మాయాశక్తి మొదలైనవి ఆరోపించి ఈశ్వరుడనీ వ్యవహారం జరుగుచున్నదనీ; ఈ ఆరోపాలను తొలగిస్తే జీవ–బ్రహ్మలకు, జీవాత్మ–పరమాత్మలకు అభేదమనీ; అది ఏక సత్యమనీ రెండవదనునదే లేదనీ, అద్వైత సిద్ధాంతం.

**తత్ప్రేమాత్మార్థమన్యత్ర నైవమన్యార్థమాత్మని ।**
**అతః తత్పరమం తేన పరమానందతః ఆత్మనః ॥9॥**

*9. ఆత్మ కొరకే ఇతరులు, ఇతరాలు ప్రేమించబడుతున్నాయి. కాని ఎవరూ కూడా ఇతరుల కొరకు, ఇతరాల కొరకు తమను ప్రేమించుకోవడం లేదు. కనుక తమపైనే, తమ ఆత్మపైనే ఎల్లరకును మితిలేని ప్రేమ. అదే పరమానందం.*

**వ్యాఖ్య:** తనతో సంబంధపడినవి, తనలోని భాగాలు అనుకొనుట చేతనే తన పుత్రులు తన దేశం అన్నీ ప్రేమాస్పదాలవుతున్నాయి. మరొకరి పుత్రులను, దేశాన్ని ఎవరుగాని అంతగా ప్రేమించరుగదా. కనుక ఆత్మయందే ఎవనికైనా మితిలేని ప్రేమయనుట స్పష్టము.

**ఇత్థం సచ్చిత్పరానంద ఆత్మా యుక్త్యా తథావిధమ్ ।**
**పరం బ్రహ్మ తయోశ్చైక్యం శ్రుత్యన్తేషూపదిశ్యతే ॥10॥**

*10. ఈ విధంగా ఆత్మ సత్ చిత్ ఆనందమని తర్కం ద్వారా స్పష్టమవుతోంది. పరబ్రహ్మ కూడా అట్టిదే. ఈ రెండింటి ఏకత్వం వేదాంతాలు అనగా ఉపనిషత్తులు ఉపదేశిస్తున్నాయి.*

**వ్యాఖ్య:** అర్థం స్పష్టమే. ఆత్మను గూర్చి తర్కం ద్వారా తెలిసిననూ, ఉపనిషత్తులు చెప్పనిచో బ్రహ్మం గాని ఆత్మ బ్రహ్మముల ఐక్యం గాని తెలియదు గనుక ఉపనిషత్తులు నిరర్థకాలు కావు.

**అభానే న పరం ప్రేమ భానే న విషయే స్పృహా ।**
**అతో భానేఽ ప్యభాతాఽ సౌ పరమానందతాఽ ఽ త్మనః ॥11॥**

*11. ఆత్మయొక్క పరమానంద స్వరూపం తెలిసినచో తుచ్ఛ విషయాలలో, అవి కలిగించే క్షణికానందాలలో ఎవరికీ ప్రేమ ఉండదు. ఆత్మ పరమానంద స్వరూపమని తెలియకపోతే ఆత్మనే ప్రేమించడు. కనుక ఆత్మయొక్క పరమానందత తెలిసి కూడా తెలియనిదే.*

**వ్యాఖ్య:** ఆనందం కలిగిస్తుందని తెలియని వస్తువును ఎవరూ ప్రేమించరు. కాని అందరూ ఆత్మను ప్రేమిస్తున్నారు. కనుక ఆత్మ యొక్క పరమానందత తెలిసే ఉండాలి. నిజంగా ఆత్మ కంటె ఆనందదాయకమైనది మరొకటి లేదని తెలిస్తే ఎవడును మరొక దానిని గూర్చి ఆలోచించడు. అయినా అందరూ ఇల్లు, ఇల్లాలు, డబ్బు మొదలైన వాటితో రాత్రింబవళ్ళు ఆనందమగ్నులై ఉంటున్నారు కనుక, ఆత్మ యొక్క పరమానందత కొంతవరకు తెలిసినా విస్పష్టంగా తెలియడం లేదు. (ఆత్మానందాన్నే విషయాలపై ఆరోపించడం చేత విషయానందం కలుగుతోంది.)

**అధ్యేతృ వర్గ మధ్యస్థ పుత్రాధ్యయన శబ్దవత్ ।**
**భానేఽ ప్యభానం భానస్య ప్రతిబంధేన యుజ్యతే ॥12॥**

*12. సహపాఠి సమూహంలో వేదాధ్యయనం చేస్తున్న పుత్రుని కంఠాన్ని తండ్రి విస్పష్టంగా తెలుసుకోలేడు. అయిననూ అందరితో కలిసి తన పుత్రుడు కూడా పఠిస్తున్నాడని అతనికి తెలుసు. కనుక ప్రతిబంధ కారణం వల్ల, తెలిసి కూడా తెలియకపోవడం సంబద్ధపడుతోంది.*

**వ్యాఖ్య:** కొంతవరకు తెలిసి విస్పష్టంగా తెలియక పోవడానికి కారణం ప్రతిబంధం ఉండడమే. ప్రతిబంధం తొలగగనే విస్పష్టంగా తెలుస్తుంది. ఇతరుల పఠనాన్ని ఆపివేయగనే పుత్రుని పఠనం స్వచ్ఛంగా వినబడే విధంగానే ఆత్మానందం కొంతవరకు తెలిసినప్పటికీ ప్రతిబంధం వల్ల పూర్తిగా తెలియడం లేదు.

**ప్రతి బంధోఽ స్తి భాతీతి వ్యవహారార్హ వస్తుని ।**
**తం నిరస్య విరుద్ధస్య తస్యోత్పాదన ముచ్యతే ॥13॥**

*13. ఉన్నది, తెలుస్తున్నది (భాసిస్తున్నది) అనే వ్యవహారానికి తగిన వస్తువులో ఆ వ్యవహారాన్ని అడ్డగించి విరుద్ధమైన లేదు, తెలియుట లేదు అనే వ్యవహారాన్ని కలిగించేది ప్రతిబంధం.*

**వ్యాఖ్య:** ప్రతిబంధం అంటే ఏమి? ఉన్నది లేనట్లు తోపింపజేసేదే ప్రతిబంధం.

**తస్య హేతుః సమానాభిహారః పుత్ర ధ్వనిశ్రుతౌ ।**
**ఇహానాదిరవిద్యైవ వ్యామోహైక నిబంధనమ్ ॥14॥**

*14. పుత్రుని పఠనం వినబడుటకు ఇతరుల పఠనం ప్రతిబంధమైనట్లు, ఆత్మ యొక్క పరమానందత తెలియడానికి అనాది అయిన అవిద్యయే ఒకే ఒక్క ప్రతిబంధం.*

**వ్యాఖ్య:** అవిద్య ఉత్పత్తిని చూచిన వారెవరును లేరు. కనుక అది అనాది. భూతభవిష్యత్తులనే కాలవివక్ష కూడ అవిద్య వల్లే కలుగుతోంది. ఉత్పత్తి వినాశాలు అకాలంలో కలుగుతున్నాయి. ఇలా చూస్తే అవిద్య అనాది అని ఏర్పడుతోంది.

**చిదానందమయ బ్రహ్మ ప్రతిబింబ సమన్వితా ।**
**తమోరజః సత్త్వగుణా ప్రకృతిర్ద్వివిధా చ సా ॥15॥**

*15. చిదానంద స్వరూపమగు బ్రహ్మం యొక్క ప్రతిబింబంతో కూడిన ప్రకృతి సత్త్వరజస్తమోగుణాత్మకం. ఆ ప్రకృతి రెండు విధాలు.*

**వ్యాఖ్య:** ప్రకృతి అంటే సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాల సామ్యావస్థ. ఈ గుణాల పరస్పర కలయిక చేత దృశ్యమాన జగత్తు ఏర్పడుతోంది. కాని అవి తెలుపు నలుపు వంటి గుణాలు కావు. పాలు, ఇనుము వంటి ద్రవ్యాలు కావు. సత్త్వమంటే జ్ఞానశీలత. రజస్సు క్రియాశీలత. తమస్సు స్థితిశీలత. జీవునిపై వీటి ప్రభావాలు భగవద్గీతలో (14.5–18) వివరించబడింది.

'చ'కారము వల్ల తమః ప్రధానమైన ప్రకృతి సూచించబడింది.

జీవుడు, జగత్తు, ఈశ్వరుడు, అనే వ్యవహారానికి మూల కారణంగా ప్రకృతి ప్రతిపాదించబడుతోంది. బ్రహ్మం కంటె భిన్నమైన సత్త ప్రకృతికి లేదు. అది బ్రహ్మం నుండి పుట్టునది కూడా కాదు. కాని ప్రకృతిని తీసివేస్తే సృష్టికి కారణ ఏమిటి అనే ప్రశ్నకు ఉత్తరం లేదు. ఇట్టి ప్రకృతిలో బ్రహ్మం 'ప్రతిబింబించుట'... అంటే ఇది ఊహకు అతీతమైన విషయాన్ని మాటలలో చెప్పే ప్రయత్నమనే గ్రహించాలి. బ్రహ్మంలో 'సృష్టింప వలెననే ఇచ్ఛ కలుగుట' మొదలైనవన్నీ ఇట్టి ప్రయత్నాలే. ఈ విషయం గుర్తుంచుకుంటే తత్త్వగ్రహణం సులభతరమవుతుంది.

**సత్త్వ శుద్ధ్యవిశుద్ధిభ్యాం మాయాఽవిద్యే చ తే మతే ।**
**మాయాబింబో వశీకృత్య తాం స్యాత్ సర్వజ్ఞ ఈశ్వరః ॥16॥**

*16. ఇతర గుణాలు చేరని సత్త్వం శుద్ధ సత్త్వం. దీనికి మాయ అని పేరు. రజస్తమో గుణాలచే మిశ్రితమైన సత్త్వం మలిన సత్త్వం. దీనికి అవిద్య అని పేరు. మాయలో ప్రతిబింబించిన బ్రహ్మం ఈశ్వరుడవుతోంది. మాయను తన ఆధీనంలో ఉంచుకునే ఈశ్వరుడు సర్వజ్ఞత్వం, సర్వశక్తిమత్వం, సర్వాంతర్యామిత్వం మొదలైన గుణాలు కలవాడవుతున్నాడు.*

**వ్యాఖ్య:** మాయ ఈశ్వరుని వశంలో ఉంటుంది. అది 'ఈశ్వరుని శక్తి' అని

కూడా అనవచ్చు. జీవుడు అవిద్యావశుడై ఉంటాడు. ఈ మాయను, అవిద్యను తొలగిస్తే ఉండేది బ్రహ్మమే.

**అవిద్యా వశగస్త్వన్యస్త ద్వైచిత్రాదనేకధా ।**
**సా కారణశరీరం స్యాత్ప్రాజ్ఞస్తత్రాభిమానవాన్ ॥17॥**

*17. అవిద్యలో ప్రతిఫలించిన బ్రహ్మం జీవుడవుతోంది. జీవుడు అవిద్యకు వశుడు. అవిద్యలో రజస్తమోగుణాల హెచ్చు తగ్గుల వల్ల దేవతలు పశుపక్షులు మొదలైన అనేక విధాలైన జీవులు ఏర్పడుతున్నాయి. ఈ అవిద్యకు 'కారణ శరీరం' అని పేరు. దీనిపై అభిమానం గల జీవుడు ప్రాజ్ఞుడనబడుచున్నాడు.*

**వ్యాఖ్య:** సూక్ష్మ-స్థూల శరీరాలకు అవిద్యయే కారణం కనుక అవిద్యకు 'కారణ శరీరం' అని పేరు. '*శీర్యతే ఇతి శరీరం*'. తత్త్వజ్ఞానంచే నశించేది కనుక శరీరం. శరీరాలన్నీ ప్రకృతి యొక్క అవస్థావిశేషాలే కనుక జీవుని అసలు తత్త్వం తెలియగనే అవి నశిస్తాయి. ఈ కారణశరీరంతో తాదాత్మ్యాన్ని అనుభవిస్తూ 'నేను' అనుకునే జీవుడు ప్రాజ్ఞుడనబడుతున్నాడు. అవిద్యకు లోబడుటచేత 'నాకేమీ తెలియదు' అని భావిస్తూ జీవుడు తన బ్రహ్మత్వాన్ని, నిజస్వరూపాన్ని మరచిపోతు న్నాడు. ఇట్లు జీవ బ్రహ్మైక్యజ్ఞానానికి అవిద్యయే ప్రతిబంధమని తేట పడుతోంది.

'ఈ స్థూల-సూక్ష్మ శరీరాలు ఎట్లేర్పడుతున్నాయి' అని వివరించడానికి వీటి కారణాలైన పంచమహా భూతాల సృష్టి చెప్పబడుతోంది. వీటి నుండే సకల శరీరాలు, జగత్తు, ఏర్పడుతున్నాయి.

**తమః ప్రధాన ప్రకృతే స్తద్భోగాయేశ్వరాజ్ఞయా ।**
**వియత్పవనతేజోంబుభువో భూతాని జజ్ఞిరే ॥18॥**

*18. ఈ ప్రాజ్ఞులు సుఖదుఃఖాలను అనుభవించడానికి తమః ప్రధానమైన ప్రకృతి నుండి ఈశ్వరాజ్ఞచే ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథివి అనే మహాభూతాలు ఉద్భవించాయి.*

**వ్యాఖ్య:** సత్త్వ ప్రధానమైన ప్రకృతిలో జీవులు, ఈశ్వరుడు ప్రతిబింబితులు. తమః ప్రధానమైన ప్రకృతి యొక్క వికారం వల్ల పంచమహా భూతములాదిగా సృష్టి ప్రారంభమవుతోంది.

శాసించడం మొదలైన శక్తులు గల ఈశ్వరుడు సర్వజగత్తుకు అధిష్ఠాత. ఆయన 'సృష్టించవలెను' అని చూచుటయే, లేదా ఇచ్ఛించుటయే ఆజ్ఞ. అట్టి

ఈశ్వరాజ్ఞను నిమిత్తంగా చేసుకుని తమః ప్రధానమైన ప్రకృతి నుండి పృథ్వి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచమహాభూతాలు జనించాయి.

**సత్త్వాంశైః పంచభిస్తేషాం క్రమాద్ధీంద్రియ పంచకమ్ ।**
**శ్రోత్రత్వగక్షిరసనఘ్రాణాఖ్యముపజాయతే ॥19॥**

*19. పంచమహా భూతాల సత్త్వాంశల నుండి క్రమంగా శ్రవణేంద్రియం, స్పర్శనేంద్రియం, నేత్రేంద్రియం, రసనేంద్రియం, ఘ్రాణేంద్రియం అనే జ్ఞానేంద్రియాలు ఏర్పడుతున్నాయి.*

**వ్యాఖ్య:** ఆకాశం నుండి శ్రవణేంద్రియం, వాయువు నుండి స్పర్శేంద్రియం, ఇత్యాదిక్రమము. ఈ జ్ఞానేంద్రియాలు సూక్ష్మాంశములన్నీ శరీరంలోని చెవి, చర్మం మొదలైన మాంసవికారాలు కావనీ, గోళకములనీ గుర్తుంచుకోవాలి. ఈ మాంస వికారాల ద్వారా జ్ఞానేంద్రియాలు పనిచేస్తాయి. ఆయా జ్ఞానేంద్రియం ఆయా మహాభూతం యొక్క సత్త్వాంశం నుండి జనిస్తుంది.

**తైరంతఃకరణం సర్వైర్వృత్తి భేదేన తద్ద్విధా ।**
**మనో విమర్శరూపం స్యాద్బుద్ధిః స్యాన్నిశ్చయాత్మికా ॥20॥**

*20. సత్త్వాంశములు అయిదు కలసి అంతఃకరణం ఏర్పడుతోంది. పరిణామ భేదం వల్ల అంతఃకరణం రెండు భాగాలు. విమర్శాత్మకమైనది మనస్సు. నిశ్చయాత్మకమైనది బుద్ధి.*

**వ్యాఖ్య:** కన్ను వినజాలదు. అట్లే చెవిగాని నాలుకగాని చూడలేవు. ఏలన వాటిలో ఒక్కొక్క మహాభూతపు అంశ మాత్రమే ఉండుట చేత. అయిదు ఇంద్రియాలూ తీసుకువచ్చే విషయాలను గ్రహించడానికి అంతఃకరణంలో అయిదు భూతాల సత్త్వాంశములు ఉంటాయి.

ఇదియా, అదియా అని సంశయించి విమర్శించు భాగం 'మనస్సు' అనీ, వివేచించి ఈ కారణంచే ఇది ఫలానాయని నిశ్చయించే భాగం 'బుద్ధి' అనీ చెప్ప బడుతోంది. ఈ అంతఃకరణం ద్రవ్యమని చెప్పబడుట గమనార్హం.

**రజోఽంశైః పంచభిస్తేషాం క్రమాత్కర్మేంద్రియాణి తు ।**
**వాక్పాణి పాదపాయూపస్థాభిధానాని జజ్ఞిరే ॥21॥**

*21. పంచభూతముల ప్రత్యేక రజోంశముల నుండి క్రమముగా వాక్కు,*

చేయి, పాదము, గుదము, గుహ్యము అను అయిదు కర్మేంద్రియములు ఏర్పడుచున్నవి. (ఇవి కూడా సూక్ష్మాంశములే. మాంసవికారములు కావు.)

**తైః సర్వైః సహితైః ప్రాణో వృత్తిభేదాత్స పంచధా ।**
**ప్రాణోఽపానః సమాన శ్చోదానవ్యానౌ చ తే పునః ॥22॥**

*22. పంచభూతముల రజోంశములన్నియు చేరి ప్రాణమేర్పడుచున్నది. పరిణామ భేదము చేత ఇది మరల ఐదు విధములు. ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము అనునవి పంచప్రాణములు.*

**వ్యాఖ్య:** రజోంశములన్నియు చేరి ఏర్పడిన ప్రాణమునకు ముఖ్య ప్రాణమని పంచ ప్రాణములలో మొదటిదగు ప్రాణము నుండి వివేచించు కొనవలెను. ముఖ్య ప్రాణముచేయు పనుల భేదము వలన వేరు వేరు పేర్లతో పంచ ప్రాణములున్నవి. ఇవియన్నియు కర్మేంద్రియముల ద్వారా అస్థిమాంస మజ్జాపిండమగు శరీరమును నడిపించును.

**బుద్ధి కర్మేంద్రియ ప్రాణపంచకైర్మనసా ధియా।**
**శరీరం సప్తదశభిః సూక్ష్మం తల్లింగముచ్యతే ॥23॥**

*23. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రాణపంచకములు, బుద్ధియు, మనస్సు అను పదిహేడింటిచే సూక్ష్మశరీరమేర్పడుతోంది. దీనికే లింగ శరీరమని పేరు.*

**వ్యాఖ్య:** ఆకాశము నుండి ప్రాణముల వరకు జరిగిన సృష్టికి ఉద్దేశము ఇప్పుడు చెప్పబడినది. అవిద్య కారణశరీరముగా గల జీవునకు ఈ పన్నేడంగముల సూక్ష్మ శరీరము కూడ చేరుచున్నది.

**ప్రాజ్ఞస్తత్రాభిమానేన తైజసత్వం ప్రపద్యతే ।**
**హిరణ్య గర్భతామీశస్తయోర్వ్యష్టి సమష్టితా ॥24॥**

*24. ఈ సూక్ష్మ శరీరముతో తాదాత్మ్యమును అనుభవించే ప్రాజ్ఞునకు తైజసుడని పేరు. అట్లే ఈశ్వరుడు కూడా హిరణ్యగర్భుడగుచున్నాడు. తైజస హిరణ్యగర్భులకు భేదము వ్యష్టి సమష్టి అగుటయే.*

**వ్యాఖ్య:** మలినసత్త్వ ప్రధానమగు అవిద్య అనే కారణశరీరము నందు అభిమానము గల ప్రాజ్ఞుడు, అంతఃకరణముచే సూచితము తేజః శబ్ద వాచ్యము అగు సూక్ష్మశరీరము నందు అభిమానముంచుట చేత తైజసుడనబడుచున్నాడు.

శుద్ధ సత్త్వ ప్రధానమగు మాయకు అధీశ్వరుడగు ఈశ్వరుడు ఈ సూక్ష్మశరీరము లన్నింటి యందును అభిమానముంచుట చేత హిరణ్యగర్భుడగుచున్నాడు. తైజసునకు హిరణ్యగర్భునకు సూక్ష్మ శరీరము నందు అభిమానము సమానమే అయినా తైజసుడు వ్యష్టియభిమాని హిరణ్యగర్భుడు సమష్టియభిమాని.

**సమిష్టిరీశః సర్వేషాం స్వాత్మతాదాత్మ్య వేదనాత్ ।**
**తదభావాత్తతోఽన్యే తు కథ్యంతే వ్యష్టి సంజ్ఞయా ॥25॥**

*25. ఈశ్వరుడు లింగశరీరధారులగు తైజసులందరితో స్వాత్మతా దాత్మ్యమును తెలిసి స్వీకరించుటచే సమష్టియగు హిరణ్యగర్భుడగు చున్నాడు. ఇతరులగు ప్రాజ్ఞులకు అట్టి అన్ని సూక్ష్మశరీరముల తోడి తాదాత్మ్యము లేక ఒక్కొక్క సూక్ష్మశరీరముతో మాత్రమే తాదాత్మ్యము ఉండుట చేత వ్యష్టియను పేరు కలుగుచున్నది.*

**వ్యాఖ్య:** అన్నింటిని కలిపి తాదాత్మ్యముంచునది సమష్టి. ప్రత్యేకముగ నొక్కొక్క దానితో తాదాత్మ్యముంచునది వ్యష్టి.

**తద్భోగాయ పునర్భోగ్యభోగాయతనజన్మనే ।**
**పఞ్చీకరోతి భగవాన్ ప్రత్యేకం వియదాదికమ్ ॥26॥**

*26. ఆ జీవులు అనుభవించుటకు అన్నపానాది భోగ్యవిషయములను, అనుభవించగలుగుటకు భోగాయతనములుగ వివిధ శరీరములను, సృష్టించు టకు భగవంతుడు ఆకాశాది మహాభూతములను పంచీకరించును.*

**వ్యాఖ్య:** ఇప్పటి వరకు పరిశుద్ధములుగ పంచ మహాభూతములు ఉండినవి. అనగా దేనియందును మిశ్రణము లేదు. అందుచేతనే అవి సూక్ష్మములు. జీవులకు స్థూలశరీరములు కల్పించుటకు స్థూలభూతములను కల్పింపవలసి ఉన్నది. దానికై జ్ఞానైశ్వర్య శక్తి బలవీర్యతేజః సంపన్నుడగు ఈశ్వరుడు పంచీకరణము చేయు చున్నాడు. అనగా ప్రతిభూతమునందును ఇతర నాలుగు భూతముల అంశములు చేరునట్లు చేయుచున్నాడు. జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు అని శరీరములు నాలుగు విధములు.

**ద్విధా విధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః।**
**స్వస్వేతర ద్వితీయాంశైః యోజనాత్పఞ్చ పంచ పఞ్చ తే ॥27॥**

*27. ప్రతి భూతము మొదట రెండు సమభాగములగును. రెండవ భాగము మరల నాలుగు భాగములగును. ప్రతి భూతము యొక్క అర్ధ భాగమునకు, ఇతర నాలుగు భూతముల నుండి ఒక్కొక్క భాగము చేరుట చేత స్థూలభూతము లేర్పడుచున్నవి.*

**వ్యాఖ్య:** సూక్ష్మమగు ఆకాశమునందు కేవలము ఆకాశము మాత్రమే ఉండును. స్థూలాకాశమునందు అర్ధభాగము ఆకాశము, ఎనిమిదవ వంతు భూమి, మరొక ఎనిమిదవ వంతు జలము, మరొక ఎనిమిదవ వంతు అగ్ని, మరొక ఎనిమిదవ వంతు వాయువు ఉండును. ఇట్లే మిగిలిన స్థూలభూతములు కూడా ఏర్పడుచున్నవి. పంచ మహాభూతముల సత్త్వాంశములు చేరి అంతః కరణమను ద్రవ్యమేర్పడుచున్నది. వాని రజోంశములు చేరి ప్రాణమేర్పడుచున్నది. అవి అన్నియు పరస్పరము కలిసి స్థూల భూతము లేర్పడుచున్నవి.

**తైరణ్డస్తత్ర భువనం భోగ్యభోగాశ్రయోద్భవః ।**
**హిరణ్యగర్భః స్థూలేఽస్మిన్దేహే వైశ్వానరో భవేత్ ॥28॥**

*28. ఈ స్థూల భూతములచే బ్రహ్మాండమేర్పడుచున్నది. బ్రహ్మాండము నందు పదునాల్గు భువనములు, ఆయా భువనమునకు తగిన భోగ్య విషయములు, వాటిని అనుభవించుటకు తగిన శరీరములు, పంచీకృత భూతములచే ఏర్పడుచున్నవి. ఈ స్థూలదృష్టి యందు అభిమానముంచిన హిరణ్యగర్భుడు వైశ్వానరుడగుచున్నాడు.*

**వ్యాఖ్య:** భూః, భువః, సువః, మహః, జనః, తపః సత్యలోకములు ఊర్ధ్వ లోకములు. అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళములు అధోలోకములు. ఈ పదునాల్గు భువనములును బ్రహ్మాండము లోనివే. ఈ బ్రహ్మాండపు సమష్టితో అభిమానముంచిన హిరణ్యగర్భుడు, వైశ్వానరుడనే పేరు గలిగి ఉండును.

సృష్టి క్రమమును క్రైస్తవాది వివిధ మతములు, సాంఖ్య న్యాయాది దర్శనములు, భౌతికాది విజ్ఞాన శాస్త్రములు వివిధముగ ప్రతిపాదించును. దేనికిని ఇదమిత్థమని నిర్ధారణ లేదు. అద్వైత సిద్ధాంతమున ఈ సృష్టియందు తాత్పర్యము లేదు. అది అవిద్యా కల్పితమగుటచే జ్ఞానోత్పత్తిచే తిరోభావము చెందునదగుటచే, జ్ఞానోత్పత్తి పర్యంతము సహాయభూతముగ ఉండుటకై తర్క బద్ధముగ ప్రతిపాదింప బడిన సిద్ధాంతమిది.

**తైజసా విశ్వతాం యాతా దేవతిర్యఙ్న రాదయః ।**
**తే పరాగ్దర్శినః ప్రత్యక్తత్త్వబోధవివర్జితాః ॥29॥**

*29. దేవతలు జంతువులు మానవులు మొదలగు ప్రత్యేక శరీరము నందు అభిమానముంచిన తైజసుడు విశ్వుడ గుచున్నాడు. విశ్వు లందరును బహిర్ముఖులు. వారికి ప్రత్యక్తత్త్వమును, అనగా వాస్తవమగు తమ బ్రహ్మత్వమును, గూర్చిన జ్ఞానము లేదు.*

**వ్యాఖ్య:** నైయాయికులు మొదలగు వారందరికి శరీరభిన్నమగు ఒక ఆత్మను గూర్చి తెలియును. కాని వేదోక్తమైన ఆత్మ స్వరూపము తెలియదు అని సూచించునది 'ప్రత్యక్' శబ్దము. అన్నింటికంటే లోపల ఉన్నది, అన్నింటికంటే సూక్ష్మమైనది, అన్నింటికంటే వ్యాపనశీలమైనది అని ప్రత్యక్ శబ్దమునకు అర్థము.

**కుర్వతే కర్మ భోగాయ కర్మ కర్తుం చ భుఞ్జతే ।**
**నద్యాం కీటా ఇవావర్తాదావర్తాంతరమాశు తే ।**
**వ్రజంతో జన్మనో జన్మ లభంతే నైవ నివృ్వతిమ్ ॥30॥**

*30. భోగములను అనుభవించుటకే కర్మనాచరింతురు. మరల కర్మను ఆచరించుటకే భోగములను అనుభవింతురు. నదీ ప్రవాహమున బడిన కీటకములు ఒక నీటి సుడియందు తిరుగుచు దాని నుండి మరొక సుడిలో పడి తిరుగునట్లు, ఒక జన్మము నుండి మరొక జన్మమునకు జన్మ జన్మలకు వేవేగముగ జీవులు పోవుచుందురు. కాని వారికి సుఖము లభింపనే లభింపదు.*

వ్యాఖ్య: సచ్చిదానంద స్వరూపమగు ఆత్మ తత్త్వము తెలియక పోవుటచే ఆనందమును వెదకుచు జీవులు సంసార చక్రమున చిక్కి తిరుగుచుందురు.

**సత్కర్మ పరిపాకాత్తే కరుణానిధినోద్ధృతాః ।**
**ప్రాప్య తీరతరుచ్ఛాయాం విశ్రామ్యంతి యథాసుఖమ్ ॥31॥**

*31. ఆ కీటకములు పూర్వ పుణ్య కర్మ పరిపాక వశమున కరుణానిధి యగు పురుషునిచే ఉద్ధరింపబడి గట్టునకు చేర్చబడి చెట్టు నీడను సుఖముగ విశ్రమించును.*

**ఉపదేశమవాప్యైవమాచార్యాత్తత్త్వదర్శినః ।**
**పఞ్చకోశవివేకేన లభన్తే నిర్వృతిమ్ పరామ్ ॥32॥**

*32.* *అట్లే జీవులును తత్త్వదర్శియగు ఆచార్యుని వద్ద ఉపదేశమును పొంది పంచకోశ వివేకముచే మోక్ష సుఖము ననుభవింతురు.*

**వ్యాఖ్య:** జీవులకును పూర్వజన్మములందు చేసిన పుణ్య కర్మ పరిపాక వశముననే తత్త్వదర్శియగు ఆచార్యుడు లభించును. తత్త్వదర్శి అనగా ప్రత్యగభిన్నమైన బ్రహ్మమును సాక్షాత్కరించు కొనిన వ్యక్తి. ఉపదేశ మనగా తత్త్వమసి మొదలగు ఆత్మ తత్త్వ బోధక మహా వాక్యములు. కారణ, సూక్ష్మ, స్థూల శరీరములే ప్రకారాంతరమున పంచకోశములుగ చెప్పబడు చున్నవి. వీటిని వివేకముచే తన నుండి భిన్నములని తెలుసుకుండే, తన నిజ స్వరూపమగు బ్రహ్మత్వమును సాక్షాత్కరించుకొని 'అహం బ్రహ్మాస్మి' అని మోక్ష సుఖమును జీవుడు అనుభవించును.

**అన్నం ప్రాణో మనో బుద్ధిరానన్దశ్చేతి పఞ్చ తే ।**
**కోశాస్తై రావృతః స్వాత్మా విస్మృత్యా సంసృతిం వ్రజేత్ ॥33॥**

*33.* *అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములనునవి పంచకోశములు. వీనిచే ఆవరింపబడిన ఆత్మ స్వస్వరూపమును మరచి, జనన మరణ రూపమగు సంసారమునందు పరిభ్రమించును.*

**వ్యాఖ్య:** కత్తిని కోశము (ఒర) వలె ఆత్మను ఈ అయిదు కోశములు కప్పి ఉంచును కనుక కోశములనబడుచున్నవి. లేదా పట్టు పురుగునకు తానే అల్లుకొనిన కోశము బాధాకరము, మరణ హేతువు అయినట్లే ఈ పంచ కోశములు ఆనంద స్వరూపమగు ఆత్మకు బాధ కలిగించు స్వరూప విస్మృతియను మరణమునకు హేతువులగుచున్నవి.

**స్యాత్పఞ్చీకృతభూతోత్థో దేహః స్థూలోఽన్నసంజ్ఞకః ।**
**లిఙ్గేతు రాజసైః ప్రాణైః ప్రాణః కర్మేంద్రియైః సహ ॥34॥**

*34.* *పంచీకృత మహాభూతములచే ఏర్పడిన స్థూల దేహమునకు అన్నమయ కోశమని పేరు. సూక్ష్మభూతముల రాజసాంశములచే ఏర్పడిన పంచప్రాణములు పంచ కర్మేంద్రియములు మొత్తము పదియును కలసి ప్రాణమయ కోశమగుచున్నది. ఇది సూక్ష్మ శరీరము (లింగ శరీరము) లోని భాగము.*

**సాత్త్వికైర్ధీంద్రియైః సాకం విమర్శాత్మా మనోమయః ।**
**తైరేవ సాకం విజ్ఞానమయో ధీర్నిశ్చయాత్మికా ॥ 35॥**

*35.* *సూక్ష్మ భూతముల సాత్త్వికాంశములచే ఏర్పడిన పంచ జ్ఞానేంద్రియములు, విమర్శాత్మకమైన మనస్సు కలిసి మనోమయ కోశమగు చున్నది. ఆ జ్ఞానేంద్రియములే నిశ్చయాత్మికమైన బుద్ధితో కలిసి విజ్ఞానమయ కోశమగుచున్నది.*

**వ్యాఖ్య:** ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములు మూడూ కలిసి లింగ శరీరం ఏర్పడుచున్నది.

**కారణే సత్త్వమానందమయో మోదాది వృత్తిభిః।**
**తత్తత్కోశైస్తు తాదాత్మ్యాదాత్మా తత్తన్మయో భవేత్ ॥36॥**

*36.* *కారణ శరీరమగు మలిన సత్త్వము ఆనందము మొదలగు పరిణామములతో కూడి ఆనందమయ కోశమగుచున్నది. ఈ అయిదు కోశముల కంటే భిన్నమగు ఆత్మ ఆయా కోశములతో తాదాత్మ్యమును అనుభవించినపుడు ఆయా కోశముల ధర్మములను తనకు ఆరోపించు కొనుచున్నది.*

**వ్యాఖ్య:** భోగ్య విషయములను చూచుటచే కలుగు పరిణామమునకు ప్రియమనీ, వాటిని పొందుటచే గలుగు పరిణామమునకు మోదమనీ, అనుభ వించుటచే కలుగు పరిణామమునకు ప్రమోదమనీ పేర్లు.

తైత్తిరీయోపనిషత్తు నందు 'సవాఏష పురుషోఽన్న రసమయః' మొదలైన వాక్యములు ఆత్మయే అన్నమయము ఇత్యాదిగా చెప్పుటకు కారణము, వ్యవహార కాలమున ఆత్మకు ఆయా కోశములందు తాదాత్మ్యాభిమానము ఉండుటయే.

**అన్వయవ్యతిరేకాభ్యాం పఞ్చకోశ వివేకతః ।**
**స్వాత్మానం తత ఉద్ధృత్య పరం బ్రహ్మ ప్రపద్యతే ॥37॥**

*37.* *అన్వయ వ్యతిరేకము లనే రెండు పద్ధతులచే పంచకోశములను ప్రత్యగాత్మ నుండి వివేచించి, ఆత్మను వాని నుండి ఉద్ధరించి, బుద్ధిచే ఆత్మ యొక్క చిదానంద స్వరూపమును నిష్కర్ష చేసికొనుటచే చిదానంద స్వరూప మగు బ్రహ్మము సిద్ధించుచున్నది. అనగా ఆత్మ బ్రహ్మమే అగుచున్నది.*

**అభానే స్థూలదేహస్య స్వప్నే యద్భానమాత్మనః ।**
**సోఽన్వయో వ్యతిరేకస్తద్భానేఽన్యానవభాసనమ్ ॥38॥**

*38. స్వప్నావస్థయందు స్థూలదేహము ఉన్నట్లు తెలియక పోయినను స్వప్నములను చూచున్న ఆత్మ తెలియుచునే ఉన్నది. ఇది అన్వయము. ఆత్మ తెలియుచుండగా ఇతరములు తెలియక పోవుట వ్యతిరేకం.*

**వ్యాఖ్య:** అన్వయ వ్యతిరేకములు తర్క శాస్త్రమున సాంకేతిక పదములు. ఇచ్చట ఆ సాంకేతికార్థమునగాక కేవలం ఉండుట లేకపోవుట అను అర్థములలో ఉపయోగింప బడినవి. ఒక దానితో పాటుగ మరియొకటి ఉండుటను అనువృత్తి అనీ, అట్లు లేక పోవుటను వ్యావృత్తి అనీ అందురు. ఉన్నట్లు తెలియుటనే భానమనీ, ప్రతీతియనీ అందురు.

**లిఙ్గాభానే సుషుప్తౌ స్యాదాత్మనో భానమన్వయః ।**
**వ్యతిరేకస్తు తద్భానే లిఙ్గస్యాభాన ముచ్యతే ॥39॥**

*39. సూక్ష్మ శరీరమునకు కూడా సుషుప్తావస్థ యందు ప్రతీతి లేదు. అయినను ఆత్మస్ఫురణ ఉండనే ఉన్నది. ఇది అన్వయము. ఆత్మస్ఫురణ ఉండగా సూక్ష్మ శరీర ప్రతీతి లేకపోవుట వ్యతిరేకము. (చూడు: 1.5-6)*

**వ్యాఖ్య:** సుషుప్తి అనుభవమునకు సాక్షిగా ఆత్మ ఉండుట ఈ ప్రకరణముననే 5-6 శ్లోకములందు వివరింపబడినది.

**తద్వివేకాద్వివిక్తాః స్యుః కోశాః ప్రాణమనోధియః।**
**తే హి తత్ర గుణావస్థాభేదమాత్రాత్ పృథక్కృతాః ॥40॥**

*40. సూక్ష్మ శరీర వివేచన వలననే ప్రాణ, మనో, విజ్ఞానమయ కోశముల వివేచన కూడ జరిగిపోవుచున్నది. ఏలన సూక్ష్మ శరీరమునందలి ఈ మూడు కోశములు గుణభేదము చేతను అవస్థాభేదము చేతను మాత్రమే వేరు వేరుగా చెప్పబడుచున్నది.*

**వ్యాఖ్య:** తమః ప్రధానమైన ప్రకృతి యందలి సూక్ష్మ భూతముల రజోంశములచే ప్రాణమయ కోశమేర్పడినది. సాత్త్వికాంశములచే మనోమయ కోశమేర్పడినది. దీని వికారమే విజ్ఞానమయ కోశము. ఈ మూడు కోశములు కలిపి సూక్ష్మశరీరమనబడుచున్నది. కనుక సూక్ష్మ శరీరము నుండి ఆత్మను వివేచించి

తెలిసికొన్నచో అవశ్యంభావిగ మూడు కోశముల నుండియు ఆత్మవివేచన సిద్ధమగుచున్నది.

**సుషుప్త్యభానే భానంతు సమాధావాత్మనోఽన్వయః ।**
**వ్యతిరేకస్త్వాత్మభానే సుషుప్త్యనవభాసనమ్ ॥41॥**

*41. సమాధ్యవస్థ యందు సుషుప్తి యొక్క ప్రతీతి లేకపోయినను ఆత్మ స్ఫురణ ఉండుట అన్వయము. ఆత్మస్ఫురణ ఉండగా సుషుప్తి తెలియకపోవుట వ్యతిరేకము.*

**వ్యాఖ్య:** ఇచ్చట 'సుషుప్తి' కారణ శరీరమునకు ఉపలక్షణము. సుషుప్తి యందు కేవలము అవిద్యయే, ఏమియు తెలియకపోవుటయే, భాసించును. ఈ అవిద్య చేతనే కారణ శరీరమేర్పడుచున్నది. కనుక ఈ శ్లోకమున సుషుప్తి పదము కారణ శరీరమునకు సమానార్థకముగా ఉపయోగింప బడినది. స్థూల సూక్ష్మ కారణ శరీరములు ఇట్లు వేరు వేరు అవస్థలలో వ్యావృత్తి చెందుచున్నను ఆత్మ వ్యావృత్తమగుటలేదు. కనుక ఆత్మ ఈ మూడు శరీరముల కంటె భిన్నమని తెలియవలెను. పూలమాల యందలి సూత్రము పువ్వుల కంటె భిన్నమైనట్లే.

**యథా ముఞ్జాదిషీకైవమాత్మా యుక్త్యా సముద్ధృతః ।**
**శరీరత్రితయాద్ధీరైః పరం బ్రహ్మైవ జాయతే ॥42॥**

*42. ముంజగడ్డి యొక్క వెలుపలి ఆకుల నుండి లోనున్న మొవ్వును తీసినట్లే ఆత్మను శరీరత్రయము నుండి వివేచనతో ధీరులు వెలికి తీసినచో, అది పరబ్రహ్మమే అని తెలియుచున్నది.*

**వ్యాఖ్య:** ధీరులనగా శరీరము మనస్సు బుద్ధులను నిగ్రహించి నియమింప గలిగినవారు అంతులేని ఓర్పుగలవారును అని భావము. ఇట్టి సామర్థ్యము బ్రహ్మచర్యాది సాధనల ద్వారా కలుగును.

**పరాపరాత్మనోరేవం యుక్త్యా సంభావితైకతా ।**
**తత్త్వమస్యాదివాక్యైః స్సా భాగత్యాగేన లక్ష్యతే ॥43॥**

*43. ఈ విధముగ తర్కము ద్వారా అంగీకరింప బడిన జీవాత్మ పరమాత్మల ఐక్యత తత్త్వమసి మొదలగు వాక్యములచే భాగత్యాగ లక్షణద్వారా బోధింపబడుచున్నది.*

వ్యాఖ్య: రెండుగా కనబడు వస్తువులందు విరుద్ధాంశములను పరిత్యజించి సామాన్యాంశమును సూచించుట భాగత్యాగ లక్షణ.

**జగతో యదుపాదానం మాయామాదాయ తామసీమ్ ।**
**నిమిత్తం శుద్ధసత్త్వాం తాముచ్యతే బ్రహ్మ తద్గిరా ॥44॥**

*44. సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మము, తమః ప్రధానమైన ప్రకృతిని ఉపాధిగా జేసికొని జగత్తునకు ఉపాదాన కారణము, శుద్ధ సత్త్వ ప్రధానమైన ప్రకృతిని ఉపాధిగా స్వీకరించి జగత్తునకు నిమిత్త కారణము అగుచున్నది. అట్లు నిమిత్త, ఉపాదాన కారణములైన బ్రహ్మమే తత్త్వమసియను వేదాంత మహా వాక్యమున 'తత్' అను పదముచే సూచించబడినది.*

**వ్యాఖ్య:** కుండ తయారైనచో దానికి మట్టి ఉపాదాన కారణము. కుమ్మరి నిమిత్త కారణము. జగత్తులో ఏ పదార్థమునకైనా ఇట్లు నిమిత్త ఉపాదాన కారణములు వేరువేరుగ ఉండును. కేవలము బ్రహ్మము మాత్రమే తన అనిర్వచనీయమైన మాయ (ప్రకృతి) వలన జగత్తునకు నిమిత్త కారణము ఉపాదాన కారణము కూడా అగుచున్నది.

**యదా మలినసత్త్వాం తాం కామకర్మాదిదూషితామ్ ।**
**ఆదత్తే తత్పరం బ్రహ్మ త్వం పదేన తదోచ్యతే ॥45॥**

*45. ఆ బ్రహ్మమే మలినసత్త్వ ప్రధానమైన ప్రకృతిని ఉపాధిగా స్వీకరించిన అవస్థ యందు 'త్వం' పదముచే సూచింపబడినది. ఈ ఉపాధి యందలి సత్త్వము మలినమగుట చేతనే, రజస్తమో లేశములచే కూడినదగుట చేతనే, కామకర్మాది దోషములచే కూడినదగుచున్నది.*

**త్రితయీమపి తాం ముక్త్వా పరస్పరవిరోధినీమ్ ।**
**అఖండం సచ్చిదానన్దం మహావాక్యేన లక్ష్యతే ॥46॥**

*46. పరస్పర విరుద్ధములైన ఈ మూడు ఉపాధులను వదలినచో అఖండమైన సత్‌చిత్ ఆనందమగు బ్రహ్మమే మిగులుచున్నది. ఇదియే మహా వాక్యముచే సూచించబడినది.*

**వ్యాఖ్య:** శుద్ధసత్త్వ ప్రధానమైన ప్రకృతికి మాయ అని పేరు. దానిని ఉపాధిగా స్వీకరించిన బ్రహ్మము ఈశ్వరుడనబడుచున్నది. మలినసత్త్వ ప్రధానమగు ప్రకృతికి అవిద్య అని పేరు. దానిని ఉపాధిగా జేసికొనిన బ్రహ్మము జీవుడనబడుచున్నది.

తమః ప్రధానమైన ప్రకృతిని ఉపాధిగా గ్రహించిన బ్రహ్మము జగత్తు అని వ్యవహృత మగుచున్నది. ఈ మూడు ఉపాధులను తొలగించగా మిగిలి ఉండేది బ్రహ్మమే.

**సోఽ యమిత్యాది వాక్యేషు విరోధాత్తదిదన్తయోః ।**
**త్యాగేన భాగయోరేక ఆశ్రయో లక్ష్యతే యథా ॥47॥**

*47. 'ఆ దేవదత్తుడే ఈ వ్యక్తి' మొదలైన వాక్యములలో ఆ, ఈ, శబ్దములు విభిన్న దేశ కాల పరిస్థితులను సూచించును. విరుద్ధములైన ఆ భాగములను త్యజించినచో వానికి ఆశ్రయమైన దేవదత్తుడు ఒకడే అని తెలియుచున్నది.*

**మాయాఽ విద్యే విహాయైవముపాధీ పరజీవయోః ।**
**అఖండం సచ్చిదానన్దం పరబ్రహ్మైవ లక్ష్యతే ॥48॥**

*48. అట్లే పరమాత్మ జీవాత్మలకు ఉపాధులైన మాయ అవిద్యలను త్యజించినచో భేదరహితమైన సచ్చిదానందమే పరబ్రహ్మమే తత్-త్వం అను పదముల చేత సూచితమగుచున్నది.*

**సవికల్పస్య లక్ష్యత్వే లక్ష్యస్య స్యాదవస్తుతా ।**
**నిర్వికల్పస్య లక్ష్యత్వం న దృష్టం న చ సంభవి ॥49॥**

*49. (పూర్వపక్షము) సూచితమైనది సవికల్పమైనచో అది మిథ్య అగుచున్నది. నిర్వికల్పమైనది సూచింపబడుట ఎవరును చూడలేదు. అది సంభవమే కాదు.*

**వ్యాఖ్య:** 'తత్త్వమసి' అను మహావాక్యము సూచించు బ్రహ్మము సవికల్పమా నిర్వికల్పమా అని పూర్వపక్షి ప్రశ్నించుచున్నాడు. సిద్ధాంతి చెప్పునట్లు నామరూపాది వికల్పములన్నియు మిథ్యయే, నిజముగ సత్తలేనివే, అయినచో ఆ సవికల్ప బ్రహ్మము కూడ మిథ్యయే యగుచున్నది. అట్టి వికల్పములు లేని, నిర్వికల్పమగు, బ్రహ్మము సూచింపబడ గలుగుటయే అసంభవము. ఎట్లు చూచినను ఈ బ్రహ్మము అప్రతిపాద్యమే అని ఆక్షేపము.

**వికల్పో నిర్వికల్పస్య సవికల్పస్య వా భవేత్ ।**
**ఆద్యే వ్యాహతి రన్యత్రా నవస్థాఽ ఽ త్మాశ్రయాదయః**

*50. (సిద్ధాంతము) ఈ వికల్పము నిర్వికల్పమునకు గాని, సవికల్పము నకు గాని సంబంధింపవచ్చును. నిర్వికల్పపు వికల్పమనినచో అది స్వవచన*

*వ్యాఘాత మగుచున్నది. సవికల్పపు వికల్పమనినచో అది అనవస్థ, ఆత్మాశ్రయము మొదలగు దోషములకు దారితీయుచున్నది.*

**వ్యాఖ్య:** సిద్ధాంతి మరియొక ప్రశ్నతో ఆక్షేపమును ఖండించుచున్నాడు. ఈ సందర్భమున వికల్ప శబ్దము వేరు వేరు అర్థములతో ఉపయోగింప బడినవి. పూర్వపక్షి గుణము భేదము అను అర్థములలో వికల్ప శబ్దమును ఉపయోగించెను. సిద్ధాంతి ఆక్షేపము, మరొక విధము అను అర్థములతో వికల్ప శబ్దమును ఈ శ్లోకమున ప్రయోగించెను. వ్యతిరేకము, అదియా ఇదియా అనే సంశయము, ఈ అర్థములతో కూడ వికల్ప శబ్దము ప్రయోగింపబడును. ఏ అర్థమును ఇచ్చినా, నిర్వికల్పమును గూర్చిన వికల్పము అసంభవమని పూర్వపక్షియే అనెను. సవికల్పమును గూర్చిన వికల్పమైనచో ఈ రెండు వికల్పములును ఒకటియేనా వేరువేరా? ఒకటియేయైనచో ఆత్మాశ్రయదోషము. వేరైనచో ఈ రెండు వికల్పముల గురించి మరొక వికల్పము, మూడవది, ఏర్పడుచున్నది. ఈ మూడు వికల్పముల గూర్చి మరొకటి. ఇట్లు అనవస్థా దోషము. ఒక దానిపై మరొకటి ఆధారపడినచో చక్రక దోషము. కావున పూర్వపక్షి ఆక్షేపము ఎట్లు చూచినను దోష పూర్ణమే అగుచున్నది.

**ఇదం గుణక్రియాజాతి ద్రవ్యసంబంధవస్తుషు ।**
**సమం తేన స్వరూపస్య సర్వమేతదితీష్యతామ్ ॥51॥**

*51. ఈ దోషపూర్ణత గుణము, క్రియ, జాతి, ద్రవ్యము, సంబంధము, వస్తువు అను ఆరు భావపదార్థములకును సమానముగనే వర్తించును. కావున ఇవియన్నియు స్వరూపముననే యున్నవని స్వీకరింపవలెను.*

**వ్యాఖ్య:** వికల్పము నిర్వికల్పమునందా సవికల్పమునందా అనే ప్రశ్న అన్ని రకముల తార్కిక దోషములచే నిండియున్నదంటిమి. ఈ దోషములు భావ పదార్థములు ఆరింటికీ సమానమే, నిర్వికల్ప బ్రహ్మమునకు మాత్రమే కాదు అని చూపబడినది. గుణము నిర్గుణమునందున్నదా? సగుణమునందా? క్రియ నిష్క్రియమునందా సక్రియమునందా? కనుక ఇవన్నియు స్వరూపమునందే మాయచే కల్పింపబడి ఉన్నవని స్వీకరింపవలసి ఉన్నది. ఇచ్చట వస్తువు అను శబ్దము 'సత్త' అను అర్థములో గాక వైశేషికుల 'విశేషము' అనే అర్థమున ప్రయోగింపబడినది.

**వికల్పతదభావాభ్యా మసంస్పృష్టాత్మ వస్తుని ।**
**వికల్పితత్వ లక్ష్యత్వసంబంధాద్యాస్తు కల్పితాః ॥52॥**

*52. వికల్పముండుట, లేకుండుట - వీనిచే అంటబడని సత్తయందు వికల్పితత్త్వము లక్ష్యత్వము సంబంధము మొదలైనవన్నియు కల్పింబడినవే.*

**వ్యాఖ్య:** సిద్ధాంతము స్పష్టముగా చెప్పబడినది. సవికల్పమునకా నిర్వికల్పమునకా అనుట వికల్పితత్త్వము సూచించబడగలుగుట లక్ష్యత్వము. ఇట్టివి అన్నీ కల్పితములే. అద్వితీయమగు బ్రహ్మమును స్పర్శింపగలుగున దేదియు లేదు. ఇవి అన్నీ సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమున మాయచే కల్పింపబడినవే.

**ఇత్థం వాక్యైస్తదర్థానుసంధానం శ్రవణం భవేత్ ।**
**యుక్త్యా సంభావితత్వానుసంధానం మననం తు తత్ ॥53॥**

*53. ఇట్టి వాక్యములచే తత్త్వమసి మొదలగు మహా వాక్యముల అర్థమును తెలిసికొనుట శ్రవణమనబడును. ఈ విధముగ తెలిసికొనిన అర్థమును విచారణచే ఇదియే సరియని నిర్ధారణ చేసికొనుట మనన మనబడును.*

**వ్యాఖ్య:** ఈ ప్రకరణమున 44వ శ్లోకము నుండి చెప్పబడిన విధమున తత్త్వమస్యాది మహావ్యాక్యములకు అర్థము జీవబ్రహ్మముల ఐక్యతయే అని తెలిసికొనుట శ్రవణము. ప్ర. 1.3 నుండి 43 వరకు వివరించినట్లు తర్కబద్ధముగ విచారించి నిర్ధారణకు వచ్చుట మననము. అద్వైత జ్ఞానమునకు సాధనములగు శ్రవణమనన నిదిధ్యాసనములు వివరింపబడుచున్నవి.

**తాభ్యాం నిర్విచికిత్సేఽర్థే చేతసః స్థాపితస్య యత్ ।**
**ఏకతానత్వమేతద్ధి నిదిధ్యాసనముచ్యతే ॥54॥**

*54. ఈ శ్రవణ మననములచే నిస్సంశయముగ దృఢపడితే అర్థము నందు మనస్సు స్థాపింపబడుటయే ఏకతానత్వము. ఇదే నిదిధ్యాసనము.*

**వ్యాఖ్య:** పతంజలి యోగసూత్రములు (3.29) 'తత్ర ప్రత్యయైక తానతా ధ్యానమ్' అని ధ్యానమును నిర్వచించును. ఈ శ్లోకమున 'హి' అను శబ్దము ఆ ప్రసిద్ధమైన ఏకతానతను స్మరించును. అదే నిదిధ్యాసనమని అద్వైత శాస్త్రమున చెప్పబడుచున్నది.

**ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయక గోచరమ్ ।**
**నివాతదీపవచ్చిత్తం సమాధిరభిధీయతే ॥55॥**

*55. క్రమముగా మనస్సు ధ్యాత ధ్యానము ధ్యేయము అను త్రిపుటిని వదలి, ధ్యేయ స్వరూపమేయై చిమ్నియందలి దీపశిఖ వలె నిష్కంపమై ఉండే అవస్థను సమాధి అందురు.*

**వ్యాఖ్య:** నిదిధ్యాసనమున ధ్యానవస్తువు ధ్యానము చేయువాడు, ధ్యానము, ధ్యాన కర్మ ఈ మూడు తెలియుచుండును. అభ్యాస బలముచే మనస్సు ఈ మూడింటి అనుభవమును వదల గలిగినప్పుడు మనస్సు ధ్యేయ స్వరూపమే అగును. దీనికి సమాధి అని పేరు.

**వృత్తయస్తు తదానీమజ్ఞాతా అప్యాత్మగోచరాః ।**
**స్మరణాదనుమీయంతే వ్యుత్థితస్య సముత్థితాత్ ॥56॥**

*56. మనస్సు యొక్క పరిణామములు ఆ స్థితియందు తెలియకున్నా అవి ఆత్మనే విషయముగ కలిగి ఉండినవని వ్యుత్థానావస్థ యందు కలుగు స్మరణ వలన అనుమానముచే తెలియుచున్నది.*

**వ్యాఖ్య:** సమాధికాలమున మనస్సున ఆత్మ, ధ్యేయ విషయము తప్ప మరేదీ ఉండక పోవుటచే ఆత్మయే ఉండినదని సమాధి అనంతరము మనస్సునకెట్లు తెలియును? ఆ ఆత్మానుభవము జ్ఞాపక ముండుట వలన అనుమాన ప్రమాణముచే తెలియుచున్నది. అనుభవము పిమ్మటనే జ్ఞాపకము వచ్చుట లోకసిద్ధము గదా.

**వృత్తీనామనువృత్తిస్తు ప్రయత్నాత్ ప్రథమాదపి ।**
**అదృష్టాసకృదభాస్యససంస్కారసచివాద్భవేత్ ॥57॥**

*57. మనఃపరిణామములు సమాధియవస్థ యందును ఉండుట, మొదట నుండియు దీర్ఘకాలము చేసిన అభ్యాస బలము వలనను అదృష్టమనబడు పూర్వపుణ్య విశేషమువలనను సంభవమగుచున్నది.*

**వ్యాఖ్య:** మనస్సు యొక్క పరిణామములన్నీ అణగి పోయినపుడు ఆత్మ స్వరూపము ప్రకటమగును. ఈ అణగారిపోయిన స్థితియే ఒక పరిణామము. శ్రీరామకృష్ణ పరమహంస పరిశుద్ధమైన మనస్సు, ఆత్మ – రెండూ ఒకటే అని ఉపదేశించారు గదా!

**యథా దీపో నివాతస్థ ఇత్యాదిభి రనేకథా ।**
**భగవానిమమేవార్థమర్జునాయ న్యరూపయత్ ॥58॥**

***58.*** *జ్ఞానైశ్వర్య శక్తి బలవీర్య తేజస్సంపన్నుడగు శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతయందు యథా దీపో నివాతస్థో నేంగతే సోపమాస్మృతా* ***(6.19)*** *మొదలగు శ్లోకములచే అనేక విధముల ఈ నిర్వికల్ప సమాధి రూపమునే శిష్యుడగు అర్జునునకు బోధించెను.*

**అనాదావిహ సంసారే సఞ్చితాః కర్మకోటయః ।**
**అనేన విలయం యాన్తి శుద్ధో ధర్మో వివర్ధతే ॥59॥**

***59.*** *అనాదియగు సంసారమున పుణ్యాపుణ్య రూపములగు కర్మలు అసంఖ్యాకముగ సంపాదింపబడుచున్నవి. అవి అన్నీ నిర్వికల్ప సమాధి అనుభవముచే నశించును. శుద్ధమగు ధర్మము పెంపొందును.*

**వ్యాఖ్య:** శుద్ధ ధర్మమనగా కార్యవర్గ సమేతముగ అవిద్యను తొలగించి ఆత్మ సాక్షాత్కారమునకు సాధనమగు ధర్మము. కర్మలు నశించుటకు *'క్షియంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే'* (ముండకోపనిషత్తు 2.2.8) *'జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా'* (గీత 4.37) అనే వాక్యములు ప్రమాణముగా చూపబడినవి.

**ధర్మమేఘమిమం ప్రాహుః సమాధిం యోగవిత్తమాః ।**
**వర్షత్యేష యతో ధర్మామృతధారాః సహస్రశః ॥60॥**

***60.*** *బ్రహ్మసాక్షాత్కారమును పొందిన యోగివరేణ్యులు ఈ సమాధిని ధర్మమేఘమందురు. ఏలన ఇది ధర్మమనెడి అమృతమును వేయిధారలతో వర్షించును.*

**వ్యాఖ్య:** *'క్షణమేక మాస్థాయక్రతుశతస్యాపి'* అని యథర్వశిఖోపనిషత్తు. పాతంజల యోగసూత్రములు కైవల్యపాదమును (29.సూ) దీనినే సూచించును.

**అమునా వాసనాజాలే నిశ్శేషం ప్రవిలాపితే ।**
**సమూలోన్మూలితే పుణ్యపాపాఖ్యే కర్మసఞ్చయే ॥61॥**

***61.*** *ఈ నిర్వికల్ప సమాధిచే, జ్ఞానవిరుద్ధములు అహంకార మమకార కర్తృత్వాది అభిమానములకు హేతువులు అగు, సంస్కారములు సమూహము నిశ్శేషముగ నశింపజేసినపుడు పుణ్య పాపములనే కర్మ సంచయమును కూకటి వేర్లతో నిర్మూలించినపుడు...*

**వాక్యమప్రతిబద్ధం సత్ప్రాక్పరోక్షావభాసితే ।**
**కరామలకవద్భోధ మపరోక్షం ప్రసూయతే ॥62॥**

*62.* తత్త్వమసి మొదలగు మహా వాక్యములు, సత్కర్మలు సంస్కారములు అనే ప్రతిబంధము తొలగి, మునుపు పరోక్షముగ మాత్రము తెలిసిన తత్త్వము ఇపుడు అరచేతిలో ఉసిరికాయ వలె ప్రత్యక్షముగ అపరోక్షముగ తెలియునట్లు చేయును.

**పరోక్షం బ్రహ్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకమ్ ।**
**బుద్ధి పూర్వకృతం పాపం కృత్స్నం దహతి వహ్నివత్ ॥63॥**

*63.* గురుదేవుని వద్ద తత్త్వమస్యాది వాక్యముల ఉపదేశ రూపమున కలిగిన పరోక్షమగు బ్రహ్మజ్ఞానము బుద్ధి పూర్వకముగ జేసిన సకల పాపములను దహించును.

**అపరోక్షాత్మ విజ్ఞానం శాబ్దం దేశికపూర్వకమ్ ।**
**సంసార కారణాజ్ఞాన తమసశ్చండభాస్కరః ॥64॥**

*64.* గురుదేవుని వద్ద తత్త్వమస్యాది వాక్యముల ఉపదేశము వలన కలిగిన సంశయ విపర్యయములు లేని అపరోక్షమగు ఆత్మ విజ్ఞానము సంసార కారణమగు అవిద్యయనెడి అంధకారమునకు చండభాస్కరుని వంటిది. మధ్యాహ్నపు సూర్యుడు చీకటిని వలె అపరోక్షజ్ఞానము అవిద్యను రూపు మాపునని యుద్దేశము.

**ఇత్థం తత్త్వవివేకం విధాయ విధివన్మనస్సమాధాయ ।**
**విగళితసంసృతిబంధః ప్రాప్నోతి పరం పదం నరో న చిరాత్ ॥65॥**

*65.* ఈ విధముగ బ్రహ్మాత్మైకత్వమనెడు తత్త్వమును గూర్చిన వివేకమును పంచకోశ వివేచనముచే సంపాదించి ఆ తత్త్వమున శాస్త్రోక్త విధానమున మనస్సును స్థిరముగ నిలిపి అపరోక్ష జ్ఞానముచే సంసార బంధమగు అవిద్యను నశింపజేసి పరమ పదమును నిరతిశయానంద రూపమగు మోక్షమును మానవుడు అచిరకాలముననే పొందును. సత్య జ్ఞానానంద లక్షణమగు బ్రహ్మమే అగునని భావము.

## ప్రథమ ప్రకరణము సమాప్తము

# ద్వితీయము : పంచభూత వివేక ప్రకరణము

**సదద్వైతం శ్రుతం యత్తత్పఞ్చభూతవివేకతః ।**
**బోద్ధుం శక్యం తతో భూత పఞ్చకం ప్రవివిచ్యతే ॥1॥**

*1. బ్రహ్మము అద్వితీయమైన సత్తయని శ్రుతి (వేదము) చెప్పును. ఆ బ్రహ్మమును పంచభూత వివేకముచే తెలిసికొనగలము. కావున ఇప్పుడు పంచభూత వివేకము ప్రారంభింపబడుచున్నది.*

**వ్యాఖ్య:** 'సదేవ సోమ్యేదమగ్ర అసీత్ ఏకమే వాద్వితీయమ్' (చాంధోగ్య 6.2.1) అని శ్రుతి ప్రమాణము. ఈ అద్వయ సత్తయగు బ్రహ్మము అవాఙ్మానస గోచరమగుట చేత నేరుగా తెలియబడదు. అనగా పంచేంద్రియముల చేత అంతరింద్రియమగు మనస్సు చేత బ్రహ్మమును గ్రహింపలేము. అయినా ఆ బ్రహ్మమే ఉపాధివశమున పాంచ భౌతికమైన జగత్తుగా భాసించుచుండుటచే పంచ భూతవివేకము ద్వారా ఆ ఉపాధిని తొలగిస్తే బ్రహ్మము బోధపడును.

**శబ్ద స్పర్శౌ రూపరసౌ గంధో భూతగుణా ఇమే ।**
**ఏకద్విత్రిచతుః పఞ్చగుణా వ్యోమాదిషు క్రమాత్ ॥2॥**

*2. శబ్ద స్పర్శ రూప రస గంధము లనునవి ఆకాశము వాయువు తేజము (అగ్ని) జలము పృథివి అను పంచభూతముల గుణములు. వీనియందు క్రమముగా ఒకటి రెండు మూడు నాలుగు అయిదు గుణములుండును.*

**ప్రతిధ్వని ర్వియచ్ఛబ్దో వాయౌ బీసీతి శబ్దనమ్ ।**
**అనుష్ణాశీతసంస్పర్శః వహ్నౌ భుగుభుగుధ్వనిః ॥3॥**

*3. ఆకాశమునందు ప్రతిధ్వని ఉన్నది. వాయువునందు బీసీ అను ధ్వనియు ఉష్ణశైత్యములు లేని స్పర్శయు గలవు. అగ్నియందు భుగ భుగయను శబ్దము, (తరువాతి శ్లోకముతో నన్వయము.)*

**ఉష్ణ స్పర్శః ప్రభారూపం జలే బులుబులు ధ్వనిః ।**
**శీత స్పర్శః శుక్లరూపం రసో మాధుర్యమీరితః ॥4॥**

*4. ఉష్ణ స్పర్శయు కాంతి రూపమును గలవు. జలమున బులుబులు మను శబ్దము చల్లని స్పర్శయు తెల్లని రంగు తీయని రుచియు ఉన్నవని చెప్పబడినవి.*

**భూమౌ కడకడాశబ్దః కాఠిన్యం స్పర్శ ఇష్యతే ।**
**నీలాదికం చిత్రరూపం మధురామ్లాదికో రసః ॥5॥**

*5. భూమియందు కటకట యను శబ్దము, కఠిన స్పర్శయు, నీలము ఎరుపు మొదలగు అనేక వర్ణములు, తీపు పులుపు మొదలగు రుచులు.*

**సురభీతరగంధౌ ద్వౌ గుణాః సమ్యగ్వివేచితా ।**
**శ్రోత్రం త్వక్ చక్షుషీ జిహ్వా ఘ్రాణం చేంద్రియ పంచకమ్ ॥6॥**

*6. సుగంధము దుర్గంధము అనే రెండూ గలవు. ఇట్లు పంచభూతముల గుణములు వివేచింపబడినవి. వీనిని గ్రహించే ఇంద్రియములు క్రమముగా శ్రోత్రము, త్వక్కు, చక్షువులు, జిహ్వా, ఘ్రాణము అనునవి. పంచభూతముల పరిణామములే కార్యములే పంచేంద్రియములు. చూ.ప్ర.1.19*

**కర్ణాదిగోలకస్థం తచ్ఛబ్దాదిగ్రాహకం క్రమాత్ ।**
**సౌక్ష్మ్యాత్ కార్యానుమేయం తత్ప్రాయో ధావేద్బహిర్ముఖమ్ ॥7॥**

*7. శ్రోత్రాది ఇంద్రియములు చెవి మొదలగు మాంసగోళకము లందుండి శబ్దాది విషయములను గ్రహించును. సూక్ష్మములగుటచే ఆ ఇంద్రియములు వాని కార్యముల వలన అనుమాన ప్రమాణము చేతనే తెలియబడుచున్నవి. సాధారణముగ అవి బహిర్ముఖముగ ప్రసరించును. (కఠ ఉప 4.1)*

**కదాచిత్పిహితే కర్ణే శ్రూయతే శబ్ద ఆంతరః ।**
**ప్రాణవాయౌ జాఠరాగ్నౌ జలపానేఽన్న భక్షణే ॥8॥**

*8. చెవులు మూసికొనినపుడు అంతరమైన శబ్దము వినిపించును. అట్లే ప్రాణవాయువు జఠరాగ్నియు చేయు శబ్దములు అంతరములు, అనగా లోపలనున్నవి, తెలియబడుచున్నవి.*

**వ్యజ్యంతే హ్యాంతరాః స్పర్శా మీలనే చాంతరం తమః।**
**ఉద్గారే రసగంధౌ చేత్యక్షాణామాంతరగ్రహః ॥9॥**

*9. నీళ్ళు త్రాగినపుడు అన్నము తినినపుడు అంతరమైన స్పర్శలు తెలియుచున్నవి. కన్నులు మూసుకున్నప్పుడు లోపలి అంధకారమును చూతుము. త్రేపు వచ్చినపుడు రుచియు వాసనయు తెలియుచున్నవి. ఇట్లు ఇంద్రియములు సాధారణముగ బహిర్విషయములను గ్రహించినప్పటికీ అప్పుడప్పుడు ఆంతర విషయములను కూడా గ్రహించును.*

**పంచోక్త్యాఽఽదాన గమన విసర్గానందకాః క్రియాః ।**
**కృషి వాణిజ్య సేవాద్యాః పంచస్వంతర్భవంతి హి ॥10॥**

*10. మాటలాడుట తీసికొనుట పోవుట త్యజించుట ఆనందించుట అనునవి అయిదు క్రియలు. వ్యవసాయము వ్యాపారము సేవ మొదలగు క్రియలన్నియు ఈ అయిదింటి యందు ఇమిడిపోవును.*

**వాక్పాణిపాదపాయూపస్థై రక్షైస్తత్క్రియాజనిః ।**
**ముఖాదిగోలకేష్వాస్తే తత్కర్మేంద్రియ పంచకమ్ ॥11॥**

*11. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ అనే అయిదు కర్మేంద్రియముల నుండి ఆ అయిదు క్రియలు క్రమముగా జనించును. నోరు, చేయి, కాలు, గుదము, జననేంద్రియము అనే మాంసపిండము లందు కర్మేంద్రియములు ఉండును.*

**మనో దశేంద్రియాధ్యక్షం హృత్పద్మేగోళకే స్థితమ్ ।**
**తచ్చాంతః కరణం బాహ్యేష్వ స్వాతంత్ర్యాద్వినేన్ద్రియైః ॥12॥**

*12. ఈ పది ఇంద్రియములను శాసించునది మనస్సు. అది హృదయ కమలమునందు ఉండును. స్వతంత్రముగ అది బాహ్యవిషయములను గ్రహింపజాలదు కనుక ఇంద్రియముల సహాయమును అపేక్షించును. కాబట్టి దానికి అంతఃకరణమని పేరు.*

**వ్యాఖ్య:** కరణ మనగా సాధనము. పది ఇంద్రియములు కూడ బాహ్య కరణములే. మనస్సు అంతఃకరణము. దీపపు కాంతి గదియందంతటను ప్రసరించి ఉన్నను కాంతి స్థానము దీపశిఖ అనునట్లే అంతటయు వ్యాపించి ఉన్న మనస్సుకు స్థానము హృదయ కమలమని చెప్పబడినది.

**అక్షేష్వర్థార్పితేష్వేతద్గుణదోష విచారకమ్ ।**
**సత్త్వం రజస్తమశ్చాస్య గుణా విక్రియతే హి తైః ॥13॥**

*13.* *ఇంద్రియములు కొనివచ్చి సమర్పించు విషయములలోని గుణ దోషములను మనస్సు విచారించును. సత్త్వము రజస్సు తమస్సు అనే గుణములచే మనస్సు ఏర్పడుచున్నది. వీనిచే మనస్సు అనేక వికారములను అనగా పరిణామములను పొందును.*

**వ్యాఖ్య:** ప్ర. 1.20 నందు మనస్సు సూక్ష్మభూతముల సాత్త్వికాంశల కలయికచే ఏర్పడినదని చెప్పబడెను. ఇపుడు రజస్తమస్సు లెచట నుండి వచ్చినవి? అనగా సూక్ష్మభూతములే తమఃప్రధానమగు ప్రకృతి నుండి జనించినవి. కనుక ప్రతి ప్రకృతి వికారమునందూ మూడు గుణములు ఉండును. కేవలము వాని ప్రాధాన్యత యందు మాత్రమే భేదము.

జ్ఞానస్వరూపమగు ఆత్మ అన్ని జ్ఞానములకు సమానమే. నేత్రాది జ్ఞానేంద్రియములు రూపము మొదలగు జ్ఞానములను సమర్పించుటతో ఆగి పోవును. ఇక వానిని సమన్వయపరచి గుణదోషములు విచారించున దెవరు? ఆ విచారణకు సాధనముగ మనస్సును అంతరింద్రియముగ స్వీకరింపవలసియున్నది.

**వైరాగ్యం క్షాంతిరౌదార్యమిత్యాద్యాస్సత్త్వసంభవాః ।**
**కామక్రోధౌ లోభయత్నావిత్యద్యా రజసోత్థితాః ॥14॥**

*14.* *వైరాగ్యము క్షమ ఔదార్యము మొదలగు వికారములు, అనగా గుణములు, సత్త్వ గుణము నుండి కలుగును. కామక్రోధములు లోభము ప్రయత్నము మొదలగు గుణములు రజో గుణము నుండి ఉద్భవించును.*

**ఆలస్యం భ్రాన్తి తన్ద్రాద్యా వికారాస్తమసోత్థితాః ।**
**సాత్త్వికైః పుణ్యనిష్పత్తిః పాపోత్పత్తిశ్చ రాజసైః ॥15॥**

*15.* *ఆలస్యము (సోమరితనము) భ్రమ మత్తు మొదలగు వికారములు తమోగుణము వలన కలుగును. సాత్త్విక వికారముల వలన పుణ్యము కలుగును. రాజస వికారముల వలన పాపము కలుగును.*

**తామసైర్నోభయం కింతు వృథాయుఃక్షపణం భవేత్ ।**
**అత్రాహం ప్రత్యయీ కర్తేత్యేవం లోకే వ్యవస్థితిః ॥16॥**

*16.* *కాని, తమోగుణము వలన పుణ్యాపాపము లేవియు కలుగవు. రాయి రప్పలకు వలె నిరర్థకముగ ఆయువు క్షయించి పోవును. ఇట్టి అంతఃకరణ వికారములలో 'నేను' అనే వికారమునకు కర్తయని పేరు. ఇదే లోకవ్యవహారము.*

**వ్యాఖ్య:** ప్రథమ ప్రకరణమున శరీరత్రయమును పంచకోశములను విచారించి 'తత్త్వమసి' అనే మహా వాక్యమునందలి 'త్వం' పదార్థము స్పష్టము చేయబడినది. 'సదేవ సోమ్య ఇదం అగ్ర అసీదేకమేవాద్వితీయమ్' (ఛాందోగ్య ఉపనిషత్తు 6. 2. 1) అను వాక్యమున ఇదం శబ్దముచే జగత్తు సూచింపబడినది. ఆ 'ఇదం' శబ్దమునకు అర్థము నిరూపిస్తూ ఆ జగత్తున దర్శించు ఏకాదశ ఇంద్రియములు కర్తయగు 'నేను' (అహంకారము) అన్నియు పంచభూత వికారములని చూపబడినది. పంచభూతములు తమః ప్రధానమగు ప్రకృతి నుండి జనించినవి. ఈ ప్రకృతి కూడా బ్రహ్మము యొక్క ఉపాధియే. కనుక ఈ ఉపాధిని వివేచించి తొలగించినచో ఈ జగత్తు (ఇదం) కూడా బ్రహ్మము మాత్రమే (సత్‌ఏవ) అని తేటపడును.

**స్పష్టశబ్దాదియక్తేషు భౌతికత్వమతిస్ఫుటమ్ ।**
**అక్షాదావపి తచ్ఛాస్త్రయుక్తిభ్యామవధార్యతామ్ ॥17॥**

*17. స్పష్టముగ శబ్దస్పర్శాది గుణములు గల ఘటము మొదలగు వస్తువులు పంచభూతముల కార్యములనుట స్ఫుటమగ తెలియచున్నవి. ఇంద్రియములు కూడా అట్టి భూతకార్యములే అని శాస్త్రప్రమాణము చేతను తర్కము (అనుమాన ప్రమాణము) చేతను తెలిసికొనవలెను.*

**వ్యాఖ్య:** ఛాందోగ్య ఉప. 6. 5. 4 నందు మనస్సు అన్నమయమనీ ప్రాణములు అపోమయము (జలమయము) అనీ వాక్కు తేజోమయమనీ చెప్పబడినది. ఛాందోగ్య 6. 7. 1 యందూ సిద్ధాంతబింద గ్రంథమునందూ ఈ విషయమే తర్క బద్ధముగ నిరూపింపబడినది.

**ఏకాదశేంద్రియైర్యుక్త్యా శాస్త్రేణాప్యవగమ్యతే ।**
**యావత్కించిత్ భవేదేత దిదంశబ్దోదితం జగత్ ॥18॥**

*18. ఏకాదశ ఇంద్రియముల (ప్రత్యక్ష ప్రమాణమ) చేతను తర్కము (అనుమాన ప్రమాణము) చేతను శాస్త్రము (శబ్దప్రమాణమ) చేతను అర్థాపత్తి మొదలగు ఇతర ప్రమాణముల చేతను బోధపడుచున్న ~~ఈ~~ జగత్తు అనునదంతయు 'ఇదం' శబ్దముచే సూచింపబడుచున్నది. (ఇదం శబ్దము 'సదేవ సోమ్య ఇదం అగ్ర ఆసీదేక మేవాద్వితీయం' ఛాం.6.2.1 అనే వాక్యములోనిది.)*

**ఇదం సర్వం పురాసృష్టే రేక మేవాద్వితీయకమ్ ।**
**సదేవాసీన్నామరూపే నాస్తామిత్యారుణేర్వచః ॥19॥**

*19. ఇది అంతా (ఈ జగత్తు అంతా) సృష్టి అగుటకు పూర్వము సత్ పదార్థమే, అది ఒక్కటే, రెండవ పదార్థము లేకయే ఉండెను. నామరూపములు లేకుండెను అని ఆరుణి మహర్షి చెప్పెను. (ఛాందోగ్య ఉపనిషత్తు. 6.2. లోని అర్థము మాత్రము ఇచట చెప్పబడినది)*

**వృక్షస్య స్వగతో భేదః పత్రపుష్పఫలాదిభిః ।**
**వృక్షాంతరాత్సజాతీయో విజాతీయతలాదిశ్శిః ॥20॥**

*20. భేదమ మూడు విధములు. ఒకే వృక్షమున ఆకులు పువ్వులు పండ్లు మొదలగు భేదము స్వగతభేదము. ఒక జాతికి చెందిన అనేక వృక్షములకు పరస్పరముగనున్న భేదము సజాతీయ భేదము. వృక్షమునకు శిలలు నదులు మొదలగు వానితో గల భేదము విజాతీయ భేదము.*

**తథా సద్వస్తునో భేదత్రయం ప్రాప్తం నివార్యతే ।**
**ఐక్యావధారణద్వైతప్రతిషేధైస్త్రిభిః క్రమాత్ ॥21॥**

*21. అట్లే సద్వస్తువు నందు ఈ మూడు భేదములు ఉండవచ్చుననే సంశయమును ఐక్యము అవధారణ ద్వైత ప్రతిషేధము అనే మూడు శబ్దముల ప్రయోగము నివారించుచున్నది.*

**వ్యాఖ్య:** 'ఏకమే వాద్వితీయమ్' అనే శ్రుతివాక్యము 'ఏకమ్' అనే శబ్దముచే ఐక్యమును, 'ఏవ' శబ్దముచే అవధారణను, అద్వితీయమ్ అనే శబ్దముచే ద్వైతప్రతిషేధమును సూచించుచున్నది.

**సతో నావయవాశ్శంక్యాస్తదంశస్యానిరూపణాత్ ।**
**నామరూపే న తస్యాంశౌ తయోరద్యాప్యనుద్భవాత్ ॥22॥**

*22. అద్వయమగు సత్త (బ్రహ్మము) యందు అవయమవములనెడి స్వగత భేదమును అనుమానింపలేము. ఏలన బ్రహ్మమునందు అంశములే నిరూపింపబడలేదు. నామరూపములు సదంశములు కావా? అనిన కావు. సృష్టికి పూర్వము అవి లేవు కనుక.*

**నామరూపోద్భవ స్యైవ సృష్టిత్వాత్ సృష్టితః పురా ।**
**న తయోరుద్భవస్తస్మాన్నిరంశం సత్యథా వియత్ ॥23॥**

*23. నామరూపములు కలుగుటయే సృష్టియనబడుచున్నది. కనుక సృష్టికి పూర్వము అవి లేవనుట నిర్వివాదాంశము. అందుచే బ్రహ్మము ఆకాశము వలె అంశరహితము. (అంశములే లేకపోవుటచే స్వగత భేదము బ్రహ్మమునందు లేదు.)*

**సదంతరం సజాతీయం న వైలక్షణ్యవర్జనాత్ ।**
**నామరూపోపాధిభేదం వినా నైవ సతో భిదా ॥24॥**

*24. ఘటసత్త పటసత్త అనే వేరువేరు సత్తలు ఉన్నట్లు తోచినా ఆ సత్తల యందు విలక్షణత్వము లేకపోవుటచే సత్త ఒకటియే అగుచున్నది. నామ రూపములనెడి ఉపాధుల వలన మాత్రము భేదమున్నట్లు తోచును. ఆకాశము ఒకటియే అయినను ఘటాకాశము మఠాకాశము మొదలగు భేదములున్నట్లు ఘటము మఠము మొదలగు ఉపాధుల వశమున తోచుచున్నది గదా. కనుక బ్రహ్మమునందు సజాతీయ భేదము లేదు.*

**విజాతీయ మసత్తత్తు న ఖల్వస్తీతి గమ్యతే ।**
**నాస్యాతః ప్రతియోగిత్వం విజాతీయాద్భిదా కుతః ॥25॥**

*25. సత్తకు విజాతీయము అసత్. అసత్ అనగా అసలు లేకపోవుట. లేనివస్తువుతో భేదము చెప్పుటకుదరదు. ఇక విజాతీయ భేదమెట్లు వచ్చును? కనుక బ్రహ్మము నందు విజాతీయ భేదము కూడా లేదు.*

**ఏకమేవాద్వితీయం సత్సిద్ధమత్ర తు కేచన ।**
**విహ్వలా అసదేవేదం పురాఽఽసీదిత్యవర్ణయన్ ॥26॥**

*26. ఇట్లు సత్త ఒకటి మాత్రమే, రెండవది లేదు అని సిద్ధించుచున్నది. కాని ఈ విషయమున కొందరు మతిభ్రమించిన వారు పూర్వము అసత్ మాత్రమే ఉండినదని వర్ణింతురు.*

**వ్యాఖ్య:** మాధ్యమిక సంప్రదాయమునకు చెందిన శూన్యవాది బౌద్ధులు మొదట శూన్యమే ఉండినదని వాదింతురు. అంతా శూన్యమునందే లయించుననీ మధ్యలో కన్పించే ఈ సృష్టియంతా భ్రమయనీ వారి సిద్ధాంతము. ఈ భ్రమకు ఆధారము లేదు కనుక శూన్యమే పరతత్త్వమని వారి వాదము.

**మగ్నస్యాబ్ధౌ యథాక్షాణి విహ్వలాని తథాస్యధీః ।**
**అఖండైకరసం శ్రుత్వా నిష్ప్రచారా బిభేత్యతః ॥27॥**

*27.* సముద్ర మధ్యమున మునిగిన వ్యక్తికి భయముచే మతిభ్రమించి నట్లు వీరు కూడా బ్రహ్మము అఖండము ఏకరసము అని వినుటచేతనే చేష్టలు దక్కి భయభ్రాంతులగుచున్నారు. (ఇచట సాకారబ్రహ్మవాదులు కూడా ఉద్దేశింపబడిరి).

**గౌడాచార్యా నిర్వికల్పే సమాధావన్యయోగినామ్ ।**
**సాకారబ్రహ్మనిష్ఠానామత్యంతం భయమూచిరే ॥28॥**

*28.* సాకార బ్రహ్మమును ఉపాసించే ఇతరయోగులు నిర్వికల్ప సమాధిని గూర్చి అత్యంతము భయము నొందుదురని ఆచార్యగౌడపాదులు వచించిరి.

**వ్యాఖ్య:** నిర్వికల్ప సమాధియందు ధ్యాతధ్యేయము ఏవియు మిగలవు. సత్తాస్వరూపము వికల్పములు లేనిదై ప్రకాశించును. ధ్యేయమనే ఆలంబనమును ఆశ్రయించి ఉండే ధ్యాతలు ఇట్టి నిరాలంబ స్థితిని గూర్చి భయపడుట సహజమే (చూ, మాండూక్యకారిక 3.39)

**అస్పర్శయోగో నామైష దుర్దర్శః సర్వయోగిభిః ।**
**యోగినో బిభ్యతి హ్యస్మాదభయే భయదర్శినః ॥29॥**

*29.* ఈ నిర్వికల్ప సమాధికి అస్పర్శయోగమని పేరు. సాకార ధ్యాన నిష్ఠులగు సకలయోగులకు ఇది అసాధ్యము. నిర్జన ప్రదేశమునందు బాలకుల వలె వీరు భయరహితమగు నిర్వికల్ప సమాధియందు భయహేతువులను ఊహించి భీతి జెందుదురు.

**భగవత్పూజ్యపాదాశ్చ శుష్క తర్కపటూనమూన్ ।**
**ఆహుర్మాధ్యమికాన్భ్రాంతానచింత్యేఽస్మిన్సదాత్మని ॥30॥**

*30.* శ్రీశంకర భగవత్పాదులు కూడా ఈ శుష్క తర్కనిష్ణాతులగు మాధ్యమికులు, అద్వయము స్వయంసిద్ధము అగు బ్రహ్మమును గూర్చి భ్రాంతిలో పడిరని నుడివిరి.

**అనాదృత్య శ్రుతిం మౌర్ఖ్యాదిమే బౌద్ధాస్తమస్వినః ।**
**ఆపేదిరే నిరాత్మత్వమనుమానైక చక్షుషః ॥31॥**

*31.* మూర్ఖత్వము వలన అంధకారమగ్నులైన ఈ బౌద్ధులు అనుమాన ప్రమాణమను ఒకకంటితో మాత్రమే చూచుచు శ్రుతి ప్రమాణమును

*నిరాకరించి ఆత్మయనునదే లేదనుచూ శూన్యమును మాత్రము సంపాదింప గలిగిరి.*

**శూన్యమాసీదితి బ్రూషే సద్యోగం వా సదాత్మతామ్ ।**
**శూన్యస్య న తు తద్యుక్తముభయం వ్యాహతత్వతః ॥32॥**

*32. "శూన్యమే ఉండెను" అనునపుడు ఈ 'శూన్యము' ఇతర వస్తువుల వలె సత్తారూపమా లేక సత్తతో సంబంధపడినదా? ఎట్లైనను 'శూన్యము ఉండుట' అనునవి పరస్పర విరుద్ధవచనమే.*

**వ్యాఖ్య:** సృష్టికి పూర్వము శూన్యమే ఉండెననీ ప్రళయము పిదప అంతా శూన్యముననే లయించుననీ, కనుక మధ్యకాలమున మాత్రము భాసించు ఈ జగదాదికమంతా, వ్యక్తి, వ్యక్తి యందలి ఆత్మ కూడా, శూన్యమేననీ శూన్యవాది బౌద్ధుల వాదము.

ఉండుటనే సత్తయనుచున్నాము. అన్ని వస్తువులు ఉండుట వలన సత్తా రూపములగుచున్నవి. కనుక శూన్యము ఉండినచో అదియూ సత్తారూపమే అగును. అయినచో శూన్యమను పదమున కర్థము లేదు. కాక, శూన్యము సద్వస్తువుతో సంబంధపడునది అనినచో సంబంధపడుటకు శూన్యము మరియొక వస్తువు కావలసి ఉండును. రెండు వస్తువుల మధ్యగదా సంబంధముండుట. ఇట్లైనచో శూన్యము మరొక సద్వస్తువగు చున్నది. శూన్యమగు పదము అర్థరహిత మగుచున్నది.

అనుభవమున కూడా శూన్యమున్నదని చెప్పుటకు శూన్యమును చూచిన ద్రష్ట ఉండవలెను గదా. అట్టి ద్రష్ట ఉండగా అంతా శూన్యమే అని యెట్లు చెప్పగలము?

**న యుక్తస్తమసా సూర్యో నాపి చాసౌ తమోమయః ।**
**సచ్ఛూన్యయో ర్విరోధిత్వాచ్ఛూన్యమాసీత్కథం వద ॥33॥**

*33. సూర్యుడు చీకటితో ఉండడు. సూర్యుడు అంధకారమయుడూ కాడు. అట్లే సత్త, శూన్యము పరస్పర విరుద్ధములగుటచే శూన్యము ఉండెనని ఎట్లందువో చెప్పు. (అది అసంభవమని ఉద్దేశము).*

**వియదాదే ర్నామరూపే మాయయా సువికల్పితే ।**
**శూన్యస్య నామరూపే చ తథా చేజ్జీవ్యతాం చిరమ్ ॥34॥**

*34.* ఆకాశము మొదలగు నిర్వికారవస్తువులందు నామరూపములు మాయచే కల్పింపబడినట్లే శూన్యమునందును నామరూపములు మాయచే కల్పింపబడినవనినచో నీవు చిరకాలము జీవింపుము. (అనగా శూన్యవాది పప్పులో కాలు వేసెనని అర్థము).

**సతోపి నామరూపే ద్వే కల్పితే చేత్తదా వద ।**
**కుత్రేతి నిరధిష్ఠానో న భ్రమః క్వచిదీక్ష్యతే ॥35॥**

*35.* ఏదైన ఉన్న వస్తువుపై నామరూపములు కల్పింపబడినచో అట్లు చెప్పుము. ఆధారవస్తువు లేని చోట భ్రమయున్నట్లు ప్రపంచమున నెచ్చటను చూడము.

**వ్యాఖ్య:** వేదాంతమున సద్వస్తువగు బ్రహ్మముపై నామరూపములు కల్పితము లగుచున్నవని చెప్పబడినది. ఇచ్చట ఆధారవస్తువు బ్రహ్మము. శూన్యవాది శూన్యముపై నామరూపములు కల్పింపబడినవనినచో శూన్యము కూడా ఆధారముగ సద్వస్తువగుచున్నది. శూన్యత్వము నశించుచున్నది. కాదు, శూన్యమే ఆధారమనిన ఆధారమే లేదని ఏర్పడును. ఆధారము లేకయే భ్రమ కలుగుట అనుభవ విరుద్ధము, కనుక శూన్యవాదము నిలువదు. సద్వస్తువునకు జగత్తు ఆధారము (అధిష్ఠానము) కాజాలదు, సత్త నుండే జగత్తు ఉత్పన్నమైనది కనుక.

**సదాసీదితి శబ్దార్థభేదే వైగుణ్యమాపతేత్ ।**
**అభేదే పునరుక్తిస్స్యాన్మైవం లోకే తథేక్షణాత్ ॥36॥**

*36.* సత్త ఉండెను అనే శబ్దముల అర్థము నందును విరోధమే. విరోధము లేదు, రెండింటి అర్థమొకటే అనిన పునరుక్తి దోషము (అని ఆక్షేపించినచో సమాధానము) లోకవ్యవహారమిట్లే అగుటచే దోషము లేదు.

**వ్యాఖ్య:** ఛాం.ఉప.3.19.9: 6.2.1 నందు 'అసదేవేదమగ్ర ఆసీత్' అనే వాక్యమున విరోధము చెప్పబడినట్లే 'సదేవసోమ్యేద మగ్ర అసీత్' అనినను విరోధమేయని ఆక్షేపము. ఉండినదే మరల ఉండెను అనుట విరుద్ధము. సత్, ఆసీత్ అనునవి రెండు సత్తలైనచో అద్వయసత్తయు సిద్ధమగుచున్నది. అర్థము ఒకటియే కదా అనిన ఒకదానిని రెండు పర్యాయములు చెప్పుట పునరుక్తి దోషము. ఇట్టి ఆక్షేపమునకు సమాధానముగ లోకమున ఇట్లే వ్యవహారము జరుగుటచే అందు దోషము లేదని చెప్పబడుచున్నది.

**కర్తవ్యం కురుతే వాక్యం బ్రూతే ధార్యస్య ధారణమ్ ।**
**ఇత్యాది వాసనావిష్టం ప్రత్యాసీత్సదితీరణమ్ ॥37॥**

*37.* చేయవలసిన దానిని చేసెను, వాక్యమును వచించెను, భారమును భరించెను మొదలైన వాక్య ప్రయోగములన్నీ పునరుక్తులు విరోధములే. ఇట్టి సంస్కారములు కలిగిన వారినుద్దేశించే శ్రుతి 'సత్ ఆసీత్ 'అని చెప్పుచున్నది. జనులకు ఈ వాక్యములన్నీ అర్థవంతములే సాధువులే అగుచున్నవి.

**కాలాభావే పురేత్యుక్తిః కాలవాసనయా యుతమ్ ।**
**శిష్యం ప్రత్యేవ తేనాత్ర ద్వితీయం న హి శంక్యతే ॥38॥**

*38.* అద్వితీయమగు బ్రహ్మము 'పూర్వము' ఉండెను అనుట ఎట్లు? రెండవది ఉండినగదా దానికి 'పూర్వము' మరొకటి ఉండెనని చెప్పగలము? అను సంశయము వారింపబడుచున్నది. బ్రహ్మము కాలాతీతమైనను 'పూర్వము' అని చెప్పుట కాలమను భావనను వదలని శిష్యుని గూర్చి మాత్రమే. కాలము లేదనిన నూతనులు దిగ్భ్రమ జెందుదురు. వారికి క్రమముగ బోధ పరచుటకు బ్రహ్మము పూర్వము ఉండెను అని చెప్పబడినది. రెండవ దాని గూర్చిన ఉద్దేశము ఇందు లేదు.

**చోద్యం వా పరిహారో వా క్రియతాం ద్వైతభాషయా ।**
**అద్వైతభాషయా చోద్యం నాస్తి నాపి తదుత్తరమ్ ॥39॥**

*39.* ఆక్షేపముగాని పరిహారము గాని ద్వైతభాష యందే, వ్యవహారమున ద్వైతమును ఆరోపించుకొనియే జరుగును. అద్వైతభాష యందు పరమార్థమున ప్రశ్నయు లేదు ఉత్తరమసలే లేదు. రెండవదే లేనపుడు ప్రశ్నలు ఉత్తరములు అసంభవముగదా.

**తదా స్తిమిత గంభీరం న తేజో న తమస్తతమ్ ।**
**అనాఖ్యమనభివ్యక్తం సత్కిఞ్చిదవశిష్యతే ॥40॥**

*40.* అప్పుడు, పరమార్థమున, నిశ్చలము మనస్సు ఊహింపలేనిది కాంతి కానిది ఆచరింపనిది వ్యాప్తమైనది వివరింపనలవికానిది ఇంద్రియములు గ్రహింపజాలనిది శూన్యముకానిది ఇది ఫలానా అని చెప్పవీలు లేనిది ఉండును. అనగా దానిని ద్వైతనిషేధముచే మాత్రము సూచింపగలమని ఉద్దేశము. (యోగవాసిష్ఠ ప్రారంభమున రామవసిష్ఠ సంవాదము ద్రష్టవ్యము.)

**నను భూమ్యాదికం మా భూత్పరమాణ్వస్తనాశతః ।**
**కథం తే వియతోఽ సత్త్వం బుద్ధిమారోహతీతి చేత్ ॥41॥**

*41. ఆక్షేపము: పరమాణువుల కలయికచే ఏర్పడిన భూమి జలము మొదలైనవి లేకపోవుగాక. నిత్యమగు ఆకాశము కూడా లేదనుట ఎట్లు ఊహింపగలము? (వైశేషికుల అభిప్రాయము. బ్రహ్మముతో పాటుగ ఆకాశముండిన అద్వయ వాదము భంగపడును)*

**అత్యంతం నిర్జగద్వ్యోమ యథా తే బుద్ధిమాశ్రితమ్ ।**
**తథైవ సన్ని రాకాశం కుతో నాశ్రయతే మతిమ్ ॥42॥**

*42. సమాధానము: జగమంతా నశించి ఆకాశము మాత్రముండునని నీవు ఊహింపగలిగినట్లే ఆకాశము కూడా నశింపగా సత్త ఉండునని ఏల ఊహింపలేము?*

**వ్యాఖ్య:** *'శబ్దగుణక మాకాశం'* అనీ *'అవకాశ దాతృత్వమ్ ఆకాశత్వమ్'* అనీ ఆకాశమునకు నిర్వచనములు. శబ్దము కలుగుటకు ఆధారమైనది, ఇతర వస్తువులు ఉండుటకు అవకాశమును ఇచ్చునది ఆకాశము. అనగా ఇతర వస్తువులతో సంబంధపడునది ఆకాశము. ఇట్లుండ, వస్తువులన్నీ నశించి ఆకాశము మాత్రము ఉండుట ఊహింపగలిగినచో ఆ ఆకాశము కూడా నశించి సత్త మాత్రము శేషించుట ఏల ఊహింపలేము? అన్నింటిని నిషేధించుచూ వచ్చిన నిషేధింప సాధ్యము గానిది మిగులును. అదే సత్త, బ్రహ్మము.

**నిర్జగద్వ్యోమ దృష్టం చేత్ప్రకాశతమసీ వినా ।**
**క్వ దృష్టం కిం చ తే పక్షే న ప్రత్యక్షం వియత్ఖలు ॥43॥**

*43. జగత్తు నశించినా ఆకాశమును చూడగలమనినచో వెలుగు చీకటులు లేక ఆకాశమును ఎట్లు చూడగలము? అదీగాక మీ పక్షమున ఆకాశము ఇంద్రియగోచరము కాదుగదా? (నైయాయికులు, శూన్యవాదుల పక్షము)*

**తద్వస్తు శుద్ధం త్వస్మాభిర్నిశ్చితైరనుభూయతే ।**
**తూష్ణీం స్థితౌ న శూన్యత్వం శూన్యబుద్ధేశ్చ వర్జనాత్ ॥44॥**

*44. అంతఃకరణ వృత్తులన్నీ ఉపశమించినపుడు శుద్ధసత్తయగు బ్రహ్మము స్పష్టముగ అనుభూతమగుచున్నది. అది శూన్యము కాదు, శూన్యమును అనుభవించుచున్న అనుభవము లేదు కనుక.*

**వ్యాఖ్య:** ఆకాశము వలెనే బ్రహ్మము కూడ ఇంద్రియ గోచరము కాదు గదా అను సంశయము వారింపబడినది. సమాధి స్థితియందు బ్రహ్మము అనుభవ వేద్యము. శూన్యమును అనుభవించే వాడుండినచో ఇక శూన్యమే భంగపడుచున్నది.

**సద్బుద్ధిరపి చేన్నాస్తి మాఽస్త్వస్య స్వప్రభత్వతః ।**
**నిర్మనస్కత్వ సాక్షిత్వాత్సన్మాత్రం సుగమం నృణామ్ ॥45॥**

*45. వృత్తులన్నీ శాంతించినపుడు సత్తను గూర్చిన వృత్తియునుండదు గదా అనిన ఆ వృత్తి లేకపోయినను బాధలేదు. బ్రహ్మము స్వప్రకాశము గనుక తానై ప్రకాశించుచు వృత్తినాశమునకు సాక్షియగుచున్నది. అట్టి బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుటలో కష్టమేమియు లేదు.*

**వ్యాఖ్య:** అచ్చట నా మనస్సు లేదు, నేను ఉన్నాను' అను అనుభవములో అర్థముగాని దేమియు లేదు.

**మనోజృంభణరాహిత్యే యథా సాక్షీ నిరాకులః ।**
**మాయా జృంభణతః పూర్వం సత్తథైవ నిరాకులమ్ ॥46॥**

*46. మనోవ్యాపారములన్నీ ఉపశమించినపుడు సాక్షిచైతన్యము ప్రశాంతముగ భాసించునట్లు మాయా కల్లోలమునకు పూర్వము బ్రహ్మము కూడా ప్రశాంతముగ ప్రకాశించుచుండెను.*

**వ్యాఖ్య:** సాక్షి చైతన్య మనగా మనలోని ఆత్మ సత్త. దాని ఉనికిపైననే సాక్షిత్వము, చూచుచుండుట, ఆరోపింపబడుచున్నది. ఆత్మ సత్తతో విషయములు కూడా ఉండునపుడును ఆత్మ చేయునదేమియు లేదు. కాని విషయముల సాన్నిధ్యము వలన సాక్షిత్వము ఆత్మకు చెప్పబడుచున్నది. విషయముల గూర్చి కర్తృత్వ భావము కలిగినపుడు ఆత్మ అహంతయగు చున్నది. ఈ యహంతనే మనము వ్యవహారమున చైతన్యమని చెప్పుచున్నాము. అహంత స్థితియందు ఆత్మ సత్త యొక్క ప్రశాంత స్థితిపోయి మాయా కల్లోలము ప్రారంభమగుచున్నది. కనుక కర్తృత్వ భావమును వదలి ఆత్మసత్త సత్తా మాత్రముగ అనుభవమునకు వచ్చుటలో అసంభవముగాని విషయముల ఆవశ్యకతగాని ఏమీ లేదు. అట్లే పదునాల్గు భువనముల తోడి బ్రహ్మాండ సహితమగు బ్రహ్మము కూడ ఈ మాయాకల్లోలమును వదలి, నామరూప రహితమై, సృష్టికి పూర్వము కేవలము సత్తా మాత్రముగ ఉండెననుటలో నసంభావ్యతగాని నామరూపముల ఆవశ్యకత గాని ఏమీ లేదు.

**నిస్తత్వా కార్యగమ్యాస్య శక్తిర్మాయాఽగ్ని శక్తివత్ ।**
**న హి శక్తిః క్వచిత్కైశ్చిత్ బుధ్యతే కార్యతః పురా ॥47॥**

*47. అగ్నియందలి దాహక శక్తివలె సద్వస్తువగు బ్రహ్మము కంటె భిన్నమగు అస్తిత్వము లేనిదియు, ఆకాశాది కార్యములకు కారణముగ అనుమానముచే తెలియబడునదియు, అగు బ్రహ్మము యొక్క శక్తియే, ఆకాశాదులను కల్పించు సామర్థ్యమే, మాయయనబడుచున్నది. కార్యమునకు పూర్వము ఏ శక్తియైనను తెలియబడదు.*

**వ్యాఖ్య:** సృష్టికి పూర్వము బ్రహ్మము, అద్వయసత్త, మాత్రమే ఉండెను. ఆకాశాది జగత్తుకు కారణము మాయ. జగత్తు సృష్టింపబడుటకు పూర్వము మాయ ఎచ్చట ఉన్నది? అనిన బ్రహ్మమునందే ఉండెనని అనుమానముచే ఊహింప వలసియున్నది. ఈ ఊహకు ఉపపత్తిగ అగ్నియు దాని దాహక శక్తియు చెప్ప బడినది. చేయి కాలుట అనే కార్యమునకు పూర్వము కారణమగు దాహక శక్తి అగ్నియందున్నది అని చెప్పుటకు ఆధారము లేదు గదా. అట్లే మాయయు కేవలము కార్యగమ్యమే అని ఉద్దేశము.

**న సద్వస్తు సతః శక్తిర్న హి వహ్నేః స్వశక్తితా ।**
**సద్విలక్షణతాయాం తు శక్తేః కిం తత్త్వముచ్యతామ్ ॥48॥**

*48. సత్త యొక్క శక్తియే సత్త కాజాలదు. అగ్ని యొక్క దాహక శక్తియే అగ్ని కాదు గదా. (అట్లే మాయ కూడా బ్రహ్మము కాజాలదు.) బ్రహ్మము కంటె సత్తకంటె భిన్నమైనచో ఆ మాయా తత్త్వ మెట్టిదో చెప్పుము.*

**శూన్యత్వమితి చేచ్ఛూన్యం మాయాకార్యమితీరితమ్ ।**
**న శూన్యం నాపి సద్యాదృక్తాదృక్త త్త్వమిహేష్యతామ్ ॥49॥**

*49. మాయాస్వరూపము శూన్యమనినచో (ప్ర 2.34న) శూన్యము మాయా కార్యమని చెప్పబడినది. కారణస్వరూపము కార్యస్వరూపము కాజాలదు గదా. కనుక మాయ సత్తయు కాదు, అసత్తయు కాదు, ఇదమిత్థమని చెప్పలేనిది అనిర్వచనీయమైనది అని అంగీకరింపవలెను.*

**వ్యాఖ్య:** పారమార్థిక సత్త వ్యావహారిక సత్త ప్రాతిభాసిక సత్తయని సత్త మూడు విధములు. బ్రహ్మము మాత్రమే పారమార్థిక సత్త. ఈ సత్తకు భూత భవిష్యద్వర్తమానము లందు భంగము లేదు. వ్యవహార కాలమున మాత్రము

ఉండునది వ్యావహారిక సత్త. ఉత్పత్తి వినాశములు కల వస్తువులన్నీ ఈ కోవకు చెందును. వ్యవహార కాలమున కూడ నిజముగ లేకపోయినను ఉన్నట్లు కన్పించునది ప్రాతిభాసిక సత్త. ఇంద్రజాలికుడు చూపు వస్తువులిట్టివి. అసత్తు కూడ రెండు విధములు. వంధ్యాపుత్రుడు కుందేటి కొమ్మువలె అసలు లేకనేపోవుట. పగిలిన కుండ వలె ఎండిన చెరువు వలె ఒకప్పుడుండినది పిదప నశించుట.

అసత్త నుండి సత్త జనింపదు అని అందరు అంగీకరింతురు. ఉత్పత్తి మొదలగు వికారములు బ్రహ్మమునకు లేవు. బ్రహ్మము కంటె రెండవది లేనపుడు ఈ జగత్తు దేని నుండి జనించినది అనే ప్రశ్నకు మాయ నుండి అనే సమాధానము. ఈ మాయ సత్తయా అసత్తయా అని మరల తర్కమారంభించినచో అయ్యా, అది సత్తయు కాదు అసత్తయు కాదు. అది కేవలము అనిర్వచనీయము అనుట కంటె గత్యంతరము లేదు.

**నాఽసదాసీన్నో సదాసీత్తదానీం కిం త్వభూత్తమః ।**
**సద్యోగాత్తమసః సత్త్వం న స్వతస్తన్నిషేధనాత్ ॥50॥**

*50. మాయ యొక్క అనిర్వచనీయత శ్రుతియే ప్రమాణీకరించు చున్నది. సృష్టికి పూర్వము సత్తయు లేదు అసత్తయు లేదు. మరి ఉండినదేమి? అంధకారము తమస్సు అనగా అనిర్వచయనీయమైన మాయయే. ~~ఈ~~ తమస్సు ఉండినదనుటలోని సద్భావము సద్వస్తువుతో కూడి ఉండుట వలన చెప్ప బడినది కాని తమస్సుకు స్వతః సద్భావము లేదు. సత్త అసత్తలను రెండింటిని శ్రుతి నిషేధించినది గదా.*

**వ్యాఖ్య:** నాసదీయ సూక్తము ఉద్దేశింపబడినది. ఋగ్వేదము 10. 129. 1; 8. 7. 17. 1 శతపథ బ్రాహ్మణము 10. 5. 3. 2. తైత్తిరీయ బ్రాహ్మణము 2. 8. 9. 3.

'తమ ఆసీత్తమసా *గూఢమగ్రే*' అని శ్రుతి వాక్యము. సృష్టికి పూర్వము తమస్సుచే కప్పబడి తమస్సు ఉండెను అని అర్థము వచ్చును. ఒక వస్తువు తన చేతనే కప్పబడ జాలదు కనుక ఉండిన తమస్సు బ్రహ్మమనీ కప్పుచున్న తమస్సు మాయ అనీ అర్థము చెప్పబడినది. ఈ మాయ బ్రహ్మము యొక్క శక్తియనీ స్వీకరింపబడినది.

**అత ఏవ ద్వితీయత్వం శూన్యవన్న హి గణ్యతే ।**
**న లోకే చైత్రతచ్ఛక్త్యోర్జీవితం లిఖ్యతే పృథక్ ॥51॥**

*51. కనుక శూన్యము వలె మాయ స్వతంత్రమగు రెండవ వస్తువుగా పరిగణింపబడదు. లోకమున గూడ శక్తియు శక్తిశాలియు ఒకటిగనే చెప్పుదురు గాని శక్తిని విడదీసి ప్రత్యేకముగ జెప్పరు గదా.*

**శక్త్యాధిక్యే జీవితం చే ద్వర్ధతే తత్ర వృద్ధికృత్ ।**
**న శక్తి : కింతు తత్కార్యం యుద్ధకృష్యాదికం తథా ॥52॥**

*52. శక్తి పెరిగినపుడు జీవనపరిమితి కూడ పెరుగుచున్నది కనుక శక్తికి ప్రత్యేక సత్త చెప్పవలెననినచో నట్లు కాదు. శక్తిశాలి చేయుచున్న ఉపయోగము మాత్రమే అట్లు కన్పించును. యుద్ధము, వ్యవసాయము మొదలైన ఉపయోగముల వలెనే దీర్ఘజీవనము కూడ.*

**వ్యాఖ్య:** మాయ యొక శక్తియైనచో అది ప్రత్యేకముగ మరియొక సత్త అగునని ఆక్షేపము. శక్తి ఫలితము దీర్ఘజీవనమనీ సత్త కానిచో ఫలితమేర్పడదు కనుక శక్తి ప్రత్యేక సత్తయనీ వాదము. కాని వాస్తవముగ దీర్ఘజీవనమునకు శక్తికి అట్టి కార్యకారణ సంబంధము లేదు. శక్తి శాలి తన శక్తిని ఆయావిధముగ ఉపయోగించును మాత్రమే. యుద్ధము చేయుట, వ్యవసాయము చేయుట మొదలగు ఉపయోగముల వలె దీర్ఘ జీవనము కూడ శక్తిశాలి తన శక్తిని ఉపయోగించే మరొక పద్ధతి మాత్రమే.

శక్తిని ఉపయోగించినా ఉపయోగింపక పోయినా శక్తిశాలి సత్తకు కొదువ లేదు. కాని శక్తిశాలి ఉన్నను లేకపోయినను అతని శక్తి ఉన్నదనుట హాస్యాస్పదము. కనుక శక్తి తన ఉనికికి సత్తకు మరొక సద్వస్తువుపై ఆధారపడక తప్పదు. కాని సద్వస్తువు తన సత్తకై శక్తిపై ఆధారపడనవసరము లేదు. ఇట్లు శక్తి స్వతంత్రమగు ద్వితీయమైన సత్తకాదని తేలుచున్నది.

**సర్వథా శక్తి మాత్రస్య న పృథగ్గణనా క్వచిత్ ।**
**శక్తి కార్యం తు నైవాస్తి ద్వితీయం శంక్యతే కథమ్ ॥53॥**

*53. ఆశ్రయము కంటె భిన్నముగ శక్తికి ఎచ్చటను ప్రత్యేకమైన గణణ లేదు. సృష్టికి పూర్వము ఆ శక్తి యొక్క కార్యము లేనే లేదు. ఇక రెండవ సత్తను అనుమానించుటెట్లు? అద్వయసత్తయే సత్యమని భావము.*

**న కృత్స్నబ్రహ్మవృత్తిః సా శక్తి : కింత్వేకదేశభాక్ ।**
**ఘటశక్తిర్యథా భూమౌ స్నిగ్ధమృద్యేవ వర్తతే ॥54॥**

*54.* *ఆ శక్తి బ్రహ్మమునందంతటయు ఉండదు. ఒక భాగమున మాత్రమే ఉండును. కుండను చేయుశక్తి భూమియందంతట ఉండదు గదా, కేవలము బంకమట్టి యందు మాత్రమే ఉండును.*

**వ్యాఖ్య:** సత్ చిదానందమగు బ్రహ్మము యొక్క ఆనందాంశమున మాత్రమే మాయాశక్తి ఉండి దాని ఆచరించునని కొందరు చెప్పుదురు. సద్భావము చిద్భావము ఎల్లప్పుడును అభివ్యక్తములే.

**పాదోస్య సర్వా భూతాని త్రిపాదస్తి స్వయంప్రభః ।**
**ఇత్యేక దేశ వృత్తిత్వం మాయాయా వదతి శ్రుతిః ॥55॥**

*55.* *బ్రహ్మమునందలి ఒక భాగము మాత్రమే ఈ విశ్వము భూత జాతమైనది. మిగిలిన మూడు భాగములు స్వయంప్రకాశములు అని శ్రుతియు మాయ బ్రహ్మము యొక్క అంశమును మాత్రమే ఆచరించుటను చెప్పు చున్నది. (చూ.పురుష సూక్తము 3; ఛాందోగ్య ఉప. **3.12.6.** బ్రహ్మము నందు అంశములు లేకపోయినను సృష్టి యొక్క అల్పత్వమును సూచించుటకు ఇట్లు చెప్పబడినది.)*

**విష్ట భ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ।**
**ఇతి కృష్ణోఽర్జునాయాహ జగతస్త్వేక దేశతామ్ ॥56॥**

*56.* *భగవద్గీత యందు **(10.42)** శ్రీ కృష్ణుడు అర్జునునితో సకల జగత్తును తాను ఏకాంశము చేతనే భరించి ఉన్నానని చెప్పును. దీనిచే బ్రహ్మము నందొక అంశమే సృష్టియని ప్రమాణీకరింపబడినది.*

**స భూమిం విశ్వతో వృత్వా హ్యత్యతిష్ఠద్దశాంగులమ్ ।**
**వికారావర్తి చాత్రాస్తి శ్రుతి సూత్ర కృతోర్వచః ॥57॥**

*57.* *శ్రుతియు దీనినే బలపరచుచున్నది: 'ఆ పరతత్త్వము జగత్తు అంతా అన్నివైపుల వ్యాపించి దానిని పదివ్రేళ్ళ మేరకు అతిక్రమించియున్నది.' బ్రహ్మసూత్రకారుడును బ్రహ్మము భేద జగత్తున కతీతమని చెప్పెను.*

**వ్యాఖ్య:** పదివ్రేళ్ళ మేరకు అని చెప్పుట బ్రహ్మము జగత్తు మాత్రమే కాదనీ దానిని అతిక్రమించినదనీ కరతలామలకవతుగా సూచించుటకు మాత్రమే. దశదిశలనీ అర్థము చెప్పవచ్చును. (చూ. శ్వేతా. ఉ.3.14; బ్ర.సూ. 4.4.19)

**నిరంశేఽ ప్యంశమారోప్య కృత్స్నేంశే వేతి పృచ్ఛతః ।**
**తద్భాషయోత్తరం బ్రూతే శ్రుతిః శ్రోతృ హితైషిణీ ॥58॥**

*58. శ్రోత యొక్క హితమును కోరు శ్రుతి, అతడు మాయ బ్రహ్మము అంతా వ్యాపించునా లేక అంశమున వ్యాపించునా అని అడుగుచుండగా, అంశములు లేని బ్రహ్మమునందు అంశములున్నట్లుగా ఉదాహరణములతో వివరించుచున్నది. బ్రహ్మము యొక్క అద్వయసత్త శ్రోతకు అర్థమగుటయే శ్రుతి ఉద్దేశము.*

**స తత్త్వమాశ్రితా శక్తిః కల్పయేత్సతి విక్రియా : ।**
**వర్ణా భిత్తిగతా భిత్తౌ చిత్రం నానావిధం తథా ॥59॥**

*59. బ్రహ్మమును ఆధారముగ జేసికొని మాయాశక్తి ప్రపంచ వికారము లననేకములుగ కల్పించును. రకరకముల రంగులతో గోడపై రకరకముల చిత్రములను గీసినట్లే.*

**ఆద్యో వికార ఆకాశః సోఽ వకాశ స్వరూపవాన్ ।**
**ఆకాశోఽ స్తీతి సత్తత్త్వమాకాశేఽ ప్యను గచ్ఛతి ॥60॥**

*60. మాయ యొక్క ప్రథమ వికారము ఆకాశము. వస్తువులుండుటకు అవకాశము నిచ్చుట ఆకాశ లక్షణము, ఆకాశము తన సద్భావమును ఆశ్రయ మగు బ్రహ్మము నుండే పొందుచున్నది. సద్వస్తువు బ్రహ్మము మాత్రమే.*

**ఏకస్వభావం సత్తత్త్వమాకాశో ద్విస్వభావకః ।**
**నావకాశః సతి వ్యోమ్ని స చైషోఽ పిద్వయం స్థితమ్ ॥61॥**

*61. బ్రహ్మము సత్తాస్వరూపము మాత్రమే. బ్రహ్మము నందు ఆకాశత్వము లేదు. ఆకాశమున ఆకాశత్వము సద్భావము రెండును ఉన్నవి.*

**యద్వా ప్రతిధ్వనిర్వ్యోమ్నో గుణో నాసౌ సతీక్ష్యతే ।**
**వ్యోమ్ని ద్వౌ సద్ధ్వనీ తేన సదేకం ద్విగుణం వియత్ ॥62॥**

*62. మరొక విధముగ చెప్పినచో: ప్రతిధ్వని ఆకాశము యొక్క గుణము. బ్రహ్మమునందిది లేదు. ఆకాశమునందు సద్భావము ప్రతిధ్వనియను రెండు లక్షణములున్నవి. బ్రహ్మము సద్రూపము మాత్రమే.*

**యాశక్తిః కల్పయేద్ వ్యోమ సా సద్వ్యోమ్నోరభిన్నతామ్ ।**
**ఆపద్య ధర్మధర్మిత్వం వ్యత్యయేనావకల్పయేత్ ॥63॥**

*63.* సద్వస్తువునందు ఆకాశమును కల్పించిన మాయా శక్తియే ఆ రెండింటికిని భేదమును సృష్టించి ధర్మము ఆ ధర్మముకల వస్తువు అను విపరీత భావమును కల్పించుచున్నది. వాస్తవమునకు సత్తయందు ఆకాశము కలుగగా మనకు ఆకాశమునకే సత్తయున్నట్లు తోచుచున్నది. ఇట్టి విపరీత భావన మాయాకార్యము.

**సతో వ్యోమత్వమాపన్నం వ్యోమ్నః సత్తాం తు లౌకికాః ।**
**తార్కికాశ్చావగచ్ఛన్తి మాయాయా ఉచితం హి తత్ ॥64॥**

*64.* వస్తు తత్త్వమును విచారించినచో సత్తయందు ఆకాశము కనిపించును. కాని మాయా శక్తి ప్రభావ మెట్టిదనగా, లౌకిక జనులు తార్కికులను ఆకాశపు ధర్మములలో సద్భావము కూడ ఒకటియందురు. మాయా శక్తి వలన నిట్టి విపరీత ధర్శనము కలుగుట ఉచితమే!

**యద్యథా వర్తతే తస్య తథాత్వం భాతి మానతః ।**
**అన్యథాత్వం భ్రమేణేతి న్యాయోఽయం సార్వలౌకికః ॥65॥**

*65.* ప్రమాణ జ్ఞానము వలన నొక వస్తువు ఎట్లున్నదో అట్లే తెలియ బడును. అట్లుగాక మరియొక విధముగ కనబడుట భ్రాంతి జ్ఞానమని సర్వజనులకు తెలిసిన న్యాయము. మాయా శక్తి ఇట్టి భ్రాంతికి విపరీత జ్ఞానమునకు కారణము. ముత్యపు చిప్ప వెండితునకగా కనిపించుట భ్రాంతి వలన అని సర్వజన విదితము.

**ఏవం శ్రుతి విచారాత్ ప్రాగ్యథా యద్వస్తు భాసతే ।**
**విచారేణ విపర్యేతి తతస్తచ్చింత్యతాం వియత్ ॥66॥**

*66.* అట్లే శ్రుతి వాక్యమును విచారించుటకు పూర్వము ఒక విధముగా భాసించిన వస్తువు, సమ్యగ్విచారమునకు పిమ్మట దానికి పూర్తిగా వ్యతిరేకముగ తెలియవచ్చును. కనుక నిపుడు ఆకాశ తత్త్వమును విచారింతము.

**వ్యాఖ్య:** మాయాశక్తి వలన కలుగు భ్రాంతిచే అద్వయసత్తయగు బ్రహ్మము నానారూపమగు జగత్తుగ కన్పించును. శ్రుతివాక్యములను అనుసరించి చక్కగా విచారించినచో ఆ భ్రాంతి తొలగి బ్రహ్మస్వరూపము తెలియబడును.

**భిన్నే వియత్సతీ శబ్దభేదాద్ బుద్ధేశ్చ భేదతః ।**
**వాయ్వాదిష్వనువృత్తం సన్న తు వ్యోమేతి భేదధీః ।**

*67. ఆకాశము బ్రహ్మము అనునవి రెండు విభిన్న వస్తువులు. ఏలన అవి వేరు వేరు పేర్లను కలిగియున్నవి. ఆ పేర్లు సూచించు అర్థములు కూడ భిన్నములు. బ్రహ్మము వాయువు మొదలగు వస్తువులందు కూడ ఉన్నది. ఆకాశమట్లు కాదు. ఇది మనకు తెలిసిన భిన్నత్వము.*

**సద్వస్త్వధిక వృత్తిత్వాద్ధర్మి వ్యోమ్నస్తు ధర్మతా ।**
**ధియా సతః పృథక్కారే బ్రూహి వ్యోమ కిమాత్మకమ్ ॥68॥**

*68. సద్వస్తువు అధికవ్యాప్తి కలిగియుండుటచే ధర్మియగుచున్నది. ఆకాశము అల్పవ్యాప్తి కలిగియుండుటచే ధర్మమగుచున్నది. బుద్ధిచే ఈ సదంశమును ఆకాశము నుండి వేరు పరచినచో మిగిలిన ఆ ఆకాశ స్వరూపమెట్టిదో చెప్పు. (ఆకాశమనునదే ఉండదని భావము)*

**వ్యాఖ్య:** రూపరస గంధాదులు గల ద్రవ్యము ధర్మి యనబడుచున్నది. క్రియా విశేషముల చేత రూపరస గంధాదులను తొలగించినను ధర్మియగు ద్రవ్యము మిగిలియే ఉండును. ఇట్లు ద్రవ్యమును ఆశ్రయించి ఉండే రూపరసగంధాదులు ధర్మములనబడును. అన్ని వస్తువులకును సద్భావమే బ్రహ్మమే ఆశ్రయము. సత్తను తొలగించినచో వస్తువే లేకపోవును శూన్యమగును. మిక్కిలి అల్పధర్మములు గల ఆకాశమును ఉపలక్షణముగా జేసికొని ఈ విషయమే నిరూపించబడుచున్నది.

**అవకాశాత్మకం తచ్చేదసత్తదితి చిన్త్యతామ్ ।**
**భిన్నం సతోఽసచ్చ నేతి వక్షి చేద్ వ్యాహతిస్తవ ॥69॥**

*69. సత్త లేకపోయినా అవకాశాత్మకముగ ఉండుననినచో అది సరికాదు. సత్త కంటె భిన్నమైనది అసత్తయే శూన్యమే కావలెను. అది సత్తయు అసత్తయు కానిది అనినచో నీ వాదము వదలుకొనుచున్నాను. సదసద్విలక్షణమైన మాయను అద్వయ బ్రహ్మవాదులు అంగీకరించియే ఉన్నారు.*

**భాతీతి చేద్భాతు నామ భూషణం మాయికస్య తత్ ।**
**యదసద్భాసమానం తన్మిథ్యా స్వప్నగజాదివత్ ॥70॥**

*70. శూన్యమైనచో కనిపించుటెట్లు? కనిపించుచున్నదే అనిన, కనిపించనిమ్ము. మాయావికి ఇది అలంకారమే. వాస్తవమునకు లేకున్నను ఉన్నట్లు కనిపించుట మిథ్యాలక్షణము, స్వప్నగజము మొదలగు వానివలె.*

**జాతివ్యక్తీ దేహిదేహౌ గుణద్రవ్యే యథా పృథక్ ।**
**వియత్సతో స్తథైవాస్తు పార్థక్యం కోఽత్ర విస్మయః ॥71॥**

*71.* ఎప్పుడును కలిసి ఉండే వాని మధ్య భేదము చెప్పుట చూడముగద అనే శంక వారింప బడుచున్నది. జాతి వ్యక్తులకు శరీరి శరీరములకు గుణద్రవ్యము లకు భేదమున్నట్లే ఆకాశము సత్తలకు భేదముండు గాక. ఇందాశ్చర్యమేమి?

**బుద్ధోఽపి భేదో నో చిత్తే నిరూఢిం యాతి చేత్తదా ।**
**అనైకాగ్ర్యాత్సంశయాద్వా రూఢ్యభావోఽస్య తే వద ॥72॥**

*72.* భేదము తెలిసినను చిత్తమున నిశ్చయము కలుగకున్నదనినచో ఈ అనిశ్చయత్వము ఏకాగ్రత లేకపోవుట వలననా సంశయమువలననా చెప్పుము.

**అప్రమత్తో భవ ధ్యానాదాద్యేఽన్యస్మిన్ వివేచనమ్ ।**
**కురు ప్రమాణయుక్తిభ్యాం తతో రూఢతమో భవేత్ ॥73॥**

*73.* మొదటిదైనచో ధ్యానాభ్యాసముచే అప్రమత్తుడవై ఏకాగ్రతను సాధింపుము. రెండవ కారణమైనచో ప్రమాణము ద్వారా తర్కము ద్వారా విషయమును చక్కగా వివేచింపుము. అపుడు దృఢనిశ్చయము కలుగును.

**ధ్యానా న్మానాద్యుక్తితోఽపి రూఢే భేదే వియత్సతోః ।**
**న కదాచి ద్వియత్సత్యం సద్వస్తు చ్ఛిద్రవన్న చ ॥74॥**

*74.* గాఢ ధ్యానము చేతను ప్రమాణము చేతను తర్కము చేతను బ్రహ్మము ఆకాశము విభిన్నములని దృఢపడును. ఎన్నటికిని ఆకాశము సత్త కాదనీ సత్తకు అవకాశత్వము లేదనీ దృఢపడును.

**జ్ఞస్య భాతి సదా వ్యోమ నిస్తత్త్వోల్లేఖపూర్వవత్ ।**
**సద్వస్త్వపి విభాత్యస్య నిశ్ఛిద్రత్వపురస్సరమ్ ॥75॥**

*75.* బ్రహ్మజ్ఞానికి ఆకాశము యొక్క మిథ్యాత్వము స్పష్టముగ ఎల్లప్పుడు తెలియుచునే ఉండును. అట్లే బ్రహ్మము కూడా ఏ ధర్మముల వాసనయైనను లేక ప్రకాశించుచునే ఉండును.

**వాసనాయాం ప్రవృద్ధాయాం వియత్సత్యత్వవాదినమ్ ।**
**సన్మాత్రాబోధయుక్తం చ దృష్ట్వా విస్మయతే బుధః ॥76॥**

*76.* ఈ విధముగ తర్కము చేతను గాఢ ధ్యానము చేతను అద్వయ సత్తను గూర్చిన సంస్కారము దృఢపడిన జ్ఞాని, అద్వయసత్తను గూర్చిన అజ్ఞానముచే ఆకాశము సద్వస్తువని వాదించే అజ్ఞానిని జూచి ఆశ్చర్యపడును.

**ఏవమాకాశమిథ్యాత్వే సత్సత్యత్వే చ వాసితే ।**
**న్యాయేనానేన వాయ్వాదేః సద్వస్తు ప్రవివిచ్యతామ్ ॥77॥**

*77.* ఇట్లు ఆకాశము మిథ్యయనీ బ్రహ్మము మాత్రము సత్యమనీ దృఢ పడిన పిమ్మట ఈ న్యాయమునే యనుసరించి వాయువు మొదలగు ఇతర భూతములు మిథ్యయనీ బ్రహ్మము సద్వస్తువనీ వివేచించి తెలియవలెను.

**సద్వస్తున్యేకదేశస్థా మాయా తత్రైకదేశగమ్ ।**
**వియత్తత్రాప్యేకదేశగతో వాయుః ప్రకల్పితః ॥78॥**

*78.* బ్రహ్మము సర్వవ్యాపి అందు మాయ యొక్క వ్యాప్తి చాల తక్కువ. మాయాకార్యమగు ఆకాశపు వ్యాప్తి ఇంకను అల్పము. ఆకాశకార్యమగు వాయువు వ్యాప్తి దాని కంటెను, తక్కువ.

**శోష స్పర్శో గతిర్వేగః వాయుధర్మా ఇమే మతాః ।**
**త్రయః స్వభావాః సన్మాయావ్యోమ్నాం యే తేఽపి వాయుగా ॥79॥**

*79.* శోషణశక్తి స్పర్శ చలనము వేగము అనునవి వాయుధర్మములు. ఆకాశ మాయా ధర్మములు సద్భావము కూడ వాయువునందు గలవు.

**వాయురస్తీతి సద్భావః సతో వాయౌ పృథక్కృతే ।**
**నిస్తత్త్వ రూపతా మాయాస్వభావో వ్యోమగో ధ్వనిః ॥80॥**

*80.* వాయువు ఉన్నది అనుటలో వాయువు యొక్క సద్భావము అద్వయ సత్త యొక్క రూపము. దీనిని వాయువు నుండి వేరు చేసినచో మిగులునది మాయా స్వరూపము అనగా మిథ్య, నిస్తత్వము. వాయువు నందుండు ధ్వని ఆకాశధర్మము.

**సతోఽనువృత్తిః సర్వత్ర వ్యోమ్నో నేతి పురేరితమ్ ।**
**వ్యోమానువృత్తిరధునా కథం న వ్యాహతం వచః ॥81॥**

*81.* మునుపు *(2.67)* అద్వయసత్త అన్నింటియందును ఉన్నదనీ ఆకాశమట్లు కాదనీ చెప్పబడినది. ఇప్పుడు ఆకాశము కూడ అన్నింటి యందున్నట్లు చెప్పబడుచున్నది. ఇది విరుద్ధ వచనము కాదా?

**ఛిద్రానువృత్తిర్నేతీతి పూర్వోక్తిరధునా త్వియమ్ ।**
**శబ్దానువృత్తిరేవోక్తా వచసో వ్యాహతిః కుతః ॥82॥**

*82.* పూర్వము ఆకాశ స్వరూపమగు అవకాశ ధాతృత్వము అనువృత్తము కాదని చెప్పబడినది. ఇప్పుడు ఆకాశ ధర్మమగు శబ్దము ఆకాశ కార్యమగు వాయువునందు అనువృత్తమగునని చెప్పబడినది. ఇందు విరోధమేమి ఉన్నది? లేదని భావము.

**నను సద్వస్తుపార్థక్యాదసత్త్వం చేత్తదా కథమ్ ।**
**అవ్యక్త మాయావైషమ్యాదమాయామయతాఽపి నో ॥83॥**

*83.* సద్వస్తువు కంటె భిన్నమగుట చేత వాయువు అసత్తయనినచో, అవ్యక్తమగు మాయకంటెను గూడ భిన్నమగుటచేత వాయువు మాయవలె మిథ్య కూడా కాదనవలెను గదా?

**నిస్తత్త్వ రూపతైవాత్ర మాయాత్వస్య ప్రయోజికా ।**
**సా శక్తికార్యయోస్తుల్యా వ్యక్తావ్యక్తత్వభేదినోః ॥84॥**

*84.* వాయువు మాయా కార్యమగుట చేత మాయా ధర్మమగు మిథ్యాత్వమును గూడ పొందుచున్నది. మిథ్యాత్వము మాయకును మాయా కార్యము లన్నింటికిని సమానమే. ఏలన అన్నియు సద్వస్తువు కంటె భిన్నములు. అన్ని రకములు శక్తులును అవ్యక్తములే, వాని కార్యములు మాత్రమే వ్యక్తము లగుచున్నవి.

**సదసత్వ వివేకస్య ప్రస్తుతత్వాత్స చింత్యతామ్ ।**
**అసతోఽవాంతర భేద ఆస్తాం తచ్చింతయాత్రకిమ్ ॥85॥**

*85.* సదసద్వివేకము ప్రస్తుత విషయమగుట వలన దానిని గూర్చి చింతింపవలెను. అసత్తయందు వ్యక్తావ్యక్తాది భేదములుండిన ఉండనిమ్ము. వానిని గూర్చి చర్చించుట వలన నేమి ప్రయోజనము? ఏమీ లేదని భావము.

**సద్వస్తు బ్రహ్మ శిష్టోంశో వాయుర్మిథ్యా యథా వియత్ ।**
**వాసయిత్వా చిరం వాయోర్మిథ్యాత్వం మరుతం త్యజేత్ ॥86॥**

*86.* సద్వస్తువు బ్రహ్మము. వాయువునందు సద్వస్తువు గాని ఇతర అంశములన్నియు మిథ్యయే, ఆకాశము వలె. ఈ విషయమును మనస్సున స్థిరపరచుకొని వాయువు సద్వస్తువనే ఊహను పరిత్యజింపుము.

**చింతయే ద్వహ్నిమప్యేవం మరుతో న్యూనవర్తినమ్ ।**
**బ్రహ్మాండావరణేష్వేషా న్యూనాధిక విచారణా ॥87॥**

*87. ఇట్లే వాయువు కంటె తక్కువ వ్యాప్తిగల అగ్నిని గూర్చి చింతింప వలెను. బ్రహ్మాండమునావరించి ఉండు ఇతర భూతములందు (పృథివి, జలము) కూడా ఇట్లే హెచ్చుతక్కు వలను విచారింపవలెను.*

**వాయోర్దశాంశతో న్యూనో వహ్నిర్వాయౌ ప్రకల్పితః ।**
**పురాణోక్తం తారతమ్యం దశాంశైర్భూత పంఞ్చకే ॥88॥**

*88. అగ్ని వాయువు యొక్క పదియవ భాగముచే కల్పింపబడినది. పంచభూతములందు ఈ దశాంశత్వము పురాణములందు వర్ణింపబడినది.*

**వహ్నిరుష్ణః ప్రకాశాత్మా పూర్వానుగతిరత్ర చ ।**
**అస్తి వహ్నిః స నిస్తత్త్వః శబ్దవాన్స్పర్శవానపి ॥89॥**

*89. ఉష్ణతయు, ప్రకాశము అగ్ని యొక్క ధర్మములు. కారణధర్మములు కూడా అనువర్తించును. సద్వస్తువు నుండి సద్భావము, ఆకాశము నుండి శబ్దము వాయువు నుండి స్పర్శయు అగ్నికి సంక్రమించుచున్నవి.*

**సన్మాయా వ్యోమ వాయ్వంశైర్యుక్తస్యాగ్నేర్నిజో గుణః ।**
**రూపం తత్ర సతః సర్వమన్యద్బుద్ధ్యా వివిచ్యతామ్ ॥90॥**

*90. సత్త, మాయ, ఆకాశము, వాయువుల అంశలచే ఏర్పడిన అగ్ని యొక్క నైజగుణము రూపము. ఈ గుణములలో సద్భావము దక్క మిగిలిన వన్నియు మిథ్యయని వివేచనచే తెలియవలెను.*

**సతో వివేచితే వహ్నౌ మిథ్యాత్వే సతి వాసితే ।**
**ఆపో దశాంశతో న్యూనాః కల్పితా ఇతి చింతయేత్ ॥91॥**

*91. అగ్నియందు బ్రహ్మమే సత్యమనీ తక్కినదంతా మిథ్యయనీ దృఢ పడిన పిదప, అగ్ని యొక్క పదియవ అంశముచే ఏర్పడిన జలమును గూర్చి వివేచింపవలెను.*

**సన్త్యాపోఽమూః శూన్యతత్త్వాః సశబ్దస్పర్శ సంయుతాః।**
**రూపవత్యోఽన్య ధర్మానువృత్త్యా స్వీయో రసో గుణః ॥92॥**

*92. జలమునందలి సద్భావము, శేషాంశముల మిథ్యాత్వము, శబ్ద స్పర్శ*

రూపములు పారంపర్యముగ సంక్రమించిన ధర్మములు. జలములకు స్వీయ ధర్మము రసము.

**సతో వివేచితాస్వప్సు తన్మిథ్యాత్వే చ వాసితే ।**
**భూమిర్దశాంశతో న్యూనా కల్పితాప్స్వితి చిన్తయేత్ ॥93॥**

*93.* వివేకము (తర్కము ప్రమాణము) ధ్యానములచే జలమునందలి బ్రహ్మము సత్యమనియు మిగిలినది మిథ్యయనియు దృఢనిశ్చయము కలిగిన పిదప జలము యొక్క దశాంశముచే నేర్పడిన భూమిని గూర్చి విచారింపవలెను.

**అస్తి భూస్తత్త్వ శూన్యాఽస్యాం శబ్దస్పర్శౌ సరూపకౌ ।**
**రసశ్చ పరతో గంధో నైజః సత్తా వివిచ్యతామ్ ॥94॥**

*94.* భూమియందు సద్భావము, అన్యగుణముల మిథ్యాత్వము, శబ్ద స్పర్శ రూపరసములు, ఇవియన్నియు సంక్రమించిన ధర్మములు. భూమికి నైజగుణము గంధము, ఇట్లు వివేచించి తెలియవలెను.

**పృథక్కృతాయాం సత్తాయాం భూమిర్మిథ్యాఽవశిష్యతే ।**
**భూమే ర్దశాంశతో న్యూనం బ్రహ్మాండం భూమిమధ్యగమ్ ॥95॥**

*95.* భూమినుండి బ్రహ్మ సద్భావమును వేరుపరచినచో మిగులునది మిథ్యయే. ఈ భూమి యొక్క దశాంశము వలన బ్రహ్మాండమేర్పడినది.

**బ్రహ్మాండ మధ్యే తిష్ఠన్తి భువనాని చతుర్దశ ।**
**భువనేషు వసన్త్యేషు ప్రాణిదేహా యథాయథమ్ ॥96॥**

*96.* ఈ బ్రహ్మాండమున పదునాలుగు భువనములు అనగా లోకము లున్నవి. ప్రతి లోకమునందు దానికి తగిన దేహములతో ప్రాణులు ఉన్నవి. భూలోకమునకు పైన క్రమముగా భువర్లోకము, స్వర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము ఉన్నవి. అట్లే క్రింద అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళ లోకములున్నవి.

**బ్రహ్మాండ లోక దేహేషు సద్వస్తుని పృథక్కృతే ।**
**అసన్తోఽణ్డాదయో భాన్తు తద్భానేఽపీహ కా క్షతిః ॥97॥**

*97.* ఈ బ్రహ్మాండము నుండి అద్వయసత్తను వేరు చేసినచో నందలి లోకములు దేహములు ప్రాణులు అంతయు మిథ్యయే. అవి అన్నీ ఉన్నట్లే కనిపించుచుండిన ఉండనిమ్ము. దాని వలన ఏమి హాని? ఏమీ లేదని భావము.

**వ్యాఖ్య:** ఎండమావిలోని నీరు నేలను తడపనట్లే బ్రహ్మాండపు మిథ్యావైవిధ్య మంతా బ్రహ్మము యొక్క అద్వితీయతను ఏకమాత్రసత్తను స్పర్శింపజాలదు.

**భూతభౌతికమాయానామసత్త్వేఽత్యన్తవాసితే ।**
**సద్వస్త్వద్వైతమిత్యేషా ధీర్విపర్యేతి న క్వచిత్ ॥98॥**

*98. మాయ పంచభూతములు వాని వికారములు అన్నీ అసత్తవర్గమునకు చెందినవను నిశ్చయము దృఢముగ ఏర్పడిన పిదప సద్వస్తువగు బ్రహ్మము అద్వైతమను బోధ ఎన్నటికిని చలింపదు.*

**సదద్వైతాత్పృథక్భూతే ద్వైతే భూమ్యాదిరూపిణి ।**
**తత్తదర్థక్రియా లోకే యథా దృష్టా తథైవ సా ॥99॥**

*99. సద్వస్తువు అద్వయమనీ భూమ్యాది ద్వైతజాతమంతా మిథ్యయనీ బోధ కలిగిన జ్ఞానికి ద్వైతమంతా పూర్వము వలె భాసించుచునే ఉండును. తదర్థమైన వ్యవహారము నడుచుచునే ఉండును.*

**వ్యాఖ్య:** బ్రహ్మమును అనుభవమునకు తెచ్చుకొనిన బ్రహ్మజ్ఞాని అచేతన పదార్థము వలె నిష్క్రియుడగునా? కానక్కరలేదు. ద్వైతమంతా పూర్వము వలెనే ఉండును. ఆ ద్వైతములోని భాగములగు జ్ఞాని యొక్క మనస్సు శరీరములు కూడ యథా పూర్వకముగ వ్యవహరించుచునే ఉండును. అయినా అజ్ఞానుల వలె ద్వైత సంబంధమైన రాగద్వేషములు పుణ్యపాపములు సుఖదుఃఖములు జ్ఞానులను పీడింపవు. వారు ఇంద్రియాగోచరమైన బ్రహ్మానందమునే సదా అనుభవింతురు.

**సాంఖ్యకాణాదబౌద్ధాద్యైర్జగద్భేదో యథా యథా ।**
**ఉత్ప్రేక్ష్యతేఽనేకయుక్త్యా భవత్వేష తథా తథా ॥100॥**

*100. సాంఖ్యులు నైయాయిక వైశేషికులు బౌద్ధులు మొదలగు వారందరు అనేక తర్కములతో ద్వైతజగత్తు సత్యమనియు మిథ్యకాదనియు వాదింతురు. అది అంతా అట్లే ఉండనిమ్ము.*

**వ్యాఖ్య:** వ్యవహారమున బ్రహ్మజ్ఞానము కలిగే వరకు జగత్తు సత్యమేయని స్వీకరించి వ్యవహారము నెరపుచు బ్రహ్మజ్ఞానమునకై యత్నింపవలెను. ఆ జ్ఞానము కలిగిన పిదప ఈ జగత్తు మిథ్యయేయని తేట తెల్లమగును. అపుడు ఈ మాయా జాలమున నిక చిక్కుకొనక జ్ఞాని ఎప్పటి వలెనే జగన్నాటకమున తన పాత్రను నిర్వహించును.

అట్లుగాక కేవలము పుస్తకజ్ఞానముచే జగత్తు మిథ్యయని చిలుకపలుకులు పలుకుచుండిన అది మెట్టవేదాంతముగ మారును. ఇట్టి మిథ్యాజ్ఞాని ఘోర తమస్సున మునుగుచు ఎట్టి పురోగతియు లేక యధోగతి పాలగును.

**అవజ్ఞాతం సదద్వైతం నిశ్శంకైరన్యవాదిభిః**
**ఏవం కా క్షతిరస్మాకం తద్ద్వైతమవజానతామ్ ॥101॥**

*101. ఇతర వాదులు నిశ్శంకముగ సద్వైత సత్యమును తృణీకరింతురు. ఆ మిథ్యా ద్వైతమును తృణీకరించే మాకు అద్వైత సిద్ధాంతులకు ఏమి హాని?*

**వ్యాఖ్య:** శ్రుతి అనగా వేదము, యుక్తి అనుభవము అను నీ మూడు ప్రమాణములచే అద్వితీయ బ్రహ్మము నిర్ధారింపబడుచున్నది. శ్రుతి ప్రమాణమును తేలిక చేసి స్వకపోల కల్పనలచే నేమి వ్యాఖ్యానించిన నేమి ఫలము? అట్టి ద్వైత సిద్ధాంతమును తృణీకరింపక తప్పదు గదా.

**ద్వైతావజ్ఞా సుస్థితా చేదద్వైతే ధీః స్థిరా భవేత్ ।**
**స్థైర్యే తస్యాః పుమానేష జీవన్ముక్త ఇతీర్యతే ॥102॥**

*102. ద్వైతమును గూర్చిన యవజ్ఞ సుస్థిరమైనపుడు అద్వైతమునందు బుద్ధి అచంచలముగ నిలుచును. అద్వైతబోధ స్థిరపడిన మానవుడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.*

**ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థనైనాం ప్రాప్య విముహ్యతి ।**
**స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మ నిర్వాణమృచ్ఛతి ॥103॥**

*103. ఓ అర్జునా! ఇదియే బ్రాహ్మీస్థితి. దీనిని పొందిన జ్ఞాని ఇక భ్రాంతిని పొందడు. మరణసమయము నందైనను ఈ స్థితిని చేరిన బ్రహ్మీ భావము నొందగలడు. (ఇది విదేహముక్తి.) భగవద్గీత 2.72.*

**సదద్వైతేఽనృతేద్వైతే యదన్యోన్యైక్యవీక్షణమ్ ।**
**తస్యాన్తకాలస్తద్భేదబుద్ధిరేవ న చేతరః ॥104॥**

*104. అద్వైత సత్యము అనృతమగు ద్వైతము ఈ రెండు నొకటియే అనిచూచే భ్రాంతి దర్శనమున కవసానకాలమని 'అన్తకాలే' అనే పదమునకు అర్థము. మరొకటి కాదు.*

**యద్వాన్తకాలః ప్రాణస్య వియోగోఽస్తు ప్రసిద్ధితః ।**
**తస్మిన్కాలేఽపి న భ్రాంతేర్గతాయాః పునరాగమః ॥105॥**

*105.* లోకప్రసిద్ధిని అనుసరించి 'అన్తకాలే' అనిన ప్రాణములు పోవునపుడు అనియే అర్థము కానిమ్ము. ఆ సమయము నందైనను భ్రాంతి దర్శనము తొలగినచో నిక పునర్జన్మ ఉండదు.

**నీరోగ ఉపవి ష్టో వా రుగ్ణో వా విలుఠన్భువి ।**
**మూర్ఛితో వా త్యజత్వేష ప్రాణాన్ భ్రాంతిర్న సర్వథా ॥106॥**

*106.* బ్రహ్మజ్ఞానిని భ్రాంతి స్పర్శింప జాలదు. అతడు పూర్ణారోగ్యముతో ప్రాణములు త్యజించినను కూర్చుండి గాని వ్యాధిగ్రస్తుడైగాని మూర్ఛచే భూమి యందు దొరలుచు గాని మరణించినను అతని కేమీ క్షతి లేదు.

**వ్యాఖ్య:** శాశ్వతమగు బ్రహ్మమున స్థితుడైన జ్ఞానికి మరణమేలేదు. అతని శరీరము ఉండినను ఎట్లు ఊడినను ఒకటియే.

**దినే దినే స్వప్న సుప్త్యోరధీతే విస్మృతేఽప్యయమ్ ।**
**పరేద్యుర్నానధీతః స్యాత్తద్వద్విద్యా న నశ్యతి ॥107॥**

*107.* ప్రతిదినము అధ్యయనము చేయబడు వేదము స్వప్న సుషుప్తు లందు విస్మరింపబడుచునే ఉన్నది. అయినా మరుదినమున అది యధీత విద్యయే. అట్లే బ్రహ్మవిద్యయు వ్యాధి మూర్ఛాది వికారములెన్ని కలిగినను ఎన్నటికిని నశింపదు.

**ప్రమాణోత్పాదితా విద్యా ప్రమాణం ప్రబలం వినా ।**
**న నశ్యతి న వేదాంతాత్ ప్రబలం మానమీక్ష్యతే ॥108॥**

*108.* బ్రహ్మవిద్య వేద ప్రమాణముచే కలుగునది. వేదప్రమాణము కంటే ప్రబలమైన ప్రమాణము చేత తప్ప అది నశింపదు. శ్రుతి ప్రమాణము కంటె బలవత్తరమైన ప్రమాణము లేనేలేదు గదా!

**వ్యాఖ్య:** ఇచ్చట వేదాంతమనగా శ్రుతియు బ్రహ్మానుభవము కూడ ఉద్దేశింపబడినవి. 'వేదాంత జ్ఞానము' బ్రహ్మానుభావమునకు మరియొక పేరు. ఈ విషయమున ప్రశ్నోపనిషత్తు 6. 3న శ్రీ శంకరుల భాష్యము చూడనగును.

**తస్మాద్వేదాంత సంసిద్ధిం సదద్వైతం న బాధ్యతే ।**
**అంతకాలేఽప్యతో భూతవివేకాన్నిర్వృతిః స్థితా ॥109॥**

*109.* కనుక అంతకాలమనిన ఏ అర్థము చెప్పినను, వేదాంత సంసిద్ధమైన అద్వైత జ్ఞానమునకు బాధలేదు. కనుక సద్వస్తువు నుండి పంచభూతములను వివేచించుట వలన నిర్వృతి కలుగుట సిద్ధము. ఇక పునరావృత్తి ఉండదు.

## ద్వితీయ ప్రకరణము: సమాప్తము

# తృతీయము : పంచకోశ వివేక ప్రకరణము

**గుహాహితం బ్రహ్మ యత్తత్పఞ్చకోశ వివేకతః ।**
**బోద్ధుం శక్యం తతః కోశపంచకం ప్రవివిచ్యతే ॥1॥**

*1.* 'యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్' అను తైత్తిరీయోపనిషద్వాక్యము *(2.1.1)* 'గుహ' యందు బ్రహ్మము నిహితమై ఉన్నదని చెప్పుచున్నది. పంచకోశములే ఆ గుహ అనీ, వానిని వివేచించుట ద్వారా ప్రత్యగాత్మకు అభిన్నమగు బ్రహ్మము బోధపడుననీ ప్రస్తుత ప్రకరణమున పంచకోశ వివేకము ప్రారంభింపబడినది.

**దేహాదభ్యంతరః ప్రాణః ప్రాణాదభ్యంతరం మనః ।**
**తతః కర్తా తతో భోక్తా గుహా సేయం పరంపరా ॥2॥**

*2.* స్థూలమగు దేహము అన్నమయ కోశము. దాని లోపలనుండునది ప్రాణమయ కోశము. దానికంటే లోపల ఉండేది మనోమయకోశము. దీనిలో ఉండేది విజ్ఞానమయకోశము. ఇదే కర్త అనబడుచున్నది. మరియు లోనున్నది ఆనందమయకోశము. ఇది భోక్త అనబడుచున్నది. ఈ కోశపరంపరయే 'గుహ'.

**పితృ భుక్తాన్నజాద్వీర్యాజ్జాతోఽన్నేనైవ వర్ధతే ।**
**దేహః సోఽన్నమయో నాత్మా ప్రాక్ చోర్ధ్వం తదభావతః ॥3॥**

*3.* మాతాపితలు భుజించిన అన్నపు రసములచే జన్మించిన స్థూలదేహము అన్నము వలననే వర్ధిల్లును. ఈ దేహము అన్నమయకోశము. జన్మకు పూర్వము మరణమునకు పిమ్మట ఇది లేకపోవటచే దేహము నిత్యమగు ఆత్మకాజాలదు.

**పూర్వజన్మన్యసన్నేతజ్జన్మ సంపాదయేత్కథమ్ ।**
**భావిజన్మన్య సత్కర్మ న భుంజీతేహ సఞ్చితమ్ ॥4॥**

*4. పూర్వ జన్మమున ఈ శరీరము లేదు. కనుక ఈ జన్మమున ఈ శరీరమును సంపాదింపగలుగుట ఎట్లు? మరు జన్మమున ఈ శరీరము లేక పోవుటచే ఈ జన్మమున చేసిన కర్మఫలము ఈ శరీరముచే అనుభవింపబడదు.*

**వ్యాఖ్య:** ఈ శరీరమే ఆత్మ అనుటలో దోషములు నిరూపింపబడినవి. ఈ శరీరమునకు పూర్వశరీరముతో కార్యకారణ సంబంధము లేదు. అందుచే అకృతా భ్యాగమము కృతవిప్రణాశము అను దోషములు ఏర్పడుచున్నవి. అనగా చేయని కర్మకు ఫలితము కలుగుట చేసిన కర్మకు ఫలితము లేకపోవుట. ఈ శరీరము మరణించిన వెంటనే ఇది చేసిన కర్మ అంతా ఫలితము లేకయే నశించును. కనుక దేహము ఆత్మకాజాలదు అని సిద్ధాంతము. కర్మఫలమును అనుభవించుటకే శరీర గ్రహణమనీ, సుఖదుఃఖాలు కర్మఫలములనీ ఇచ్చట స్వీకరింపబడిన సూత్రములు.

**పూర్ణో దేహే బలం యచ్ఛన్నక్షాణాం యః ప్రవర్తకః**
**వాయుః ప్రాణమయో నాసావాత్మా చైతన్యవర్జనాత్ ॥5॥**

*5. శరీరమంతటా నిండియుండి ఇంద్రియములకు బలము నిచ్చుచు వానిని నడిపించు ప్రాణవాయువే ప్రాణమయకోశము. ఇది అచేతనమగుటచే ఆత్మ కాజాలదు.*

**అహంతాం మమతాం దేహే గేహాదౌ చ కరోతియః ।**
**కామాద్యవస్థయా భ్రాంతో నాసావాత్మా మనోమయః ॥6॥**

*6. 'నేను' అను భావమును, దేహగృహాదుల పట్ల 'నాది' అనుభావమును కలిగించునది మనోమయకోశము. కామక్రోధాది వికారములకు లోనగుచూ భ్రాంతమై పరిభ్రమించే మనోమయకోశము, అవికార్యము అచంచలము అగు ఆత్మ కాజాలదు.*

**లీనా సుప్తౌ వపుర్బోధే వ్యాప్నుయాదానఖాగ్రగా ।**
**చిచ్ఛాయోపేతధీర్నాత్మా విజ్ఞానమయశబ్దభాక్ ॥7॥**

*7. సుషుప్తియందు లయమునొందుచు జాగ్రదవస్థయందు నఖాగ్రముల వరకు వ్యాపించుచు సచ్చిదానంద ప్రతిఫలన యుక్తమైన బుద్ధి విజ్ఞానమయ కోశమనబడుచున్నది. సుషుప్త్యాది వికారములకు లోనగునది కనుక ఇది కూడా ఆత్మ కాజాలదు.*

**కర్తృత్వ కరణత్వాభ్యాం విక్రియేతాంతరింద్రియమ్ ।**
**విజ్ఞాన మనసీ అంతర్బహిశ్చైతే పరస్పరమ్ ॥8॥**

*8. మనోబుద్ధులు రెండూ అంతఃకరణ విభాగములే కదా. రెండుకోశము లెట్లగును అనే సందేహము వారింపబడుచున్నది. అంతఃకరణము కర్తగను ఉపకరణముగను పనిచేయును. కర్తయగు విజ్ఞానమయకోశము లోపలి కోశము. ఉపకరణమగు మనస్సు వెలుపలి కోశము.*

**వ్యాఖ్య:** మనస్సు ఇంద్రియముల ద్వారా బహిర్గతమగుచు విషయజ్ఞానమును లోనికి గొనివచ్చి బుద్ధికి నిశ్చయార్థమై సమర్పించును. రెండూ అంతః కరణాంశములే అయినా వాని వాని పనులిట్లు స్పష్టముగ విభజింపబడుటచే రెండు కోశములుగ చెప్పుట సరియేయని భావము.

**కాచిదంతర్ముఖా వృత్తిరానంద ప్రతిబింబభాక్ ।**
**పుణ్యభోగే భోగశాంతౌ నిద్రారూపేణ లీయతే ॥9॥**

*9. పుణ్యకర్మల ఫలమగు సుఖమును అనుభవించునపుడు బుద్ధి మరి కొంత అంతర్ముఖమై ప్రతిఫలించిన సచ్చిదానందపుటానందమును అనుభవించును. విషయభోగములు శాంతించిన పిదప అది నిద్రయందు లీనమగును. ఇట్లు ఆనందమును అనుభవించే బుద్ధి వృత్తియే ఆనందమయకోశము.*

**వ్యాఖ్య:** ఒక అంతఃకరణమే ఉపకరణముగను, కర్తగను, భోక్తగను పని చేయుచున్నది. అట్లు పనిచేయించునది ప్రజ్ఞ. అదే సచ్చిదానందము. మిథ్యయు జడమును అగు ప్రకృతి వికారమగు అంతఃకరణమున సచ్చిదానందము ప్రతిఫలించుట వలన దానియందు సద్భావము చైతన్యము ఆనందము ఉన్నట్లు తోచును. ఇట్లు విశేషముగ చేతనవంతము ఆనందమయము అగు అంతఃకరణాంశములే క్రమముగ విజ్ఞానమయకోశము ఆనందమయకోశము అని చెప్పబడినవి. సద్భావము సృష్టియందంతటను అనుస్యూతమే. చిద్భావము ప్రాణికోటియందు వికసించియుండును. ఆనంద భావము తద్ద్వారా ఆత్మప్రాప్తి మానవులకు మాత్రము విశేషము.

**కాదాచిత్కత్వతో నాత్మా స్యాదానందమయోఽప్యయమ్ ।**
**బింబభూతో య ఆనంద ఆత్మాఽసౌ సర్వదా స్థితే ॥10॥**

*10. ఈ ఆనందానుభవము కూడా అప్పుడప్పుడు మాత్రమే ఉండుట వలన ఆనందమయమే అయినా ఈ కోశము కూడ ఆత్మ కాజాలదు. ప్రతిబింబమునకు కారణము అవికార్యము శాశ్వతము అగు ఆనందమే ఆత్మ.*

**వ్యాఖ్య:** తన సద్భావము చిద్భావము మానవునకు సర్వదా అనుభవమున నున్నవే. అత్యంత సహజములగుట చేత వానిని సంశయించుటగాని లేదనుకొనుట గాని జరుగనే జరుగదు. కాని ఆనందానుభవము వచ్చుచు పోవుచుండుటచే దాని కొరకు మానవులు అజ్ఞానవశమున వివిధ ప్రయత్నములు చేయుదురు. సద్భావము చిద్భావము వలెనే ఆనందభావము కూడా తమ నిజస్వరూపమను జ్ఞానము కలిగినపుడు సద్భావము వలె ఆనందభావము కూడా సహజమైపోవును. అదే ఆత్మానుభవము, ఆత్మానందము. అది అవికార్యము శాశ్వతము.

**నను దేహముపక్రమ్య నిద్రానందాంతవస్తుషు ।**
**మా భూదాత్మత్వమన్యస్తు న కశ్చిదనుభూయతే ॥11॥**

*11. (ఆక్షేపము): దేహము మొదలు నిద్ర సాధారణ ఆనందముల వరకు అన్నింటి యందును ఆత్మత్వము లేకపోనిమ్ము. వీనినన్నింటిని తొలగించినచో ఇక అనుభవింపబడునదేదీ మిగులదే!*

**బాఢం నిద్రాదయః సర్వేఽనుభూయంతే న చేతరః ।**
**తథాఽ ప్యేతేఽనుభూయంతే యేన తం కో నివారయేత్ ॥12॥**

*12. సమాధానము: మంచిదే. నిద్రాదులన్నీ అనుభవింప బడుచున్నవి. అవిగాక అనుభవింపబడుటకు మరేమీ లేదు. అయినను, వీనినన్నింటిని ఎవడు అనుభవించుచున్నాడో వాని నెవరు తొలగింపగలరు? కాదనగలరు?*

**వ్యాఖ్య:** ఆ అనుభవించు వానినే ప్రజ్ఞయనీ, ఆత్మయనీ చెప్పుచున్నాము.

**స్వయమేవానుభూతిత్వాద్విద్యతే నానుభావ్యతా ।**
**జ్ఞాతృజ్ఞానాంతరాభావా దజ్ఞేయో న త్వసత్తయా ॥13॥**

*13. ఆత్మ స్వయముగనే అనుభూతి స్వరూపము. అది అనుభవ విషయములలో ఒకటి కాదు. ఆత్మ అజ్ఞేయమని చెప్పుట ఆ అవస్థయందు అనుభవించువాడును (జ్ఞాత) అనుభవవిషయము (జ్ఞాన విషయము) లేకపోవుట వలన గాని ఆత్మ అసత్త అగుట వలన కాదు.*

**వ్యాఖ్య:** ఈ అనుభూతి స్వరూపమునే సాక్షియనుచున్నాము. అన్ని కోశములకూ ఇదే సాక్షి.

**మాధుర్యాది స్వభావానామన్యత్ర స్వగుణార్పిణామ్ ।**
**స్వస్మింస్తదర్పణాపేక్షా నో న చాస్త్యన్యదర్పకమ్ ॥14॥**

*14. మాధుర్యమే స్వభావమగు చక్కెర తేనె మొదలగు వస్తువులు తమ మాధుర్యమును ఇతర వస్తువులకు ఈయగలవు. కాని వానికే మాధుర్యము నీయవలసిన అగత్యము లేదు. ఈయగలిగిన మరొక వస్తువే లేదు.*

**వ్యాఖ్య:** అట్లే సాక్షియనుభూతిచే అన్నీ అనుభవింపబడుచున్నవి. ఆ అనుభూతినే మరల అనుభవించుటకు మరొకటి లేదు.

**అర్పకాంతరరాహిత్యేఽప్యస్త్యేషాం తత్స్వభావతా ।**
**మా భూత్తథాఽనుభావ్యత్వం బోధాత్మా తు న హీయతే ॥15॥**

*15. తమ స్వాభావిక గుణమునిచ్చు వస్తువు మరొకటి లేకున్నను స్వాభావిక గుణమున్నట్లే, అనుభూతి మరల అనుభవ విషయము కాకున్నను, ఆ అనుభూతికి బోధకు ఆత్మకు హాని లేదు.*

**స్వయం జ్యోతిర్భవత్యేష పురోఽస్మాద్భాసతేఽఖిలాత్ ।**
**తమేవ భాంతమన్వేతి తద్భాసా భాస్యతే జగత్ ॥16॥**

*16. "అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి" బృహదారణ్యక ఉప. 4.3.1, "అస్మాత్సర్వస్మాత్పురతః సువిభాతమ్" నృసింహ ఉత్తర తాపినీయ ఉప. 2, "తమేవ భాంతమను భాతిసర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" ముండక ఉప. 2.2.10, శ్వేతాశ్వతర ఉప. 6.14, కఠ ఉప. 5.14, మొదలగు శ్రుతి వాక్యములన్నీ ఆత్మ యొక్క స్వయం జ్యోతిః స్వరూపమును ప్రకటించుచున్నవి.*

**యేనేదం జానతే సర్వం తత్కేనాన్యేన జానతామ్ ।**
**విజ్ఞాతారం కేన విద్యా చ్ఛక్తం వేద్యే తు సాధనమ్ ॥17॥**

*17. ఈ విశ్వమంతా ఏ సాక్షిచైతన్య స్వరూపమగు ఆత్మచే తెలియ బడుచున్నదో అట్టి ఆత్మ మరి దేనిచే తెలియబడగలదు? తెలియబడజాలదు. జ్ఞాతయే జ్ఞేయమగుట ఎట్లు. మనస్సు మొదలగు ఇంద్రియములన్నీ తమ తమ విషయములనే తెలిసికొనును. అవి ఆత్మను తమ విషయముగా తెలిసికొనలేవు. బృహ. ఉప. 4.5.15, కఠ.ఉప. 6.13.*

**స వేత్తి వేద్యం తత్సర్వం నాన్యస్తస్యాస్తి వేదితా ।**
**విదితావిదితాభ్యాం తత్పృథక్ బోధ స్వరూపకమ్ ॥18॥**

*18. వేద్యవిషయములనన్నింటిని బోధస్వరూపమగు ఆత్మ తెలిసి కొనును. కాని దానిని బోధపరచుకొనుటకు మరియొకరు లేరు. అది తెలిసినదానికి తెలియనిదానికి రెండింటికంటె భిన్నము. ఆత్మ స్వరూపమే తెలివి, బోధ. శ్వేతా. ఉప.3.19, కేన. ఉప.1.4.*

**బోధేప్యనుభవో యస్య న కథంఞ్చన జాయతే ।**
**తం కథం బోధయేచ్ఛాస్త్రం లోష్టం నరసమాకృతిమ్ ॥19॥**

*19. ఏ విధముగ నైనను బోధయే అనుభవమునకు రాని నరరూపమగు మట్టిగడ్డకు శాస్త్రం మాత్రం ఎట్లు బోధపరుపగలదు? బోధింపజాలదని అర్థము.*

**వ్యాఖ్య:** ఎట్టి విషయమును తెలిసికొనినను అందు రెండు అంశములను గమనింపగలము. తెలిసికొనిన విశేషము ఒకటి. రెండవది, ఇది మనకు తెలిసినది అను బోధ. ఇట్లు బోధ అనుక్షణము ఉండనే ఉన్నది. ఈ బోధే నాకు తెలియదను మూఢునకు శాస్త్రము కూడా నిరుపయోగము. అంధునకు దీపము వలె.

**జిహ్వా మేఽస్తి న వేత్త్యుక్తిర్లజ్జాయై కేవలం యథా ।**
**న బుధ్యతే మయా బోధో బోద్ధవ్య ఇతి తాదృశీ ॥20॥**

*20. 'నాకు నాలుక ఉన్నదా లేదా' అని అడుగుట హాస్యాస్పదమైనట్లే 'నాకు బోధ అనునది బోధపడుటలేదు. దానిని బోధపరచుకొనవలెను' అనుటయు అట్లే హాస్యాస్పదము. 'బోధపడుట లేదు' అను బోధయుండనే ఉన్నది గదా!*

**యస్మిన్యస్మిన్నస్తి లోకే బోధస్తత్తదుపేక్షణే ।**
**యద్బోధమాత్రం తద్బ హ్మేత్యేవం ధీః బ్రహ్మనిశ్చయః ॥21॥**

*21. ఏఏ విషయములందు బోధ కలుగుచున్నదో ఆయా విషయములను పేక్షించినపుడు మిగులు బోధయే బ్రహ్మము. ఇట్టి నిశ్చయమే బ్రహ్మావగతి.*

**పఞ్చకోశపరిత్యాగే సాక్షిబోధావశేషతః ।**
**స్వస్వరూపం స ఏవ స్యాచ్ఛూన్యత్వం తస్య దుర్ఘటమ్ ॥22॥**

*22. అట్లే సంకోచములను విచారణచే పరిత్యజించిన మిగులు సాక్షి బోధయే ఆత్మ యొక్క నిజస్వరూపము. ఆత్మ శూన్యత్వమగుట అసంభవము.*

**వ్యాఖ్య:** విషయములను తొలగించిననే బ్రహ్మావగతి కలుగుచున్నచో ఇక పంచకోశ వివేకము అనావశ్యకము గదా అనిన, కాదు. బ్రహ్మాత్మైక్య జ్ఞానము లేక సంసారనివృత్తి లేదు. కనుక ఆత్మస్వరూప నిశ్చయార్థమై పంచకోశ వివేకము ఆవశ్యకమే.

**అస్తి తావత్స్వయం నామ వివాదావిషయత్వతః ।**
**స్వస్మిన్నపి వివాదశ్చేత్ ప్రతివాద్యత్ర కో భవేత్ ॥23॥**

*23. 'నేను' అనునది నిర్వివాదాంశమై ఉండనే ఉన్నది. దాని గూర్చియే వివాదమైనచో ఇక ప్రతివాది మాత్రమెవడు?*

**వ్యాఖ్య:** పంచకోశములను తొలగించిన శూన్యము మిగులదనీ సాక్షి బోధగ 'నేను', అనగా ఆత్మ, మిగులుననియు ప్రతిపాదింపబడినది. బ్రహ్మస్వరూపము ఆత్మస్వరూపము ఇట్లు బోధయే అగుటచే బ్రహ్మాత్మైక్య జ్ఞానము సిద్ధించుచున్నది.

**స్వాసత్త్వ తు న కస్మైచిద్రోచతే విభ్రమం వినా ।**
**అత ఏవ శ్రుతిర్బాధం బ్రూతే చాసత్త్వవాదినః ॥24॥**

*24. బుద్ధివిభ్రమము చేత తప్ప నెవడును తాను లేడని అంగీకరింపడు. ఈ కారణముననే శ్రుతియు అట్టి అసద్వాది అసత్త్వమును ప్రకటించినది.*

**అసద్బ్రహ్మేతి చేద్వేద స్వయమేవ భవేదసత్ ।**
**అతోఽస్య మా భూద్వేద్యత్వం స్వసత్త్వం త్వభ్యుపేయతామ్ ॥25॥**

*25. 'బ్రహ్మము అసత్తయని భావించువాడు తానే అసత్తయగుచును' తైత్తిరీయ ఉప. 2.6.1. స్వసత్త, తన స్వంత అస్తిత్వము, ఘటపటాదుల వలె తెలియబడు విషయములు కాదు. కాని అది ఉన్నదని అంగీకరింపక తప్పదు. (అది స్వయం ప్రకాశమైన తత్త్వము.)*

**కీదృక్తర్హీతి చేత్ పృచ్ఛేదీదృక్తా నాస్తి తత్ర హి ।**
**యదనీదృగతాదృక్చ తత్స్వరూపం వినిశ్చిను ॥26॥**

*26. మరి అది ఎట్టిది అని అడిగినచో అది ఇట్టిదని వర్ణింపశక్యము కాదు. దాని స్వరూపము 'ఇట్టిది' 'అట్టిది' అని వర్ణింపజాలనిదే.*

**అక్షాణాం విషయస్త్వీదృక్పరోక్షస్తాదృగుచ్యతే ।**
**విషయీ నాక్షవిషయః స్వత్వాన్నాస్య పరోక్షతా ॥27॥**

*27. ఇంద్రియ ప్రత్యక్షమగు విషయము దృశ్యము. అది 'ఇట్టిది', ఇంద్రియ గోచరము కానిది పరోక్షము. ఇది 'అట్టిది', ద్రష్టయగు ఆత్మ ఇంద్రియ గోచరము కాదు గనుక 'ఇట్టిది' కాదు. దృశ్యమును చూచు ద్రష్ట తానే అగుటచే పరోక్షము 'అట్టిది' కూడా కాదు.*

**అవేద్యోఽపరోక్షోతః స్వప్రకాశో భవత్యయమ్ ।**
**సత్యం జ్ఞాన మనంతం చేత్యస్తీహ బ్రహ్మలక్షణమ్ ॥28॥**

*28. అజ్ఞేయమైనను ఆత్మ అపరోక్షమగుట చేత అది స్వప్రకాశమగుచున్నది. సత్యము జ్ఞానము అనంతము కూడా అగుటచే ఆత్మ యందు బ్రహ్మలక్షణము లన్నియు ఉన్నవి.*

**వ్యాఖ్య:** కనుక ఆత్మయే బ్రహ్మము. తైత్తిరియ ఉప. 2.1.

**సత్యత్వం బాధరాహిత్యం జగద్బాధైక సాక్షిణః ।**
**బాధః కిం సాక్షికో బ్రూహి న త్వసాక్షిక ఇష్యతే ॥29॥**

*29. సత్యత్వమనగా ఎన్నటికిని అసద్బుద్ధి కలుగకుండుట. ఈ జగత్తు యొక్క మిథ్యాత్వమునకు ఏకైక సాక్షియగు ఆత్మయే మిథ్యయైనచో నీ ఆత్మ మిథ్యాత్వమునకు సాక్షి ఎవరు? సాక్షి లేకయే మిథ్యాత్వము చెప్పలేము గదా.*

**వ్యాఖ్య:** 'సత్యమబాధ్యం, బాధ్యం మిథ్యా' అని పూర్వాచార్యవచనము.

**అపనీతేషు మూర్తేషు హ్యమూర్తం శిష్యతే వియత్ ।**
**శక్యేషు బాధితేష్వంతే శిష్యతే యత్తదేవ తత్ ॥30॥**

*30. ఘటాది మూర్త వస్తువులన్నింటిని తొలగించినపుడు ఆకాశము మిగులును. అట్లే 'నేతి, నేతి' అని నిరాకరింప గలిగినవన్నియు, పంచకోశములతో సహా, నిరాకరింపబడగా మిగులునదే అబాధ్యమగు ఆత్మ.*

**సర్వబాధే న కించిచ్చేద్యన్న కించిత్తదేవ తత్ ।**
**భాషా ఏవాత్ర భిద్యంతే నిర్బాధం తావదస్తి హి ॥31॥**

*31. అన్నింటిని నిరాకరింపగా ఇక ఏమీ మిగులనదిననచో ఆ 'ఏమియు మిగులదు' అను బోధయే ఆత్మ. ఉపయోగింపబడు పదములు మాత్రము మారునే గాని నిరాకరింప శక్యముగానిది (బోధ) ఉండనేయున్నది.*

**అత ఏవ శ్రుతిర్బాధ్యం బాధిత్వా శేషయత్యదః ।**
**స ఏష నేతి నేత్యాత్మేత్యత ద్వ్యావృత్తిరూపతః ॥32॥**

*32.* 'స ఏష నేతినేత్యాత్మా' అను శ్రుతి వాక్యము *(బృహ.3.9.29)* అనాత్మ పదార్థములన్నింటిని 'ఇది కాదు ఇది కాదు' అని నిరాకరించి 'అది' అను ప్రత్యగాత్మను మిగుల్చుచునేయున్నది.

**ఇదం రూపం తు యద్యావత్తత్త్యక్తుం శక్యతేఽఖిలమ్ ।**
**అశక్యో హ్యనిదంరూపః స ఆత్మా బాధవర్జితః ॥33॥**

*33.* 'ఇది' అనబడు పదార్థములన్నియు బ్రహ్మాండ మంతా నిరాకరింప శక్యమైనదే. 'ఇది' కానిది నిరాకరింపబడదు. అదే ఆత్మ. దానికి బాధలేదు.

**వ్యాఖ్య:** అహంకారాది దృశ్యజాతము ఆత్మ కాదు. సాక్షిచైతన్యమే ఆత్మ.

**సిద్ధ బ్రహ్మణి సత్యత్వం జ్ఞానత్వం తు పురేరితమ్ ।**
**స్వయమేవానుభూతిత్వాదిత్యాదివచనైః స్ఫుటమ్ ॥34॥**

*34.* ఈ విధముగ బ్రహ్మలక్షణమగు సత్యత్వము ప్రత్యగాత్మ యందు నిరూపితమైనది. జ్ఞానత్వము పూర్వమే *(ప్ర. 3.13)* 'స్వయమేవానుభూతి త్వాత్' మొదలగు వాక్యములచే స్పష్టముగ నిరూపింపబడినది.

**న వ్యాపిత్వాద్దేశతోఽన్తో నిత్యత్వాన్నాపి కాలతః ।**
**న వస్తుతోఽపి సార్వాత్మ్యాదానంత్యం బ్రహ్మణి త్రిధా ॥35॥**

*35.* సర్వవ్యాపి అగుటచే బ్రహ్మము దేశము (స్థలము)లచే సీమితము కాదు. శాశ్వతమగుటచే కాలము దానికి పరిమితి నీయజాలదు. సకల వస్తువులు స్వరూపమగుటచే ఏదియు దాని నడ్డగింప లేదు. ఇట్లు మూడు విధములగు నానంత్యములును బ్రహ్మమునందు సిద్ధించుచున్నవి.

**వ్యాఖ్య:** 'నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం' ముండక ఉప. 1.1.6; 'ఆకాశ వత్సర్వగతశ్చ నిత్యః' శ్వేతాశ్వ 6.13; 'నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం' కఠ 5.13; 'ఇదం సర్వం యదయమాత్మా' బృహ. 4.5.7; 'సర్వం హ్యేతద్బ్రహ్మ' మాండూక్య 2; 'బ్రహ్మైవేదం సర్వం' నృ.ఉ.తా. 7; మొదలగు శ్రుతివాక్యములు ప్రకటించు వ్యాపిత్వనిత్యత్వ సర్వాత్మత్వములచే బ్రహ్మమునకు దేశకాల వస్తు పరిచ్ఛేదములు మూడును ఉండవని తెలియవలెను.

**దేశకాలాన్యవస్తూనాం కల్పితత్వాచ్చ మాయయా ।**
**న దేశాదికృతోఽన్తోస్తి బ్రహ్మోనంత్యం స్ఫుటం తతః ॥36॥**

*36.* *కేవలము శ్రుతి ప్రమాణముచే గాక యుక్తి ప్రమాణముచే కూడా బ్రహ్మము అనంతమని తెలియును. దేశకాలములు అన్యవస్తువులు మిథ్యయగు మాయచే కల్పింపబడిన వగుటచే అవి ఏవీ సత్యమగు బ్రహ్మమును అంతము చేయజాలవు. ఇట్లు బ్రహ్మము యొక్క అనంతత్వము స్ఫుటమగుచున్నది.*

**సత్యం జ్ఞానమనంతం యద్బ్రహ్మ తద్వస్తు తస్య తత్ ।**
**ఈశ్వరత్వం చ జీవత్వముపాధిద్వయ కల్పితమ్ ॥37॥**

*37.* *సత్యము జ్ఞానము అనంతము అగు బ్రహ్మము పారమార్థిక వస్తువు. ఈశ్వరత్వము జీవత్వము అనునవి రెండు ఉపాధులచే కల్పింపబడినవి.*

**వ్యాఖ్య:** జడమగు జగత్తు బ్రహ్మ పరిచ్ఛేదకము కాకపోవచ్చును. చేతనములైన ఈశ్వరుడు జీవుడు పరిచ్ఛేదకములు కావచ్చును కదాయను సంశయము వారింపబడినది. ఇవి రెండును మిథ్యయగు మాయను ఉపాధిగ స్వీకరించుటచే ఏర్పడినవి గనుక వానికి పారమార్థిక సత్త లేదు. కనుకనే పారమార్థిక పరిచ్ఛేదకత్వము కూడా లేదు.

**శక్తిరస్త్యైశ్వరీ కాచిత్సర్వ వస్తునియామికా ।**
**ఆనందమయ మారభ్య గూఢా సర్వేషు వస్తుషు ॥38॥**

*38.* *ఈశ్వరుని ఉపాధియైనది, అనిర్వచనీయమైనది అంతర్యామి రూపమున వస్తువులను నియమించునది అగు శక్తి ఒకటి కలదు. అది ఆనంద మయాది కోశములతో ప్రారంభించి బ్రహ్మాండాంతమగు సకల వస్తువుల యందు నిగూఢముగ ఉన్నది.*

**వ్యాఖ్య:** ఈశ్వరుని ఉపాధియగు శక్తి, 'పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే' శ్వేతాశ్వ. 6.8 యందు చెప్పబడినది. అది నిగూఢముగ ఉండుటచే సులభముగ మనకు దొరకుట లేదు.

**వస్తుధర్మా నియమ్యేరన్ శక్త్యా నైవ యదా తదా ।**
**అన్యోన్యధర్మ సాంకర్యా ద్విప్లవేత జగత్ఖలు ॥39॥**

*39.* *ఎన్నటికిని దొరకని ఈ శక్తి అసలు లేదనిన ఏమి అనే సంశయము వారింపబడుచున్నది. ఆయా వస్తుధర్మములను నియమించుచు ఈ శక్తి*

*ఉండనిచో అన్ని ధర్మములు అన్ని వస్తువులందుండుట వలన జగత్తు కలగా పులగమై విప్లవము నొందును గదా. (అట్లు జరుగుట లేదు గనుక ఈశ్వరీయ శక్తి ఉన్నదని స్వీకరింపవలెనని భావము.)*

**చిచ్ఛాయావేశతః శక్తిశ్చేతనేవ విభాతి సా ।**
**తచ్ఛక్త్యుపాధి సంయోగాద్ బ్రహ్మైవేశ్వరతాం వ్రజేత్ ॥40॥**

*40. ఆ శక్తియే ఉపాధి. దాని యందు ప్రతిఫలించిన బ్రహ్మముచే, చిదాభాసముచే, ఆ శక్తి చేతనమైనట్లు భాసించును. ఇట్లు శక్తి చిదాభాసముల సంయోగముచే బ్రహ్మముచే ఈశ్వరత్వమును పొందుచున్నది.*

**వ్యాఖ్య:** అనాదీ, అనిర్వచనీయా, అవిద్యా అయిన శక్తియే ఉపాధి. సత్యము జ్ఞానమనంతమైన బ్రహ్మము చిదాభాస రూపములో ఉపాధితో సంయోగము చెందుట వలన సర్వజ్ఞత్వమూ సర్వశక్తిమత్వమూ మొదలైన గుణములు గల ఈశ్వరుడు సిద్ధించుచున్నాడు.

**కోశోపాధి వివక్షాయాం యాతి బ్రహ్మైవ జీవతామ్ ।**
**పితా పితామహశ్చైకః పుత్రపౌత్రౌ యథా ప్రతి ॥41॥**

*41. కోశములనెడి ఉపాధి సంయోగముచే బ్రహ్మమే జీవత్వమును పొందుచున్నది. ఒక వ్యక్తియే కుమారునితో సంబంధపడినపుడు తండ్రి, మనుమనితో సంబంధపడినపుడు తాతయు అగుచున్నాడు గదా. అట్లే ఒక బ్రహ్మమే జీవుడు ఈశ్వరుడును అగుటలో ఆశ్చర్యము లేదని భావము.*

**పుత్రాదేరవివక్షాయాం న పితా న పితామహః ।**
**తద్వన్నేశో నాపి జీవః శక్తికోశావివక్షణే ॥42॥**

*42. కుమారుడు మనుమడు అను సంబంధపు ప్రసక్తి లేనపుడు ఆవ్యక్తి తండ్రియు కాడు తాతయు కాడు. అట్లే శక్తి, కోశముల ప్రసక్తి లేనిచో బ్రహ్మము ఈశ్వరుడు కాడు జీవుడు కాడు. (వంగతోటలో బావగాదను నానుడి ప్రసిద్ధమే!)*

**య ఏవం బ్రహ్మ వేదైష బ్రహ్మైవ భవతి స్వయమ్ ।**
**బ్రహ్మణో నాస్తి జన్మాతః పునరేషన జాయతే ॥43॥**

*43. ఇట్లు బ్రహ్మమును సాక్షాత్కరించు కొనినవాడు బ్రహ్మమే అగును. బ్రహ్మమునకు జన్మయే లేదు. కనుక బ్రహ్మవిదునకు పునర్జన్మ లేదు.*

**వ్యాఖ్య:** సాధన చతుష్టయ సంపన్నుడు ఇట్టి పంచకోశ వివేకముచే బ్రహ్మమును ప్రత్యగభిన్నముగ సాక్షాత్కరించు కొనవలెనని అభిప్రాయము. ముండక 3. 2. 9; తైత్తిరీయ 2. 1; కఠ 2. 18; ఛాందోగ్య 8. 15. 1.

## తృతీయ ప్రకరణము: సమాప్తము

# చతుర్థము : ద్వైత వివేక ప్రకరణము

**ఈశ్వరేణాపి జీవేన సృష్టం ద్వైతం వివిచ్యతే ।**
**వివేకే సతి జీవేన హేయో బంధః స్ఫుటీభవేత్ ॥1॥**

*1.* కారణోపాధియు అంతర్యామీ అగు ఈశ్వరుని చేతను కార్యోపాధియు అహంప్రత్యయమూ అగు జీవుని చేతను సృష్టింపబడిన ద్వైత జగత్తు విభజింప బడి ప్రదర్శింపబడుచున్నది. ఇట్టి జీవసృష్టి ఈశ్వర సృష్టి అనే వివేకము వలన జీవుడు పరిత్యజింపవలసిన బంధహేతువగు ద్వైతము స్పష్టపడును.

**మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్ ।**
**స మాయీ సృజతీత్యాహుః శ్వేతాశ్వతరశాఖినః ॥2॥**

*2.* మాయయే ప్రకృతి. ఆ మాయను ఉపాధిగ స్వీకరించిన మాయికుడే మహేశ్వరుడు. ఆ ఈశ్వరుడు జగత్తును సృష్టించును అని శ్వేతాశ్వతరోపనిషత్తు (అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్' శ్వే.4.9) చెప్పుచున్నది. (ప్ర. 6-123)

**ఆత్మా వా ఇదమగ్రేఽభూత్స ఈక్షత సృజా ఇతి ।**
**సంకల్పేనాసృజల్లోకాన్స ఏతానితి బహ్వృచా ః ॥3॥**

*3.* సృష్టికి పూర్వము ఆత్మ (అనగా పరమాత్మ) ఉండెను. అతడు సృష్టింప వలెనని చూచెను. ఆ చూపుచేతనే సంకల్పము చేతనే ఈ లోకము లన్నింటిని సృష్టించెను. అని ఐతరేయోపనిషత్తు (1.1) చెప్పుచున్నది. 'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర అసీన్నాన్యత్కించన మిషత్ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాం ల్లోకాన సృజత' అని శ్రుతి వాక్యము, ఋగ్వేదము లోనిది.

**ఖం వాయ్వగ్నిజలోర్వ్యోషధ్యన్నదేహాః క్రమాదమీ ।**
**సంభూతా బ్రహ్మణస్తస్మాదేతస్మా దాత్మనోఽఖిలాః ॥4॥**

*4.* ఆత్మ నుండి అనగా బ్రహ్మము నుండి మాత్రమే క్రమముగా ఆకాశము వాయువు అగ్ని జలము ఉర్వి ఓషధులు అన్నము దేహములు సంభవించెననీ బ్రహ్మమనెడి ఆ ఆత్మ నుండే అఖిల లోకములు ఉద్భవించెననీ తైత్తిరీయోపనిషత్తు *(2.1)* చెప్పుచున్నది.

**బహు స్యామహమేవాతః ప్రజాయేయేతి కామతః ।**
**తపస్తప్త్వాఽసృజత్సర్వం జగదిత్యాహ తిత్తిరిః ॥5॥**

*5.* నేను అనేకమయ్యెదను. కనుక నేను సృష్టింతును అను కోరికతో తపస్సు చేసి ఈ సకల జగత్తును సృష్టించెను. అని తైతిరీయోపనిషత్తు *(2.6)* చెప్పుచున్నది. 'సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి స తపోఽతపో తప్యత స తప స్తప్త్వా ఇదం సర్వమసృజత యదిదం కించ' అని శ్రుతి వాక్యము.

**ఇదమగ్రే సదేవాసీ ద్బహుత్వాయ తదైక్షత ।**
**తేజోఽబన్నాండజాదీని ససర్జేతి చ సామగాః ॥6॥**

*6.* సృష్టికి పూర్వము సత్తమాత్రమే ఉండెను. అది అనేకము కావలెనని చూచెను. అగ్నిని జలమును అండజములు మొదలైనవాని నన్నింటిని సృష్టించెనని ఛాందోగ్యపనిషత్తు *(6.2.1-4)* *(సామవేదము లోనిది)* చెప్పును.

**విస్ఫులింగా యథా వహ్నేర్జాయంతేఽక్షరతస్తథా ।**
**వివిధాశ్చిజ్జడా భావా ఇత్యాథర్వణికీ శ్రుతిః ॥7॥**

*7.* ఉజ్జ్వలముగ మండుచున్న అగ్ని నుండి నిప్పురవ్వలు అనేకము ఉలుద్భవించినట్లే అక్షరబ్రహ్మము నుండి చేతనములు జడములు వివిధములై ఉద్భవించెనని ముండకోపనిషత్తు *(2.2.1)* చెప్పుచున్నది. ఇది అథర్వణ వేదియము. 'తదేతత్సత్యం యథా సుదీప్తాత్పావకాద్విస్ఫు లింగాః ప్రజాయంతే తత్ర చైవాపియంతి'

**జగదవ్యాకృతం పూర్వమాసీద్వ్యాక్రియతాధునా ।**
**దృశ్యాభ్యాం నామరూపాభ్యాం విరాడాదిషు తే స్ఫుటే ॥8॥**

**విరాణ్మనుర్నరో గానః ఖరాశ్వాజావయస్తథా ।**
**పిపీలి కావధి ద్వంద్వ మితి వాజసనేయినః ॥9॥**

*8-9.* సృష్టికి పూర్వము బ్రహ్మమునందు జగత్తు అవ్యాకృత రూపమున

*ఉండెను. అదే దృశ్యములైన నామరూపములచే ఇప్పుడు విరాట్టు మొదలైన వానియందు స్పష్టముగ వికారము నొందినది. విరాట్టు నుండి మనువు, మనుష్యులు, పశువులు గాడిదలు గుఱ్ఱములు మేకలు గొఱ్ఱెలు మొదలైనవి చీమల వరకు ఆడవి, మగవి సముద్భవించెనని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది.*

**వ్యాఖ్య:** 'ఆత్మై వేదమగ్ర ఆసీత్పురుష విధః' అని బృహదారణ్యకోపనిషత్తు (1. 4. 1) బ్రహ్మమే పూర్వముండెనని చెప్పి పిమ్మట (1. 4. 7) నందు 'తద్ధేదం తర్హి అవ్యాకృతమాసీన్నామరూపాభ్యామేవ వ్యాక్రియతాసౌ నామ అయమిదం రూపః' అని జగత్తు అవ్యాకృత రూపమున ఉండెనని చెప్పును. కనుక జగత్తు బ్రహ్మము నందే అవ్యాకృతముగ ఉండెనని గ్రహింపవలెను. (జగత్తు మాయాకార్య మగుటయు, మాయబ్రహ్మములకు గల సంబంధము, పంచభూత వివేక ప్రకరణమున చర్చింపబడినది.) (1. 4. 4)న 'ఏవమేవ యదిదం కించమిథునమా పిపీలికాభ్యస్తత్సర్వ మసృజత' అని జగత్తు బ్రహ్మము నుండి సృష్టింపబడుట స్పష్టముగ చెప్పబడినది. బృహదారణ్యకోపనిషత్తు శుక్లయజుర్వేదములోని వాజసనేయ శాఖకు చెందినది.

నాలుగు వేదములును సృష్టి ఈశ్వరకృతమే అని చెప్పుచున్నవనీ, జీవులు మీమాంసకుల 'అదృష్టము' మొదలైన వానిచే కాదనీ ఉద్దేశము.

**కృత్వా రూపాంతరం జైవం దేహే ప్రావిశదీశ్వరః ।**
**ఇతి తాః శ్రుతయః ప్రాహు ర్జీవత్వం ప్రాణధారణాత్ ॥10॥**

*10. ఈ ఈశ్వరుడు అవిక్రియమగు బ్రహ్మమునకు భిన్నమగు వికారవంతమైన జీవరూపము ఏర్పరుచుకొని దేహమునందు ప్రవేశించెనని శ్రుతులు చెప్పుచున్నవి. ప్రాణములను దేహమునందు ధరించుటచే జీవుడనబడుచున్నాడు.*

**చైతన్యం యదధిష్ఠానం లిఙ్గదేహశ్చ యః పునః ।**
**చిచ్ఛాయా లిఙ్గదేహస్థా తత్సంఘో జీవ ఉచ్యతే ॥11॥**

*11. అంతటికిని అధిష్ఠానమైన బ్రహ్మచైతన్యము, సూక్ష్మశరీరము, అందు ప్రతిఫలించిన బ్రహ్మచైతన్యము (చిదాభాస) ఈ మూడును కలిసి జీవుడనబడుచున్నాడు.*

**వ్యాఖ్య:** సూక్ష్మశరీరము మాయాకార్యము జడము అగుటచే స్వతంత్రముగా పనిచేయ జాలదు. అందున్న చిచ్ఛాయయే యజమానిగా సర్వకార్యములకును ప్రేరేపించును. జీవునకు ప్రత్యేకతను పరిచ్ఛిన్నతను కల్పించునదీ చిచ్ఛాయయే.

**మాహేశ్వరీ తు మాయా యా తస్యా నిర్మాణ శక్తివత్ ।**
**విద్యతే మోహశక్తిశ్చ తుం జీవం మోహయత్యసౌ ॥12॥**

*12.* *మహేశ్వరుని మాయకు లోకములను సృష్టించు నిర్మాణ శక్తివలె మరియొక మోహశక్తియు గలదు. దానిచే మాయ జీవుడు తన సచ్చిదానంద స్వరూపమును మరచిపోవునట్లు చేసి మోహపరచును. తదేతజ్జడం మోహాత్మకమ్ అని నృసింహ ఉత్తర తాపినీ ఉపనిషత్తు.9.*

**మోహాదనీశతాం ప్రాప్య మగ్నో వపుషి శోచతి ।**
**ఈశసృష్ట మిదం ద్వైతం సర్వముక్తం సమాసతః ॥13॥**

*13. మోహము వలన జీవుడు తాను ఇష్టప్రాప్తికి అనిష్ట పరిహారమునకు అసమర్థుడననీ తాను శరీరమే అనీ భావించుచు దుఃఖమును అనుభవించును. ఈ విధముగ ఈశ్వరసృష్టి అగు ద్వైతము సంగ్రహముగ చెప్పబడినది. శ్వేతాశ్వతర 4.7, ముండక ఉప. 3.2.1.*

**సప్తాన్న బ్రాహ్మణే ద్వైతం జీవసృష్టం ప్రపఞ్చితమ్ ।**
**అన్నాని సప్త జ్ఞానేన కర్మణాఽజనయత్పితా ॥14॥**

*14. బృహదారణ్యకోపనిషత్తున (1.5.1) 'యత్సప్తాన్నాని మేధయా తపసాజనయత్పితా' అనే వాక్యము జీవసృష్టియగు ద్వైతమును ప్రకటించు చున్నది. పిత తన జ్ఞానముచేతను కర్మచేతను ఏడు విధములైన అన్నములను సృష్టించెను. తన అదృష్టము ద్వారా జగత్తును సృష్టించే సర్వ లోకపాలకుడగు జీవుడే పిత.*

**మర్త్యాన్న మేకం దేవాన్నే ద్వే పశ్వన్నం చతుర్థకమ్ ।**
**అన్యత్త్రితయ మాత్మార్థమన్నానాం వినియోజనమ్ ॥15॥**

*15. అందే ఈ ఏడు విధముల అన్నముల వినియోగము కూడా చెప్పబడినది. మానవులకు ఒకటి, దేవతలకు రెండు, పశువులకు ఒకటి, మిగిలిన మూడును ఆత్మకు అని అన్న విభజనము. (1.5.1,2,3)*

**వ్రీహ్యాదికం దర్శపూర్ణమాసౌ క్షీరం తథా మనః ।**
**వాక్ ప్రాణాశ్చేతి సప్తత్వ మన్నానామవగమ్యతామ్ ॥16॥**

*16.* గోధుమలు మొదలగు ధాన్యము మానవులకు, పూర్ణిమ అమావాస్యల యజ్ఞములు దేవతలకు, పాలు జంతువులకు, మనస్సు వాక్కు ప్రాణములు ఆత్మకునని ఏడు అన్నముల విభాగమును తెలియవలెను. *(బృహ.1.5.1)*

**ఈశేన యద్యప్యేతాని నిర్మితాని స్వరూపతః ।**
**తథాపి జ్ఞానకర్మభ్యాం జీవోఽకార్షీత్తదన్నతామ్ ॥17॥**

*17.* అవియన్నియు స్వరూపమున నీశ్వరునిచే సృష్టింపబడినను జీవుడు తన జ్ఞానముచే (యుక్తాయుక్త విషయ జ్ఞానముచే)విహితము ప్రతిషిద్ధము అగు కర్మచే వానిని తనకు భోగ్యవస్తువులుగ జేసికొనెను. గనుక అవి జీవసృష్టియే యగుచున్నవి.

**వ్యాఖ్య:** జ్ఞానమువలన ధర్మాధర్మ వివేకము కలుగుచున్నది. దీని నుండి జరుగు కర్మ సత్కర్మయైనచో పుణ్యమును దుష్కర్మయైన పాపమును జీవునకు సంక్రమించును. పుణ్యమునకు ఫలము సుఖము. పాపఫలము దుఃఖము. ఈ విధముగ సప్తాన్నములను యజ్ఞాది కర్మలందు వినియోగించుచు భోగ్యవస్తువులుగ జేయుటచే నివి జీవసృష్టియగుచున్నవి.

**ఈశ కార్యం జీవభోగ్యం జగద్ద్వాభ్యాం సమన్వితమ్ ।**
**పితృజన్యాభర్తృభోగ్యా యథా యోషిత్తథేష్యతామ్ ॥18॥**

*18.* ఈశ్వరసృష్టము జీవభోగ్యము అగు సప్తాన్న రూపమైన జగత్తు ఆ ఇరువురి తోడను సంబంధ పడియున్నది. ఒక కన్య మాతాపితలకు పుత్రికయు భర్తకు భార్యయునైనట్లే.

**మాయా వృత్త్యాత్మకో హీశసంకల్పః సాధనం జనౌ ।**
**మనో వృత్త్యాత్మకోజీవసంకల్పో భోగసాధనమ్ ॥19॥**

*19.* సకల జగత్తుయొక్క సృష్టికి మాయాశక్తి సహితమైన ఈశ్వర సంకల్పమే సాధనము. వాని ననుభవించుటయందు అంతఃకరణ వికార రూపమగు జీవసంకల్పము సాధనము.

**వ్యాఖ్య:** త్రిగుణాత్మికమైన మాయను ఉపాధిగ చేసుకుని ఈశ్వరుడు సంకల్ప మాత్రముననే సృష్టికార్యము నెరపును. అందలి వస్తువులను అనుభవించుటకు

జీవుడు పుణ్యాపుణ్య సంపాదనకై ధర్మాధర్మకర్మను జేయును. పుణ్యాపుణ్యముల ఫలమగు సుఖదుఃఖములు మనోవృత్తుల ద్వారా అనుభవమగును. ఈ విధముగ జీవసృష్టి జీవసంకల్పముపై ఆధారపడి అంతఃకరణ వికారముల ద్వారా భోగసాధన మగుచున్నది.

**ఈశ నిర్మిత మణ్యాదౌ వస్తున్యేకవిధేస్థితే ।**
**భోక్తృ ధీవృత్తి నానాత్వాత్తద్భోగో బహుధేష్యతే ॥20॥**

*20. ఈశ్వరనిర్మితములగు మణులు మొదలగు వస్తువులు ఒక విధముగనే ఉండును. జీవసృష్టమగు వాటి అనుభవము, భోక్తల అంతఃకరణ వృత్తుల వైవిధ్యముచే బహువిధములుగ ఉండును.*

**వ్యాఖ్య :** మణి జీవసంకల్పమును అనుసరించి అనేక విధములుగ ఉపయోగ పెట్టబడుచున్నది.

**హృష్యత్యేకో మణిం లబ్ధ్వా క్రుధ్యత్యన్యో హ్యలాభతః ।**
**పశ్యత్యేవ విరక్తోఽత్ర న హృష్యతి న కుప్యతి ॥21॥**

*21. మణి దొరికినదని ఒకడు మహానందము నొందును. మరియొకడు తనకు దొరకలేదని క్రుద్ధుడగును. విరక్తుడగు ఇంకొకడు సంతోషము గాని కోపముగాని లేక ఉదాసీనముగ జూచును.*

**ప్రియోఽప్రియ ఉపేక్ష్యశ్చేత్యాకారా మణిగాస్త్రయః ।**
**సృష్టా జీవైరీశ సృష్టం రూపం సాధారణం త్రిషు ॥22॥**

*22. ప్రియము అప్రియము ఉపేక్ష (ఉదాసీనత) అను నీ మూడు భావములు మణియందు జీవులచే సృష్టింపబడినవి. మూడింటియందును ఈశ్వరసృష్టమైన మణిరూపము సమానమే.*

**భార్యా స్నుషా ననందా చ యాతా మాతేత్యనేకధా ।**
**ప్రతియోగిధియో యోషిద్భిద్యతే న స్వరూపతః ॥23॥**

*23. ఒక స్త్రీయే ఒకరికి (భర్తకు) భార్యగను, కోడలుగను, మరదలుగను, తోడికోడలుగను, తల్లిగను వారి సంబంధమును అనుసరించి వేరువేరుగ ఉండును. కాని స్వరూపమున ఉన్నది ఒక స్త్రీయే.*

**నను జ్ఞానాని భిద్యన్తా మాకరస్తు న భిద్యతే ।**
**యోషిద్వపుష్యతిశయో న దృష్టో జీవనిర్మితః ॥24॥**

*24. (ఆక్షేపము): భావములు (జ్ఞానములు) మారిన మారుగాక. వస్తువు యొక్క ఆకారము మారుటలేదు గదా. జీవనిర్మితమైన విశేషమేమీ ఈ స్త్రీ శరీరమున కన్పించుట లేదు.*

**మైవం మాంసమయీ యోషిత్కాచిదన్యా మనోమయీ ।**
**మాంసమయ్యా అభేదేఽపి భిద్యతే హి మనోమయీ ॥25॥**

*25. (సమాధానము): అట్లు కాదు. మాంసనిర్మిత శరీరము గల స్త్రీకి మనో నిర్మితమైన సూక్ష్మశరీరము మరియొకటి ఉన్నది. మాంసశరీరమున మార్పులేకున్నను మనోనిర్మిత శరీరము మారుట ప్రసిద్ధమే.*

**వ్యాఖ్య:** జ్ఞానవిషయము మారనిచో జ్ఞానము కూడా మారదు. జ్ఞానము మారినదనగా జ్ఞేయము తత్పూర్వమే మారి ఉండవలెను గదా.

**భ్రాంతి స్వప్న మనోరాజ్య స్మృతిష్వస్తు మనోమయమ్ ।**
**జాగ్రన్మానేన మేయస్య న మనోమయ తేతి చేత్ ॥ 26 ॥**

*26. భ్రాంతి స్వప్నము పగటికలలు జ్ఞాపకములు వీని యందు మానసిక మైన ఆకారములు ఉండనిమ్ము. వీనియందు స్థూలరూపములు గాక మానసిక రూపములే కన్పించును. కాని జాగ్రదవస్థయందు మానసిక రూపములు కన్పింపవు గదా.*

**బాధం మానే తు మేయేన యోగాత్స్వాద్విషయాకృతిః ।**
**భాష్యవార్తికకారాభ్యామయమర్థ ఉదీరితః ॥27॥**

*27. (సమాధానము:) సత్యమే. జాగ్రదవస్థయందు స్థూలరూపములే కన్పించును. కాని విషయాకృతి మనస్సు ఆ విషయముతో కలియుట వలన ఏర్పడుచున్నది. ఈ విషయమును శ్రీశంకరులు సురేశ్వరాచార్యులు బోధించిరి.*

**మూషాసిక్తం యథా తామ్రం తన్నిభం జాయతే తథా ।**
**రూపాదీన్ వ్యాప్నువచ్చిత్తం తన్నిభం దృశ్యతే ధ్రువమ్ ॥28॥**

*28. కరిగిన రాగి (లోహము) మూసయందు పోయబడినపుడు ఆ మూస ఆకారమును పొందినట్లే రూపము మొదలగు విషయములందు వ్యాపించిన మనస్సు అవశ్యము ఆ సాకారమునే పొందునని శ్రీ శంకరాచార్యులు చెప్పిరి. (ఉపదేశసాహస్రి 14.3-4, బ్రహ్మసూత్రభాష్యము 1.1.12.)*

**వ్యంజకో వాయథాఽఽ లోకోవ్యంగ్యస్యాకారతామియాత్ ।**
**సర్వార్థ వ్యఞ్జకత్వాద్ధీరర్థాకారా ప్రదృశ్యతే ॥29॥**

*29. తామ్రమము స్థూల వస్తువు - మనస్సు అట్టిది కాదేయను సంశయమును వారించుచున్నాడు. సూర్యకాంతి తాను ప్రకాశింప జేయుచున్న వస్తువు ఆకారమునే పొందును. సకల వస్తువులను ప్రకాశింపజేయునది తుదకు బుద్ధియే అగుటచే అది కూడా తాను చూచుచున్న వస్తువుల ఆకారమునే పొందును.*

**మాతుర్మానాభినిష్పత్తి ర్నిష్పన్నం మేయమేతి తత్ ।**
**మేయాభిసంగతం తచ్చ మేయాభత్వం ప్రపద్యతే ॥30॥**

*30. (శ్రీసురేశ్వరాచార్యుల అభిప్రాయమున) ప్రమాత అనగా జీవుని యందు మానము అనగా చిదాభాసయక్తమైన యంతఃకరణము యొక్క వృత్తి, వికారము, ఉత్పత్తి యగును. ఈ యంతఃకరణ వృత్తి మేయమును అనగా జ్ఞాన విషయమును చేరి జ్ఞానవిషయాకారమును పొందును. అంతేగాక మేయ సంబంధముచే చిదాభాసయందు కూడ మేయ సమానమైన ఆకారమేర్పడును.*

**వ్యాఖ్య:** మలినసత్త్వ ప్రధానమైన ప్రకృతియందు బ్రహ్మము ప్రతిఫలించి జీవుడగుచున్నది. తమః ప్రధానమైన ప్రకృతి యందేర్పడిన సూక్ష్మమహాభూతముల సాత్త్వికాంశలచే అంతఃకరణ మేర్పడుచున్నది. ఈ అంతఃకరణము నందలి బుద్ధి ద్వారా జీవునకు దృశ్యమాన ప్రపంచముతో సంబంధమేర్పడును. కనుక అంతః కరణము స్థూలవస్తువుల యాకారమును పొందుచుండ జీవునియందు సూక్ష్మ వస్తువుల యాకారము గూడ నేర్పడుచుండును.

**సత్యేవం విషయౌ ద్వౌస్తో ఘటౌ మృన్మయధీమయౌ ।**
**మృన్మయో మనోమేయః స్యాత్ సాక్షిభాస్యస్తు ధీమయః ॥31॥**

*31. సంగతి ఇట్లున్నందున విషయములు రెండున్నవి. మట్టితో చేయ బడిన కుండయొకటి, బుద్ధితో చేయబడిన కుండ మరియొకటి. మట్టికుండను మనస్సు తెలిసికొనును. బుద్ధి కుండను సాక్షిచైతన్యము చిదాభాసుడు తెలిసికొనును.*

**వ్యాఖ్య:** మనస్సు విషయాకారతను మాత్రము పొంది ఆ జ్ఞానమును కలిగించుచుండగా బుద్ధి ఆ విషయమును గూర్చిన అనేకములగు భావనలను

కూడ కల్పించి కోరికలను కలిగించు మరొక రూపమును సిద్ధము చేయుచున్నది. కనుక ఈశ్వర సృష్టియైన విషయము మాత్రమే గాక ఆ విషయమును గూర్చిన భావనలచే కోరికలచే నేర్పడు మరొక మానసిక విషయము, జీవసృష్టి ఉన్నదని నిర్ణయము.

**అన్వయ వ్యతిరేకాభ్యాం ధీమయో జీవ బంధకృత్ ।**
**సత్యస్మిన్ సుఖదుఃఖే స్తన్తస్మిన్నసతి న ద్వయమ్ ॥32॥**

*32. అన్వయవ్యతిరేకములచే ధీమయ విషయమే జీవ బంధకారణము. అది ఉండినచో సుఖదుఃఖములున్నవి. అది లేనిచో సుఖదుఃఖములును లేవు.*

**వ్యాఖ్య:** బుద్ధికృతములైన సూక్ష్మవిషయాకారములున్ననే జాగ్రత్స్వప్నములు అందలి సుఖదుఃఖములు ఉన్నవి. బుద్ధి యట్టి వికారములు పొందని సుషుప్తి సమాధి స్థితులయందు సుఖదుఃఖములును లేవు. ఆ బుద్ధి జనిత వికారములు జీవసృష్టి కనుక అదియే బంధకారణము.

**అసత్యపి చ బాహ్యార్థే స్వప్నాదౌ బధ్యతే నరః ।**
**సమాధి సుప్తి మూర్ఛాసు సత్యప్యస్మి న్న బధ్యతే ॥33॥**

*33. బాహ్యవిషయములు లేని స్వప్నము జ్ఞాపకము మొదలగు స్థితుల యందు బుద్ధి జనిత వికారముల వలన మానవుడు అనుకూల వికారములచే సుఖమును ప్రతికూల వికారములచే దుఃఖమును పొందుచు బుద్ధిచే బద్ధుడగు చున్నాడు. అనుకూలములు ప్రతికూలములు అగు బాహ్యవిషయములున్నను సమాధి సుషుప్తి మూర్ఛ మొదలగు అవస్థలయందు తదనుగుణములైన సుఖదుఃఖములు లేవు, బంధము లేదు. ఏలన బుద్ధి వికారము లేదు గనుక.*

**దూరదేశం గతే పుత్రే జీవత్యేవాత్ర తత్పితా ।**
**విప్రలంభకవాక్యేన మృతం మత్వా ప్రరోతి ॥34॥**

*34. దూరదేశమునకు పోయిన పుత్రుడు జీవించి ఉండగనే స్వదేశమున అతని తండ్రి, తుంటరి వంచకునిచే 'నీ పుత్రుడు మరణించె'నని చెప్పబడి, తన పుత్రుడు మృతుడయ్యెనని భావించి విశేషముగ రోదించును.*

**మృతేఽపి తస్మిన్వార్తాయా మశ్రుతాయాం న రోదితి ।**
**అతౌ సర్వస్య జీవస్య బంధకృన్మానసం జగత్ ॥35॥**

*35.* అట్లు గాక, పుత్రుడు నిజముగనే మరణించినప్పటికీ ఆ వార్త అందనిచో పుత్రుడు జీవితుడే అని భావించుచు తండ్రి ఎంతకాలమైనను రోదింపడు. కనుక సర్వజీవులకు బంధకారణము మానసిక ప్రపంచమే.

**విజ్ఞానవాదో బాహ్యార్థవై యర్థ్యాత్ స్యాదిహేతి చేత్ ।**
**న హృద్యాకార మాధాతుం బాహ్యస్యాపేక్షితత్వతః ॥36॥**

*36.* బాహ్యవిషయములు వ్యర్థములగుటచే ఇది కేవలం విజ్ఞాన వాదమని ఆక్షేపమైనచో అట్లు కాదు. మానసికాకారములను ఇచ్చుటకు బాహ్య వస్తువులు అవసరమగుటచే వేదాంతవాదము విజ్ఞానవాదము కాదని సమాధానము.

**వ్యాఖ్య:** యోగాచార బౌద్ధుల మతమున బాహ్యవస్తువులు లేనేలేవు. అంతా మనః కల్పితమే కాని వేదాంత మతమున బాహ్యజగత్తు వ్యవహారకాలమున సత్యమే. వానిని మనస్సు గ్రహించును. దీనికి మించి బుద్ధి ఎన్నో భావనలు కూడా ఆ వస్తువులను గూర్చి కల్పించును. ఇట్లు బాహ్య వస్తువులు లేనిదే బుద్ధికృత రూపములు అసంభవములు కనుక వేదాంతమతము విజ్ఞానవాదము కాదు.

**వైయర్థ్యమస్తు వా బాహ్యం న వారయితు మీశ్మ హే ।**
**ప్రయోజన మపేక్షంతే న మానానీతి హి స్థితిః ॥37॥**

*37.* బాహ్య వస్తువులు వ్యర్థములే. కాని అవి లేనే లేవని మేము చెప్పము. ఒక వస్తువు ఉన్నది, లేదు అని చెప్పుట ప్రమాణమును బట్టిగాని ప్రయోజనమును బట్టి కాదు గదా. ప్రయోజనము లేని వస్తువు అసత్తయని ఎవరును అంగీకరింపరు.

**బంధశ్చేన్మానసం ద్వైతం తన్నిరోధేన శామ్యతి ।**
**అభ్యసేద్యోగమేవాతో బ్రహ్మజ్ఞానేన కిం వద ॥38॥**

*38.* మానసికమైన ద్వైతమే బంధకారణమైనచో యోగమే అభ్యసింపుము. చిత్త నిరోధముచే ప్రపంచముపశమించును. బ్రహ్మజ్ఞానముతో ఏమి పని?

**తాత్కాలికద్వైతశాంతావప్యాగామిజనిక్షయః ।**
**బ్రహ్మజ్ఞానం వినా న స్యాదితి వేదాంత డిండిమః ॥39॥**

*39.* యోగముచే ద్వైతము తత్కాలమున, చిత్తము నిరుద్ధమై ఉన్నంత కాలమున, శాంతించినను రాబోవు జన్మమృత్యువులు మానస ప్రపంచము బ్రహ్మజ్ఞానము లేనిదే నశింపదని వేదాంత నిర్ఘోషము.

**వ్యాఖ్య:** ప్రపంచము అవిద్యా కార్యము. బ్రహ్మజ్ఞానముచే అవిద్య నశింపనంత వరకు అవిద్యాకామ కర్మ సుఖదుఃఖాత్మకమైన ప్రపంచము శాశ్వతముగ నశించు ఆశయే లేదు.

**అనువృత్తేఽపీశసృష్టే ద్వైతే తస్య మృషాత్మతామ్ ।**
**బుద్ధ్వా బ్రహ్మాద్వయం బోద్ధుం శక్యం వస్త్వైక్యవాదినః ॥40॥**

*40. ఈశ్వరసృష్టమగు ద్వైతము నశింపకున్నను అది మిథ్యయని తెలిసికొని అద్వైతవాది అద్వయమగు బ్రహ్మబోధను పొందగలడు.*

**ప్రలయే తన్నివృత్తౌ తు గురుశాస్త్రా ద్యభావతః ।**
**విరోధి ద్వైతాభావేపి న శక్యం బోద్ధు మద్వయమ్ ॥41॥**

*41. ప్రళయమునందు ద్వైతప్రపంచము నశించును. గురువు శాస్త్రము మొదలైనవేవీ ఉండవు. ఇట్లు ద్వైతముపశమించినను, నిద్రలో వలె, ఎవరికిని అద్వయ బ్రహ్మబోధ కలుగుట లేదు.*

**అబాధకం సాధకం చ ద్వైత మీశ్వరనిర్మితమ్ ।**
**అపనేతుమశక్యం చేత్యాస్తాం తద్ద్విష్యతే కుతః ॥42॥**

*42. ఈశ్వరనిర్మితమైన ద్వైతము అద్వయ బ్రహ్మజ్ఞానమునకు బాధకము కాదు. మీదు మిక్కిలి సహకారము కూడ. దానిని నిర్మూలించుట కూడా అసాధ్యమే. కనుక దానిని ఉండనిమ్ము. దాని పట్ల ద్వేషమెందుకు?*

**జీవద్వైతం తు శాస్త్రీయమశాస్త్రీయమితి ద్విధా ।**
**ఉపాదదీత శాస్త్రీయమాతత్త్వస్యావబోధనాత్ ॥43॥**

*43. జీవసృష్టమైన ద్వైతము శాస్త్రీయము అశాస్త్రీయము అని రెండు విధములు. తత్త్వము అవగతమగునంత వరకు శాస్త్రీయమగు జీవద్వైతము మనస్సున ఉంచుకొనవలెను.*

**ఆత్మ బ్రహ్మ విచారాఖ్యం శాస్త్రీయం మానసం జగత్ ।**
**బుద్ధేతత్త్వే తచ్చ హేయమితి శ్రుత్యనుశాసనమ్ ॥44॥**

*44. ఆత్మ స్వరూపము బ్రహ్మమే అనే విచారము, శ్రవణ మనన నిది ధ్యాసనాత్మకము శాస్త్రీయమైన మానస జగత్తు. తత్త్వము బోధపడిన పిమ్మట దీనిని కూడా పరిత్యజింప వలెనని శ్రుతి శాసించుచున్నది.*

**శాస్త్రా ణ్యధీత్య మేధావీ అభ్యస్య చ పునః పునః ।**
**పరమం బ్రహ్మ విజ్ఞాయ ఉల్కావత్తాన్యథోత్సృజేత్ ॥45॥**

*45.* మేధావియగు పురుషుడు శాస్త్రములను చక్కగా అధ్యయనము చేసి అందు బోధింపబడిన విషయమును శ్రద్ధతో అభ్యసించి బ్రహ్మాత్మబోధను పొందిన పిమ్మట ఆ శాస్త్రములను కూడా, గమ్యమును చేరిన యాత్రికుడు చేతి దివ్వెను పారవేసినట్లు, వదలవలెను. *(అమృతనాదోపనిషత్తు1.)*

**గ్రంథ మభ్యస్య మేధావీ జ్ఞాన విజ్ఞాన తత్పరః ।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథ మశేషతః ॥46॥**

*46.* గ్రంథమును అభ్యసించిన మేధావి జ్ఞాన విజ్ఞాన తత్పరుడై, బియ్యమును పొందిన పిమ్మట వడ్ల ఊకను వలె, గ్రంథమును నిశ్శేషముగ పరిత్యజింపవలెను. *(అమృతబిందూపనిషత్తు.18.)*

**తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః ।**
**నానుధ్యాయా ద్బహూఞ్ఛబ్దాన్వాచో విగ్లాపనం హి తత్ ॥47॥**

*47.* ప్రత్యగాత్మయే బ్రహ్మమని సాక్షాత్కరించుకొనిన ధీరుడు తన ప్రజ్ఞను బ్రహ్మమునందు ఏకము చేసి ఉంచుకొనవలెను. మనస్సును అనేక శబ్దములచే నింపరాదు. ఏలన అది మనస్సును పీడించును. *(బృహ 4.4.21; వివేకచూడామణి 321-325.)*

**తమేవైకం విజానీథ హ్యన్యా వాచో విముంచథ ।**
**యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ ఇత్యాద్యాః శ్రుతయః స్ఫుటాః ॥48॥**

*48.* ఆత్మను ఒక దానిని మాత్రమే తెలిసికొనుము. ఇతర వాక్కులను పరిత్యజింపుము అని ముండకోపనిషత్తు *2.2.5,* వాక్కును మనస్సునందు లయము చేయుము మొదలైనది కఠోపనిషత్తు *3.13,* మొదలగు శ్రుతులు స్పష్టముగ ఉద్ఘోషించుచున్నవి. ఇతర వాక్కులనగా అపరావిద్యయని శ్రీ శంకరుల అభిప్రాయము.

**అశాస్త్రీయమపి ద్వైతం తీవ్రం మందమితి ద్విధా ।**
**కామక్రోధాదికం తీవ్రం మనోరాజ్యం తథేతరత్ ॥49॥**

*49.* జీవసృష్టి అగు అశాస్త్రీయద్వైతము తీవ్రము, మందము అని రెండు విధములు. అందు కామక్రోధాదులను కల్పించునది తీవ్రము, పగటికలలు కల్పించునది మందము.

**ఉభయం తత్త్వబోధాత్ ప్రాఙ్నివార్యం బోధసిద్ధయే ।**
**శమః సమాహితత్వం చ సాధనేషు శ్రుతం యతః ॥50॥**

*50. ఇవి రెండూ తత్త్వబోధకై ప్రయత్నించుటకు పూర్వమే పరిత్యజింప వలెను. బోధసిద్ధికి శాంతస్వభావము ఏకాగ్రత సాధనములుగ చెప్పబడినవి. అశాస్త్రీయ ద్వైతమును వదలనిచో ఈ సాధనములు సిద్ధింపవు.*

**బోధా దూర్ధ్వం చ తద్ధేయం జీవన్ముక్తిప్రసిద్ధయే ।**
**కామాది క్లేశబంధేన యుక్తస్య నహి ముక్తతా ॥51॥**

*51. బ్రహ్మాత్మబోధ కలిగిన పిమ్మట కూడా జీవన్ముక్తియందు ప్రతిష్ఠితు డగుటకు ఆ అశాస్త్రీయ ద్వైతమును పరిత్యజింపవలెను. కామక్రోధాది క్లేశములచే బంధితుడైన వానికి ముక్తత లేదు.*

**జీవన్ముక్తిరియం మా భూత్ జన్మాభావే త్వహం కృతీ ।**
**తర్హి జన్మాపి తేఽ స్త్యేవ స్వర్గ మాత్రాత్కృతీ భవాన్ ॥52॥**

*52. ఈ జీవన్ముక్తి లేకపోయిన పోనిమ్ము. ఇక మీద జన్మము లేక పోవుటచే నేను కృతార్థుడనే అనినచో కామాదులు ఉన్నంత వరకు నీకు జన్మము కూడ తప్పదు. స్వర్గముతో మాత్రమే నీవు తృప్తి పడవలెను. విదేహ ముక్తి అసంభవమని ఉద్దేశము.*

**క్షయాతిశయ దోషేణ స్వర్గో హేయో యదా తదా ।**
**స్వయం దోషతయాత్మాయం కామాదిః కిం న హీయతే ॥53॥**

*53. స్వర్గసుఖములు క్షయించును, తారతమ్యములు గలవి అగుటచే స్వర్గము త్యాజ్యమైనపుడు దానికి మూలమైన దోషమగు కామక్రోధాదులను ఏల పరిత్యజింపవు? అవశ్యము పరిత్యజింపవలెనని భావము.*

**తత్త్వం బుద్ధ్వాపి కామాదీన్నిః శేషం న జహాసి చేత్ ।**
**యథేష్టాచరణం తే స్యాత్కర్మశాస్త్రాతిలంఘినః ॥54॥**

*54. తత్త్వమును తెలిసికొనిన పిమ్మట కూడా కామాదులను సమూలముగ పరిత్యజింపనిచో కర్మశాస్త్రము నుల్లంఘించు నీవు స్వేచ్ఛాచారివి అగుదువు. నిజమగు జ్ఞాని విధి నిషేధములకు అతీతుడైనను శాస్త్ర విరుద్ధముగ ప్రవర్తింపడు. (భాగవతము 11.7.11; కఠోపనిషత్తు 2.24.)*

**బుద్ధాద్వైత స్వతత్త్వస్య యథేష్టాచరణం యది ।**
**శునాం తత్త్వదృశాం చైవ కో భేదోశుచిభక్షణే ॥55॥**

*55.* నిజస్వరూపము అద్వైత బ్రహ్మమని తెలిసికొనిన వాడు స్వేచ్ఛాచారియైనచో నమేధ్యమును తినుటయందు కుక్కకును ఈ తత్త్వదర్శికిని ఏమి భేదము? నియమములను పాటింపకయే తాను బ్రహ్మజ్ఞానినని నటించువాడు అమేధ్యమును తిను కుక్కవంటి వాడని సురేశ్వరాచార్యులు అంటారు. నైష్కర్మ్యసిద్ధి *4.62;* వేదాంతసారము *223.*

**బోధాత్పురా మనోదోషమాత్రాత్క్లి శ్నాస్యథాధునా ।**
**అశేష లోకనిందా చేత్యహో తే బోధవైభవమ్ ॥56॥**

*56.* జ్ఞానమునకు పూర్వము మానసిక దోషములచే మాత్రమే ఖిన్నుడవై ఉంటివి. మరి ఇప్పుడు జనులందరి చేతను నిందింపబడుచున్నావు. ఆహా ఏమి నీ జ్ఞానవైభవము ! ( నీ బ్రహ్మజ్ఞానము వట్టి నటనయే అనీ ఇప్పుడు దుఃఖము రెండింతలైనదనీ వ్యంగ్యము.)

**విడ్వరాహాదితుల్యత్వం మా కాంక్షీసస్తత్త్వవిద్భవాన్ ।**
**సర్వధీదోష సంత్యాగాల్లోకైః పూజ్యస్వ దేవవత్ ॥57॥**

*57.* సర్వోన్నతి హేతువైన జ్ఞానమును ఆర్జించిన నీవు సర్వాధమమైన మలము పంది మొదలగువానితో సామ్యమును కోరకుము. కామ క్రోధాదులైన సకల మనోదోషములను పరిత్యజించి దేవతలతో సమానముగ లోకమున పూజలందుకొనుము.

**కామ్యాది దోషదృష్ట్యాద్యాః కామాది త్యాగహేతవః ।**
**ప్రసిద్ధో మోక్షశాస్త్రేషు తానన్విష్య సుఖీ భవ ॥58॥**

*58.* కామము మొదలైన దోషములను పరిత్యజించుటకు వానియందలి బంధహేతుత్వము, తోజోహాని, క్షణికత్వము మొదలగు దోషములను గూర్చి విచారించుట మొదలగు ఉపాయములు మోక్షశాస్త్రములందు చెప్పబడినవి. వానిని అన్వేషించి అవలంబించి సుఖముగ ఉండుము.

**త్యజ్యతామేవ కామాది ర్మనోరాజ్యే తు కా క్షతిః ।**
**అశేషదోషబీజత్వాత్ క్షతిర్భగవతేరితా ॥59॥**

*59. (ఆక్షేపము:) కామాదిదోషములు పరిత్యజింపబడుగాక. వానిని గూర్చి ఊహించుచు పగటి కలలు కనుటయందేమి హాని కలదు? (సమాధానము:) అట్లాలోచించుట అశేషములైన యనర్థములకు మూలమని కృష్ణభగవానుడు చెప్పెను.*

**ధ్యాయతో విషయాన్పుంసః సంజ్గస్తే షూప జాయతే ।**
**సజ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోభి జాయతే ॥60॥**

*60. కామ్యవిషయములను గూర్చి ఆలోచించు మానవునకు వాని యందు ఆసక్తి కలుగును. ఆసక్తి వలన అవి కావలెననే కాంక్ష ఉదయించును. ఈ కాంక్ష తీరుటకు ఆటంకము కలిగినచో క్రోధముప్పతిల్లును. (భగవద్గీత 2.62)*

**క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్స్మృతి విభ్రమః ।**
**స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥60క॥**

*60. క్రోధము వలన మనస్సునందు మూఢత కలుగును. దాని వలన గురుశాస్త్రోపదేశములు మరచిపోవును. అవి జ్ఞాపకమునకు రావు. దీని వలన యుక్తాయుక్త వివేకము నశించును. తత్ఫలితంగ సర్వనాశము కలుగును. (ఈ శ్లోకము చాల మూలప్రతులందు అలభ్యము.)*

**శక్యం జేతుం మనోరాజ్యం నిర్వికల్ప సమాధితః ।**
**సుసంపాదః క్రమాత్సోఽపి సవికల్ప సమాధినా ॥61॥**

*61. మనోరాజ్యము నిర్వికల్ప సమాధిచే జయింపవచ్చును. నిర్వికల్ప సమాధి కూడా మొదట ఈశ్వరధ్యాన లక్షణమగు సవికల్ప సమాధి అభ్యాసముచే క్రమముగ సాధింపవచ్చును.*

**బుద్ధతత్త్వేన ధీదోషశూన్యేనైకాంతవాసినా ।**
**దీర్ఘం ప్రణవ ముచ్చార్య మనోరాజ్యం విజీయతే ॥62॥**

*62. బ్రహ్మాత్మైక్య లక్షణమగు తత్త్వమును అవగతము చేసికొనిన పురుషుడు కామాది బుద్ధి దోషములను పరిత్యజించి ఏకాంతమున నివసించుచు దీర్ఘకాలము ప్రణవ (ఓంకార) జపమును అభ్యసించినచో మనోరాజ్యము జయింపగలడు. అష్టాంగయోగసాధన లేని వారికి మార్గము చెప్పబడినది.*

**జితే తస్మిన్ వృత్తిశూన్యం మనస్తిష్ఠతి మూకవత్ ।**
**ఏతత్పదం వసిష్ఠేన రామాయ బహుధేరితమ్ ॥63॥**

*63.* మనోరాజ్యమును జయించినచో ఏ ఊహలు లేకపోవుటచే మనస్సు ఎట్టి వృత్తులకును లోనుగాక మూగవానివలె నిశ్శబ్దముగ ఉండును. ఈ పద్ధతి అనేక విధములుగ వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు చెప్పెను.

**దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్ ।**
**సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణ నిర్వృతిః ॥64॥**

*64.* 'నేహ నాసక్తి కించ' బృహదారణ్యక ఉప. *4.4.19;* కఠ ఉప.*4.11* మొదలగు శ్రుతివాక్యములు బోధించునట్లు అద్వితీయ బ్రహ్మము తప్ప దృశ్య జగత్తు మిథ్యయను బోధచే మనస్సునందలి ద్వైతమును తొలగింప గలిగినచో నిరతిశయ మోక్షసుఖము సిద్ధించును. యోగవాసిష్ఠము వైరాగ్యప్రకరణము *3.6.*

**విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః ।**
**సంత్యక్తవాసనా న్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్ ॥65॥**

*65.* దీర్ఘకాలము శాస్త్రమును నిష్ఠతో ఏకాగ్రతో అధ్యయనము చేయుట అందలి సత్యమును గూర్చి గురువులతోను ఇతర విద్వాంసులతోను చర్చించుట వలన వాసనాలేశములు కూడా లేని మనస్సు ప్రశాంతమై మౌనముగ ఉండుట కంటె ఉత్తమమైన స్థితి లేదని తెలియును. (యో.వా. స్థితి ప్రకరణము *57.28*)

**విక్షిప్యతే కదాచిద్ధీః కర్మణా భోగదాయినా ।**
**పునః సమాహితా సా స్యాత్తదైవాభ్యాస పాటవాత్ ॥66॥**

*66.* ప్రారబ్ధ కర్మము వలన సుఖదుఃఖములు కలుగుచు ఎప్పుడైన బుద్ధి విక్షేపము చెందినను అభ్యాసపాటవముచే దార్ఢ్యముచే మరల యథా పూర్వముగ సమాహితమగును.

**విక్షేపో యస్య నాస్తి అస్య బ్రహ్మవిత్త్వం న మన్యతే ।**
**బ్రహ్మైవాయమితి ప్రాహుర్మునయః పారదర్శినః ॥67॥**

*67.* అట్టి విక్షేపములు లేని మానవుడు కేవలము బ్రహ్మవిదుడే కాదు సాక్షాత్తు బ్రహ్మమే అని వేదశాస్త్ర పారంగతులగు మునులు చెప్పుదురు.

**దర్శనాదర్శనే హిత్వా స్వయం కేవలరూపతః ।**
**యస్తిష్ఠతి స తు బ్రహ్మన్ బ్రహ్మ న బ్రహ్మవిత్స్వయమ్ ॥68॥**

*68.* బ్రహ్మము తనకు సాక్షాత్కరించెనా లేదా అనే ఆలోచనలు లేక సచ్చిదానందముతో ఏకత్వమును సదా అనుభవించుచు ఉండే పురుషుడు కేవలము బ్రహ్మవిదుడు కాడు. సాక్షాత్తు బ్రహ్మమే. ముక్తికోపనిషత్తు *2.64.* వసిష్ఠుడు కూడా రాముని కిట్లుపదేశించెను.

**జీవన్ముక్తేః పరా కాష్ఠా జీవద్వైత వివర్జనాత్ ।**
**లభ్యతేఽసావతోఽత్రేదమీశద్వైతాద్వివేచితమ్ ॥69॥**

*69.* ఈశ్వరసృష్టిపై ఆరోపింపబడిన జీవసృష్టిని పరిత్యజించుటచే జీవన్ముక్తి పరాకాష్ఠ సిద్ధించును. అందుచే ఈ ప్రకరణమున ఈశ్వర సృష్టి నుండి జీవసృష్టి వివేచింపబడినది.

## చతుర్థ ప్రకరణము: సమాప్తము

# పంచమము : మహావాక్య వివేక ప్రకరణము

**యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ ।**
**స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితమ్ ॥1॥**

*1. ఏ చైతన్యము ద్వారా చూచునో, ఏ చైతన్యము ద్వారా వినునో, ఏ చైతన్యము ద్వారా గంధము నాఘ్రాణించునో వాక్కుతో వ్యవహరించునో దేని ద్వారా రుచి అరుచి తెలిసికొనునో ఆ చైతన్యమే ప్రజ్ఞానమని చెప్పబడినది.*

**వ్యాఖ్య:** నాలుగు వేదములలోని నాలుగు మహా వాక్యములను వివరించుచు, మొదట 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనే ఋగ్వేదీయ ఐతరేయోపనిషద్వాక్యము (3. 1. 3)లోని 'ప్రజ్ఞాన' శబ్దమును వివరించుచున్నాడు. శుద్ధ చైతన్యము అంతఃకరణము ఇంద్రియములచే పరిమితమై వాని ద్వారా ఇంద్రియ విషయములను గ్రహించు చున్నది. ఈ చైతన్యమే ప్రజ్ఞానము. ఈ ఉపాధులను తొలగించినచో అదే సచ్చిదానంద బ్రహ్మము.

**చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వ గవాదిషు ।**
**చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి ॥2॥**

*2. చతుర్ముఖబ్రహ్మ ఇంద్రుడు దేవతలు మొదలగు ఉత్తమములైన ఉపాధులందు గల చైతన్యము, మధ్యమోపాధులగు మానవ శరీరములందూ అధమోపాధులగు గుర్రములు పశువులు మొదలగు వాని యందూ గల చైతన్యం అంతా ఒక్కటే. అదే బ్రహ్మము. కనుక నా యందుగల ప్రజ్ఞానము కూడా బ్రహ్మమే.*

**పరిపూర్ణః పరాత్మాఽస్మిన్దేహే విద్యాధికారిణి ।**
**బుద్ధే సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే ॥3॥**

*3.* పరిపూర్ణమగు పరమాత్మ ఈ మానవ శరీమున బ్రహ్మవిద్యకు అర్హమై బుద్ధియందు సాక్షిరూపమున ఉంటూ 'నేను' అనబడుచున్నది.

**వ్యాఖ్య:** యజుర్వేదములోని బృహదారణ్యకోపనిషత్తు నందలి 'అహం బ్రహ్మాస్మి' (1.4.10) అనే మహా వాక్యము వివరింపబడుచున్నది. దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితమై పరిపూర్ణము అనంతము అగు బ్రహ్మము మాయా కల్పితము లగు శరీరములనే ఉపాధులను గ్రహించి 'నేను'గా వ్యవహృత మగుచున్నది. ఉపాధులలో శుద్ధతమమగుట చేత మానవుని బుద్ధి బ్రహ్మ స్వరూపమును అవగతము చేసికొన గలుగుచున్నది.

**స్వతః పూర్ణః పరాత్మాఽత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః ।**
**అస్మీత్యైక్య పరామర్శ స్తేన బ్రహ్మ భవామ్యహమ్ ॥4॥**

*4.* స్వరూపమున పరిపూర్ణము అనంతము అగు పరమాత్మ ఈ మహా వాక్యమున 'బ్రహ్మ' మని చెప్పబడినది. 'అస్మి' అనే పదము 'నేను' 'బ్రహ్మము' అనే శబ్దముల ఐక్యమును సూచించుచున్నది. కనుక నేను బ్రహ్మమునే అగుదును. (అని వ్యాక్యార్థము).

**ఏక మేవాద్వితీయం సన్నామరూప వివర్జితమ్ ।**
**సృష్టేః పురాధునాఽప్యస్య తాదృక్త్వం తదితీర్యతే ॥5॥**

*5.* సృష్టికి పూర్వము నామరూపములు లేని సత్త ఒక్కటే అద్వితీయమై ఉండెను. ఈ కాలమున కూడా అది అట్లే ఉండుటను 'తత్' శబ్దము సూచించుచున్నది. సామవేదీయమైన ఛాందోగ్యోపనిషత్తులోని తత్త్వమసి *(6.8.7)* అనే వాక్యము వివరింపబడుచున్నది.

**శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితమ్ ।**
**ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్యమనుభూయతామ్ ॥6॥**

*6.* శ్రోతయందలి దేహేంద్రియాంతఃకరణములకు అతీతమైన సద్వస్తువు ఇచ్చట 'త్వం' పదముచే సూచితమైనది. 'అసి' అనే పదము ఈ రెండింటి ఐక్యమును సూచించుచున్నది. ఈ ఏకతనే అనుభవింపవలసి ఉన్నది.

**స్వప్రకాశాపరోక్షత్వ మయమిత్యుక్తితో మతమ్ ।**
**అహంకారాది దేహాంతాత్ప్రత్యగాత్మేతి గీయతే ॥7॥**

*7.* ఏ ప్రమాణముల ఆవశ్యకతయు లేక నేరుగా తెలియబడునదీ స్వయముగనే ప్రకాశించునదీ అని 'అయమ్' అనగా 'ఈ' అనే శబ్దము సూచించుచున్నది. ఈ ఆత్మ అహంకారము మొదలు దేహము వరకు అన్నింటియందూ అనుస్యూతమై ప్రత్యగాత్మ అని కీర్తింపబడుచున్నది.

**వ్యాఖ్య:** అథర్వవేదములోని మాండూక్యోపనిషత్తు నందలి 'అయమాత్మా బ్రహ్మ' (2) అనే వాక్యము వివరింపబడుచున్నది. సూక్ష్మత్వము, వ్యాపిత్వము అపరోక్షత్వములను 'ప్రత్యక్' శబ్దము సూచించును.

**దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే ।**
**బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్ ॥8॥**

*8.* దృశ్యమానమగు సకల జగత్తు యొక్క సారతత్త్వము 'బ్రహ్మ' శబ్దముచే సూచించబడుచున్నది. స్వప్రకాశమగు ప్రత్యగాత్మ యొక్క స్వరూపమే బ్రహ్మము.

**వ్యాఖ్య:** బాహ్యజగత్తు మిథ్య. దానికి అధిష్ఠానమగు సచ్చిదానందము బ్రహ్మశబ్ద సూచితము.

## పంచమప్రకరణము: సమాప్తము

# షష్ఠము : చిత్రదీప ప్రకరణము

**యథా చిత్రపటే దృష్టమవస్థానాం చతుష్టయమ్ ।**
**పరమాత్మని విజ్ఞేయం తథాఽవస్థాచతుష్టయమ్ ॥1॥**

*1. చిత్రపటములు చిత్రికరించుటయందు నాలుగు అవస్థలను మనము గమనించినట్లే పరమాత్మపై జరుగు జగద్రచన యందు కూడా నాలుగు అవస్థలను తెలియవలెను.*

**వ్యాఖ్య:** అవ్యక్తము అచింత్యము అగు బ్రహ్మమునకు బదులు ఇంద్రియ గోచరము అపారవైవిధ్య సంపన్నము అగు ఈ జగత్తును మనము చూచుచుండుట ఎట్లు జరుగుచున్నది? ఆరోపించుట వలన. తెల్లని కాగితముపై గాని వస్త్రముపైగాని వివిధ వర్ణములను ఆరోపించుట వలన మనము ఇక కాగితమును గాని వస్త్రమును గాని చూడము. వానిపై ఆరోపించబడిన పర్వతములను నదులను వృక్షములను ప్రాణిజాతమును చూచుచు 'ఎంత మనోహరమైన చిత్రము' అని ఆనందించుచు మైమరచి పోవుదుము. శ్రద్ధాయుతమగు వివేచన వలనగాని ఆ చిత్రమంతా శుద్ధ వస్త్రము పైని రంగురంగుల విన్యాసమే అని మనస్సునకు తోచదు. అట్లే జనన మరణములు జరావ్యాధులు సుఖదుఃఖములతో నిండి మనలను సమ్మోహపరచు ఈ జగత్తు కూడా శుద్ధము ఆనందస్వరూపము అగు బ్రహ్మముపై ఆరోపింపబడిన అజ్ఞానపు విన్యాస వైచిత్ర్యమే. వస్త్రమును రంగులను వివేచించినట్లే బ్రహ్మమును అజ్ఞానవికారములను వివేచించి తత్త్వమును తెలియవలెను. ఈ రెండు ప్రక్రియలకే అద్వైత శాస్త్రమున 'అధ్యారోపము-అపవాదము' అని పరిభాష.

**యథా ధౌతో ఘట్టితశ్చ లాంఛితో రంజితః పటః ।**
**చిదంతర్యామీ సూత్రాత్మా విరాట్ చాత్మా తథేర్యతే ॥2॥**

*2.* చిత్రీకరించడంలో వస్త్రము, బిగువునిచ్చుట, రేఖాచిత్రము, వర్ణ చిత్రము అనే నాలుగు అవస్థలున్నవి. జగద్రచనలో కూడా అట్లే శుద్ధ బ్రహ్మము (చిత్) అంతర్యామి సూత్రాత్మ విరాట్టు అను నాలుగు అవస్థలు గలవు.

**స్వతః శుభ్రోఽత్ర ధౌతః స్యాద్ఘట్టితోఽన్నవిలేపనాత్ ।**
**మష్యాకారైర్లాంఛితః స్యాద్రఙ్జితో వర్ణపూరణాత్ ॥3॥**

*3.* వర్ణచిత్రమునకు ఆధారమైన వస్త్రము ఇతర ద్రవ్యములతో సంయోగము లేనపుడు శుభ్రముగ ఉండును. దానినే ధౌత వస్త్రమంటాము. గంజిపెట్టుట వలన అది బిగువు పొందును. అది సిరా మొదలగు వానిచే రేఖలతో లాంఛిత మగును. ఈ రేఖాచిత్రమున తగినట్లు వర్ణములు నింపుట వలన వర్ణ చిత్రము సిద్ధమగుచున్నది.

**స్వతశ్చిదంతర్యామీ తు మాయావీ సూక్ష్మసృష్టితః ।**
**సూత్రాత్మా స్థూలసృష్ట్యైవ విరాడిత్యుచ్యతే పరః ॥4॥**

*4.* పరము, అనగా పరమాత్మ బ్రహ్మము, స్వరూపమున శుద్ధచైతన్యము. మాయ-విరహితమైనది. మాయా-సమన్వితమైన బ్రహ్మము ఈశ్వరుడు అంతర్యామి అనబడుచున్నది. మాయాకార్యమగు అపంచీకృత భూతకార్యమగు సమష్టి సూక్ష్మశరీరమును ఉపాధిగ జేసికొని హిరణ్యగర్భుడు సూత్రాత్మ అనబడుచున్నది. అట్లే పంచీకృత భూతకార్యమగు సమష్టి స్థూలశరీరము ఉపాధియైనపుడు విరాట్ అనబడుచున్నది.

**బ్రహ్మాద్యాః స్తంబపర్యంతాః ప్రాణినోఽత్ర జడా అపి ।**
**ఉత్తమాధమ భావేన వర్తన్తే పటచిత్రవత్ ॥5॥**

*5.* పటచిత్రమునందు బ్రహ్మవిష్ణువు మొదలగు శ్రేష్ఠములైన చిత్రములు, నీరు తృణములు మొదలగు సామాన్య చిత్రములు ఉన్నట్లే శుద్ధ బ్రహ్మము నందును బ్రహ్మాది దేవతలు గడ్డి గరిక వంటి సామాన్య ద్రవ్యములు ఆరోపింపబడుచున్నవి. బ్రహ్మ మొదలు గరిక వరకు చేతనాత్మకము, ఉత్తమము. పర్వతములు నదులు మొదలగునవి జడాత్మకములు, అధమములు.

**చిత్రార్పిత మనుష్యాణాం వస్త్రాభాసాః పృథక్ పృథక్ ।**
**చిత్రాధారేణ వస్త్రేణ సదృశా ఇవ కల్పితాః ॥6॥**

*6. ఈ పటచిత్రమునందలి మనుష్యులకు మరల వివిధములగు వస్త్రములు, చిత్రమునకు ఆధారమైన వస్త్రము వంటివే, కల్పింపబడును. ఆ కల్పిత వస్త్రములు వస్త్రాభాసలు.*

**పృథక్ పృథక్ చిదాభాసాః చైతన్యాధ్యస్త దేహినామ్ ।**
**కల్ప్యంతే జీవనామానో బహుధా సంసరం త్యమీ ॥7॥**

*7. అట్లే శుద్ధ చైతన్యమునందు ఆరోపింపబడిన బ్రహ్మాది శరీరములకు శుద్ధ చైతన్యమువంటి చైతన్యములు అనగా చిదాభాసలు, కల్పింపబడుచున్నవి. ఈ చిదాభాసలకే జీవులని పేరు. ఈ జీవులే బహు విధములుగా సంసార చక్రమున పరిభ్రమింతురు. (నిర్వికారమగు బ్రహ్మమునకు సంసరణము లేదని భావము).*

**వస్త్రాభాసస్థితాన్ వర్ణాన్ యద్వదాధార వస్త్రగాన్ ।**
**వదన్త్యజ్ఞా స్తథా జీవసంసారం చిద్గతం విదుః ॥8॥**

*8. అజ్ఞానులు కల్పితవస్త్రముల యందలి రంగులనే, చిత్రమునకు ఆధారమైన వస్త్రము వలె నిజమైన వస్త్రములుగ భావింతురు. అట్లే పరమాత్మ యందు ఆరోపింపబడిన జీవులు, చిదాభాసలు, జన్మమృత్యు సంసారమున తిరుగుచుండగా అజ్ఞానులు పరమాత్మయే సంసారచక్రమున భ్రమించు చున్నదని భావిస్తారు.*

**చిత్రస్థ పర్వతాదీనాం వస్త్రాభాసో న లిఖ్యతే ।**
**సృష్టిస్థ మృత్తికాదీనాం చిదాభాసస్తథా నహి ॥9॥**

*9. పటచిత్రమునందలి పర్వతములు మొదలగు వానికి వస్త్రాభాసలు, కల్పితవస్త్రములు, చిత్రింపబడవు. అట్లే సృష్టియందలి మట్టి, శిలలు మొదలగు వానికి చిదాభాస కూడా ఉండదు.*

**సంసారః పరమార్థోఽయం సంలగ్నః స్వాత్మవస్తుని ।**
**ఇతి భ్రాన్తి రవిద్యా స్యా ద్విద్యయైషా నివర్తతే ॥10॥**

*10. ఈ సంసారము పరమ సత్యము, పరమాత్మకు చెందినది అనే భ్రాంతియే అవిద్య. విద్యచే ఇది నివారింపబడుచున్నది.*

**ఆత్మాభాసస్య జీవస్య సంసారో నాత్మవస్తునః ।**
**ఇతి బోధో భవేద్విద్యా లభ్యతేఽసౌ విచారణాత్ ॥11॥**

*11. 'ఆత్మాభాసయగు జీవునిదే సంసారము. పరమాత్మది కాదు' అనే జ్ఞానమే విద్య. విచారణ వలన ఈ జ్ఞానము కలుగును.*

**సదా విచారయేత్తస్మా జ్జగజ్జీవ పరాత్మనః ।**
**జీవ భావ జగద్భావ బాధే స్వాత్మైవ శిష్యతే ॥12॥**

*12. కనుక సర్వదా జీవుడు జగత్తు పరమాత్మలను గూర్చి విచారింప వలెను. జీవుడనే భావము జగత్తు అనే భావము బాధ చెందినపుడు ప్రత్యగాత్మ స్వరూపమగు పరమాత్మయే మిగులును. బాధ అనగా అవి సత్యమనే భావము నశించుట.*

**నా ప్రతీతిస్త యోర్బాధః కింతు మిథ్యాత్వ నిశ్చయః ।**
**నో చే త్సుషుప్తి మూర్ఛాదౌ ముచ్యేతాయత్నతో జనః ॥13॥**

*13. అవి బాధ చెందుట అనగా ఇంద్రియ గోచరములు కాకుండుట కాదు. కాగా, అవి మిథ్య అనే దృఢనిశ్చయమే బాధ. అట్లు కానిచో సుషుప్తి మూర్ఛ మొదలగు అవస్థలయందు ఏ ప్రయత్నము లేకయే మానవుడు ముక్తి నొందవచ్చును గదా! (జీవజగత్తులు ఇంద్రియగోచరములు కాకుండుటయే బాధయైనచో గాఢనిద్రయందు ఏమీ గోచరింపదు. అపుడు తత్త్వజ్ఞానము లేకయే ముక్తి కలుగవలెను. కాని అట్లు జరుగుట లేదు. కనుక బాధ అనగా మిథ్యాత్వ నిశ్చయమని నిర్ధారణము.)*

**పరమాత్మావశేషోఽపి తత్సత్యత్వ వినిశ్చయః ।**
**స జగద్విస్మృతిర్నో చే జ్జీవన్ముక్తిర్న సంభవేత్ ॥14॥**

*14. 'పరమాత్మయే మిగులును' అనగా పరమాత్మయే సత్యము అనే దృఢ నిశ్చయము అని అర్థము. ఆ జీవజగత్తులు విస్మరింపబడునని కాదు. అట్లు కానిచో జీవన్ముక్తియే సంభవింపదు.*

**వ్యాఖ్య:** మనకు చలనచిత్ర దృశ్యములు కన్పించునట్లే జీవన్ముక్తునకు జగన్నాటకము కన్పించుచుండును. వెండి తెర ఒక్కటే సత్యము, దాని మీది సినిమా దృశ్యములన్నీ చలనచిత్రములే అనే జ్ఞానము మనకున్నట్లే జీవన్ముక్తునకు జగన్నాటకము బూటకమే అనీ పరబ్రహ్మమే సత్యమనీ తెలియును. జగత్తును మరచుటయే జ్ఞానమైనచో ఇట్టి జీవన్ముక్తి సంభవింపనే సంభవింపదు గదా!

**పరోక్షా చాపరోక్షేతి విద్యా ద్వేధా విచారజా ।**
**తత్రాపరోక్షవిద్యాప్తౌ విచారోఽయం సమాప్యతే ॥15॥**

*15. విచారణ వలన కలుగు జ్ఞానము రెండు విధములు, పరోక్షము అపరోక్షము అని, అపరోక్ష జ్ఞానము కలుగుటతో విచారణ సమాప్తి నొందును.*

**వ్యాఖ్య:** పరోక్ష జ్ఞానమనగా తర్కాది జనితమైన జ్ఞానము. అపరోక్ష జ్ఞానము అనుభవ జనితము. తేనెటీగలు కుట్టును అనే జ్ఞానము అందరికిని కలదు. సాక్షాత్తుగ తేనెటీగలచే కుట్టబడిన వ్యక్తికి కలుగు 'తేనెటీగలు కుట్టును' అనే జ్ఞానములోని విశిష్టత స్పష్టమే గదా!

**అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞానమేవ తత్ ।**
**అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారః స ఉచ్యతే ॥16॥**

*16. 'బ్రహ్మము ఉన్నది' అనే జ్ఞానము పరోక్షము మాత్రమే. 'నేనే బ్రహ్మమును' అనే జ్ఞానము అపరోక్షము. అదే సాక్షాత్కారము.*

**వ్యాఖ్య:** తైత్తిరీయ ఉపనిషత్తు 2.6. బృహదారణ్యక ఉపనిషత్తు 1.4-10 శాస్త్రాధ్యయనము వలన బ్రహ్మము కలదు అనే పరోక్షజ్ఞానము కలుగు చున్నది. మనలోని ప్రత్యగాత్మయే బ్రహ్మమనే అనుభవము కలుగుట అపరోక్ష జ్ఞానము.

**తత్సాక్షాత్కార సిద్ధ్యర్థ మాత్మ తత్త్వం వివిచ్యతే ।**
**యేనాయం సర్వ సంసారాతు త్సద్య ఏవ విముచ్యతే ॥17॥**

*17. ఆ సాక్షాత్కారము సిద్ధించుట కొరకు ఆత్మ తత్త్వము వివేచింప బడుచున్నది. ఈ ఆత్మసాక్షాత్కారముచే జీవుడు తత్క్షణమే సంసార చక్రము నుండి విముక్తి నొందును.*

**కూటస్థో బ్రహ్మ జీవేశావిత్యేవం చిచ్చతుర్విధా ।**
**ఘటాకాశమహాకాశౌ జలాకాశభ్రఖే యథా ॥18॥**

*18. ఘటము నందలి ఆకాశము, అనంతమగు మహాకాశము, జలము నందలి ఆకాశము, మేఘమునందలి ఆకాశము అని ఆకాశము నాలుగు విధములుగ తోచునట్లే, పరమార్థమున ఒకటియేయైన చిదాత్మ వ్యవహార దశయందు కూటస్థము, బ్రహ్మము, జీవుడు, ఈశ్వరుడు అనే నాలుగు విధములుగ భాసించును.*

**ఘటావచ్ఛిన్నఖే నీరం యత్తత్ర ప్రతిబింబితః ।**
**సాభ్ర నక్షత్ర ఆకాశో జలాకాశ ఉదీర్యతే ॥19॥**

*19. ఘటముచే సీమితమైన ఆకాశము నందలి నీటి యందు మేఘములు నక్షత్రములతో సహా ప్రతిఫలించిన ఆకాశము జలాకాశమనబడుచున్నది.*

**మహాకాశస్య మధ్యే యన్మేఘమండల మీక్ష్యతే ।**
**ప్రతిబింబతయా తత్ర మేఘాకాశో జలే స్థితః ॥20॥**

*20. ఆకాశము నందలి మేఘములందు గల నీటి కణముల యందు ప్రతిఫలించిన ఆకాశము మేఘాకాశము.*

**మేఘాంశరూపముదకం తుషారాకార సంస్థితమ్ ।**
**తత్ర ఖప్రతిబింబోఽయం నీరత్వాదనుమీయతే ॥21॥**

*21. మేఘమనగా ఒకానొక అవస్థ యందున్న జలమే. మంచు ఆకారమున ఉండును. జలము నందు ప్రతిఫలించినట్లే మేఘావస్థ యందున్న జలమునందు కూడా ఆకాశము ప్రతిఫలించునని అనుమానముచే తెలియుచున్నాము.*

**అధిష్ఠానతయా దేహద్వయావచ్ఛిన్న చేతనః ।**
**కూటవన్నిర్వికారేణ స్థితః కూటస్థ ఉచ్యతే ॥22॥**

*22. ఆధారమైన చైతన్యముపై స్థూల సూక్ష్మదేహములు రెండూ కూడా ఆరోపింపబడుచు చైతన్యమును సీమితము చేయుచున్నవి. కాని ఆ చైతన్యము మాత్రము కమ్మరి యొక్క ఇనుపకూటము వలె ఏ వికారమును పొందక ఉండును. ఈ నిర్వికారమైన చైతన్యమే కూటస్థము.*

**కూటస్థే కల్పితా బుద్ధిస్తత్ర చిత్ప్రతిబింబకః ।**
**ప్రాణానాం ధారణాజ్జీవః సంసారేణ స యుజ్యతే ॥23॥**

*23. కూటస్థ చైతన్యముపై బుద్ధి ఆరోపింపబడుచున్నది. ఆ బుద్ధి యందు ప్రతిఫలించిన చైతన్యము ప్రాణములను ధరించుటచే జీవుడనబడు చున్నది. ఈ జీవుడు జన్మమృత్యురూపమైన సంసారమున బద్ధుడగుచున్నాడు.*

**వ్యాఖ్య:** చైతన్యమునకు ఆద్యంతములు లేవనుట స్పష్టము. కాని జనన మరణములకు లోనగుచున్న చైతన్యమును చూడక మనకు తప్పుట లేదు. కనుక

జనిమృత్యు లక్షణమైన చైతన్యము వాస్తవ చైతన్యము కాదనీ అది చైతన్యాభాసమనీ సిద్ధాంతము చేయబడినది. ప్రాణములతో కూడిన ఈ చైతన్యాభాసకే జీవుడని పేరు.

**జలవ్యోమ్నా ఘటాకాశో యథా సర్వస్తిరోహితః ।**
**తథా జీవేన కూటస్థః సోఽన్యోన్యాధ్యాస ఉచ్యతే ॥24॥**

*24. జలాకాశముచే ఘటాకాశము సంపూర్ణముగా ఆవరింపబడి కనుపింప కుండునట్లు జీవునిచే కూటస్థము సర్వదా ఆవరింపబడి గోచరింపక ఉండును. వీనినే అన్యోన్యాధ్యాస అని అంటారు.*

**అయం జీవో న కూటస్థం వివినక్తి కదాచన ।**
**అనాది రవివేకోఽయం మూలాఽవిద్యేతి గమ్యతామ్ ॥25॥**

*25. ఈ అన్యోన్యాధ్యాస ఫలముగా జీవుడు ఎన్నటికిని కూటస్థమును గూర్చి వివేచింపక ఉండును. ఈ అవివేకము అనాదియైనది. దీనినే మూలావిద్య అంటారు.*

**విక్షేపావృత్తి రూపాభ్యాం ద్విధాఽవిద్యా వ్యవస్థితా ।**
**న భాతి నాస్తి కూటస్థ ఇత్యాపాదనమావృతిః ॥26॥**

*26. అవిద్యయందు రెండంశములున్నవి, విక్షేపము ఆవృతి అని. కూటస్థము ప్రకాశింపదు, కనుక అసలు లేదు అని ఆరోపించుట ఆవృతి.*

**వ్యాఖ్య:** అవిద్యా ఫలముగ మనము నిత్యసత్యమైన బ్రహ్మమును గ్రహింపక తత్కాల సత్యమైన జగత్తును చూచుచున్నాము. అవిద్యను విశ్లేషించినచో ఉన్నదానిని చూడకపోవుట, లేని దానిని చూచుట అనే రెండు ప్రక్రియలను గమనింపగలము. మొదటి దానికి ఆవరణమనీ రెండవ దానికి విక్షేపమనీ పేర్లు. అవిద్య యొక్క ఆవరణ ప్రభావముచే ఉన్న కూటస్థము తిరోహితమగుచున్నది. దాని విక్షేప ప్రభావముచే స్థూలసూక్ష్మాది శరీరములు జీవులు కన్పించుచున్నవి.

**అజ్ఞానీ విదుషా పృష్టః కూటస్థం న ప్రబుధ్యతే ।**
**నభాతి నాస్తి కూటస్థ ఇతి బుద్ధ్వా వదత్యపి ॥27॥**

*27. లోకానుభవమున కూడా అజ్ఞానియైన పురుషుని విద్వాంసుడు కూటస్థమును గూర్చి అడిగినచో అతడు 'నాకు తెలియద'నును. అంతే గాక 'ఈ కూటస్థము తెలియబడుట లేదు గదా, అసలు లేనేలేదు' అని తలచి అట్లే*

*ప్రత్యుత్తరమిచ్చును కూడా. తెలియకపోవుట అవిద్య. ప్రకాశింపకపోవడం లేదనుట, ఆవరణము.*

**స్వప్రకాశే కుతోఽవిద్యా తాం వినా కథమావృతిః ।**
**ఇత్యాది తర్కజాలాని స్వానుభూతిర్గ్రసత్యసౌ ॥28॥**

*28. కూటస్థము స్వయముగా భాసించినచో అవిద్య ఎట్లుండును? అవిద్యయే లేనిచో ఇక ఆవరణమెట్లు? మొదలైన తర్కవితర్కములన్నీ స్వానుభవముచే మ్రింగివేయబడును.*

**వ్యాఖ్య:** తార్కికముగ అసంభవములైనవి ఎన్నో అనుభవమునకు వచ్చు చున్నవి. ఆ అనుభవమును సమర్థించుటకు క్రొత్త తర్కములను ఆవిష్కరింప బడుచున్నవి. గాలి కంటే బరువైన వస్తువులు గాలిలో ఎగురగలుగుట తార్కికముగ అసంభవము. కాని పక్షులు విమానములు ఎగురుచున్నవి. దీనిని సమర్థించుటకు ఒక క్రొత్త శాస్త్రము. అట్లే స్వప్రకాశమైన కూటస్థము దానిని ఆవరించిన అవిద్య ఏకకాలమున ఉండుట తార్కికముగ అసంభవము. కాని వస్తుస్థితి అట్టిదే. పరమాత్మ సాక్షాత్కారము నొందిన వ్యక్తులకు దీని యందలి ఆనుపానులన్నీ అవగత మగును. నహిదృష్టే అనుపపన్నం నామ. సాక్షాత్తుగ చూడబడుచున్న విషయము నందు 'ఇది యుపపన్నము కాదే' అనే ప్రశ్నయే ఉండదు.

**స్వానుభూతావవిశ్వాసే తర్కస్యాప్యనవస్థితేః ।**
**కథం వా తార్కికం మన్యస్తత్త్వ నిశ్చయ మాప్నుయాత్ ॥29॥**

*29. స్వానుభవమునందు విశ్వాసము లేనిచో తర్కము అంతిమ నిర్ధారణను ఇవ్వజాలనందున, తార్కికులకు తత్త్వనిశ్చయమెట్లు లభించును? లభింపదు.*

**వ్యాఖ్య:** ఎంత సూక్ష్మ తర్కమును అవలంబించి ఒకరు సిద్ధాంతము చేసినను, అతని కంటె బుద్ధిశాలురు మరింత సూక్ష్మతర్కముచే విపరీత సిద్ధాంతము చేయగలరు. ఇది తార్కికులంగీకరించిన విషయమే. కనుక తత్త్వనిర్ధారణలో కేవల తర్కముపై విశ్వాసముంచలేము. ఇక అనుభవమును కూడా విశ్వసింపనిచో తత్త్వ నిశ్చయమునకు మార్గమే లేకపోవును. కనుక అనుభవమును విశ్వసించి దాని యందలి లోపదోషములను తొలగించి నిష్కర్షచేయుటకు మాత్రమే తర్కము ఉపయోగపడును. ఇట్లు తర్కము యొక్క పరిధిని గుర్తించి సదుపయోగము చేయవలెనే గాని కేవలము తర్కించుట వలెననే ప్రయోజనము సాధింపబడదు.

**బుద్ధ్యారోహాయ తర్క శ్చేదపేక్షేత తథా సతి ।**
**స్వానుభూత్యనుసారేణ తర్క్యతాం మా కుతర్క్యతామ్ ॥30॥**

*30. అనుభూత విషయము సంభవమే అని తెలిసికొనుటకు తర్కము ఆవశ్యకమైనచో అనుభవమును అనుసరించి తర్కించు. కుతర్కములు చేయకు.*

**వ్యాఖ్య:** అనుభూత విషయము ఎట్లు అనుభవమునకు వచ్చినదో తెలిసికొనిన ఇచ్ఛానుసారము ఆ అనుభవమును సంపాదించుకొనగలము. ఇట్టి జ్ఞానమును సంపాదించుటకు తర్కము అవసరమే. ఇట్టి తర్కము అనుభవమును అనుసరించి నడచునే గాని పిడివాదములచే నడవదు. పక్షులెగురుట అనే అనుభవమును స్వీకరించి తర్కించి మానవుడు విమానముల నెక్కి తానును ఎగురగలుగు చున్నాడు. అట్లే బ్రహ్మవిదుల అనుభవమును స్వీకరించి సుతర్కము చేసి వారి అనుభవమును మనము కూడా సంపాదించుకొనవలెనే గాని కుతర్కములు చేయుట నిరర్థక ప్రయాస.

**స్వానుభూతి రవిద్యాయామావృతౌ చ ప్రదర్శితా ।**
**అతః కూటస్థ చైతన్య మవిరోధీతి తర్క్యతామ్ ॥31॥**

*31. మనము అవిద్యను అనుభవించుచుండుట ఆ అవిద్య మన చైతన్యానుభవమును ఆవరించి ఉండుట ముందే చూపబడినది. కనుక కూటస్థ చైతన్యమునకు విరోధము లేదని తర్కింపుము. అనగా కూటస్థ చైతన్యము, అవిద్య  ఏక కాలముననే ఉండుట సంభవమే అని స్వీకరింపవలెను.*

**వ్యాఖ్య:** మనము చైతన్యవంతులము అని అనుటలో ఎవరికీ సంశయము లేదు. తెలియనిది కాదు. కాని మనలోని ఏ అంశము చైతన్యము? అని ప్రశ్నించినచో సమాధానము మనకు తెలియదు. శరీరమా? మనస్సా? బుద్ధియా? వీటన్నిటికంటె విలక్షణమైన మరియొకటియా? ఇట్లు మనయందున్న చైతన్యపు అనుభవము దాని స్వరూపమును గూర్చిన యవిద్యయు నేకకాలముననే యుండుచున్నవి. కనుక వానికి విరోధము లేదు.

**తచ్ఛేద్విరోధి కేనేయమావృతిర్హ్యనుభూయతామ్ ।**
**వివేకస్తు విరోధ్యస్యాస్తత్త్వజ్ఞానిని దృశ్యతామ్ ॥32॥**

*32. కూటస్థ చైతన్యమునకే అవిద్యతో విరోధమైనచో అవిద్య ఉన్నదనే*

*అనుభవం ఎవరికి కలుగుచున్నది? (అవిద్యను గూర్చిన ప్రతీతియే లేక పోవునని భావము.) కాని వివేకము అవిద్యకు విరోధి. తత్త్వజ్ఞానుల యందు అవిద్య లేకుండుటను చూడుము.*

**వ్యాఖ్య:** వివేకమనగా ఉపనిషద్విచారణ జన్యమైన జ్ఞానము. ఈ జ్ఞానము అవిద్యను తొలగించును. దానితో అవిద్యాకార్యములైన స్థూల సూక్ష్మకారణ శరీరముల బోధ కూడా తొలగి కూటస్థ చైతన్యపు నిరంతరాయమైన బోధ కలుగును. ఇట్టి బోధ కలిగినవారే తత్త్వజ్ఞానులు.

మాయను ఉపాధిగ స్వీకరించిన బ్రహ్మము ఈశ్వరుడనీ అవిద్యను ఉపాధిగ స్వీకరించిన బ్రహ్మము జీవుడనీ ముందు (ప్ర. 1.16,17) చెప్పబడినది. ఈ అవిద్యయే కారణ శరీరము. అవిద్యకు గల ఆవరణ శక్తి వలన కూటస్థ చైతన్యమును గూర్చిన బోధ ఆవరింపబడుచున్నది. విక్షేప శక్తి వలన అవిద్యా కల్పితములైన సూక్ష్మ స్థూల శరీరములు భాసించుచున్నవి. సూక్ష్మశరీరమున, అనగా అంతఃకరణమున, ప్రతిఫలించిన కూటస్థ చైతన్యము చిదాభాసుడు అనబడుచున్నాడు. ఇదే 'జీవుడు' అని వ్యవహారము. ఈ విక్షేపశక్తియే అన్యోన్యాధ్యాస, అధ్యాస, అధ్యారోపము అనీ తెలియబడుచున్నది.

ఉపనిషదుపదేశములను చక్కగా వివేచించి విచారించి అనుభవమునకు తెచ్చుకొను ప్రయత్నము చేసినచో వివేకము కలిగి అవిద్య తొలగి ప్రత్యక్ చైతన్య బోధ అనుభవగతమగును.

కేవలము ఉపనిషద్ గ్రంథములను మాత్రము అధ్యయనము చేసినచో కలుగునది పరోక్ష జ్ఞానము. అది సాపేక్షికము (Relative). దీని వలన మనకు అజ్ఞానము, అవిద్య కలదు అని మాత్రము బోధపడును. అవిద్యకు ఈ జ్ఞానము విరోధి కాదు. కనుకనే సాధారణ పండితులు విద్వాంసులయందు అపారమైన తాత్త్విక పాండిత్యమున కూటస్థచైతన్య బోధరాహిత్యమును ఏకకాలమున చూచుచున్నాము.

ఉపనిషత్తులు ఉపదేశించిన మార్గమును అవలంబించి అభ్యసించిన వారియందు కూటస్థ చైతన్యపు దివ్య ప్రకాశమును అవిద్యా రాహిత్యమును మనము చూడగలుగుదుము. వారిముందు కేవల పండితప్రకాండులు సూర్యుని ముందు దివిటీల వలె వెలవెల బోవుదురు గదా! ఇట్టి తత్త్వదర్శులకు కలిగిన జ్ఞానము అపరోక్ష జ్ఞానమను బడుచున్నది. ఇది చైతన్యానుభవజన్యమైన జ్ఞానము.

కనుక బోధ స్వరూపమైన కూటస్థచైతన్యము అజ్ఞానము, అవిద్యతో ఏకకాలమున ఉండుట అసంభవమేమీ కాదు. కాగా అవసరము కూడా. అవిద్య ఉన్నదని తెలిసిననే దానిని తొలగించే ప్రయత్నము జరుగును. అవిద్యను గూర్చిన జ్ఞానము కూడా లేని మనుష్యులు ఇతర జంతువుల వలెనే పుట్టుచు చచ్చుచు సంసార చక్రమున తిరుగుచుందురు.

**అవిద్యావృతకూటస్థే దేహద్వయయుతా చితిః ।**
**శుక్తౌ రూప్యవదధ్యస్తా విక్షేపాధ్యాస ఏవ హి ॥33॥**

*33. అవిద్య యొక్క ఆవరణ శక్తిచే ఆవరింపబడిన కూటస్థ చైతన్యముపై సూక్ష్మ స్థూల శరీరములు విక్షేపశక్తి వలన కల్పింపబడుచున్నవి. ఇదే విక్షేపాధ్యాస. ముత్యపు చిప్పపై రజతము ఆరోపింపబడినట్లే కూటస్థ చైతన్యముపై శరీరత్రయము అధ్యస్తమగుచున్నది.*

**వ్యాఖ్య:** అధ్యాసకు, అనగా ఒక వస్తువును మరొక వస్తువుగా భ్రమపడుటకు, అద్వైత వేదాంతమున అవిద్య కారణముగా చెప్పబడినది. అవిద్యకు గల ఆవరణ శక్తి మొదట వస్తు స్వరూపమును కప్పిపుచ్చును. దానికి బదులుగా మరొక వస్తువు యొక్క అభాసను విక్షేప శక్తి సృష్టించును. ఆవరణశక్తి ముత్యపు చిప్ప నిజస్వరూపమును కప్పిపుచ్చగా, విక్షేపశక్తి దాని స్థానమున రజతాభాసను కల్పింపగా, మనకు ముత్యపు చిప్పకు బదులు రజతము కన్పించుచున్నది.

**ఇద మంశశ్చ సత్యత్వం శుక్తిగ రూప్య ఈక్ష్యతే ।**
**స్వయంత్వం వస్తుతా చైవం విక్షేపే వీక్ష్యతేఽన్యగమ్ ॥34॥**

*34. 'ఇది రజతము' అనే భ్రాంతియందు వాస్తవముగ చూడబడినది ముత్యపు చిప్పయే. అదే సత్యముగ చూడబడినది. కాని ఈ సత్యత్వము వాస్తవమునకు లేనట్టి రజతమునకు అన్వయింపబడినది. అట్లే కూటస్థ చైతన్యపు వస్తుత్వము స్వయంత్వము అనునవి కల్పితములైన శరీరములకు, అనగా జీవునకు, అవిద్యచే అన్వయింపబడుచున్నవి.*

**నీలపృష్ఠ త్రికోణత్వం యథా శుక్తౌ తిరోహితమ్ ।**
**అసంగానందతాద్యేవం కూటస్థేఽపి తిరోహితమ్ ॥35॥**

*35. ముత్యపు చిప్ప యొక్క నల్లటి వెనుక భాగము, త్రికోణాకారము అదృశ్యములైనట్లే, కూటస్థ చైతన్యపు అసంగత్వము, ఆనందము మొదలగునవి కూడ అవిద్యావరణ వలన భాసింపవు.*

**ఆరోపితస్య దృష్టాంతే రూప్యం నామ యథా తథా ।**
**కూటస్థాధ్యస్తవిక్షేపనామాహమితి నిశ్చయః ॥36॥**

*36. ఉదాహరణమున ఆరోపింపబడినది రజతము. అట్లే విక్షేపశక్తిచే కూటస్థముపై ఆరోపింపబడినది అహంత 'నేను' అనే భావము.*

**ఇదమంశం స్వతః పశ్యన్ రూప్యమిత్యభిమన్యతే ।**
**తథా స్వం చ స్వతః పశ్యన్నహమిత్యభిమన్యతే ॥37॥**

*37. 'ఇది' అనునంశమును చూచుచు దానిని రజతమని భ్రమించును. అట్లే తనను తాను ఉద్దేశించుచు 'నేను' అని అభిమానపడును.*

**వ్యాఖ్య:** 'నేను' అనుకొనునపుడు మనస్సున ఉండునవి శరీర లక్షణములే, ఇంత అందగాడను, బలశాలిని, సంపన్నుడను, అధికారిని మొదలగునవి. 'ఇది రజతము' అనే భావములో 'ఇది' అని చూడబడినది ముత్యపు చిప్ప. కాని దానిపై ఆరోపింపబడినవి రజతలక్షణములు. అట్లే 'నేను' అనుటచే ఉద్దేశింపబడినది కూటస్థ చైతన్యమే. కాని దానిపై ఆరోపింపబడిన శరీర లక్షణములచే అహంత కలుగుచున్నది.

**ఇదంత్వరూప్యతే భిన్నే స్వత్వాహన్తే తథేష్యతామ్ ।**
**సామాన్యం చ విశేషశ్చఉభయత్రాపి గమ్యతే ॥38॥**

*38. 'ఇది' 'రజతము' అనే భావములు రెండు విభిన్న భావములు. అట్లే స్వత్వము అహంత అనునవి రెండు భిన్నములైన భావములని తెలియుము. ఇది, స్వత్వము అనునవి రెండును సామాన్యాంశములు. రజతము అహంత అనునవి విశేష భావములు.*

**వ్యాఖ్య:** ఇది అనే శబ్దము అన్ని వస్తువులకు అన్వయించునట్లే నేను అనే శబ్దము సకల మానవులకు జీవజాలమునకు అన్వయించును. కాని రజతము అహంతలు పరిమితమైన అన్వయముగలవి. బిచ్చగాడైనను చక్రవర్తియైనను 'నేను' అనే తనను తాను ఉద్దేశించును. కాని వారి అహంతలలోని భిన్నత వలన వైవిధ్యము అనుభూతమగును. అంతటను అన్వయించే భావము సామాన్యము. ఒక దానికి పరిమితమై విశేషముగ ఏర్పరచునది విశేష భావము.

**దేవదత్తః స్వయం గచ్ఛేత్త్వం వీక్షస్వ స్వయం తథా ।**
**అహం స్వయం న శక్నోమీత్యేవం లోకే ప్రయుజ్యతే ॥39॥**

*39.* దేవదత్తుడు స్వయముగ పోవుగాక, నీవు స్వయముగ చూడుము, నేను స్వయముగ చేయజాలను, ఇట్లు లోకమున ప్రయోగమున్నది గదా. (స్వయం శబ్దపు సామాన్యత్వము చూపబడినది.)

**ఇదం రూప్య మిదం వస్త్రమితి యద్వదిదం తథా ।**
**అసౌత్వ మహమిత్యేషు స్వయమి త్యభిమన్యతే ॥40॥**

*40.* ఇది వెండి, ఇది వస్త్రము మొదలగు వానిలో 'ఇది' సామాన్యమైనట్లే ప్రథమ మధ్యమ ఉత్తమ పురుషలు మూడును స్వయమని అభిమానించును.

**అహంత్వాద్భిద్యతాం స్వత్వం కూటస్థే తేన కిం తవ ।**
**స్వయం శబ్దార్థ ఏవైష కూటస్థ ఇతి మే భవేత్ ॥41॥**

*41.* (ఆక్షేపము) స్వత్వము అహంత కంటె భిన్నమగు గాక. దాని వలన కూటస్థమున కేమి లాభము? (సమాధానము) స్వయం శబ్దమునకు అర్థమే ఈ కూటస్థము.

**అన్యత్వవారకం స్వత్వమితి చేదన్యవారణమ్ ।**
**కూటస్థస్యాత్మతాం వక్తురిష్టమేవ హి తద్భవేత్ ॥42॥**

*42.* (ఆక్షేపము) స్వత్వము ఇతరములను వారించును గదా. కూటస్థము ను గూర్చి చెప్పుట లేదే. (సమాధానము) ఈ 'ఇతరములను వారించుట'యే కూటస్థము యొక్క ఆత్మత్వము. ఇది మాకు ఇష్టమే (సమ్మతమే).

**స్వయమాత్మేతి పర్యాయై తేన లోకే తయోః సహ ।**
**ప్రయోగో నాస్త్యతః స్వత్వమాత్మత్వం చాన్య వారకమ్ ॥43॥**

*43.* 'స్వయం' 'ఆత్మ' అనునవి పర్యాయ పదములు. కనుకనే లోకమున ఈ రెండింటికి ఏకకాలమున ప్రయోగము లేదు. ఇవి రెండూ ఇతర భావములను వారించును.

**ఘటః స్వయం న జానాతీత్యేవం స్వత్వం ఘటాదిషు ।**
**అచేతనేషు దృష్టం చేత్దృశ్యతామాత్మ సత్త్వతః ॥44॥**

*44.* (ఆక్షేపము) 'ఘటము స్వయముగ తెలియజాలదు' మొదలైన ప్రయోగములందు కుండ మొదలగు అచేతనములందు కూడ స్వత్వము కనబడుచున్నది గదా. (సమాధానము) అట్లే. ఆత్మసత్తయే అచేతనములకు కూడా ఆశ్రయమగుట చేత వానియందు కూడా స్వత్వము కన్పించును.

**వ్యాఖ్య:** ఉన్నది సర్వవ్యాపియైన బ్రహ్మమే. అవిద్యా ఉపాధియందలి శుద్ధ మలిన తారతమ్యముల వలన కొన్ని ఉపాధులయందు బ్రహ్మము ప్రతిఫలించి చిదాభాసలు, అనగా జీవులు చేతనములు, భాసించును. కొన్ని ఉపాధుల యందు ప్రతిఫలింపక అచేతనములుగ భాసించును.

**చేతనాచేతనభిదా కూటస్థాత్మకృతా న హి ।**
**కింతు బుద్ధికృతాభాసకృతైవే త్యవగమ్యతామ్ ॥45॥**

*45. చేతనము అచేతనము అనే భేదము కూటస్థమగు ఆత్మ వలన కలుగుట లేదు. ప్రతిఫలన సాధనమగు బుద్ధి, అంతఃకరణము, వలన ప్రతిఫలనమగు అభాసల వలన మాత్రమే అని తెలియును.*

**యథా చేతన ఆభాసః కూటస్థే భ్రాంతికల్పితః ।**
**అచేతనో ఘటాదిశ్చ తథా తత్రైవ కల్పితః ॥46॥**

*46. కూటస్థము నందు భ్రాంతి ద్వారా చేతనమనే అభాస కల్పితమగు చున్నట్లే కుండ మొదలగు అచేతనములనే అభాసలు కూడా కూటస్థమునందు భ్రాంతిచే కల్పింపబడుచున్నవి. చేతనములు, అచేతనములు రెండింటికీ ఆశ్రయము కూటస్థ బ్రహ్మమే అని భావము.*

**తత్తేదంతే అపి స్వత్వమివ త్వమహమాదిషు ।**
**సర్వత్రానుగతే తేన తయోరప్యాత్మతేతి చేత్ ॥47॥**

*47. (ఆక్షేపము) స్వత్వశబ్దము వలె ఇది అది అనే శబ్దములు కూడా నీవు, నేను, అతడు అనే మూడు పురుషల యందూ అన్వయించుటచే అవి కూడా ఆత్మార్థకములగును కదా.*

**తే ఆత్మత్వేఽప్యనుగతే తత్తేదంతే తతస్తయోః ।**
**ఆత్మత్వం నైవ సంభావ్యం సమ్యక్త్వాదేర్యథాతథా ॥48॥**

*48. (సమాధానము) ఇది అది అనే పదములు మూడు పురుషల యందు మాత్రమే గాక ఆత్మయందు కూడా అన్వయించును. కనుక అవి సమీచీనత్వము వలె విస్తృతతరమైన అర్థము గలవి. అందుచే అది ఇది అనే పదములు ఆత్మార్థకములు కావు.*

**తత్తదంన్తే స్వత్వాన్యత్వే త్వన్తాహన్తే పరస్పరమ్ ।**
**ప్రతిద్వంద్వితయా లోకే ప్రసిద్ధే నాస్తి సంశయః ॥49॥**

*49. అంతేగాక, ఇది అది, ఆత్మ ఇతరము, నీవు నేను, అనునవి పరస్పర వ్యతిరేక పదములని లోకమున ప్రసిద్ధమే. అందు సంశయమేమియు లేదు.*

**వ్యాఖ్య:** ఇది, అది అనే పదములు ఆత్మార్థకములు కావనుట ప్రాసంగికముగ చెప్పబడినవి. ఇక ముఖ్యాంశమగు విక్షేపశక్తి.

**అన్యతాయాః ప్రతిద్వంద్వీ స్వయం కూటస్థ ఇష్యతామ్ ।**
**త్వన్తాయాః ప్రతియోగ్యేషోఽహ మిత్యాత్మని కల్పితః ॥50॥**

*50. అన్యత యొక్క ప్రతిద్వంద్వి స్వయంత. అదే కూటస్థము. త్వంత ('నీవు' అనే భావము) యొక్క ప్రతిద్వంద్వి అహంత. ఇదే అహంకారము, జీవుడు. ఇదే కూటస్థముపై ఆరోపింపబడినది.*

**వ్యాఖ్య:** ఆత్మ అనగా రెండు విధములుగ అర్థమగును. అవి కార్యము కూటస్థమగు ఆత్మ, వ్యవహారము నడపు అహంత, జీవుడు.

**అహన్తా స్వత్వయోర్భేదే రూప్యతేదన్తయోరివ ।**
**స్పష్టేపి మోహమాపన్నా ఏకత్వం ప్రతిపేదిరే ॥51॥**

*51. వెండికి 'ఇది'కి గల వ్యత్యాసము స్పష్టమైనట్లే, అహంతకును ఆత్మకు గల భేదము స్పష్టమే. కాని మోహగ్రస్తులైన జనులు అహంకారమునే ఆత్మగా భావింతురు.*

**వ్యాఖ్య:** ముత్యపుచిప్పను చూచి భ్రాంతితో 'ఇది వెండి' అనుకొనునపుడు 'ఇది' అనగా చూడబడిన వస్తువును ఉద్దేశించును. 'వెండి' అనే భావం పొరపాటు. ఇట్టి పొరపాటు వలననే జనులు ఆత్మను అహంకారముగా భ్రమింతురు.

**తాదాత్మ్యాధ్యాస ఏవాత్ర పూర్వోక్తావిద్యయా కృతః ।**
**అవిద్యాయాం నివృత్తాయాం తత్కార్యం వినివర్తతే ॥52॥**

*52. అవిద్య చేతనే ఇట్లు అహంతకు, ఆత్మకు తాదాత్మ్యాధ్యాస కల్పింప బడినదని పూర్వమే (19 నుండి 34 వరకు) చెప్పబడినది. ఈ అజ్ఞానము తొలగింపబడినపుడు దాని కార్యమగు అధ్యాస కూడా తొలగింపబడును.*

**అవిద్యావృతి తాదాత్మ్యే విద్యయైవ వినశ్యతః ।**
**విక్షేపస్య స్వరూపం తు ప్రారబ్ధ క్షయమీక్షతే ॥53॥**

*53.* *ఆత్మ స్వరూపము యొక్క ఆవరణము, తాదాత్మ్యాధ్యాస రెండూ (అవిద్యచే కల్పింపబడినవగుటచే) విద్య చేతనే నశించును. కాని విక్షేపము యొక్క స్వరూపము ప్రారబ్ధక్షయము చేతనే నశించును.*

**వ్యాఖ్య:** ఆవరణము, అధ్యాసలకు కారణము కేవలము అవిద్య. కనుక అవి రెండూ విద్య చేతనే నశించును. కాని విక్షేపస్వరూపమైన స్థూలదేహము అవిద్యతో కూడిన ప్రారబ్ధ కర్మ వలన ఏర్పడినది. ఆ ప్రారబ్దము అంతమైతే గాని స్థూల దేహము నశింపదు.

కర్మ మూడు విధములు. సంచితము, ప్రారబ్ధము, ఆగామి, అని. పూర్వ జన్మములందు చేయబడి ఫలమనుభవింపవలసియున్న కర్మ 'సంచితము'. అనుభవం ఆరంభమై ఈ శరీరమును కల్పించినది 'ప్రారబ్ధకర్మ'. ఈ శరీరముచే చేయబడుచు ఇక మీద ఫలమును ఈయబోవునది 'ఆగామి' కర్మ. విద్యచే అనగా జ్ఞానముచే సంచిత ఆగామి కర్మలు నశించునుగాని ప్రారబ్ధము అనుభవము చేతనే క్షయించును. శరీరము ఇట్లు అనుభవించుచున్నను, జ్ఞానికి దానితో తాదాత్మ్యము ఉండదు. ఆ స్థితియే జీవన్ముక్తి.

**ఉపాదానే వినష్టేఽపి క్షణం కార్యం ప్రతీక్షతే ।**
**ఇత్యాహుస్తార్కికాస్తద్వదస్మాకం కిన్న సంభవేత్ ॥54॥**

*54.* *ఒక వస్తువు యొక్క ఉపాదాన కారణము నశించినను ఆ వస్తువు (కార్యము) మరుసటి క్షణమున కన్పించునని తార్కికులు వాదింతురు. అట్లే శరీరకారణమగు అజ్ఞానము నశించినా జ్ఞాని యొక్క శరీరము ఏల జీవించి ఉండదు? (చూ. ప్రశస్తపాదుల వైశేషికదర్శన భాష్యములో 1.1.12 పై వ్యాఖ్య)*

**తన్తూనాం దినసంఖ్యానాం తైస్తాదృక్ క్షణ ఈరితః ।**
**భ్రమస్యాసంఖ్య కల్పస్య యోగ్యః క్షణ ఇహేష్యతామ్ ॥55॥**

*55.* *కొన్ని దినములు మాత్రమే ఉండే వస్త్రము, దాని ఉపాదాన కారణమైన నూలుపోగులు నశించిన మరుసటి క్షణము వరకు ఉండునని తార్కికుల వాదము. జన్మజన్మముల నుండి ఉన్న అజ్ఞానము నశించిన పిదప కొంతకాలము శరీరం ఉండినచో అది క్షణతుల్యమే గదా.*

**వ్యాఖ్య:** కారణముతో సమమగు అనుపాతములో కార్యము కన్పింపవలెనని ఉద్దేశము. కుమ్మరి చక్రము తానై తిరుగుట కూడా ఈ సిద్ధాంతమున నిదర్శనము.

**వినా క్షోదక్షమం మానం తైర్వృథా పరికల్ప్యతే ।**
**శ్రుతి యుక్త్యనుభూతిభ్యో వదతాం కిన్ను దుఃశకమ్ ॥56॥**

*56. (ఆక్షేపము) తార్కికులు ఉపపత్తి లేకయే వ్యర్థముగ అట్లు కల్పించిరి. (సమాధానము) మేము శ్రుతియుక్తి అనుభవములు ఆధారముగా చెప్పితిమి. అందు అనుపపన్నమేమున్నది?*

**వ్యాఖ్య:** ఛాందోగ్యోపనిషత్తు 6.14.2 శ్రుతి. కుమ్మరి చక్రమును త్రిప్పుట ఆపి వెడలిపోయినా కొంత సమయము తిరుగుచుండు చక్రము యుక్తి. జ్ఞాని పురుషులు జీవించియుండుట అనుభవము.

**ఆస్తాందుస్తార్కికైః సాకం వివాదః ప్రకృతం బ్రువే ।**
**స్వాహమోః సిద్ధమేకత్వం కూటస్థ పరిణామినోః ॥57॥**

*57. పిడివాదపు తార్కికులతో వాదించి ప్రయోజనము లేదు. విషయమేమనగా స్వయం, అహం అనే పదములకు అర్థమగు కూటస్థము పరిణామి విషయముల ఏకత్వము భ్రాంతిచే కలుగుచున్నది.*

**భ్రామ్యంతి పండితం మన్యాః సర్వే లౌకిక తైర్థికాః ।**
**అనాదృత్య శ్రుతిం మౌర్ఖ్యాత్కేవలాం యుక్తిమాశ్రితాః ॥58॥**

*58. తామే పండితులమని భావించుకొనువారు శుష్క తార్కికులందరు శ్రుతి ప్రమాణమును నిర్లక్ష్యము చేసి మూర్ఖత్వముచే కేవల తర్కమును స్వీకరించి పరిభ్రమింతురు.*

**పూర్వాపర పరామర్శ వికలాస్తత్ర కేచన ।**
**వాక్యాభాసాన్స్వ స్వపక్షే యోజయన్త్య పృలజ్జయా ॥59॥**

*59. మరికొందరు శ్రుతి ప్రమాణమును అంగీకరించి కూడా పూర్వాపర శ్రుతి వాక్యములను సమన్వయించు శక్తి చాలక శ్రుతివాక్యములను సందర్భ శుద్ధి లేకయే తమ వాదములకు అన్వయించుటకు లజ్జింపరు. (వీరి వాదములు పైకి సమీచీనములనిపించినను పరీక్షకు నిలువవు.)*

**కూటస్థాది శరీరాంత సంఘాతస్యాత్మతాం జగుః ।**
**లోకాయతాః పామరాశ్చ ప్రత్యక్షాభాసమాశ్రితాః ॥60॥**

*60. లోకాయుతులు (భౌతికవాదులు) పామరజనులు ఇంద్రియ*

గోచరమైన ప్రత్యక్షమును, మిథ్యను, మాత్రమే ఆశ్రయించి కూటస్థము మొదలు శరీరము వరకు గల సంఘాతమును ఆత్మ అందురు.

**శ్రౌతీకర్తుం స్వపక్షం తే కోశమన్నమయం తథా ।**
**విరోచనస్య సిద్ధాంతం ప్రమాణం ప్రతిజజ్ఞిరే ॥61॥**

*61.* తమ వాదము వేదసమ్మతమని చెప్పుటకు వారు అన్నమయ కోశమును (*తైత్తిరీయ ఉప.2.1*) విరోచన సిద్ధాంతమును (*ఛాందోగ్య ఉప.8.8*) ప్రమాణముగ ఊటంకింతురు.

**జీవాత్మనిగమే దేహమరణస్యాత్ర దర్శనాత్ ।**
**దేహాతిరిక్త ఏవాత్మే త్యాహుర్లోకాయతాః పరే ॥62॥**

*62.* మరికొందరు లోకాయుతులు, జీవాత్మ శరీరమును వదలినపుడు శరీరము మరణించుట వలన, ఆత్మ నిశ్చయముగ శరీరము కంటె భిన్నమని తీర్మానింతురు.

**ప్రత్యక్షత్వేనాభిమతాహం దీర్దేహాతిరేకిణమ్ ।**
**గమయేదింద్రియాత్మానం వచ్మీత్యాదిప్రయోగతః ॥63॥**

*63.* వారు 'నేను మాటలాడుచున్నాను' మొదలగు ప్రయోగముల వలన దేహము కంటె భిన్నమగు అహం బుద్ధిని సూచించు ఇంద్రియములే ఆత్మయని చెప్పుదురు.

**వాగాదీనామింద్రియాణాం కలహః శ్రుతిషు శ్రుతః ।**
**తేన చైతన్యమేతేషామాత్మత్వం తత ఏవ హి ॥64॥**

*64.* వాక్కు మొదలగు ఇంద్రియముల కలహము వేదమునందు (*బృహదారణ్యక ఉప.6.1.7-14*) వినుదుము. కనుక ఇంద్రియములు చేతనములు. ఆ కారణముచే అవే ఆత్మయని వారి వాదము.

**హైరణ్యగర్భాః ప్రాణాత్మవాదిన స్త్వేవ మూచిరే ।**
**చక్షురాద్యక్షలోపేఽపి ప్రాణసత్త్వే తు జీవతి ॥65॥**

*65.* హిరణ్యగర్భ సంప్రదాయపు వారు ప్రాణములే ఆత్మయందురు. కన్నులు మొదలగు ఇంద్రియములు లేకున్నను ప్రాణములున్నచో జీవించును అని వారు ఎత్తి చూపుదురు.

**ప్రాణోజాగర్తి సుప్తేఽపి ప్రాణశ్రైష్ఠ్యాదికం శ్రుతమ్ ।**
**కోశః ప్రాణమయః సమ్యగ్విస్త రేణ ప్రపఞ్చితః ॥66॥**

*66. నిద్రయందు కూడ ప్రాణము మేలుకొనియే ఉండును. శ్రుతులును ప్రాణము శ్రేష్ఠమని చెప్పుచున్నవి. ప్రాణమయ కోశము సవిస్తరముగ ఉపదేశింపబడినది.*

చూ. బృహదారణ్యక ఉప. 1. 3. 7; 5. 13. 1 ఛాందోగ్య ఉప. 5. 1. ప్రశ్న ఉప. 2-3 (4. 3) తైత్తిరీయ ఉప. 2. 2. 1

**మన ఆత్మేతి మన్యన్త ఉపాసనపరా జనాః ।**
**ప్రాణస్యాభోక్తృతా స్పష్టా భోక్తృత్వం మనసస్తతః ॥67॥**

*67. ఉపాసనా పరులైన జనులు మనస్సే ఆత్మయందురు. సుఖదుఃఖములను, అనుభవించే శక్తి మనస్సునకు గలదు. ప్రాణమునకు ఆశక్తి లేదని స్పష్టముగ తెలియుచున్నది గదా. కనుక భోక్తృత్వము గల మనస్సే ఆత్మయని వారి వాదము.*

**వ్యాఖ్య:** ఇది నారద పంచరాత్ర సంప్రదాయము. ప్రాణము ఆత్మ కాదనుటకు అందు ఎన్నో కారణములు చూపబడినవి. అది వాయువు మాత్రమే. నిద్రలో కూడా ప్రాణము పనిచేసినా అది శరీరమును గాని బాహ్య విషయమును గాని అనుభవింప జాలదు. ప్రాణము పోయినచో శరీరము మరణించును. జఠరాగ్ని లేకున్నను శరీరము మరణించును. శ్రుతి ప్రాణము యొక్క మహత్వమును వర్ణించుట ఉపాసనయందు రుచి కల్పించుటకు మాత్రమే. ప్రాణము శరీరమును ప్రవేశించినదని శ్రుతి చెప్పుట అధిదేవతను ఉద్దేశించియే. శ్రుతి మనస్సే ఆత్మ అని కూడ చెప్పును 'ఆహారము లేక నా ప్రాణము పోవుచున్నది' అనుట ప్రాణము నందలి ప్రీతిని మాత్రమే తెలుపును గాని దాని ఆత్మత్వమును గాదు.

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।**
**శ్రుతో మనోమయః కోశస్తేనాత్మేతీరితం మనః ॥68॥**

*68. జీవుని బంధమోక్షములకు మనస్సే కారణమని శ్రుతి చెప్పును. మనోమయకోశము కూడ శ్రుతియందు చెప్పబడినది. కనుక మనస్సే ఆత్మ అని వీరందురు.*

**వ్యాఖ్య:** అమృతబిందు (బ్రహ్మబిందు) ఉప. 2; తైత్తిరీయ ఉ. 2. 3. 1 మనస్సు కూడ ఆత్మ కాదనుటకు చాల కారణములు గలవు. మనస్సు ఉపకారణము మాత్రమే గాఢనిద్రయందు చైతన్యము వలె మనస్సు ఉండదు. చైతన్యపు ప్రతిఫలనము వలన మాత్రమే మనస్సు భోక్తయగుచున్నది, స్వతంత్రముగ కాదు. 'నా మనస్సు శాంతముగ ఉన్నది' అనే ప్రయోగమున జ్ఞాతయగు 'నేను' మనస్సు కంటె భిన్నము. మనోనాశము వలన మోక్షము కలుగునని శ్రుతి చెప్పును. కామనాపూర్ణమైన మనస్సు బంధమునకు కారణము. కామనారహితమైనచో మోక్షమునకు సహకారి.

**విజ్ఞానమాత్మేతి పర అహుః క్షణికవాదినః ।**
**యతో విజ్ఞాన మూలత్వం మనసో గమ్యతే స్ఫుటమ్ ॥69॥**

*69. క్షణికవాదులగు బౌద్ధులు, మనస్సుకు మూలము బుద్ధియగుటచే బుద్ధియే విజ్ఞానమే ఆత్మయందురు.*

**వ్యాఖ్య:** క్షణికవాదుల ఈ బుద్ధి క్షణక్షణమునకు మారుచుండు అవస్థల పరంపర. అదే అర్థము చేసికొను శక్తి. అది ఆధారముగ మనస్సు బాహ్య విషయములను గ్రహించును.

**అహంవృత్తిరిదంవృత్తిరిత్యంతఃకరణం ద్విధా ।**
**విజ్ఞానం స్యాదహంవృత్తిరిదంవృత్తిర్మనో భవేత్ ॥70॥**

*70. అంతఃకరణమున రెండు విధములగు వృత్తులున్నవి. అహంవృత్తి ఇదంవృత్తి అని. అహంవృత్తియే బుద్ధి, విజ్ఞానము. ఇదంవృత్తియే మనస్సు.*

**వ్యాఖ్య:** కఠోపనిషత్తునందు వలె ఇచ్చట కూడా బుద్ధి అనగా అహంకారము గానూ, మనస్సనగా విషయబోధగానూ స్వీకరింపబడినవి. నిశ్చయాత్మకమైనది బుద్ధి, సంకల్పాత్మకమైనది మనస్సు అను అర్థము ఇచ్చట గ్రహింపబడలేదు.

**అహంప్రత్యయబీజత్వమిదంవృత్తేరితి స్ఫుటమ్ ।**
**అవిదిత్వా స్వమాత్మానం బాహ్యంవేత్తి న తు క్వచిత్ ॥71॥**

*71. అహం ప్రత్యయము, 'నేను' అనుభావము లేనిదే బాహ్య ప్రపంచమును గ్రహింపలేము కనుక మనస్సుకు కారణము అహంవృత్తియే. తనను తెలిసికొనకయే బాహ్యవస్తువులను ఎవరుగాని గ్రహింపలేరు.*

**వ్యాఖ్య:** 'నేను' అని గుర్తించియే 'నేను' కానిది అగు, ఇతర ప్రపంచము గుర్తింపబడుచున్నది. క్షణక్షణమునకు మారుచుండే ఈ 'నేను' ఆత్మయని క్షణిక వాదులగు బౌద్ధుల సిద్ధాంతము.

**క్షణేక్షణే జన్మనాశావహంవృత్తేర్మితౌ యతః ।**
**విజ్ఞానం క్షణికం తేన స్వప్రకాశం స్వతో మితేః ॥72॥**

*72. 'నేను' అనే బోధ క్షణక్షణమునకు వచ్చుచు పోవుచుండును గనుక విజ్ఞానము క్షణికము. దానిని ప్రకాశింపజేయుటకు మరొక తత్త్వము అనవసరము.*

**విజ్ఞానమయకోశోఽయం జీవ ఇత్యాగమా జగుః ।**
**సర్వసంసార ఏతస్య జన్మనాశ సుఖాదికః ॥73॥**

*73. ఈ విజ్ఞానమయ కోశమే జీవుడు. సకల ప్రపంచమును అదే గుర్తించును. జన్మమృత్యువులు సుఖదుఃఖములు దీనినే బాధించును. అని శ్రుతులు చెప్పుచున్నవి. (తైత్తిరీయ ఉప.2.4.5.)*

**విజ్ఞానం క్షణికం నాత్మా విద్యుదభ్ర నిమేషవత్ ।**
**అన్యస్యానుపలబ్ధత్వాచ్ఛూన్యం మాధ్యమికా జగుః ॥74॥**

*74. మెరుపు తీగల వలె రెప్పపాటుల వలె ఈ విజ్ఞానము క్షణికము. దీని కంటె మరేమీ లభింపనందున ఆత్మ అనగా శూన్యమే అని మాధ్యమిక బౌద్ధులు వాదింతురు.*

**అసదేవేదమిత్యాదావిదమేవ శ్రుతం తతః ।**
**జ్ఞాన జ్ఞేయాత్మకం సర్వం జగద్ భ్రాంతి ప్రకల్పితమ్ ॥75॥**

*75.* 'అసద్వా ఇదమగ్ర ఆసీత్' *అనే శ్రుతి వాక్యమును* (*తైత్తిరీయ ఉప. 2.7.1*) *ఉదాహరించుచు బౌద్ధులు జ్ఞానము జ్ఞేయవిషయములగు ప్రపంచము అంతా భ్రాంతి కల్పితమందురు. (బౌద్ధులు వేద ప్రామాణ్యమును అంగీకరింపరు కాని వారికి అనుకూలమైనపుడు శ్రుతి వాక్యములను ఉదాహరింతురు.)*

**నిరధిష్ఠాన విభ్రాంతేరభావాదాత్మనోఽస్తితా ।**
**శూన్యస్యాపి ససాక్షిత్వాదన్యథా నోక్తిరస్య తే ॥76॥**

*76. ఆధారము లేక భ్రాంతి జనింపదు గనుక ఆత్మయే ఆధారముగ స్వీకరింపవలెను. శూన్యమును ప్రతిపాదించుటకు కూడా శూన్యమును గ్రహించు సాక్షి ఒకడుండవలెను. లేనిచో 'అది శూన్యము' అనుటయే అసంభవము గదా!*

**వ్యాఖ్య:** శూన్యమే స్వప్రకాశమనినచో అది సత్తారూపమగు బ్రహ్మమే అని వేదాంత వాదము.

**అన్యో విజ్ఞానమయత ఆనందమయ ఆంతరః ।**
**అస్తీత్యేవోపలబ్ధవ్య ఇతి వైదికదర్శనమ్ ॥77॥**

*77. విజ్ఞానమయకోశము లోపల ఆనందమయకోశము గలదని వేదమతము. అది భావరూపము. అభావరూపము (లేకపోవుట) కాదు. ఇట్లు నైయాయికులు ప్రాభాకర మీమాంసకులు భాట్టమీమాంసకులు చెప్పుదురు. తైత్తిరీయ ఉప.2.5.1 కఠ ఉప. 2.3.13 లోని వాక్యములు వీరి ప్రమాణము.*

**అణుర్మహాన్మధ్యమో వేత్యేవం తత్రాపి వాదినః ।**
**బహుధా వివదంతే హి శ్రుతియుక్తి సమాశ్రయాత్ ॥78॥**

*78. వారియందును ఆత్మ అణుస్వరూపమనీ, కాదు చాల పెద్దది మహత్స్వరూపమైనది అనీ, కాదు కాదు మధ్యమ ప్రమాణము గలది అనీ, శ్రుతిని యుక్తి (తర్కము)ని అవలంబించి బహువిధములుగ వాదవివాదములు చేయుదురు. (వీరు అనుభవరహితులని ఉద్దేశము).*

**అణుం వదంత్యంతరాలాః సూక్ష్మనాడీ ప్రచారతః ।**
**రోమ్ణః సహస్రభాగేన తుల్యాసు ప్రచరత్యయమ్ ॥79॥**

*79. అంతరాలవాదుల ఆత్మ అణువు వలె సూక్ష్మమందురు. ఏలన వెంట్రుకలో వెయ్యవ భాగము వలె సూక్ష్మమైన నాడులయందు అది సంచరించును గనుక. బృహదారణ్యక ఉప.4.23. కౌశీతకి ఉప. 4.19*

**అణోరణీయానేషోఽణుః సూక్ష్మాత్సూక్ష్మ తరం త్వితి ।**
**అణుత్వమాహుః శ్రుతయః శతశోఽథ సహస్రశః ॥80॥**

*80. అణువు కంటే అణుస్వరూపమైనది, సూక్ష్మము కంటే సూక్ష్మతర మైనది ఇట్లు వందలకొలది వేలకొలది శ్రుతివాక్యములు ఆత్మ యొక్క*

అణుత్వమును వర్ణించుచున్నవి అని వారందరు తమ వాదమును సమర్థింతురు. *కఠ ఉప.2.20; ముండక ఉప.3.19; కైవల్య ఉప.20; శ్వేతాశ్వతర ఉప.3.20; మహా నారాయణ ఉప.3.*

**వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్యచ ।**
**భాగో జీవః స విజ్ఞేయ ఇతి చాహాపరా శ్రుతిః ॥81॥**

*81. వెంట్రుక చివర యొక్క నూరవ భాగములో నూరవభాగము జీవుడు. దానిని తెలిసికొనవలెను అని మరొక శ్రుతి చెప్పును. (ఈ శ్వేతాశ్వతర ఉప.5.9వ వాక్యము ఆ తెలిసికొనుట ఎంత కష్టమో సూచించుటకు ఉద్దేశింపబడినది గాని పరిమాణమును తెలుపుటకు గాదు.)*

**దిగంబరా మధ్యమత్వమాహురాపాదమస్తకమ్ ।**
**చైతన్య వ్యాప్తి సందృష్టేరానఖాగ్రశ్రుతేరపి ॥82॥**

*82. దిగంబరులైన జైనులు ఆత్మ మధ్యమ పరిమాణము గలదందురు. ఆపాదమస్తకము చైతన్యము వ్యాపించి ఉండుటవలనను 'గోరుల చివరల నుండి తల వరకు ఆత్మ వ్యాపించి ఉన్నది' అనే శ్రుతి వాక్య బలమునను వారట్లు చెప్పుదురు. బృహదారణ్యక ఉప.1.4.7; కౌషీతకి ఉప.4.20. మధ్యమ పరిమాణమనగా శరీరముతో సమానమైన పరిమాణమని అర్థము.*

**సూక్ష్మనాడీ ప్రచారస్తు సూక్ష్మైరవయవైర్భవేత్ ।**
**స్థూలదేహస్య హస్తాభ్యాం కంచుక ప్రతిమోకవత్ ॥83॥**

*83. ఆత్మ తన సూక్ష్మమైన అవయవములచే సూక్ష్మములైన నాడులను ప్రవేశించును. సన్నవియగు చొక్కా చేతులయందు స్థూలశరీరపు చేతులు ప్రవేశించినట్లే. ఆత్మకు అవయవములు గలవని దిగంబర జైనుల సిద్ధాంతము.*

**న్యూనాధిక శరీరేషు ప్రవేశోఽపి గమాగమైః ।**
**ఆత్మాంశానాం భవేత్తేన మధ్యమత్వం వినిశ్చితమ్ ॥84॥**

*84. ఆత్మ యొక్క అవయవములు సంకోచించుట వలనను వ్యాకోచించుట వలనను చిన్నవి పెద్దవి అగు వివిధ శరీరములందు ప్రవేశింప గలుగును. ఇట్లు ఆత్మకు సాధారణ పరిమాణము మధ్యమమని వారు నిశ్చయింతురు.*

**సాంశస్య ఘటవన్నాశో భవత్యేవ తథా సతి ।**
**కృతనాశాకృతాభ్యాగమయోః కో వారకో భవేత్ ॥85॥**

*85. సావయవమైన ఆత్మసావయవమగు కుండ వలెనే నశింపక తప్పదు. అట్లు ఆత్మ నాశనశీలియైనచో కృతనాశము అకృతాభ్యాగమము అనే దోషముల నెవరు వారింపగలరు? వారింపశక్యము కాదు.*

**వ్యాఖ్య:** ఆత్మకు అవయవములు, అంశములు, భాగములు ఉన్నచో అది భాగములు గల కుండ వంటి సకల పదార్థముల వలెనే నశింపక తప్పదు. ఈ జన్మమున శరీరముతో బాటు ఆత్మ కూడా మరణించిన, మరు జన్మము నందలి సుఖదుఃఖములకు కారణము లేకపోవును. గత జన్మమున ఆత్మ అప్పుడే మరణించుటచే ఆ జన్మమున చేసిన పుణ్య పాప కర్మలకు ఫలితము లేకపోవును, ఇట్లు కారణము లేకయే ఫలితము కలుగుట అకృతాభ్యాగమము. కారణమునకు ఫలితము లేకుండుట కృతనాశము. ఆత్మచే ఈ జన్మమున చేయపడిన సుకృత దుష్కృత (పుణ్యపా) కర్మ ఫలితము లేకయే నశించును. అట్లే అట్టి కర్మలేకయే ఈ జన్మమున సుఖదుఃఖములను అనుభవించుచున్నట్లు ఏర్పడును. ఇట్టి సంభవము ఎవరికిని సమ్మతము కాదు.

**తస్మాదాత్మా మహానేవ నైవాణుర్నాపి మధ్యమః ।**
**ఆకాశవత్సర్వగతో నిరంశః శ్రుతి సంమతః ॥86॥**

*86. కనుక ఆత్మ అణువు కాదు మధ్యమము కాదు. అది అనంతము. ఆకాశము వలె సర్వవ్యాపి అంశములు లేనిది. ఇదే శ్రుతి సమ్మతమైన సిద్ధాంతము.*

ముండ ఉప. 3.1.7 శ్వేతాశ్వతర ఉ. 6.49 గౌడపాదకారిక 3.3.

**ఇత్యుక్త్వా తద్విశేషే తు బహుధా కలహం యయుః ।**
**అచిద్రూపోఽథ చిద్రూప శ్చిదచిద్రూప ఇత్యపి ॥87॥**

*87. ఇట్లు ఆత్మ అనంతము నిరవయవము సర్వవ్యాపియని స్థాపించి దాని లక్షణములను గూర్చి మరల పలువిధములుగ కలహింతురు. చైతన్య స్వరూపమని కొందరు, కాదు అచేతనమని మరి కొందరు, కాదు కాదు అది చేతనము అచేతనము కూడా అని తదితరులు వాద వివాదములు చేయుదురు.*

**ప్రాభాకరాస్తార్కి కాశ్చ ప్రాహురస్యాచిదాత్మతామ్ ।**
**ఆకాశవత్ ద్రవ్యమాత్మా శబ్దవత్తద్గుణశ్చితిః ॥88॥**

*88. ప్రభాకర సంప్రదాయమువారు, తార్కికులు, ఆత్మ అచేతనము అందురు. ఆకాశము వలె ఆత్మయొక్క ద్రవమనీ ఆకాశమునకు శబ్దము గుణమైనట్లే ఆత్మకు చైతన్యము గుణమనీ చెప్పుదురు.*

**వ్యాఖ్య:** తార్కికుల మతమున ద్రవ్యములు తొమ్మిది. పృథివి జలము తేజము (అగ్ని) వాయువు ఆకాశము కాలము దిక్కు ఆత్మ మనస్సు. ఒక్కొక్క ద్రవ్యమున కొక్కొక్క విశేషగుణముండును. పృథివికి వాసన జలమునకు రుచి అగ్నికి రూపము, ఇట్లు. ఆత్మ యొక్క గుణము చైతన్యము.

**ఇచ్ఛాద్వేష ప్రయత్నాశ్చ ధర్మాధర్మౌ సుఖాసుఖే ।**
**తత్సంస్కారాశ్చ తస్యైతే గుణాశ్చితివదీరితాః ॥89॥**

*89. చైతన్యము మాత్రమే గాక ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము అధర్మము, సుఖము, దుఃఖము, సంస్కారములు ఇవన్నీ ఆత్మ యొక్క గుణములని వారందరు.*

**ఆత్మనో మనసాయోగే స్వాదృష్టవశతో గుణాః ।**
**జాయంన్తేఽథ ప్రలీయంన్తే సుషుప్తేఽదృష్టసంక్షయాత్ ॥90॥**

*90. పూర్వకర్మల వలన కలిగిన అదృష్టముచే ఆత్మ మనస్సుతో కలసినపుడు ఈ వివిధ గుణము లేర్పడును. ఈ అదృష్టము తీరగనే ఆత్మ సుషుప్తిలోనికి పోవును. ఆ గుణములును లయమునొందును.*

**చితిమత్త్వాచ్చేతనోఽయ మిచ్ఛాద్వేషప్రయత్నవాన్ ।**
**స్యాద్ధర్మాధర్మయోః కర్తా భోక్తా దుఃఖాదిమత్త్వతః ॥91॥**

*91. చైతన్యమను గుణముండుట చేత ఆత్మ చేతనము. ఆ చైతన్యము ఇచ్ఛాద్వేష ప్రయత్నములుగా అభివ్యక్తమగును. ధర్మాధర్మములకు ఆత్మకర్త అగును. తత్ఫలితముగ సుఖదుఃఖములకు భోక్తయగును.*

**యథాఽత్ర కర్మవశతః కదాచిత్కం సుఖాదికమ్ ।**
**తథాలోకాన్తరే దేహే కర్మణేచ్ఛాది జన్యతే ॥92॥**

*92. కర్మవశమున ఈ జన్మమున సుఖాదికములు ఆగంతుకములైనట్లే మరొక లోకమున ఇతర దేహమునందు చేసిన కర్మఫలముగ ఇచ్ఛాదులను*

*కలుగును. (కనుక చైతన్యముతో సహా ఆత్మ యొక్క అన్ని గుణములను కదాచిత్కములే. అప్పుడప్పుడు వచ్చిపోవునవే)*

**ఏవం చ సర్వగస్యాపి సంభవేతాం గమాగమౌ ।**
**కర్మకాండః సమగ్రోఽత్ర ప్రమాణమితి తేఽవదన్ ॥93॥**

*93. మరియు, సర్వవ్యాపియైనా ఆత్మ శరీరములలోనికి వచ్చుచు (జన్మ) పోవుచు (మరణము) ఉండును. వేదములోని కర్మకాండ అంతా తమ వాదమునే సమర్థించునని వారందరు.*

**ఆనందమయకోశో యః సుషుప్తౌ పరిశిష్యతే ।**
**అస్పష్టచిత్స ఆత్మైషాం పూర్వకోశోఽస్య తే గుణాః ॥94॥**

*94. పంచకోశములలో మొదటిదగు ఆనందమయకోశము సుషుప్తి యందును ఉండును. అది చైతన్యమును అస్పష్టముగ మాత్రమే ప్రకటించును. ఆ ఆనందమయకోశమే ఆత్మయని ప్రాభాకరులు, తార్కికులు భావింతురు. ఆత్మ యొక్క గుణములని వీరు చెప్పునవి ఈ ఆనందమయ కోశపు గుణములే.*

**వ్యాఖ్య:** సుషుప్తిలో చైతన్యము లేక జాగ్రత్ స్వప్నములందు మాత్రమే ఉండినచో 'సుఖముగా నిద్రించితిని, నాకేమీ తెలియలేదు' అనే సుఖము, అజ్ఞానముల జ్ఞాపకము సంభవింపదు. వీనిని అనుభవించి మరల గుర్తు తెచ్చుకొను ఒక చైతన్యసత్త ఉండే తీరవలెను. శ్రుతి కూడా ఆత్మ నిర్గుణమని వర్ణించును. ఇచ్ఛాద్వేషాదులు మనోధర్మములని బృహదారణ్యక ఉప. 1. 5. 3 చెప్పును. దానికి తగినట్లు మనస్సు పనిచేయు జాగ్రత్ స్వప్నములందు మాత్రమే ఇచ్ఛాదులు కన్పించును కదా! తార్కికులనునట్లు అసంఖ్యాకులగు పురుషులందరు సర్వవ్యాపులైనచో అందరును అన్ని శరీరములు కర్మలతో సంబంధపడుటచే ఏది ఎవరికి చెందునో అనే నిర్ణయము కష్టమగును. ఇతర కారణములచే కూడా ఆత్మను గూర్చి ప్రాభాకరుల, తార్కికుల వాదము అసమంజసము. ఆత్మయని వారు భ్రమపడునది ఆనందమయకోశము మాత్రమే.

**గూఢం చైతన్యముత్ప్రేక్ష్య జడబోధస్వరూపతామ్ ।**
**ఆత్మనో బ్రువతే భాట్టాశ్చిదుత్ప్రేక్షోత్థిత స్మృతేః ॥95॥**

*95. భాట్ట మీమాంసకులు ఆత్మయందు చైతన్యము గూఢమై ఉన్నదనీ స్వరూపమున అది చేతనము, అచేతనము కూడా అనీ అందురు. మేలుకొనిన పురుషుడు తన గాఢనిద్రను స్మరించుటను బట్టి వీరిట్లు నిశ్చయింతురు.*

**వ్యాఖ్య:** షడ్దర్శనములలో అయిదవదగు పూర్వ మీమాంసయందు రెండు సంప్రదాయములు గలవు. ప్రభాకర సంప్రదాయము, కుమారిల భట్టు సంప్రదాయము. వీరినే సంగ్రహముగ భాట్టులని వ్యవహరింతురు. ఆరవదగు ఉత్తర మీమాంసయే వేదాంతము.

**జడో భూత్వా తదాఽస్వాప్సమితి జాడ్యస్మృతిస్తదా ।**
**వినా జాడ్యానుభూతిం న కథఞ్చిదుపద్యతే ॥96॥**

*96. 'జడుని వలె నిద్రించితిని' అనే స్మరణ అట్టి జడత్వపు అనుభవము ఉండుట చేతనే సంభవము. కాని ఒక చైతన్యాంశము లేనిదే ఇట్టి అచేతనా అనుభవపు స్మరణ సిద్ధింపదు. కనుక ఆత్మ చేతనము అచేతనము కూడా.*

**వ్యాఖ్య:** కొన్ని స్థితుల యందు చైతన్యము ఆవృతమై ఉండునని భాట్టుల నిర్ణయము.

**ద్రష్టుర్దృష్టేరలోపశ్చ శ్రుతః సుప్తౌ తతస్త్వయమ్ ।**
**అప్రకాశ ప్రకాశాభ్యామాత్మా ఖద్యోతవద్యుతః ॥97॥**

*97. నిద్రయందు ద్రష్ట గాని దృష్టి గాని లోపింపవు (బృహదారణ్యక ఉప.4.3.23) అనే శ్రుతివాక్యమును చూపుచు వారు మిణుగురు పురుగు వలె ఆత్మప్రకాశము అప్రకాశము కూడా అని చెప్పుదురు.*

**నిరంశ స్యోభయాత్మత్వం న కథఞ్చిద్ఘటిష్యతే ।**
**తేన చిద్రూప ఏవాత్మేత్యాహుః సాంఖ్యవివేకినః ॥98॥**

*98. నిరవయవమగు ఆత్మ రెండూ, చేతనము అచేతనము కూడా, అగుట ఏ విధముగనైనను సంభవింపదు. ఆత్మ చిద్రూపము మాత్రమే అని సాంఖ్యులు వాదింతురు.*

**వ్యాఖ్య:** ఆత్మ విజ్ఞానఘనమని శ్రుతి వాక్యము. అందు అచేతనమునకు స్థానము లేదు. నిద్రయందలి జడత్వమును స్మరించుట జడమగు విషయమును, మాయను, అనుభవించుట చేత. ఆత్మ యొక్క జడత్వమును అనుభవించి కాదు. కనుక భాట్టుల వాదము సమీచీనము కాదు.

**జాడ్యాంశః ప్రకృతే రూపం వికారి త్రిగుణం చ తత్ ।**
**చితో భోగాపవర్గార్థం ప్రకృతిః సా ప్రవర్తతే ॥99॥**

*99. జడత్వము ప్రకృతి స్వభావము. అది పరిణామ శీలము, త్రిగుణాత్మకము. చిద్రూపుడగు పురుషుని భోగము (అనుభవము) అపవర్గము (మోక్షము) కొరకు ప్రకృతి పనిచేయును.*

**వ్యాఖ్య:** సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి పురుషుని బంధమోక్షములను కల్పించునని సాంఖ్యవాదము.

**అసంగాయాశ్చితేర్బంధమోక్షౌ భేదాగ్రహాన్మతౌ ।**
**బంధముక్తి వ్యవస్థార్థం పూర్వేషామివ చిద్భిదా ॥100॥**

*100. పురుషుడు సంగరహితుడు పరిశుద్ధుడు అయినను ప్రకృతి పురుషుల భేద జ్ఞానము లేక, ప్రకృతియే తానని భ్రమపడి, పురుషుడు బంధమునకు లోనగుచున్నాడు. ఆ బేధజ్ఞానము కలిగినంతనే మోక్షము లభించును. ఈ బంధమోక్షముల వ్యవస్థ కొరకు నైయాయికులు మొదలగు వారివలనే సాంఖ్యులు అసంఖ్యాక పురుషులను ప్రతిపాదింతురు.*

**మహతః పరమవ్యక్తమితి ప్రకృతిరుచ్యతే ।**
**శ్రుతావసజ్ఞతా తద్వదసఙ్గోహీత్యతః స్ఫుటా ॥101॥**

*101. అవ్యక్తమగు ప్రకృతి వ్యక్తప్రకృతియగు మహత్తు కంటే భిన్నమనీ ఆత్మ అసంగమనీ చెప్పు శ్రుతిని వారు ప్రమాణీకరింతురు.*

**వ్యాఖ్య:** కఠ ఉప. 1.3.11; బృహదారణ్యక ఉప. 4.3.15, 4.4.22. గుణములు సామ్యావస్థయందుండుట ప్రకృతి స్వభావము. అది చెదరినపుడు సృష్టి ప్రారంభమగును. జడమగు ప్రకృతి తానంతట తానే ఎట్లు చెదరగలదు? అసంగుడగు పురుషుడు ఎట్లు ప్రకృతిని చెదరగొట్ట గలడు? రెండవది: పురుషులు అసంఖ్యాకులై ప్రకృతి శాశ్వతమైనచో వాని మధ్య ఏదోక సంబంధము కల్పింప వలసి వచ్చును. సంబంధమేర్పడి నంతనే పురుషుని అసంగత్వము భంగపడును. ఇట్లు సాంఖ్యులవాదము కూడా సరికాదు. వేదాంతవాదమున ఆత్మ సత్‌చిత్ ఆనందస్వరూపమని ప్రథమ ప్రకరణముననే నిరూపింప బడినది. (1.10).

**చిత్సన్నిధౌ ప్రవృత్తాయాః ప్రకృతేర్హి నియామకమ్ ।**
**ఈశ్వరం బ్రువతే యోగాః స జీవేభ్యః పరః శ్రుతః ॥102॥**

*102. యోగులు ఈశ్వరుని గూర్చి చెప్పుదురు. చిత్సాన్నిధ్యమున ప్రవర్తించు ప్రకృతిని నియమించునది ఈశ్వరుడే. ఈశ్వరుడు జీవుల కంటే శ్రేష్ఠుడు.*

**వ్యాఖ్య:** ఆత్మను గూర్చిన భేదాభిప్రాయములను వివరించి ఈశ్వరుని గూర్చిన అభిప్రాయములను వివరించుచున్నాడు.

**ప్రధాన క్షేత్రజ్ఞ పతిర్గుణేశ ఇతి హి శ్రుతిః ।**
**ఆరణ్యకేఽసంభ్రమేణ హ్యంతర్యామ్యుపపాదితః ॥103॥**

*103. ఈశ్వరుడు జీవులకు ప్రకృతికి ప్రభువనీ గుణములను కూడా నియమించుననీ శ్రుతి ప్రకటించును. అరణ్యకమున ఈశ్వరుడు అంతర్యామి అని వర్ణింపబడెను.*

**వ్యాఖ్య:** శ్వేతాశ్వర ఉప. 6. 14; బృహదారణ్యక ఉప. 3. 7; కఠ ఉప. 2. 33. సాంఖ్యుల మతమున పురుష సాన్నిధ్య మాత్రమున ప్రకృతి పరిణామము నొందును. యోగులమతమున ఈశ్వరుడు ప్రకృతిని నియమించును.

**అత్రాపి కలహాయన్తే వాదినః స్వస్వయుక్తిభిః ।**
**వాక్యాన్యపి యథాప్రజ్ఞం దార్ఢ్యాయోదాహరన్తి హి ॥104॥**

*104. ఈశ్వరుని విషయమున కూడా వివిధ తాత్త్వికులు తమ తమ తర్కములచే వివిధ వాదములతో కలహింతురు. తమ తమ ప్రతిభకు తగినట్లు శ్రుతివాక్యములను కూడా దార్ఢ్యార్థము ఉటంకింతురు.*

**క్లేశకర్మవిపాకైస్తదాశయై రప్యసంయుతః ।**
**పుంవిశేషో భవేదీశో జీవవత్సోఽప్యసంగచిత్ ॥105॥**

*105. యోగసూత్రకారుడైన పతంజలి మతమున ఈశ్వరుడు క్లేశకర్మ విపాక ఆశయములు స్పర్శింపని ఒక విశిష్ట పురుషుడు. పురుషుల వలెనే ఈశ్వరుడు అసంగుడు చిద్రూపుడు.*

**వ్యాఖ్య:** యోగసూత్రముల సమాధి పాదము సూ. 24. అవిద్యా అస్మితా రాగద్వేషములు అభినివేశము అనునవి అయిదు క్లేశములు. శుక్లము కృష్ణము శుక్లకృష్ణము అని కర్మ మూడు విధములు (పుణ్య, పాప, పుణ్యపాపమిశ్రమ, కర్మ) జాతి ఆయువు భోగము అనునవి మూడు విపాకములు. ఆశయములనగా

సంస్కారములు. సాంఖ్యులకును యోగులకును పురుషుడు భోక్తమాత్రమే, కర్తకాడు. కర్తృత్వము సుఖదుఃఖములు ప్రకృతి వికారమగు బుద్ధి లక్షణములు. బుద్ధితో తాదాత్మ్యము వలన పురుషుడు తానే కర్తయని భ్రమించును. సమాధి ద్వారా తన భిన్నత్వమును తెలిసికొని మోక్షము నొందును.

**తథాపి పుంవిశేషత్వాద్ఘటతేఽస్య నియంతృతా ।**
**అవ్యవస్థా బంధమోక్షావాపతేతామిహాన్యథా ॥106॥**

*106.* *విశిష్టపురుషుడగుటచే ఈశ్వరుని నియంతృత్వము సంభవమగును. అట్టి నియామకుడు లేనిచో ఎవరు బంధమున ఉండవలెనో ఎవరు మోక్షమును పొందవలెనో ఎట్లో అనే వ్యవస్థ సిద్ధింపదు గదా! శ్వే. ఉప. 6.16-17.*

**భీషాఽస్మాదిత్యేవమాదావసఙ్గస్య పరాత్మనః ।**
**శ్రుతం తద్యుక్తమప్యస్య క్లేశకర్మాద్యసఙ్గమాత్ ॥107॥**

*107. ఈశ్వరుని వలని భీతిచే ప్రకృతి ప్రవర్తించునని శ్రుతి చెప్పును. ఈశ్వరుడు అసంగుడైనను జగన్నియామకుడు. క్లేశకర్మాదులు ఈశ్వరుని స్పృశింపవు గనుక జగత్ప్రభుత్వము ఈశ్వరునికి తగియున్నది. తైత్తిరీయ ఉప. 2.8.1 కఠ ఉప.2.3.3. నృసింహతాపనీయ ఉప.2.*

**జీవానా మప్యసంగత్వా త్క్లేశాదిర్న హ్యథాపి చ ।**
**వివేకాగ్రహతః క్లేశకర్మాది ప్రాగుదీరితమ్ ॥108॥**

*108. ఆ మాటకు, జీవులు కూడా అసంగులగుటచే క్లేశకర్మాదుల వారిని కూడా అంటవు. కాని తమ నిజస్వరూపమును గూర్చిన అజ్ఞానము వలన ప్రకృతి వికారములైన బుద్ధ్యాదులతో తాదాత్మ్యమును భావించుకొని క్లేశాదులతో సంబంధపడును. చూ.100వ శ్లోకము.*

**నిత్య జ్ఞాన ప్రయత్నేచ్ఛా గుణానీశస్య మన్వతే ।**
**అసఙ్గస్య నియంతృత్వ మయుక్తమితి తార్కికా ॥109॥**

*109. ఈశ్వరుడు అసంగుడగుటచే అతని నియంతృత్వము అసంగతమని తార్కికులు నిరాకరింతురు. నిత్యమైన జ్ఞానప్రయత్న ఇచ్ఛ అనే గుణములను వారు ఈశ్వరునకు అన్వయింతురు.*

**పుం విశేషత్వమప్యస్య గుణై రేవ న చాన్యథా ।**
**సత్యకామః సత్యసంకల్ప ఇత్యాదిశ్రుతిర్జగౌ ॥110॥**

*110.* *ఈ గుణముల చేతనే ఈశ్వరుడు విశిష్ట పురుషుడగుట సిద్ధించును. మరొకవిధమున సిద్ధింపదు. సత్యకాముడు సత్యసంకల్పుడు ఇట్లు శ్రుతి వర్ణించుచున్నది. ఛాందోగ్య ఉప. 8.1.5; 8.7.1-3*

**నిత్యజ్ఞానాదిమత్త్వేఽస్య సృష్టి రేవ సదాభవేత్ ।**
**హిరణ్యగర్భ ఈశోఽపి లిఙ్గదేహేన సంయుతః ॥111॥**

*111.* *కాని ఈశ్వరుడు నిత్యజ్ఞానాది గుణాన్వితుడైనచో సృష్టియే నిత్యముగా ఉండవలసి వచ్చును. కనుక తార్కికులు ఈశ్వరుడనునది నిజముగ లింగశరీరముల సమష్టియగు హిరణ్యాగర్భుడే.*

**వ్యాఖ్య:** వేదాంతులిట్లు తార్కికుల వాదమునందు దోషమును జూపి వారి వాదమును తమ వాదముతో సమన్వయించుకొనుచున్నారు. ఈశ్వర హిరణ్య గర్భులు ప్రథమ ప్రకరణమున వర్ణింపబడిరి. చూ. 16–24.

**ఉద్గీథబ్రాహ్మణే తస్య మాహాత్మ్యమతి విస్తృతమ్ ।**
**లింగ సత్త్వేపి జీవత్వం నాస్య కర్మాద్యభావతః ॥112॥**

*112.* *హిరణ్యాగర్భుని మహిమ ఉద్గీథ బ్రాహ్మమున విస్తరింపబడినది. సూక్ష్మదేహముల సమష్టియైనను కామకర్మాదులు హిరణ్యాగర్భునకు లేవు కనుక అతడు జీవుడనుటకు వీలు లేదు. బృహదారణ్యాక ఉప. 1.3*

**స్థూలదేహం వినా లిఙ్గదేహో న క్వాపి దృశ్యతే ।**
**వైరాజో దేహ ఈశోఽతః సర్వతోమస్తకాదిమాన్ ॥113॥**

*113.* *స్థూలశరీరము లేకయే సూక్ష్మశరీరముండుట ఎక్కడను చూడము గనుక విరాట్పురుషుడే నిజమగు ఈశ్వరుడు. అతనికి ఎల్లెడల శిరస్సులు మొదలగునవి కలవు.*

**సహస్రశీర్షే త్యేవం చ విశ్వతశ్చక్షురిత్యపి ।**
**శ్రుతమిత్యాహురనిశం విశ్వరూపస్య చిన్తకాః ॥114॥**

*114.* *అన్ని దిక్కులయందూ వ్యాపించి అనంతములైన తలలతో కన్నులతో ఉన్న విరాడ్రూపమే జగద్రూపమని శ్రుతి చెప్పును. ఇట్లు విరాడుపాసకులు వాదింతురు. ఋగ్వేదము 1.10.90; శ్వేతాశ్వతర ఉప. 3.3.*

**సర్వతః పాణిపాదత్వే కృమ్యాదేరపి చేశతా ।**
**తతశ్చతుర్ముఖో దేవ ఏవేశో నేతరః పుమాన్ ॥115॥**

*115.* ఎల్లయెడల ఈశ్వరుని పాణిపాదములు గలవనుటచే క్రిమి కీటకములందు కూడా ఈశ్వరత్వము భావింపవలసి వచ్చును. కనుక చతుర్ముఖుడైన బ్రహ్మయే ఈశ్వరుడు మరియెవరూ కాదని ఇతర ఉపాసకులందురు.

**పుత్రార్థం తముపాసీనా ఏవమాహుః ప్రజాపతిః ।**
**ప్రజా అసృజతేత్యాదిశ్రుతిం చోదాహరన్త్యమీ ॥116॥**

*116.* పుత్రార్థమై బ్రహ్మను ఉపాసించే వారు ఈ విధముగ 'ప్రజలను బ్రహ్మ సృష్టించెను' అనే శ్రుతి వాక్యములను ఉదాహరింతురు.

**విష్ణోర్నాభేః సముద్భూతో వేధా కమలజస్తతః ।**
**విష్ణురేవేశ ఇత్యాహుర్లోకే భాగవతా జనాః ॥117॥**

*117.* విష్ణువు యొక్క నాభికమలము నుండి బ్రహ్మ జనించెను. కనుక విష్ణువే ఈశ్వరుడు జగత్ప్రభువు అని విష్ణుభక్తులైన భాగవతులందురు.

**శివస్య పాదావన్వేష్టుం శార్ఙ్గ్యశక్తస్తతః శివః ।**
**ఈశో న విష్ణురిత్యాహుః శైవా ఆగమమానినః ॥118॥**

*118.* శైవ ఆగమములను ప్రమాణముగ స్వీకరించే శైవులు, విష్ణువు శివుని పాదములను కనుగొనుటకు సర్వదా అశక్తుడయ్యెను కనుక శివుడే జగదీశ్వరుడు అందురు.

**పురత్రయం సాదయితుం విఘ్నేశం సోఽప్యపూజయత్ ।**
**వినాయకం ప్రాహురీశం గాణపత్యమతే రతాః ॥119॥**

*119.* గాణపత్యులు, త్రిపుర సంహారార్థమై ఆ శివుడు గూడా గణపతిని విఘ్నేశ్వరుని పూజించెను. కనుక గణేశుడే జగదీశ్వరుడందురు.

**ఏవమన్యే స్వస్వపక్షాభిమానేనాన్యథాఽన్యథా ।**
**మంత్రార్థవాద కల్పాదీనాశ్రిత్య ప్రతిపేదిరే ॥120॥**

*120.* ఇట్లు తమ తమ వాదముల అభిమానించుచు ఇతరులు కూడా వేరు వేరుగా వేదమంత్రములను అర్థవాదములను కల్పములను ఐతిహ్యాము లను ఆశ్రయించి వివిధ ప్రతిపాదనలను చేసిరి.

**అంతర్యామిణమారభ్య స్థావరాంతేశవాదినః ।**
**సన్త్యశ్వత్థార్కవంశాదేః కులదైవత దర్శనాత్ ॥121॥**

*121.* అంతర్యామి మొదలు స్థావరముల వరకు అదే ఈశ్వరుడని వాదించువారు గలరు. అశ్వత్థవృక్షము, సూర్యకాంతము, వెదురు కూడా కులదైవములుగ చూచుచున్నాము గదా.

**తత్త్వ నిశ్చయకామేన న్యాయాగమ విచారిణామ్ ।**
**ఏకైవ ప్రతిపత్తిః స్యాత్సాఽప్యత్ర స్ఫుటముచ్యతే ॥122॥**

*122.* తత్త్వమును తెలియగోరువారు శ్రుతిని తర్కమును అనుసరింతురు. వారి నిర్ణయము కూడా ఈశ్వరుడొక్కడే అనునదే. అదే ఇచ్చట స్పష్టముగ చెప్పబడుచున్నది.

**మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్ ।**
**అస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్ ॥123॥**

*123.* విశ్వమునకు ఉపాదాన కారణమగు ప్రకృతియే మాయయనీ మాయధీశుడే మహేశ్వరుడనీ అతడు అచేతన చేతనాత్మకమైన జగత్తునంతటిని వ్యాపించి ఉన్నాడనీ ఆ జగద్విషయములన్నీ అతని అవయవముల వంటివే అనీ శ్రుతి చెప్పును. శ్వేతాశ్వతర ఉప.*4.10.*

**ఇతిశ్రుత్యనుసారేణ న్యాయ్యో నిర్ణయ ఈశ్వరే ।**
**తథాసత్యవిరోధః స్యాత్ స్థావరాన్తేశవాదినామ్ ॥124॥**

*124.* ఈశ్వరుని పట్ల ఇది శ్రుత్యనుసారమైన న్యాయమైన నిర్ణయము. అట్లయిననే వృక్షములను ఈశ్వరుడను వారితో కూడా విరోధముండదు.

**మాయాచేయం తమోరూపా తాపనీయే తదీరణాత్ ।**
**అనుభూతిం తత్రమానం ప్రతిజజ్ఞే శ్రుతిః స్వయమ్ ॥125॥**

*125.* నృసింహ ఉత్తర తాపనీయోపనిషత్తు*(9)* మాయను తమోరూపముగ అంధకారముగ చెప్పుచున్నది. శ్రుతి స్వయముగనే ఎల్లరయనుభవమునే ప్రమాణముగ జూపుచున్నది.

**జడం మోహాత్మకం తచ్చేత్యనుభావయతి శ్రుతిః ।**
**ఆబాలగోపం స్పష్టత్వాదానంత్యం తస్య సాఽబ్రవీత్ ॥126॥**

*126.* మాయ యొక్క స్వరూపము జడము భ్రమాత్మకము అని శ్రుతి చెప్పును. బాలురు మందబుద్ధులకు కూడా దీనిని ప్రకటింతురని శ్రుతియనును. నృసింహ ఉత్తర తాపనీయ ఉప. *9.*

**అచిదాత్మఘటాదీనాం యత్స్వరూపం జడం హి తత్ ।**
**యత్ర కుంఠీభవేద్బుద్ధిః స మోహ ఇతి లౌకికాః ॥127॥**

*127. చైతన్యరహితములైన ఘటము మొదలగువాని స్వరూపమే జడస్వరూపము. దేనినర్థము చేసికొనలేక బుద్ధికుంటుపడునో అది మోహము అని లోకవ్యవహారము.*

**ఇత్థం లౌకిక దృష్ట్యై ఏతత్ సర్వైరప్యనుభూయతే ।**
**యుక్తి దృష్ట్యా త్వనిర్వాచ్యం నాసదాసీదితి శ్రుతేః ॥128॥**

*128. ఈ విధముగ లౌకిక దృష్ట్యా మాయ ఎల్లరచేతను అనుభవింపబడుచున్నది. తర్కదృష్ట్యా మాయను నిర్వచించి చెప్పుటకు వీలులేదు. అది అనిర్వచనీయమనియే అనవలెను. దానికి శ్రుతి ప్రమాణము నాసదీయ సూక్తమే. (ఋగ్వేదము. 10.129)*

**వ్యాఖ్య:** మాయకు కారణమేది అనే ప్రశ్న అసంగతము. ఏలన కార్యకారణ సంబంధమే మాయా కార్యము. కనుక మాయకేది కారణమని తగవాడుట కొడుకు తల్లిని 'నీ పెండ్లికి నన్నేల పిలువలేదు?' అని నిర్బంధించినట్లే ఉండును.

**నాసదాసీద్విభాతత్వాన్నో సదాసీచ్చ బాధనాత్ ।**
**విద్యా దృష్ట్యా శ్రుతం తుచ్ఛం తస్య నిత్యనివృత్తితః ॥129॥**

*129. మాయ యొక్క ఫలితములు స్పష్టముగ ఇంద్రియగోచరములు అగుచుండుట చేత అది లేదనలేము. జ్ఞానోదయమైనపుడు నశించుట చేత నిజముగ ఉన్నదనీ అనలేము. బ్రహ్మజ్ఞానపు దృష్ట్యా మాయ పనిచేయదు కనుక అది ఉపేక్షణీయమే అగును. బృహదారణ్యక ఉప. 4.4.19 కఠ ఉప.4.11.*

**తుచ్ఛాఽనిర్వచనీయా చ వాస్తవీ చేత్యసౌ త్రిధా ।**
**జ్ఞేయా మాయా త్రిభిర్బోధైః శ్రౌతయౌక్తిక లౌకికైః ॥130॥**

*130. మాయ తుచ్ఛమనీ అనిర్వచనీయమనీ వాస్తవమనీ మూడు విధములుగ గ్రహింపబడుచున్నది. శ్రుత్యనుసారము మాయ తుచ్ఛము. తార్కికముగ అనిర్వచనీయము. లోక వ్యవహారమున వాస్తవము.*

**అస్య సత్త్వమసత్త్వం చ జగతో దర్శయత్యసౌ ।**
**ప్రసారణాచ్చ సంకోచాద్యథా చిత్రపటస్తథా ॥131॥**

*131. ఈ ప్రపంచము ఉన్నట్లుగను (జాగ్రదవస్థ యందు), లేనట్లుగను (సుషుప్తియందు), మాయ చూపించును. తైల చిత్రమును విప్పిచూపుచు చుట్టివేసి చూపునట్లుగనే. (నృసింహ ఉత్తర తాపనీయ ఉప.9)*

**అస్వతంత్రా హి మాయా స్యాదప్రతీతేర్వినా చితిమ్ ।**
**స్వతంత్రాఽపి తథైవ స్యాదసంగస్యాన్యథాకృతేః ॥132॥**

*132. గుర్తించే చైతన్యము లేనిచో మాయ అనుభవమునకు రాదు కనుక అది అస్వతంత్రం అని అనాలి. కాని నిత్యముక్తమగు ఆత్మను బద్ధమైనట్లు చూపుట చేత మాయ స్వతంత్రమని కూడా చెప్పవచ్చు.*

**కూటస్థాసఙ్గమాత్మానం జగత్త్వేన కరోతి సా ।**
**చిదాభాస స్వరూపేణ జీవేశావపి నిర్మమే ॥133॥**

*133. కూటస్థము (నిర్వికారము) సంగరహితము అగు ఆత్మను అది జగద్రూపముగ చూపును. ఆత్మను తనయందు ప్రతిఫలించుకొని జీవుని ఈశ్వరుని కూడా నిర్మించును.*

**కూటస్థమనుపద్రుత్య కరోతి జగదాదికమ్ ।**
**దుర్ఘటైకవిధాయిన్యాం మాయాయాం కా చమత్కృతిః ॥134॥**

*134. కూటస్థమునకు ఏ ఉపద్రవమును కల్పింపకయే మాయ జగదాది విషయములను సృష్టించును. ఇట్టి అసంభవములైన పనులను సంభవింప జేయుటయే మాయయందలి చమత్కారము.*

**ద్రవత్వముదకే వహ్నేరౌష్ణ్యం కాఠిన్యమశ్మని ।**
**మాయాయా దుర్ఘటత్వం చ స్వతః సిద్ధ్యతి నాన్యతః ॥135॥**

*135. జలమునకు ద్రవత్వము, అగ్నికి ఉష్ణత, శిలకు కాఠిన్యము, స్వభావములైనట్లే అసంభవమును సంభవములుగా చేయుట మాయకు స్వభావ సిద్ధము.*

**న వేత్తి లోకో యావత్తం సాక్షాత్తావచ్చమత్కృతిమ్ ।**
**ధత్తే మనసి పశ్చాత్తు మాయైషేత్యుపశామ్యతి ॥136॥**

*136. ఇంద్రజాలములోని చమత్కారమంతా ఇంద్రజాలికుని తెలుసుకో నంత వరకే. తెలిసిపోయిన పిదప ఇది ఇంద్రజాలము మాత్రమే అని ఉపశమనము కలుగును.*

**వ్యాఖ్య:** అట్లే మాయను తెలుసుకోనంత వరకు మాయా కార్యమైన ఈ జగత్తు ఆహా! ఎంత అద్భుతము అనిపించును. మాయ యొక్క రహస్యము తెలిసిన పిదప అంతా నీరసమని (మిథ్య అని) స్పష్టపడును.

**ప్రసరంతి హి చోద్యాని జగద్వస్తుత్వ వాదిషు ।**
**న చోదనీయం మాయాయాం తస్యాశ్చొద్యైకరూపతః ॥137॥**

*137. ఈ జగత్తు వాస్తవమని భావించువారికి అందలి అద్భుతములు సంగతములగును. కాని ఇది అంతా మాయ అని అనే వేదాంతులకు, మాయయే అద్భుతమనే వేదాంతులకు మాయాకార్యమునందు విశేషమేమీ కన్పింపదు.*

**చోద్యేఽపి యదిచోద్యం స్యాత్త్వచ్చోద్యే చోద్యతే మయా।**
**పరిహార్యం తతశ్చోద్యం న పునః ప్రతిచోద్యతామ్ ॥138॥**

*138.* మాయ అద్భుతమనుటను ఆక్షేపించి ఏమి లాభము*?* అట్టి ఆక్షేపములను మేము కూడా ఆక్షేపింపగలము. కర్తవ్యమేమనగా శాస్త్రానుగుణమైన విచారణ ద్వారా మాయను పరిహరించుట. కనుక వ్యర్థముగ శుష్క వాదములు చేయవలదు.

**వ్యాఖ్య:** కేవలము తర్కమును ఆశ్రయించి కార్యకారణముల సంబంధములతో కుస్తీపట్టుట వ్యర్థప్రయాస. ఏలన కార్యకారణ సంబంధమే మాయ యొక్క కార్యము. కనుక స్వంత బుద్ధి కుశలతను ప్రకటించే ప్రయత్నములు మాని మాయా రహస్యమును భేదించు ప్రయత్నము శాస్త్రోక్తముగ చేయవలెను.

**విస్మయైక శరీరాయా మాయాయాశ్చోద్యరూపతః ।**
**అన్వేష్యః పరిహారోఽస్యా బుద్ధిమద్భిః ప్రయత్నతః ॥139॥**

*139. రూపు దాల్చిన ఆశ్చర్యమే మాయ. సంశయమే దాని శరీరము. బుద్ధిమంతులు ప్రయత్న పూర్వకముగ దానిని పరిహరించే మార్గము వెదుకవలెను.*

**మాయాత్వమేవ నిశ్చేయమితి చేత్తర్హి నిశ్చిను ।**
**లోకప్రసిద్ధమాయాయా లక్షణం యత్తదీక్ష్యతామ్ ॥140॥**

*140. మాయను పరిహరించుటకు పూర్వము మాయాత్వము, మాయ యొక్క లక్షణము, నిశ్చయింపవలెను గదా అనినచో వినుము. లోకప్రసిద్ధమైన ఇంద్రజాల లక్షణమునే చూడుము.*

**వ్యాఖ్య:** ఇంద్రజాలము స్పష్టముగ కన్పించుచునే ఉండును, కాని దాని లక్షణం 'ఇది' అని చెప్పలేము. అట్లే మాయ కూడా కన్పించును కాని ఇదమిత్థమని చెప్పజాలమని ఉద్దేశము. కాని ఈ నిర్వచనము దోషరహితము కాదు. బ్రహ్మము కూడా ఇదమిత్థమని చెప్పలేము. అది కన్పించదు కూడా. కుందేటి కొమ్ము అని స్పష్టముగ చెప్పగలము కాని అది కూడా ఏనాటికిని కన్పింపదు.

**న నిరూపయితుం శక్యా విస్పష్టం భాసతే చ యా ।**
**సా మాయేతీంద్రజాలదౌ లోకాః సంప్రతిపేదిరే ॥141॥**

*141. నిర్ణయించుట అశక్యమైనది స్పష్టముగ కన్పించునది మాయ అని ఇంద్రజాలము మొదలగు వాని పట్ల జనులు స్వీకరించిరి.*

**స్పష్టం భాతి జగచ్చేదమశక్యం తన్నిరూపణమ్ ।**
**మాయామయం జగత్తస్మాదీక్షస్వాపక్షపాతతః ॥142॥**

*142. ఈ జగత్తు స్పష్టముగ కన్పించుచున్నది. కాని దాని స్వరూపమేమో నిర్ణయింపనలవి కాదు. కనుక నిష్పక్షపాతముగా ఈ జగత్తు మాయామయము భ్రమాత్మకము అని గ్రహింపుము.*

**నిరూపయితుమారబ్ధే నిఖిలైరపి పండితైః ।**
**అజ్ఞానం పురతస్తేషాం భాతి కక్షాసు కాసుచిత్ ॥143॥**

*143. ఎంత పండితమార్తాండులైనను అందరును ఏదో ఒక స్థాయి యందు దీనికి కారణము మాకు తెలియదు అని అంగీకరింపక తప్పదు.*

**వ్యాఖ్య:** ఏ శాస్త్రమునందైనను ఈ విషయము సత్యమే. శాస్త్ర పారంగతులకు ఇంకను తెలిసికొనవలసినది ఏదో మిగిలే ఉండును. సృష్టిరహస్యము పాండిత్యము చేత భేదింపబడునది కాదు. అదే మాయ. దానిని బ్రహ్మానుభవము చేతనే తొలగింపగలము.

**దేహేంద్రియాదయో భావా వీర్యేణోత్పాదితాః కథమ్ ।**
**కథంవా తత్ర చైతన్యమిత్యుక్తే తే కిముత్తరమ్ ॥144॥**

*144. శుక్లము నుండి శరీరము ఇంద్రియములు మొదలగునవి ఎట్లు జనించినవి? మాతృగర్భమునందే చైతన్యమెట్లు కలిగినది? అని ప్రశ్నించినచో ఉత్తరమేమి?*

**వీర్యస్యైష స్వభావశ్చేత్కథం తద్విదితం త్వయా ।**
**అన్వయ వ్యతిరేకౌ యౌ భగ్నౌ తౌ వంధ్యవీర్యతః ॥145॥**

*145. అట్లు పెంపొందుట శుక్లము యొక్క స్వభావమే అనినచో ఆ స్వభావము ఎట్లు తెలియబడినది? గొడ్రాలియందు ఆ 'స్వభావము' భగ్నమైనది గదా?*

**వ్యాఖ్య:** ఆధునికులు జీన్సుక్రోమోజోమ్సు వరకు పోవచ్చును డి.ఎన్.ఏ., ఆర్.ఎన్.ఏ. అని వివరింపవచ్చును. అవి మాత్రము ఎట్లు ఏర్పడినవి అని అడిగినచో మిణకరింపక తప్పదు. సరళముగ నాకు తెలియదు అనవచ్చును, లేదా తెలివిగా ప్రకృతి నియమము యాదృచ్ఛికము మొదలగు మాటలతో కప్పిపుచ్చవచ్చు. ఈ తెలియని తనమునే బ్రహ్మజ్ఞానులు మాయ అని అనిరి.

**న జానామి కిమప్యేతదిత్యన్తే శరణం తవ ।**
**అతేవ మహాన్తోఽస్య ప్రవదన్తీన్ద్రజాలతామ్ ॥146॥**

*146. చివరకు 'ఇది ఏమీ నాకు తెలియదు' అనుటే శరణము. కనుకనే మహాత్ములు ఈ జగత్తు యొక్క ఇంద్రజాలత్వమును గూర్చి చెప్పుదురు.*

**వ్యాఖ్య:** మాటవరుసకు, జడపదార్థముల నుండి చైతన్యము జనించెనే అనుకొందము. వెలుగు చీకటుల వలె పరస్పర విరుద్ధములైన జడచైతన్యములకు కార్యకారణ సంబంధమును ఎట్లు అన్వయింపగలము?

**ఏతస్మాత్కిమివేంద్రజాలమపరం యద్గర్భవాసస్థితం**
**రేతశ్చేతతి హస్తమస్తకపదప్రోద్భూతనానాఙ్కురమ్ ।**
**పర్యాయేణ శిశుత్వయౌవనజరావేషై రనేకైర్వృతం**
**పశ్యత్యతతి శృణోతి జిఘ్రతి తథా గచ్ఛత్యథాగచ్ఛతి ॥147॥**

*147. గర్భవాసమందలి రేతస్సు ఒక చేతనవంతమైన వ్యక్తియగును. చేతులు కాళ్ళు తల మొదలగు మొగ్గలు తొడుగును. క్రమముగా శైశవము యౌవనము వార్ధక్యము ఆదిగా గల అనేక వేషములను ధరించును. చూచును సంచరించును వినును వాసన చూచును అట్లే పోవును పిదప వచ్చును. దీనికంటే అద్భుతమైన ఇంద్రజాలము మరియేది కలదు?*

**దేహవద్వటధానాదౌ సువిచార్య విలోక్యతామ్ ।**
**క్వ ధానా కుత్ర వా వృక్షస్తస్మాన్మాయేతి నిశ్చిను ॥148॥**

*148.* శరీరము వలెనే వటవృక్షపు విత్తనము మొదలగు వాని గూర్చి ఆలోచించి చూడు. ఎక్కడి విత్తనము! ఎక్కడి వటవృక్షము! (అత్యల్పమగు మఱ్ఱివిత్తనము నుండి ఆ మహావృక్షము వచ్చుట పరమాద్భుతము కదా.) కనుక ఇది అంతా మాయయే అని నిశ్చయింపుము.

**నిరుక్తావభిమానం యే దధతే తార్కికాదయః ।**
**హర్ష మిశ్రాదిభిస్తే తు ఖండనాదౌ సుశిక్షితాః ॥149॥**

*149.* నిర్వచనమునందే అభిమానమునుంచు తార్కికులు మొదలగు వారు తమ తమ వాదములతో తామే సంతసింపవచ్చును. కాని వారి వాదనములందలి దోషములు హర్షమిశ్రుడు తన ఖండనఖండ ఖాద్యము *(140)* నందు విశదము చేసెను.

**అచిన్త్యాం ఖలు యే భావా న తాంస్తర్కేషు యోజయేత్ ।**
**అచింత్యరచనారూపం మనసాఽపి జగత్ఖలు ॥150॥**

*150.* మనస్సు గ్రహింపజాలని విషయములకు తార్కిక నియమములను తగిలింపరాదు. ఈ జగత్తు అట్టిది. ఏలన అది ఎట్లు సృష్టింపబడినదో ఊహింపనే సాధ్యము కాదు.

**అచింత్యరచనాశక్తిబీజం మాయేతి నిశ్చను ।**
**మాయాబీజం తదేవైకం సుషుప్తావనుభూయతే ॥151॥**

*151.* ఊహాతీతమైన ఆ కల్పనాశక్తి బీజమే మాయయని నిశ్చయింపుము. సుషుప్తియందు ఆ మాయాశక్తి బీజమే మనకు అల్పముగ అనుభవమునకు వచ్చును.

**జాగ్రత్స్వప్న జగత్తత్ర లీనం బీజ ఇవ ద్రుమః ।**
**తస్మాదశేషజగతో వాసనాస్తత్ర సంస్థితాః ॥152॥**

*152.* విత్తనమునందు వృక్షము లీనమై ఉన్నట్లే జాగ్రత్స్వప్న జగత్తులు సుషుప్తియందు లీనమై ఉన్నవి. అదే విధముగ అశేష జగత్తు యొక్క వాసనలు మాయయందు సుప్తములై ఉన్నవి.

**యా బుద్ధివాసనాస్తాసు చైతన్యం ప్రతిబింబతి ।**
**మేఘాకాశవదస్పష్ట చిదాభాసోఽనుమీయతామ్ ॥153॥**

*153.* బుద్ధియందు అట్లు సుప్తావస్థయందున్న జగద్వాసనలపై కూటస్థ చైతన్యము ప్రతిఫలించును. అస్పష్టత వలన అది అనుభవమునకు రాకున్నను దాని ఉనికిని అనుమానింపవచ్చును. మేఘమునందలి నీటి కణములలో ఆకాశ ప్రతిఫలనము ఊహించినట్లే.

**సాభాసమేవ తద్బీజం ధీరూపేణ ప్రరోహతి ।**
**అతో బుద్ధౌ చిదాభాసో విస్పష్టం ప్రతిభాసతే ॥154॥**

*154.* ఆ కూటస్థ చైతన్య ప్రతిఫలనముతో కూడిన మాయాబీజమే పెరిగి బుద్ధిరూపము దాల్చును. ఆపై బుద్ధియందు చిదాభాసము, చైతన్య ప్రతిఫలనము, స్పష్టముగ అహంతయై కన్పించును.

**మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతౌ శ్రుతమ్ ।**
**మేఘాకాశ జలాకాశావివ తౌ సువ్యవస్థితౌ ॥155॥**

*155.* జీవుడు ఈశ్వరుడు మాయయందు ప్రతిఫలించిన ఆత్మయని శ్రుతి చెప్పుచున్నది. మేఘమునందు ప్రతిఫలించిన ఆకాశము జలమునందు ప్రతిఫలించిన ఆకాశముల వలెనే. (మొదటిది ఈశ్వరుడు, రెండవది జీవుడు అని పోలికగా చెప్పవచ్చు.) తాపినీయ ఉప.9.

**మేఘవద్వర్తతే మాయా మేఘస్థితతుషారవత్ ।**
**ధీ వాసనాశ్చిదాభాస స్తుషారస్థఖవత్ స్థితః ॥156॥**

*156.* మాయను మేఘముతో పోల్చవచ్చు. బుద్ధి యందలి వాసనలు మేఘముగనున్న నీటి కణములతో పోల్చి చెప్పబడినవి. మాయయందు ప్రతిబింబితమైన కూటస్థ చైతన్యము ఈ జలబిందువులందు ప్రతి ఫలించు ఆకాశము వంటిదని చెప్పబడినది.

**వ్యాఖ్య:** ఈశ్వరతత్త్వమును వర్ణించు ఈ శ్లోకము అద్వైతసిద్ధాంతంలో ఒక దుమారమును లేపి ఒక సమస్యను కూడా పరిష్కరించినది.

చైతన్య ప్రతిఫలనము మాయయందైనను ఈశ్వరుడనీ అవిద్యయందైన జీవుడనీ మునుపు (ప్ర. 1.16,17) చెప్పబడినది.

ఈ శ్లోకమున మాయను మేఘముతో పోల్చి, బుద్ధి అందలి వాసనలలో ప్రతిఫలించిన చైతన్యము ఈశ్వరుడని సూచింపబడుచున్నది. అనగా ఈశ్వర సత్తను, మేఘములోని నీటిబిందువులందు ప్రతిఫలించే ఆకాశమును వలె, ఊహింపవలసినదే గాని అహంత వలె స్పష్టము కాదని ఉద్దేశము.

అంతేగాక ఈశ్వరుని ఉపాధి కేవలము మాయమాత్రమే గాక అందలి బుద్ధి వాసనలు కూడా అని ఏర్పడుచున్నది. ఇది అనవసరము కదా. మాయయందు సృష్టి అంతా ఉన్నది కనుక మాయను స్వీకరించుట చేతనే ఈశ్వరుడు సర్వజ్ఞుడు అగుచున్నాడు. 1. వాసనలనేకము లగుటచే వాని యందు ప్రతిఫలించుచు ఈశ్వరులు కూడా అనేకులగుదురు. 2. వ్యష్టి వాసనలని ఉద్దేశమైనచో ఆ ఈశ్వరుడు సర్వజ్ఞుడు కాక అల్పజ్ఞుడు మాత్రమే అగును. 3. సమష్టి వాసనలనినచో ప్రళయంలో తప్ప ఈ సమష్టి ఏర్పడదు కనుక సృష్టి స్థితి కాలములందు ఈశ్వరుడు లేకపోవలసి వచ్చును.

కాని మాయను మాత్రమే స్వీకరించిన చాలదు. ఈశ్వరోపాధియగు మాయ సాత్త్వికమగుటచే అందు వైవిధ్యముండజాలదు. కాని ఈశ్వరుడు సర్వజుడు అనేటప్పుడు ఆమూలాగ్రముగ జగత్తు నందలి వైవిధ్యమంతా ఈశ్వరునకు తెలియుననియే భావింతుము. ఈ వైవిధ్యమునిచ్చునది బుద్ధియందలి వాసనలే. అవి సృష్టి స్థితి ప్రళయ కాలములందుంటూ స్థూలసూక్ష్మకారణా వస్థలయందు మరల మరల మారుచుండును. కనుక ఈశ్వరునికి మాయ ఉపాధి ద్వారా ఐక్యతయు బుద్ధి వాసనలనెడి ఉపాధి ద్వారా వైవిధ్యమును సాధింపబడినవి.

అవాఙ్మానసగోచరమైన తత్త్వమును మాటల ద్వారా ఆలోచనల ద్వారా తర్కబద్ధమైన సిద్ధాంతమునందు బంధింపజూచు వారికి ఇట్టి అగచాట్లు తప్పవు.

**మాయాధీన శ్చిదాభాసః శ్రుతౌమాయీ మహేశ్వరః ।**
**అన్తర్యామీచ సర్వజ్ఞో జగద్యోనిః స ఏవ హి ॥157॥**

*157. మాయయందు ప్రతిఫలించిన చైతన్యము ఈశ్వరుడనీ, అతడు మాయకు ప్రభువనీ, ఆ మహేశ్వరుడు అంతర్యామీ సర్వజ్ఞుడూ జగత్కార ణమూ అనీ శ్రుతి చెప్పును. శ్వేతాశ్వతర ఉప.4.9-10; మాండూక్య ఉప.6.*

**సౌషుప్త మానందమయం ప్రక్రమ్యైవం శ్రుతిర్జగౌ ।**
**ఏష సర్వేశ్వర ఇతి సోఽయం వేదోక్త ఈశ్వరః ॥158॥**

*158. 'సౌషుప్త మానందమయ' మని మొదలై 'ఏష సర్వేశ్వర' యని అంతమగు శ్రుతి వాక్యము ఆనందమయ కోశమునే ఈశ్వరుడని వర్ణించినది.*

**వ్యాఖ్య:** మాండూక్య ఉప.5-6; బృహదారణ్యక ఉప.4-4-22. ఆనందమయ కోశముల సమష్టియే ఈశ్వరుడని ఉద్దేశము. పైన వాసనలయందు

ప్రతిఫలించిన చైతన్యము ఈశ్వరుడని చెప్పబడినది గదా! ఆ సూక్ష్మవిషయమును అర్థము చేసికొనలేని వారికి గ్రహణ సౌలభ్యము కొరకు అట్టి ప్రతిఫలనమగు ఆనందమయ కోశమే ఈశ్వరుడని చెప్పబడుచున్నది.

స్పష్టముగ ఆనందమయకోశమే ఈశ్వరుడనుటపై కూడా గొప్ప వాదోప వాదములున్నవి. విషయమే మనగా జీవుడు వ్యష్టియందు ప్రతిఫలించిన చైతన్యము. ఈశ్వరుడు సమష్టియందు ప్రతిఫలించిన చైతన్యము. సమష్టియందు వ్యష్టులన్నీ గ్రహింపబడుటచే ఈశ్వరునియందు జీవులందరును గ్రహింపబడుదురు. కాని అంత మాత్రముచే జీవులందరును వేరువేరుగ ఈశ్వరుడు కాజాలరు. గంగానదిలో ఎన్నో నీటి బిందువులున్నవి. కాని అన్నీ వేరువేరుగ గంగానది కానట్లే. అనగా సమష్టియందు సముదాయము మాత్రమే గాక ఒక విశిష్టమైన ఐక్యత కూడా ఉద్దేశింపబడుచున్నది.

జీవుడు జాగ్రదవస్థలో విశ్వుడనీ స్వప్నావస్థలో తైజసుడనీ సుషుప్తావస్థలో ప్రాజ్ఞుడనీ చెప్పబడుచున్నాడు. అట్లే ఈశ్వరుడు కూడా క్రమముగా వైశ్వానరుడు, హిరణ్యగర్భుడు, ఈశ్వరుడు అని చెప్పబడుచున్నాడు. మూడవస్థలయందున్న జీవుడు మూడు జీవులు కానట్లే ఈశ్వరుని మూడు భేదములు కూడా ఒక ఈశ్వరుణ్ణే సూచించును. కారణావస్థ యగు సుషుప్తావస్థ యందలి ఈశ్వరునిలో మిగిలిన రెండవస్థలును గ్రహింపబడును. ఈ విధముగ సర్వగతుడగు ఈశ్వరుడు అంతర్యామియై మూలకారణమై జగన్నియామకుడగుచున్నాడు.

సుషుప్తిలో ఆనందమయకోశమున కారణావస్థ యందున్న జీవుడు విస్తృతార్థమున ఈశ్వరుడనీ చెప్పవచ్చు. ఒక నగరము ఫలానా దేశమునకు మాత్రమేగాక అనంత విశ్వమునకు కూడా చెందును. జీవుని ఆనందమయకోశము ఈశ్వరుని ఆనందమయకోశములోని అంశమే అగుటచే జీవేశ్వరుల ఐక్యత నిలచుచున్నది.

**సర్వజ్ఞత్వాదికే తస్యనైవ విప్రతిపద్యతామ్ ।**
**శ్రౌతార్థస్యావితర్క్యత్వాన్మాయాయాం సర్వసంభవాత్ ॥159॥**

*159. ఆనందమయకోశమున సర్వజ్ఞత్వము మొదలైన గుణములున్నవా లేవా అని తర్కింపవలదు. శ్రుతి వాక్యములు తర్కమునకు విషయములు కావు గనుకను, మాయయందు సర్వమును సంభవమే అగుటచేతను తర్కమునకు అవకాశము లేదు.*

**అయం యత్సృజతే విశ్వం తదన్యథయితుం పుమాన్ ।**
**న కోఽపి శక్తస్తేనాయం సర్వేశ్వర ఇతీరితః ॥160॥**

*160.* ఆనందమయకోశము నుండి సృష్టింపబడుచున్న స్వప్నజాగ్రదవస్థలను మార్చుటకు ఎవరికిగాని శక్తి లేనందున దానిని సర్వేశ్వరుడనుట తగియున్నది.

**అశేష ప్రాణిబుద్ధీనాం వాసనాస్తత్ర సంస్థితాః ।**
**తాభిః క్రోడీకృతం సర్వం తేన సర్వజ్ఞ ఈరితః ॥161॥**

*161.* సకల ప్రాణికోటి యొక్క విషయవాసనలు ఆనందమయకోశమున ఉన్నవి. అవి అన్నీ దానియందు క్రోడీకరింపబడుట వలన అది సర్వజ్ఞుడనబడినది.

**వాసనానాం పరోక్షత్వాత్సర్వజ్ఞత్వం నహీక్ష్యతే ।**
**సర్వబుద్ధిషు తద్దృష్ట్వా వాసనాస్వనుమీయతామ్ ॥162॥**

*162.* (ఆక్షేపము) వాసనలు నేరుగా ఆనందమయకోశమునకును తెలియుట లేదు కనుక దాని సర్వజ్ఞత్వము ఎట్లు సిద్ధించును? (సమాధానము) అన్ని బుద్ధి వృత్తులయందును అది ఉండుటచే దానికి వాసనలన్నీ తెలియునని అనుమానింపవలసి ఉన్నది. కేన ఉప.2-4.

**విజ్ఞానమయముఖ్యేషు కోశేష్వన్యత్ర చైవహి ।**
**అంతస్తిష్ఠన్యమయతి తేనాన్తర్యామితాం ప్రజేత్ ॥163॥**

*163.* ఈశ్వరుడు విజ్ఞానమయకోశము మొదలుగా అన్ని కోశములందును, సృష్టి యందన్యత్రయు, ఉండి వాని కార్యకలాపములను చోదించుచు నియమించు చుండుట వలన అంతర్యామి అనబడుచున్నాడు.

**వ్యాఖ్య:** ఈశ్వరుడనగా ఆనందమయ కోశము నందలి ప్రతిఫలిత చైతన్యము. మాండూక్య ఉప. 5-6; బృహదారణ్యక ఉప. 3.7; తాపినీయ ఉప. 1.

**బుద్ధౌ తిష్ఠన్నాంతరోఽస్యా ధియానీక్ష్యశ్చ ధీవపుః ।**
**ధియ మంతర్యమయతీత్యేవం వేదేన ఘోషితమ్ ॥164॥**

*164.* బుద్దిని తన శరీరముగ జేసికొని ఈశ్వరుడు బుద్ధియందు ఉండుననీ, కాని బుద్ధియతని నెరుగదనీ బుద్ధియే ఈశ్వరునిచే నియమింపబడుచున్నదనీ శ్రుతి చెప్పును. బృహదారణ్యక ఉప: 3.7.15, 22.

**తంతుః పటే స్థితో యద్వదుపాదానతయా తథా ।**
**సర్వోపాదానరూపత్వా త్సర్వత్రాయమవస్థితః ॥165॥**

*165. నూలుపోగులు వస్త్రమునందు వ్యాపించి ఉండి వస్త్రమునకు ఉపాదానకారణమైనట్లే, యావద్విశ్వమున వ్యాపించియున్న అంతర్యామి దానికి ఉపాదానకారణమగుచున్నాడు.*

**పటాదప్యాన్తరస్తన్తుస్తన్తోరప్యంశురాన్తరః ।**
**ఆన్తరత్వస్య విశ్రాన్తిర్యత్రాసావనుమీయతామ్ ॥166॥**

*166. వస్త్రము కంటె నూలుపోగులు సూక్ష్మములు. పోగుల కంటె వానిలోని దారములు సూక్ష్మములు. ఇట్టి సూక్ష్మము కంటె సూక్ష్మవస్తువు లెచ్చట అవసానించునో అచ్చట ఈశ్వరుడు గలడని అనుమానము వలన తెలిసికో!*

**వ్యాఖ్య:** ఆంతరతముడగుటచే ఈశ్వరుడు నేరుగా అన్ని భూములందును తెలియబడడు. అనుమానము చేతనే తెలిసి కొనగలము.

**ద్విత్ర్యాన్తరత్వకక్షాణాం దర్శనేఽప్యయమాన్తరః ।**
**న వీక్ష్యతే తతో యుక్తి శ్రుతిభ్యామేవ నిర్ణయః ॥167॥**

*167. సూక్ష్మాతిసూక్ష్మ మగుటచేత ఈ ఆంతరతత్త్వము గోచరము కాదు. అనుమానము చేతను శ్రుతివాక్యముల చేతను మాత్రమే దానిని గూర్చి నియమింప దగును.*

**పటరూపేణ సంస్థానాత్పటస్తన్తోర్వపుర్యథా ।**
**సర్వరూపేణ సంస్థానాత్సర్వమస్య వపుస్తథా ॥168॥**

*168. వస్త్రముగా ఏర్పడిన నూలుపోగులకు ఆ వస్త్రమే శరీరముగా చెప్పబడినట్లు సర్వముగా ఏర్పడిన ఈశ్వరునకు సర్వమే శరీరమగుచున్నది.*

**తన్తోః సంకోచవిస్తారచలనాదౌ పట స్తథా ।**
**ఆవశ్యమేవ భవతి న స్వాతంత్ర్యం పటే మనాక్ ॥169॥**

*169. నూలుపోగులు సంకోచించి వ్యాకోచము చెంది ఇతర విధముగ చలించినపుడు ఆ వికారములే వస్త్రమునకును సంక్రమించును. దానికి స్వాతంత్ర్యమే లేదు.*

**తథాఽన్తర్యామ్యయం యత్రయయా వాసనాయా యథా ।**
**విక్రియేత తథాఽవశ్యం భవత్యేవ న సంశయః ॥170॥**

*170.* అట్లే ఆ అంతర్యామి ఎచ్చట, ఏ వాసనచే ఎట్లు వికారము నొందించునో ఆయా విషములు అట్లే ఆవశ్యముగ వికారము నొందును. ఇందు సంశయము లేదు.

**ఈశ్వర సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥171॥**

*171.* భగవద్గీతయందు శ్రీకృష్ణుడిట్లు చెప్పెను: అర్జునా సర్వ భూతముల హృదయములందు ఈశ్వరుడు గలడు. మాయచే సకలజీవులను ఈశ్వరుడు, యంత్రము నెక్కించిన బొమ్మలవలె, త్రిప్పుచుండును.

**సర్వభూతాని విజ్ఞానమయాస్తే హృదయేస్థితాః ।**
**తదుపాదాన భూతేశస్తత్ర విక్రియతే ఖలు ॥172॥**

*172.* 'సర్వభూతాని' అనగా సకల ప్రాణుల యందలి జీవులు, ఆనందమయ కోశములు. వానికి ఉపాదానకారణమగుటచే ఈశ్వరుడు కూడా వికారమునొందును. అనగా ఉపాధివశమున వికారము నొందినట్లు కన్పించును.

**దేహాది పంజ్జరం యన్త్రం తదారోహోఽభిమానితా ।**
**విహితప్రతిషిద్ధేషు ప్రవృత్తిర్భ్రమణం భవేత్ ॥173॥**

*173.* యంత్రమనగా శరీర పంజరము. ఆరోహమనగా దాని యందు 'నేను' అనే అభిమానముంచుట. భ్రమణమనగా విహిత, నిషిద్ధ కర్మలను ఆచరించుట.

**విజ్ఞానమయరూపేణ తత్ప్రవృత్తి స్వరూపతః ।**
**స్వశక్త్యేశో విక్రియతే మాయయా భ్రామణం హి తత్ ॥174॥**

*174.* ఈశ్వరుడు తన మాయచే జీవులను త్రిప్పుననగా ఈశ్వరుడు తన మాయాశక్తిచే ఆనందమయకోశముల రూపమునొంది వాని వికారములచే తాను వికారము నొందుచున్నట్లు కన్పించుట.

**అన్తర్యమయతీత్యుక్త్యాఽయమేవార్థః శ్రుతౌ శ్రుతః ।**
**పృథివ్యాదిషు సర్వత్ర న్యాయోఽయం యోజ్యతాం ధియా ॥175॥**

*175.* ఈశ్వరుడులో నుండి నియమించుననుచు శ్రుతి ఈ అర్థమునే చెప్పుచున్నది. ఈ న్యాయమునే పృథివి మొదలగు మహా భూతములకు, తదితర విషయములకు కూడా అన్వయింపవలెను.

**జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః జానామ్యధర్మం న చ మే నివృత్తిః ।**
**కేనాపిదేవేన హృది స్థితేన యథా నియుక్తోఽస్మి తథాకరోమి ॥176॥**

*176. ఏది ధర్మమో నాకు తెలుసు. కాని దానిని అనుసరించి ప్రవర్తింపను. అధర్మమేదో తెలుసు. కాని దాని నుండి విరమింపను. హృదయమునందు ఆసీనుడైన ఏ దైవమో ఎట్లు నియమించిన అట్లు చేయుదును.*

**వ్యాఖ్య:** ప్రసన్నగీత యందలి దుర్యోధనుని పలుకులు 'కేనాపి దేవేన' అనే మార్పుతో భగవంతుడే కర్తయని భావించే జ్ఞాని వాక్కుగా చెప్పబడినవి.

**నార్థః పురుషకారేణేత్యేత్వ మాశంక్యతాం యతః ।**
**ఈశః పురుషకారస్య రూపేణాపి వివర్తతే ॥177॥**

*177. ఈశ్వరుడే అంతా చేయుచున్నచో ఇక పురుషకారమేల? అని శంకింప పనిలేదు. ఈశ్వరుడు పురుషప్రయత్న రూపమున కూడా భాసించును.*

**ఈదృగ్బోధేనేశ్వరస్య ప్రవృత్తిర్మైవ వార్యతామ్ ।**
**తథాపీశస్య బోధేన స్వాత్మాసఙ్గత్వ ధీజనిః ॥178॥**

*178. ఇట్టి సిద్ధాంతము ఈశ్వరుడు సర్వమును చోదించుననుటతో విరోధింపదు. ఈశ్వరుడు అంతర్యామి అని తెలిసికొనిన పురుషుడు తన ఆత్మ అసంగమని కూడా తెలిసికొనును.*

**తావతా ముక్తి రిత్యాహుః శ్రుతయః స్మృతయస్తథా ।**
**శ్రుతి స్మృతీ మమైవాజ్ఞే ఇత్యపీశ్వర భాషితమ్ ॥179॥**

*179. ఆత్మ అసంగమనెడి బోధయే ముక్తికి కారణమని శ్రుతి వాక్యములు స్మృతి వాక్యములును చెప్పుచున్నవి. వరాహపురాణమున శ్రుతి స్మృతితులు కూడా తన ఆజ్ఞ వలననే అని ఈశ్వరుడనును.*

**ఆజ్ఞాయా భీతిహేతుత్వం భీషాఽస్మాదితి హి శ్రుతమ్ ।**
**సర్వేశ్వరత్వమేతత్స్యా దన్తర్యామిత్వతః పృథక్ ॥180॥**

*180. ఈశ్వరుని వలని భీతిచే ప్రకృతి శక్తులు ప్రవర్తించునని శ్రుతిలో వింటాము. అనగా ఈశ్వరాజ్ఞ భయము కలిగించును. కనుక ఈశ్వరుని అంతర్యామిత్వము కంటె భిన్నమై ఈశ్వరుని సర్వేశ్వరత్వము కూడా ఉన్నది.*

తైత్తిరీయ ఉప. 2. 8. 1; కఠ ఉప. 2. 3. 3; నృసింహ తాపనీయ ఉప. 2. 4.

**ఏతస్య వా అక్షరస్య ప్రశాసన ఇతి శ్రుతిః ।**
**అన్తః ప్రవిష్టః శాస్తాయం జనానా మితి చ శ్రుతిః ॥181॥**

*181.* అక్షరుడగు ఈశ్వరుని శాసనముచే సూర్యుడు గ్రహములు సంచరించుననని ఒక శ్రుతి చెప్పును. జనుల శరీరములందు ప్రవేశించి ఈశ్వరుడు వారిని శాసించుననని మరొక శ్రుతియనును. బృహదారణ్యక ఉప:*3.8.9;* తైత్తిరీయ ఆరణ్యకము *3.11.*

**జగద్యోనిర్భవేదేష ప్రభవాప్యయకృత్త్వతః ।**
**ఆవిర్భావ తిరోభావా వుత్పత్తిప్రలయౌ మతౌ ॥182॥**

*182.* జగత్తును సృష్టించి లయింపజేయును గనుక ఈశ్వరుడు జగత్కారణుడు అనబడుచున్నాడు. ఆవిర్భావమే సృష్టి తిరోభావమే (కనిపించక పోవుట) ప్రళయము. (మాండూక్య ఉప.*6;* నృసింహ ఉత్తర తాపనీయ ఉప. *1;* నృసింహ పూర్వతాపనీయ ఉప.*4.1;* శ్వేతాశ్వతర ఉప.*5.5, 5.11.)*

**ఆవిర్భావయతి స్వస్మిన్విలీనం సకలం జగత్ ।**
**ప్రాణికర్మవశాదేష పటో యద్వత్ప్రసారితః ॥183॥**

*183.* సకలజగత్తు ఈశ్వరుని యందు వాసనారూపమున లీనమై ఉండును. దానినే ఈశ్వరుడు ఆయా ప్రాణుల పూర్వకర్మను అనుసరించి సృష్టించును, అనగా వ్యక్తమగునట్లు చేయును. సృష్టి అనగా చుట్టియుంచిన పటమున విప్పి చూపినట్లే.

**పునస్తిరోభావయతి స్వాత్మన్యేవాఖిలం జగత్ ।**
**ప్రాణికర్మక్షయవశా త్సంకోచిత పటో యథా ॥184॥**

*184.* ప్రాణుల కర్మ అంతా తీరిన పిదప మరల ఈ అఖిల విశ్వమును తనయందే లీనము చేసికొనును. ప్రళయమనగా విప్పియుంచిన పటమును మరల చుట్ట చుట్టినట్లే.

**రాత్రిఘస్రౌ సుప్తిబోధావున్మీలన నిమీలనే ।**
**తూష్ణీంభావమనోరాజ్యే ఇవ సృష్టిలయావిమౌ ॥185॥**

*185.* జగత్తు యొక్క సృష్టి ప్రళయములను పగలు రాత్రులతోను, జాగృతి సుషుప్తులతోను, కన్నులు తెరచుట మూసికొనుటలతోను, మనస్సు ఊహా ప్రపంచములను కల్పించుట నిశ్చలముగ ఉండుట లతోను పోల్చవచ్చును.

**ఆవిర్భావ తిరోభావ శక్తిమత్త్వేన హేతునా ।**
**ఆరంభ పరిణామాది చోద్యానాం నాత్ర సంభవః ॥186॥**

*186. ఈశ్వరుడు ప్రత్యక్షము అంతర్ధానము చేయు మాయాశక్తి గల వాడు. ఈ కారణము చేత 'సృష్టి ప్రారంభమైనది, సృష్టి పరిణమించినది' మొదలైన వాదములు ఇచ్చట సంభవములు కావు.*

**వ్యాఖ్య:** సృష్టివాదములు మూడు విధములు. నైయాయికుల ఆరంభవాదమున పరమాణువుల కలయికలతో సృష్టి ఆరంభమగును. సాంఖ్యుల పరిణామవాదమున అవ్యక్తమైన ప్రకృతి పరిణామము నొందుచు ఈ వ్యక్తమైన జగత్తుగ నేర్పడును. ఈ రెండూ జగత్తు వాస్తవమని స్వీకరించును. వేదాంతుల వివర్తవాదమున సృష్టి అనునది అవ్యక్తమగు బ్రహ్మముపై భ్రమాత్మకమగు ఒక ఆరోపము మాత్రమే.

ఈశ్వరునుకి ప్రారంభము లేదు, ఈశ్వరుడు అద్వితీయుడై అభిన్నుడై ఉండుట వలన. రెండు వేరు వేరు వస్తువులు కలసిన కదా ఆరంభము! ఈశ్వరుడు పరిణామి కాడు, అవయవములు లేకపోవుట వలన, భాగముల వృద్ధిక్షయాదుల వలన కదా పరిణామమను వికారము సంభవము! కనుక వాస్తవముగ ఏ వికారమూ లేక, వికారమున్నట్లు కన్పించే వివర్తముననే ఈశ్వరుడు ఉండును.

**అచేతనానాం హేతుః స్యాజ్జాడ్యాంశేనేశ్వరస్తథా ।**
**చిదాభాసాంశతస్త్వేష జీవానాం కారణం భవేత్ ॥187॥**

*187. మాయయందలి తమస్సు ద్వారా ఈశ్వరుడు అచేతన వస్తువులకు కారణమగుచున్నాడు. చైతన్య ప్రతిఫలనము ద్వారా జీవులకు ఈశ్వరుడు కారణుడగుచున్నాడు.*

**తమః ప్రధానః క్షేత్రాణాం చిత్ప్రధానశ్చిదాత్మనామ్ ।**
**పరః కారణతామేతి భావనా జ్ఞాన కర్మభిః ॥188॥**

*188. కాని, పరమాత్మయే తన తమః ప్రధానమైన అంశముచే శరీరములకూ, చిత్ప్రధానమైన అంశముచే జీవులకూ కారణము. ఆయా సంస్కారములు జ్ఞానము కర్మలను అనుసరించి ఆయా శరీరములు జీవులు పరమాత్మ నుండే ఏర్పడును.*

**ఇతివార్తికకారేణ జడచేతన హేతుతా ।**
**పరమాత్మన ఏవోక్తా నేశ్వరస్యేతి చేచ్ఛృణు ॥189॥**

*189.* ఇట్లు వార్తికకారుడైన సురేశ్వరాచార్యునిచే జడ చేతనములకు కారణము పరమాత్మయే ఈశ్వరుడు కాడు అని చెప్పబడినదనినచో వినుము.

**అన్యోన్యాధ్యాస మత్రాపి జీవకూటస్థయోరివ ।**
**ఈశ్వరబ్రహ్మణోః సిద్ధం కృత్వా బ్రూతే సురేశ్వరః ॥190॥**

*190.* జీవుడు కూటస్థచైతన్యముల అన్యోన్యాధ్యాస సిద్ధమైనట్లే ఈశ్వరుడు బ్రహ్మముల అన్యోన్యాధ్యాస సిద్ధమని భావించియే సురేశ్వరులట్లు చెప్పిరి. త్వం పదమున వలె తత్ పదమునను అధిష్ఠాన ఆరోపములకు అన్యోన్యాధ్యాసను సురేశ్వరులు స్వీకరించిరని భావము.

**సత్యంజ్ఞానమనంతం యద్బ్రహ్మ తస్మాత్సముత్థితాః ।**
**ఖంవాయ్వగ్నిజలోర్వ్యోషధ్యన్న దేహా ఇతి శ్రుతిః ॥191॥**

*191.* సత్యము జ్ఞానము అనంతమగు బ్రహ్మము నుండి ఆకాశము వాయువు జలము భూమి ఓషధులు అన్నము శరీరములు జనించినవని శ్రుతి.

**వ్యాఖ్య:** తైత్తిరీయ ఉప. 2.1.1-2 సురేశ్వరులట్లు స్వీకరించిరనుటకు ఉపపత్తి చెప్పబడుచున్నది.

**ఆపాతదృష్టితస్తత్ర బ్రహ్మణో భాతి హేతుతా ।**
**హేతోశ్చ సత్యతా తస్మాదన్యోన్యాధ్యాస ఇష్యతే ॥192॥**

*192.* పై చూపులకు బ్రహ్మమే జగత్కారణమనీ జగత్కర్తృత్వము సత్యమనీ తోచును. ఈ విరోధము బ్రహ్మము ఈశ్వరుల అన్యోన్యాధ్యాస వినా తీరదు. బ్రహ్మము యొక్క సత్యత్వము ఈశ్వరునిపైనను ఈశ్వరుని జగత్కర్తృత్వము బ్రహ్మముపైను అధ్యసింపబడినవి ఆరోపింపబడినవి అని స్వీకరించుట చేతనే శ్రుతివాక్యము సంబద్ధమగును.

**అన్యోన్యాధ్యాసరూపోఽసావన్నలిప్తపటో యథా ।**
**ఘట్టితేనైకతామేతి తద్వత్ భ్రాంత్యైకతాం గతః ॥193॥**

*193.* గంజిపెట్టిన వస్త్రమునందు బిగువు ఎండిన గంజి యొక్క లక్షణము. కాని అదీ, వస్త్రమూ ఒకటే అని భావించి వస్త్రము బిగువుగ ఉన్నది అందురు. ఇదే అన్యోన్యాధ్యాస రూపము. అట్లే ఈశ్వరుడు బ్రహ్మము ఒకటే అని అన్యోన్యాధ్యాస వలన జనులు భావింతురు.

**వ్యాఖ్య:** బ్రహ్మము నిర్గుణసత్తయైన చైతన్యము. ఈశ్వరుడు మాయయందు ప్రతిఫలించిన చైతన్యము. చూ ప్ర. 6. 1–4.

**మేఘాకాశమహాకాశౌ వివిచ్యేతే న పామరైః ।**
**తద్వద్బ్రహ్మేశయోరైక్యం పశ్యంత్యాపాత దర్శినః ।194॥**

*194. మేఘమునందు ప్రతిఫలించిన ఆకాశము అసలు ఆకాశము ఒకటే అని పామరజనులు భావింతురు. అట్లే పైపైన మాత్రము చూచేవారు బ్రహ్మము ఈశ్వరుడు ఒకటే అని చూతురు.*

**ఉపక్రమాదిభిర్లిఙ్గైస్తాత్పర్యస్య విచారణాత్ ।**
**అసఙ్గం బ్రహ్మ మాయావీ సృజత్యేష మహేశ్వరః ॥195॥**

*195. శ్రుతివాక్యముల తాత్పర్య నిర్ణయమునకు సూచింపబడిన ఆరు నియమములను ఉపయోగించి విచారించినచో బ్రహ్మము అసంగమనీ మాయతో కూడిన మహేశ్వరుడు సృష్టికర్త అనీ తేటపడును.*

**వ్యాఖ్య:** ఉపక్రమ ఉపసంహారములు, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము ఉపపత్తి అనునవి షడ్లింగములు. 1. ఆదియందూ అంతమునందూ ఛాందోగ్యపనిషత్తు బ్రహ్మమును గూర్చి చెప్పును. 2. అభ్యాసమనగా మరలమరల చెప్పుట. 'తత్త్వమసి' అనే వాక్యము తొమ్మిది పర్యాయములు చెప్పబడినది. 3. అపూర్వత అనగా ఇతర ప్రమాణముల వలన తెలియకుండుట. బ్రహ్మము యొక్క లక్షణములు శ్రుతి ప్రమాణముచే తప్ప ప్రత్యక్షానుమానాది ఇతర ప్రమాణముల వలన తెలియబడవు. 4. శ్రుతివాక్యములు ఫలవంతముగ ఉండాలి. బ్రహ్మజ్ఞానము యొక్క ఫలము ఆత్యంతిక దుఃఖనివృత్తి పరమానంద ప్రాప్తి. 5. అర్థవాదము అనగా ప్రశంస, బ్రహ్మేతరముల నింద, ఇదీ శ్రుతి వాక్యాలలో లభించును. 6. ఉపపత్తి అనగా తగిన హేతువాదములు ఉదాహరణములు. ఇవి కూడా ఉపనిషత్తులలో విస్తారముగ లభించును.

ఇట్లు ఈ ఆరు నియమములను అనుసరించి శ్రుతివాక్యములను సమన్వయించి విచారించినచో బ్రహ్మము ఈశ్వరుల తత్త్వము చక్కగా అర్థమగును. అన్యోన్యా ధ్యాస తేటపడును.

**సత్యం జ్ఞాన మనంతం చేత్యుపక్రమ్యోప సంహృతమ్ ।**
**యతో వాచో నివర్తన్త ఇత్యసఙ్గత్వ నిర్ణయః ॥196॥**

*196.* ఆదియందూ, అంతమునందూ బ్రహ్మము సత్యము జ్ఞానము అనంత మనీ, వాక్కు తదితర ఇంద్రియములకు అది అగ్రాహ్యామనీ శ్రుతి చెప్పును. దీని వలన బ్రహ్మము సంగరహితమని నిర్ణయింపబడుచున్నది. తైత్తిరీయ ఉప.*2.1.1, 2.4.1;* కేన ఉప.*1.5,8;* బృహదారణ్యక ఉప.*4.3.15, 4.4.22.*

**మాయీ సృజతి విశ్వం సన్నిరుద్ధస్తత్ర మాయయా ।**
**అన్య ఇత్యపరా బ్రూతే శ్రుతిస్తే నేశ్వరః సృజేత్ ॥197॥**

*197.* మరొక శ్రుతి మాయకు ప్రభువగు ఈశ్వరుడు జగత్తును సృష్టించుననీ జీవుడు మాయకు వశుడనీ చెప్పును. కనుక మాయతో కూడిన ఈశ్వరుడు సృష్టికర్త. శ్వేతాశ్వతర ఉప.*4-9.*

**ఆనందమయ ఈశోఽయం బహు స్యామిత్యవైక్షత ।**
**హిరణ్యగర్భరూపోఽభూత్సుప్తిః స్వప్నో యథా భవేత్ ॥198॥**

*198.* సుషుప్తి అవస్థ స్వప్నావస్థగా మారినట్లే ఆనందమయుడగు ఈశ్వరుడు, ఒకడైన తాను అనేకులు కావలెనని సంకల్పించినపుడు, హిరణ్యగర్భుడగును. దాని వలన సకల సూక్ష్మశరీరముతో సంబంధపడును.

**క్రమేణ యుగపద్వైషా సృష్టిర్జ్ఞేయా యథాశ్రుతి ।**
**ద్వివిధశ్రుతి సద్భావాత్ ద్వివిధ స్వప్నదర్శనాత్ ॥199॥**

*199.* శ్రుతిని అనుసరించి ఈ సృష్టిక్రమముగ జరిగినదనీ, హఠాత్తుగ ఒక్కసారిగ జరిగినదనీ తెలియవలెను. ఈ రెండు విధములుగను శ్రుతి వాక్యములు ఉన్నవి. అనుభవమున కూడా స్వప్నములు సుషుప్తి నుండి క్రమముగను హఠాత్తుగను కూడా కలుగును. తైత్తిరీయ ఉప.*2.1.1, 2.6.1;* బృహదారణ్యక ఉప. *1.2.5.*

**సూత్రాత్మా సూక్ష్మదేహాఖ్యః సర్వజీవఘనాత్మకః ।**
**సర్వాహంమానధారిత్వా త్క్రియాజ్ఞానాది శక్తిమాన్ ।200॥**

*200.* సూత్రాత్మ, సూక్ష్మశరీరి అనబడు హిరణ్యగర్భుడు సకల జీవుల సూక్ష్మశరీరముల సమష్టి. వస్త్రమునందు అంతటా అనుస్యూతమై ఉన్న తంతువు వలె అన్ని జీవులయందు ఉన్న 'అహం' భావన అతడే. కనుకనే అతనికి ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు గలవని చెప్పబడుచున్నవి.

**ప్రత్యూషే వా ప్రదోషే వా మగ్నో మందే తమస్యయమ్ ।**
**లోకోభాతి యథా తద్వదస్పష్టం జగదీక్ష్యతే ॥201॥**

*201. ఉదయసంధ్య సాయంసంధ్యల యందూ, మందాంధ కారము నందూ ఈ లోకము అస్పష్టముగ కన్పించినట్లే హిరణ్యగర్భావస్థయందు సృష్టి అస్పష్టముగ గోచరించును.*

**సర్వతో లాంఛితో మష్యా యథా స్యాద్ఘట్టితః పటః ।**
**సూక్ష్మాకారైస్త థేశస్య వపుః సర్వత్ర లాంఛితమ్ ॥202॥**

*202. గంజితో బిగువెక్కిన వస్త్రముపై చిత్రపు రేఖలు రంగుతో దిద్దినట్లే హిరణ్యగర్భుని యందు సూక్ష్మశరీరములు రేఖామాత్రముగ కనిపించును.*

**సస్యం వా శాకజాతం వా సర్వతోంకురితం యథా ।**
**కోమలం తద్వదేవైష పేలవో జగదఙ్కురః ॥203॥**

*203. ధాన్యపు లేక చిన్న మొక్కల యొక్క అంకురము ఎట్లు సుకుమారముగ ఉండునో అట్లే ఈ జగదంకురము పేలవముగ ఉండును.*

**వ్యాఖ్య:** అపంచీకృత మహాభూతములచే ఏర్పడిన సూక్ష్మశరీరములు మాయయగు ఈశ్వరుని శరీరము నందు రేఖల వలె అంకురముల వలె ప్రారంభదశయందు ఉండును.

**ఆతపాభాతలోకో వా పటో వా వర్ణపూరితః ।**
**సస్యం వా ఫలితం యద్వత్తథా స్పష్టవపుర్విరాట్ ॥204॥**

*204. పట్టపగలున ఈ లోకము కన్పించినట్లు, పూర్తిగా రంగులుదిద్దిన వర్ణచిత్రము వలె, పంటకు వచ్చిన ధాన్యము వలె విరాట్టు దశయందు జగత్తు పరిపూర్ణమై కన్పించును. స్థూలశరీరములన్నీ స్పష్టముగ ఈ దశయందు ఏర్పడును.*

**విశ్వరూపాధ్యాయ ఏష ఉక్తః సూక్తేఽపి పౌరుషే ।**
**ధాత్రాదిస్తంబ పర్యంతానేతస్యావయవాన్విదుః ॥205॥**

*205. ఈ విషయము, అనగా విరాట్టు, భగవద్గీతయందలి విశ్వరూప దర్శనాధ్యాయములో, పురుష సూక్తములో వర్ణింపబడినది.... బ్రహ్మ మొదలు గడ్డిపోచవరకు ప్రపంచమునందలి అన్ని వస్తువులు విరాడాంశములే.*

**ఈశ సూత్ర విరాడ్వేధో విష్ణు రుద్రేంద్ర వహ్నయః ।**
**విఘ్నభైరవమైరాల మారికా యక్షరాక్షసాః ॥206॥**

*206.* విరాడ్రూపములైన ఈశ్వరుడు హిరణ్యగర్భుడు విరాట్టు బ్రహ్మ విష్ణువు శివుడు ఇంద్రుడు అగ్ని గణేశుడు భైరవుడు మైరాలుడు మారికుడు యక్షులు రాక్షసులు.

**విప్రక్షత్రియవిట్శూద్రా గవాశ్వమృగ పక్షిణః ।**
**అశ్వత్థపటచూతాద్యా యవవ్రీహితృణాదయః ॥207॥**

*207.* బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు ఆవులు గుర్రములు జంతువులు పక్షులు రావి మర్రి మామిడి మొదలైన చెట్లు యవలు వడ్లు గడ్డి మొదలగునవి.

**జలపాషాణ మృత్కాష్ఠవాప్యాకుద్దాలకాదయః ।**
**ఈశ్వరాః సర్వ ఏవైతే పూజితా ఫలదాయినః ॥208॥**

*208.* జలము రాళ్ళు మట్టి కర్ర ఉలి గడ్డపార మొదలైనవన్నీ ఈశ్వర రూపములే. ఈశ్వరుడని భావించి పూజించినచో అన్నీ ఫలము నిచ్చునవే.

**యథా యథోపాసతే తం ఫలమీయుస్తథా తథా ।**
**ఫలోత్కర్షాపకర్షా తు పూజ్యపూజానుసారతః ॥209॥**

*209.* ఎట్లెట్లు పూజింతురో, ఏయే రూపమున పూజింతురో అట్లే ఫలమును పొందుదురు. ఫలమునందలి హెచ్చుతగ్గులు పూజ్యవిషయపు శ్రేష్ఠతపైనను పూజా విధానముపైనను ఆధారపడును. చూ. భగవద్గీత *4.11.*

**ముక్తిస్తు బ్రహ్మతత్త్వస్య జ్ఞానాదేవ న చాన్యథా ।**
**స్వప్రబోధం వినానైవ స్వస్వప్నో హీయతే యథా ॥210॥**

*210.* కాని బ్రహ్మతత్త్వము తెలిసికొనిన మాత్రమే ముక్తి లభించును. వేరు దారి లేదు. తన స్వప్నములు తాను మేలుకొననిదే అంతము కావు కదా.

**అద్వితీయ బ్రహ్మతత్త్వే స్వప్నోఽయమఖిలంజగత్ ।**
**ఈశ జీవాది రూపేణ చేతనాచేతనాత్మకమ్ ॥211॥**

*211.* అద్వితీయమగు, రెండవది లేని, బ్రహ్మతత్త్వమునందు ఈ అఖిల జగత్తు ఒక కల మాత్రమే. ఈశ్వరుడు జీవుల చేతనములు అచేతనములు అన్నీ కలలోనివే.

**ఆనందమయ విజ్ఞానమయా వీశ్వర జీవకౌ ।**
**మాయయా కల్పితావేతౌ తాభ్యాం సర్వం ప్రకల్పితమ్ ॥212॥**

*212. ఆనందమయకోశము విజ్ఞానమయకోశముల రూపమున ఈశ్వరుని జీవులను మాయ కల్పించెను. ఈ దృశ్యమాన జగత్తంతా ఈశ్వర జీవుల సృష్టియే.*

**ఈక్షణాదిప్రవేశాన్తా సృష్టిరీశేన కల్పితా ।**
**జాగ్రదాది విమోక్షాన్తః సంసారో జీవకల్పితః ॥213॥**

*213. సృష్టిని సంకల్పించుట మొదలు అందు ప్రవేశించుట వరకు ఈశ్వరుడు కల్పించెను. జాగ్రదవస్థ మొదలు మోక్షము వరకు గల సంసారమును జీవుడు కల్పించెను. ఐతరేయ ఉప: **1.1.1; 1.3.12, 13.** వరాహ. ఉప. 2-54. చూ. ప్ర. 7-4.*

**అద్వితీయం బ్రహ్మతత్త్వ మసఙ్గం తన్న జానతే ।**
**జీవేశయోర్మాయికయోర్వృథైవ కలహం యయుః ॥214॥**

*214. అద్వితీయము సంగరహితము అగు బ్రహ్మతత్త్వమును ఎరుగని వారు మాయాకల్పితములగు జీవేశ్వరులను గూర్చి వాదవివాదాలు చేయుదురు.*

**జ్ఞాత్వా సదాతత్త్వనిష్ఠాననుమోదామ హే వయమ్ ।**
**అనుశోచామ ఏవాన్యాన్న భ్రాంతైర్వివదామహే ।7215॥**

*215. తత్త్వనిష్ఠులైన వారితో సంతోషము నొందుదుము. ఇతరుల పట్ల సానుభూతి చూపుదుము. భ్రాంతులతో తగవు మాత్రము పెట్టుకొనము.*

**వ్యాఖ్య:** అజ్ఞానమూలమున కదా వాదవివాదములు చేయుదురు. వారికి యథార్థమును బోధింపవలదా అనే ప్రశ్నకు సమాధానము చెప్పబడినది. సత్యాన్వేషులగు వారికి సంతోషముగ బోధింపవచ్చును. సత్యమక్కర లేక అసత్య విషయములలో ఆనందించే వారి పట్ల సానుభూతి చూపవచ్చును. కాని సత్యమును గూర్చి భ్రాంతిచెంది తాము చెప్పునదే సత్యమని కలహించే భ్రాంతులకు బోధింప బూనుట వృథాశ్రమ.

**తృణార్చకాది యోగాన్తా ఈశ్వరే భ్రాంతిమాశ్రితాః ।**
**లోకాయతాది సాంఖ్యాన్తా జీవే విభ్రాన్తి మాశ్రితాః ॥216॥**

*216.* గడ్డిని పూజించువారు మొదలు యోగసాధకుల వరకు అందరూ ఈశ్వరుని గూర్చి భ్రమించినవారు. లోకాయతులు (చార్వాకులు) మొదలు సాంఖ్యుల వరకు అందరు జీవుని గూర్చి భ్రమించిన వారు.

**అద్వితీయ బ్రహ్మతత్త్వం న జానన్తి యదా తదా ।**
**భ్రాన్తా ఏవాఖిలాస్తేషాం క్వ ముక్తిః క్వేహ వా సుఖమ్ ॥217॥**

*217.* అద్వితీయ బ్రహ్మతత్త్వమును ఎరుగకపోవుట చేత వారందరూ భ్రాంతిచెందినవారే. వారికి ముక్తి ఎక్కడ? సుఖమెక్కడ? ఏదీ లేదని భావము.

**ఉత్తమాధమ భావశ్చేత్తేషాం స్యాదస్తు తేన కిమ్ ।**
**స్వప్నస్థ రాజ్యభిక్షాభ్యాం న బుద్ధః స్పృశ్యతే ఖలు ॥218॥**

*218.* వారికిని ఉత్తమము అధమములైన సుఖములు ఉండవచ్చును గదా, బ్రహ్మజ్ఞానము లేకపోయినా అంటే ఉండనిమ్ము. దాని వలన లాభమేమి? స్వప్నమందు రాజ్యములేలినా బిచ్చమెత్తినా మేలుకొనినపుడు సమానమే గదా.

**తస్మా న్ముముక్షుభిర్నైవ మతిర్జీవేశవాదయోః ।**
**కార్యా కింతు బ్రహ్మతత్త్వం విచార్యం బుధ్యతాం చ తత్ ॥219॥**

*219.* కనుక ముముక్షువులకు జీవేశ్వరులను గూర్చి వాదములు పెట్టుకొనుట తగదు. కాగా బ్రహ్మతత్త్వమును గూర్చి విచారింపవలెను. దానిని తెలిసికొనవలెను కూడా.

**పూర్వపక్షతయా తౌ చేత్తత్త్వ నిశ్చయహేతుతామ్ ।**
**ప్రాప్నుతోఽస్తు నిమజ్జస్వ తయోర్నైతావతావశః ॥220॥**

*220.* అట్టివాదములు పూర్వపక్షరూపమున తత్త్వనిశ్చయమునకు తోడుపడును కదా అంటే అట్లే కానిమ్ము. కాని వశము తప్పి ఆ వాదవివాద సముద్రమున మునిగిపోకుండ మాత్రము జాగ్రత్తపడుము.

**వ్యాఖ్య:** వాదోపవాదములు అంతులేక కొనసాగును. అవి చిత్తవిభ్రమణమును మాత్రమే కల్పించును.

**అసఙ్గ చిద్విభుర్జీవః సాంఖ్యోక్త స్తాదృగీశ్వరః ।**
**యోగోక్తస్తత్త్వమోరథౌ శుద్ధౌ తావితి చేచ్ఛృణు ॥221॥**

*221.* *(ఆక్షేపము):* కాని 'సాంఖ్యులు చెప్పునట్లు జీవేశ్వరులు

సంగరహితులు శుద్ధచైతన్యము శాశ్వతులు అనీ యోగులనునట్లు తత్త్వమసి అనే వాక్యమున తత్ త్వం అనే పదములకు అర్థమగు ఈశ్వరుడు జీవుడు శుద్ధ స్వరూపులనీ వేదాంతులు అంగీకరింపవలెను' అంటే విను.

**న తత్త్వమోరుభావర్థావస్మత్సిద్ధాన్తతాం గతౌ ।**
**అద్వైత బోధనాయైవ సా కక్షా కాచిదిష్యతే ॥222॥**

*222. (సమాధానము):* ఆ అర్థములు అద్వైత సిద్ధాంతమును అనుసరింపవు. అవి జీవ ఈశ్వరులకు వాస్తవమగు భేదమున్నట్లు ప్రతిపాదించును. అద్వైత సిద్ధాంతమున అట్టి భేదము లేదు. సిద్ధాంతము బోధించుటకు తాత్కాలికముగ మాత్రమే భేదము స్వీకరింపబడును.

**అనాది మాయయాభ్రాంతా జీవేశౌ సువిలక్షణౌ ।**
**మన్యన్తే తద్వ్యుదాసాయ కేవలం శోధనం తయోః ॥223॥**

*223.* అనాదియగు మాయచే ప్రభావితులై జనులు జీవులు ఈశ్వరుడు అత్యంతము విలక్షణతత్త్వములని భావింతురు. ఇట్టి భ్రమను తొలగించుటకే వేదాంతి తత్ త్వం పదముల అర్థమును విచారించును.

**అత ఏవాత్ర దృష్టాన్తో యోగ్యః ప్రాక్ సమ్యగీరితః ।**
**ఘటాకాశ మహాకాశ జలాకాశాభ్రఖాత్మకః ॥224॥**

*224.* అద్వైత సత్యమును నిరూపించుటకే ఉపాధియుతమైన ఆకాశమును పూర్వము *(ప్ర.6.18)* ఉదాహరించితిమి. ఘటమునందలి ఆకాశము, అనంతమగు ఆకాశము జలమునందు ప్రతిఫలించిన ఆకాశము మేఘమునందలి ఆకాశము అని.

**జలాభ్రోపాధ్యధీనే తే జలాకాశాభ్రఖే తయోః।**
**ఆధారౌ తు ఘటాకాశ మహాకాశౌ సునిర్మలౌ ॥225॥**

*225.* జలమునందు మేఘమునందు ప్రతిఫలించిన ఆకాశములు జలము మేఘములనెడి ఉపాధివశమున ఏర్పడినవి. ఘటమునందలి ఆకాశము అనంతమగు ఆకాశము శుద్ధములు నిర్మలములు.

**ఏవ మానంద విజ్ఞానమయౌ మాయాధియోర్వశౌ।**
**తదధిష్ఠాన కూటస్థ బ్రహ్మణీ తు సునిర్మలే ॥226॥**

*226.* అట్లే ఆనందమయ కోశము విజ్ఞానమయ కోశము అనునవి మాయ దాని వికారమగు బుద్ధి ఉపాధులుగ ఏర్పడినవి. వానికి ఆధారములు, అధిష్ఠానములు, అగు కూటస్థము బ్రహ్మము అనేవి పరిశుద్ధములు.

**ఏతత్కక్షోపయోగేన సాంఖ్య యోగౌ మతౌ యది ।**
**దేహోఽన్నమయకక్షత్వాదాత్మత్వేనాభ్యుపేయతామ్ ॥227॥**

*227.* అద్వైత సిద్ధాంతమునకు సహాయకములుగ సాంఖ్యయోగ సిద్ధాంతములు స్వీకరింపవలెననినచో ఇతరములు కూడా స్వీకరింప వచ్చును. అన్నమయ కోశమగు స్థూలశరీరము కూడా స్వీకరింతుము. కాని అంతమాత్రమున దేహమే ఆత్మ అనజాలము.

**ఆత్మభేదో జగత్సత్య మీశోఽన్య ఇతి చేత్త్రయమ్ ।**
**త్యజ్యతే తైస్తదా సాంఖ్యయోగ వేదాన్త సమ్మతిః ॥228॥**

*228.* ఆత్మయందు వైవిధ్యము జగత్తు యొక్క సత్యత్వము ఈశ్వరుడు ఆత్మ కంటే ఇతరుడు అనే మూడింటిని సాంఖ్యులు యోగులు వదలి పెట్టినచో వారి సిద్ధాంతములను వేదాంతులు అంగీకరింపగలరు.

**జీవోఽసంగత్వ మాత్రేణ కృతార్థ ఇతి చేత్తదా ।**
**స్రక్చన్దనాది నిత్యత్వ మాత్రేణాపి కృతార్థతా ॥229॥**

*229.* జీవుడు సంగరహితుడని తెలిసికొనినంతనే ముక్తి నొందునని సాంఖ్యులు అందురు. అట్లయినచో పూలమాలలు చందనము మొదలుగు వాని వలని సుఖము కూడా నిత్యమని భావించుట వలననే కృతార్థతయని మేమందుము.

**యథా స్రగాది నిత్యత్వం దుస్సంపాద్యం తథాత్మనః ।**
**అసఙ్గత్వం న సంభావ్యం జీవతోర్జగదీశయోః ॥230॥**

*230.* పూల మాలలు మొదలగునవి నిత్యములని చూపుట అసంభవమైనట్లే జీవుడు సంగరహితుడని తెలియుట, జగత్తు ఈశ్వరుడు శాశ్వత సత్యములని భావించినంతకాలము, అసంభవమే.

**వ్యాఖ్య:** సంగరాహిత్యము అద్వైతబోధ లేక కలుగదు. ఈశ్వరుడు జీవుడు జగత్తు అనేవి పరస్పరాశ్రయములగుట చేత మూడూ ఏకకాలముననే శాశ్వతములు

అగుట సిద్ధింపదు. సాంఖ్యమతమున ప్రకృతి పురుషుడు రెండును శాశ్వతములు, సద్వస్తువులు.

**అవశ్యం ప్రకృతిః సంగం పురేవాపాదయే త్తథా ।**
**నియచ్ఛత్యేతమీశోఽపి కోఽస్య మోక్షస్తథా సతి ॥231॥**

*231. ప్రకృతి శాశ్వతమైనచో పురుషుడు తాను ప్రకృతి కంటె భిన్నుడనని తెలిసికొనిన పిమ్మట కూడా పురుషునియందు ప్రకృతి సంగము కల్పించును. ఈశ్వరుడు శాశ్వతుడైనచో శాశ్వతముగ పురుషుడు శాసింపబడును. ఇక సాంఖ్యుల మతమున పురుషునకు మోక్ష మెక్కడిది? లేనే లేదని భావము.*

**అవివేకకృతః సఙ్గో నియమశ్చేతి చేత్తదా ।**
**బలాదాపతితో మాయావాదః సాంఖ్యస్య దుర్మతేః ॥232॥**

*232. పురుషుని యొక్క ఈ సంగము (దేహాదులయందు), ఈశ్వరునిచే శాసింపబడుట అవివేకము వలన అనినచో మందబుద్ధులగు సాంఖ్యులపై మాయావాదము బలవంతముగ వచ్చిపడును.*

**వ్యాఖ్య:** ప్రకృతి భిన్నత్వ వివేకముచే అవివేకము తొలగుటచే పురుషునకు సంగము శాసనము సాంఖ్యమతమునకు కూడా ఉండవని ఆక్షేపము. అవివేకము అనగానేమి? తరచిచూచినచో అదే మాయయనీ మందబద్ధులగు సాంఖ్యులు దానిని గుర్తింప లేకున్నారనీ సమాధానము.

అవివేకమనగా వివేకము లేకపోవుట కాదు, లేని వస్తువు ఫలితములను చూపగలుగుట అసంగతము కనుక. వివేకము కంటె ఇతరము కాదు, ధైర్యము మొదలగునవి సంగమును కల్పింపకపోవుట చేత. వివేకమునకు విరుద్ధమైనదనియే చెప్పవలెను. ఇదే అజ్ఞానము మాయ అని అద్వైతసిద్ధాంతము కనుక సాంఖ్యులు మాయనాహ్వానించినట్లే అగును.

**బన్ధమోక్ష వ్యవస్థార్థ మాత్మనానాత్వ మిష్యతామ్ ।**
**ఇతి చేన్న యతో మాయా వ్యవస్థాపయితుం క్షమా ॥233॥**

*233. బంధమోక్షముల వ్యవస్థ కొరకు ఆత్మలు అనేకములని స్వీకరింప వలెననచో ఆ వ్యవస్థ ఏర్పరచుటకు మాయ సర్వసమర్థమగుటచే ఆత్మ నానాత్వము అనావశ్యకము.*

**దుర్ఘటం ఘటయామీతి విరుద్ధం కిన్న పశ్యసి ।**
**వాస్తవౌ బన్ధమోక్షౌతు శ్రుతిర్న సహతేతరామ్ ।7234॥**

*234. అసంభవమును సంభవము చేయుచున్నావనే విరోధము ఏల చూడవు? శ్రుతి కూడా బంధమోక్షములు వాస్తవములని అంగీకరింపదు.*

**వ్యాఖ్య:** బంధము వాస్తవమైనచో దానికి నాశమే ఉండదు. అనగా మోక్ష ప్రసక్తియే లేదు. వాస్తవమగు బంధము నుండి మోక్షము కలుగుననుట విరుద్ధ వచనము.

**న విరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః ।**
**న ముముక్షుర్న వై ముక్తః ఇత్యేషా పరమార్థతా ॥235॥**

*235. వినాశము లేదు ఉత్పత్తి కూడా లేదు. బద్ధుడు లేడు సాధకుడును లేడు. ముముక్షువు (మోక్షము కోరువాడు) లేడు. ముక్తుడును లేడు. ఇదే పరమార్థ సత్యము.*

**వ్యాఖ్య:** పరమార్థముగనున్నది బ్రహ్మము మాత్రమే అని భావము. అమృత బిందు ఉప: 10; గౌడపాదకారిక 2.32. ప్ర. 8-71.

**మాయాఖ్యాయాః కామధేనోర్వత్సౌ జీవేశ్వరావుభౌ ।**
**యథేచ్ఛం పిబతాం ద్వైతం తత్త్వం త్వద్వైతమేవ హి ॥236॥**

*236. మాయ అనే పేరుగల కామధేనువునకు జీవుడు ఈశ్వరుడు అనే రెండు దూడలు. ఆ ఆవు పాలను ద్వైతమును ఎంతగా సేవించినా సత్యము అద్వైతము మాత్రమే.*

**కూటస్థ బ్రహ్మణోర్భేదో నామమాత్రాదృతే నహి ।**
**ఘటాకాశ మహాకాశౌ వియుజ్యేతే నహి క్వచిత్ ॥237॥**

*237. (జీవేశ్వరులు మిథ్యయగుటచే వారి భేదము మిథ్య. అట్లే సత్యము లగు కూటస్థ బ్రహ్మముల భేదము సత్యము కావలెననే సంశయము పరిహరిం పబడుచున్నది.) నామమాత్రముగనే తప్ప కూటస్థమునకు బ్రహ్మమునకు భేదము లేదు. అనంతమైన ఆకాశమునకు ఘటము నందలి ఆకాశమునకు పేరునకే కదా భేదము.*

**యదద్వైతం శ్రుతం సృష్టేః ప్రాక్తదేవాద్య చోపరి ।**
**ముక్తావపి వృథామాయా భ్రామయ త్యఖిలాన్ జనాన్ ॥238॥**

*238.* శ్రుతిప్రోక్తమైన అద్వైతము సృష్టికి పూర్వము ఉండెను ఇప్పుడును కలదు. ఇకమీద ఉండును. అనగా అది త్రికాలాబాధ్య సత్యమని భావము. తత్త్వజ్ఞానము లేని సకల జనులను మాయ వ్యర్థముగ భ్రమపెట్టుచుండును. ఛాందోగ్య ఉప: **6.2.1-2.**

**యే వదన్తీత్థమేతేఽపి భ్రామ్యంతే విద్యయాత్రకిమ్ ।**
**న యథాపూర్వమేతేషామత్ర భ్రాంతేరదర్శనాత్ ॥239॥**

*239.* (ఆక్షేపము) ఇట్లు మాయాప్రభావమును వర్ణించువారు కూడ భ్రమకు లోనగుదురు. విద్య వలన, జ్ఞానము వలన కలిగిన లాభమేమి? (సమాధానము) జ్ఞానమునకు పూర్వము వలె భ్రాంతి సత్యమని భావింపకుండుటయే. ప్రారబ్ధము వలన అజ్ఞానుల వలె ప్రవృత్తి కన్పించినను జ్ఞానులకు దానియందు సత్యత్వబోధ గాని ఆసక్తి గాని ఉండవు.

**ఐహికాముష్మికః సర్వః సంసారో వాస్తవస్తతః ।**
**న భాతి నాస్తి చాద్వైత మిత్యజ్ఞాన వినిశ్చయః ॥240॥**

*240.* అజ్ఞానులకు ఈ లోకము పరలోకములందలి సుఖములే సత్యము. అద్వైతము వారికి తోచదు. లేదనియే వారి నిశ్చయము.

**జ్ఞానినాం విపరీతోఽస్మాన్నిశ్చయః సమ్యగీక్ష్యతే ।**
**స్వస్వనిశ్చయతో బద్ధో ముక్తోఽహం చేతి మన్యతే ॥241॥**

*241.* జ్ఞానుల నిశ్చయము దీనికి విపరీతమని స్పష్టముగ చూడగలము. వారి వారి నిశ్చయములను బట్టి ముక్తులును బద్ధులును అగుదురు.

**నాద్వైత మపరోక్షం చేన్న చిద్రూపేణ భాసనాత్ ।**
**అశేషేణ న భాతం చేద్ ద్వైతం కిం భాసతేఖిలమ్ ॥242॥**

*242.* అద్వైతము అపరోక్షము కాదనినచో చైతన్యస్వరూపముగ అది ఎల్లరకును అపరోక్షమే. ఇది అశేషముగ భాసించుట లేదనిన ద్వైతము కూడ అంతా మనకు కన్పించుట లేదు కదా!

**దిఙ్మాత్రేణ విభానంతు ద్వయోరపి సమం ఖలు ।**
**ద్వైతసిద్ధివదద్వైత సిద్ధిస్తే తావతా న కిమ్ ॥243॥**

*243.* సూచనామాత్రముగ తెలియబడుట ద్వైతమునకు అద్వైతమునకు

*సమానమే. దానిని బట్టి ద్వైతము అసత్యమని నిర్ణయింపగలిగినచో అట్లే అద్వైతము సత్యమనే నిర్ణయమునకు వచ్చుటకు ఏమి అభ్యంతరము?*

**వ్యాఖ్య:** అద్వైతము సత్యమనుటకు ఆధారముగ మన యందున్న చైతన్యము మనకు అనుభవగతమే. కాగా శ్రుతివాక్యములు కూడా అద్వైతసత్యమును ఘోషించును. ద్వైతము సత్యమనుటకు శాస్త్రప్రమాణము లేదు. ద్వైతానుభవము కూడా తరచిచూచిన నిలువదు.

**ద్వైతేన హీనమద్వైతం ద్వైతజ్ఞానే కథం త్విదమ్ ।**
**చిద్భాన త్వవిరోధ్యస్య ద్వైతస్యాతోఽ సమే ఉభే ॥244॥**

*244. ద్వైతము అద్వైతమునకు విరోధి. ఎల్లెడల ద్వైతమే ప్రకటమగు చున్నప్పుడు అద్వైతము ఎట్లు సిద్ధించుననినచో, చైతన్య రూపమున అద్వైతము అనుభూతమగుచుండగా దానికి విరోధియగు ద్వైతము మాత్రమే ఎట్లు సిద్ధింపగలదు? (ఆక్షేపము:) కాని ఇంద్రియగోచరమగు ద్వైతము అద్వైత జ్ఞానముతో కూడా సిద్ధించుచున్నది.*

**వ్యాఖ్య:** చైతన్యానుభవమునకు ద్వైతభావమునకు విరోధము లేదని పూర్వపక్షి ఆక్షేపము.

**ఏవం తర్హి శృణు ద్వైతమసన్మాయామయత్వతః ।**
**తేన వాస్తవమద్వైతం పారిశేషాద్విభాసతే ॥245॥**

*245. అట్లయిన విను. ద్వైతము మాయాకార్యము మాత్రమే అగుటచే అది అసత్తు. కనుక ద్వైతమును నిరాకరిస్తే వాస్తవముగ మిగులునది అద్వైతము మాత్రమే. అదే సత్యము.*

**అచింత్యరచనారూపం మాయైవ సకలం జగత్ ।**
**ఇతి నిశ్చిత్య వస్తుత్వమద్వైతే పరిశేష్యతామ్ ॥246॥**

*246. ఊహాతీతమైన కల్పనారూపమైన మాయ మాత్రమే ఈ అఖిల దృశ్యమాన ప్రపంచము కూడా అని నిశ్చయించి వాస్తవముగ ఉన్నది అద్వైతమే అని తెలియుము.*

**పునర్ద్వైతస్య వస్తుత్వం భాతి చేత్త్వం తథా పునః ।**
**పరిశీలయ కో వాత్ర ప్రయాసస్తేన తే వద ॥247॥**

*247.* ద్వైతము వాస్తవమని మరల మరల తోచునే అంటే మరల మరల దానిని పరిశీలించి అద్వైతమే సత్యమని నిశ్చయించుకొనుచుండుము. దాని యందేమి ప్రయాసయున్నది? చూ. బ్రహ్మసూత్రములు *4.1.1.*

**కియన్తం కాలమితి చేత్ఖేదోఽయం ద్వైత ఇష్యతామ్ ।**
**అద్వైతే తు న యుక్తోయం సర్వానర్థనివారణాత్ ॥248॥**

*248.* ఇట్టి అభ్యాసము ఎంతకాలము చేయవలయుననినచో ఇట్టి అసహనము ద్వైత విషయములు సాధించుటయందు సరియే కాని సకల దుఃఖ ములను నివారించే అద్వైతమున తగదు. అద్వైతము సిద్ధించే వరకు విసుగు లేక అభ్యాసము చేయవలెనని భావము.

**క్షుత్పిపాసాదయో దృష్టా యథాపూర్వం మయీతి చేత్ ।**
**మచ్ఛబ్దవాచ్యేఽహంకారే దృశ్యతాం నేతి కో వదేత్ ॥249॥**

*249.* అద్వైతజ్ఞానము కలిగినను పూర్వము వలె నాయందు ఆకలి దప్పులు కన్పించుచున్నవే అనిన కన్పించును. కాదనునదెవరు? కాని 'నా యందు' అనే పదముచే మాయాకార్యమగు అహంకారమునందు కన్పించునని తెలియుము. సకల దుఃఖములును మాయానిర్మితములగు స్థూలాది శరీములకే గాని అసంగమగు ఆత్మకు కావు.

**చిద్రూపేఽపి ప్రసజ్యేరంస్తాదాత్మ్యాధ్యాసతో యది ।**
**మాధ్యాసం కురు కిన్తు త్వం వివేకం కురు సర్వదా ॥250॥**

*250.* చిద్రూపమున కూడా తాదాత్మ్యాధ్యాస వలన, దేహముతో ఆత్మ తాదాత్మ్యమును భావించుట వలన, దుఃఖములన్నీ కలుగును కదా అనినచో అట్టి అధ్యాసను చేయకుము. కాగా ఎల్లప్పుడూ వివేచనము చేయుచుండుము. (అధ్యాసను తొలగించుటకు).

**ఝటిత్యధ్యాస ఆయాతి దృఢవాసనయేతి చేత్ ।**
**ఆవర్తయేద్వివేకం చ దృఢం వాసయితుం సదా ॥251॥**

*251.* వాసనా ప్రాబల్యము చేత హఠాత్తుగా అధ్యాస వచ్చిపడుననచో వివేకవాసనలు కూడా దానికంటె ప్రబలమగునట్లు ఆవర్తింపుము (అభ్యాసము చేయుము.)

**వివేకే ద్వైత మిథ్యాత్వం యుక్త్యైవేతి న భణ్యతామ్ ।**
**అచింత్యరచనాత్వస్యానుభూతిర్హి స్వసాక్షికీ ॥252॥**

*252. కేవలము తర్కము చేత కలిగిన వివేకమునందు మాత్రమే ద్వైతము మిథ్యయని సిద్ధించుచున్నది, అనుభవమున అట్లు సిద్ధింపదు అని అనవలదు. ఈ ప్రపంచము యొక్క ఊహాతీతము అద్భుతము అయిన స్వరూపమును నిత్యము అనుభవించుచునే ఉన్నాము.*

**వ్యాఖ్య:** ఈ జగత్తునకు జగత్తునందలి వ్యవహారములకు తర్కబద్ధమైన ఆధారమేమీ లేదనుట అనుభవైకవేద్యమే. ఈ మాయాకార్యము అద్భుతమే. తార్కికమైన ఆధారము లేకపోవుటచే ఊహకును అతీతమే. అయినను అనుభవమున ఉన్నదే. చైతన్యరూపమగు ఆత్మయు ఈ జగత్తును చూస్తున్న సాక్షిగ అనుభవమున ఉన్నదే. ఇతర విషయములు అనుభవమునకు వచ్చునట్లు ఆత్మ అనుభవమునకు రాని మాట సత్యమే. అయినను 'నేను'లోని ఆత్మ అనుభవమున లేదనుట ఎట్లు?

**చిదప్యచింత్య రచనా యది తర్హ్యస్తు నో వయమ్ ।**
**చితిం సుచింత్యరచనాం బ్రమోనిత్యత్వకారణాత్ ॥253॥**

*253. చైతన్యము కూడా ఊహాతీతమైనదే కదా, (కనుక అది కూడా మిథ్య కదా) అనినచో నిజమే ఊహాతీతమైనదే. కాని అది శాశ్వతమగుటచే ఊహింపదగినదే అందుము.*

**వ్యాఖ్య:** పరిణామశీలత మిథ్యకు లక్షణము. వికారము లేకపోవుట ఆత్మకు, సత్యమునకు, లక్షణము. కనుక ఆత్మ కూడా ఊహాతీతమైనను అవికారి అగుటచే మిథ్య అనుటకు వీలులేదు. తర్కము కొరకు ఆత్మను అవికారియగు ఊహాతీతమైన రచన అనవచ్చును. నిజముగ దానిని గ్రహించుటకు వాక్కు మనస్సు అసమర్థములు కదా!

**ప్రాగభావో నానుభూతశ్చితేర్నిత్యా తతశ్చితిః ।**
**ద్వైతస్య ప్రాగభావస్తు చైతన్యే నానుభూయతే ॥254॥**

*254. చైతన్యము ఒకప్పుడు లేకుండెననుట, లేకపోవుట, అనుభవమునకే రాదు, కనుక అది శాశ్వతము నిత్యము. ద్వైతము లేకుండుటను చైతన్యము (సుషుప్తి యందు) అనుభవించును. నృసింహ ఉత్తర తాపినీయ ఉప.2.*

**ప్రాగభావయుతం ద్వైతం రచ్యతే హి ఘటాదివత్ ।**
**తథాపి రచనాఽచింత్యా మిథ్యా తేనేంద్రజాలవత్ ॥255॥**

*255.* ద్వైతజగత్తు ఒకప్పుడు లేక పిదప సృష్టింపబడుచున్నది, ఒకప్పుడు లేని కుండలు మొదలగునవి చేయబడినట్లే. అయినను అది ఎట్లు రచించ బడినదో సృష్టింపబడినదో ఆ విషయము ఇంద్రజాలమువంటిది. కనుకనే అది ఊహాతీతము మిథ్య.

**చిత్ప్రత్యక్షా తతోఽన్యస్య మిథ్యాత్వం చానుభూయతే ।**
**నాద్వైతమపరోక్షం చేత్యేతన్న వ్యాహతం కథమ్ ॥256॥**

*256.* చైతన్యము ప్రత్యక్షముగ అనుభవింపబడుచున్నది. తదితరము (జగత్తు) యొక్క మిథ్యాత్వము కూడా అనుభవమున ఉన్నది. ఇట్లుండగా 'అద్వైతము అపరోక్షము కాదు' అనుట విరుద్ధవాక్యము కదా!

**ఇత్థం జ్ఞాత్వాప్యసంతుష్టాః కేచిత్కుత ఇతీర్యతామ్ ।**
**చార్వాకాదేః ప్రబుద్ధస్యాప్యాత్మాదేహః కుతో వద ॥257॥**

*257.* ఇట్లు అద్వైతసత్యమును తెలిసికొనియు కొందరు అసంతుష్టులు అగుదురు. ఎందుచేతయనినచో చార్వాకులు మొదలగువారు తర్కము తెలిసినను దేహమే ఆత్మయని ఏల అందురోమొదట చెప్పుము.

**సమ్యగ్విచారో నాస్త్యస్య ధీదోషాదితి చేత్తథా ।**
**అసంతుష్టాస్తు శాస్త్రార్థం న త్వైక్షంత విశేషతః ॥258॥**

*258.* వారు బుద్ధిదోషముచే చక్కగా వివేచన చేయలేక పోవుటచేత అనినచో అట్లే అద్వైతసిద్ధాంతమునందు అసంతుష్టులైన వారికిని సమ్యక్ విచారణ లేకపోవుటయే అసంతుష్టికి కారణము.

**యదా సర్వేప్రముచ్యంతే కామా యేఽస్య హృదిశ్రితాః ।**
**ఇతి శ్రౌతం ఫలం దృష్టం నేతి చేద్దృష్ట మేవ తత్ ॥259॥**

*259.* హృదయమునందలి కామనలన్నీ నిశ్శేషముగ నశించినచో అమృతత్వము సిద్ధించుననే శ్రుతివాక్యము *(కఠ ఉప.2.3.14)* జ్ఞానుల అనుభవము కూడా.

**యదా సర్వే ప్రభిద్యంతే హృదయగ్రంథయస్త్వితి ।**
**కామ గ్రంథి స్వరూపేణ వ్యాఖ్యాతా వాక్యశేషతః ॥260॥**

*260.* *మరొక వాక్యమున హృదయగ్రంథులన్నీ ఛేదింపబడినప్పుడు అమృతత్వము సిద్ధించునని చెప్పును. ఇచ్చట గ్రంథి అనగా కామనలని వ్యాఖ్యాత వివరించును. కఠ. ఉ.2.3.15.*

**అహంకారచిదాత్మానా వేకీకృత్యావివేకతః ।**
**ఇదం మే స్యాదిదం మే స్యాదితీచ్ఛాః కామశబ్దితాః ॥261॥**

*261.* *అజ్ఞానవశమున, మాయాకార్యమగు అహంకారమునకు చిద్రూపమగు ఆత్మతో ఏకీభావము కల్పించి 'ఇది నాకు కావలెను' 'ఇది నాకు కావలెను' అని కోరుకొనుటలు కామనలు అనబడినవి.*

**వ్యాఖ్య:** సత్యమగు ఆత్మకు మిథ్యయగు అహంకారమునకు కన్పించు అభేదమే అజ్ఞానము. అదే గ్రంథి, గ్రంథి వలె (ముడి వలె) విడదీయనశక్యమని ఉద్దేశము. ఈ యజ్ఞానవశముననే కోరికలు కలుగును కనుక పారంపర్యముగ కోరికలే గ్రంథులుగ స్వీకరింపబడినవి. ఆత్మజ్ఞానముచే అజ్ఞానము నశించినపుడు కామనలు కూడా, వేరు నరికబడిన చెట్టువలె, నశించును. అప్పుడు మానవుడు అమృతత్వము నొందును.

**అప్రవేశ్య చిదాత్మానం పృథక్పశ్యన్నహంకృతిమ్ ।**
**ఇచ్ఛాస్తు కోటి వస్తూని న బాధో గ్రంథిభేదతః ॥262॥**

*262.* *చిదాత్మను అహంకారము నుండి వేరుపరచి తెలిసికొనిన పిదప కోటి వస్తువులందు కోరికలున్నను బాధ లేదు, అజ్ఞాన గ్రంథి చిజ్జడగ్రంథి భేదింపబడినది గనుక.*

**వ్యాఖ్య:** అహంకారమునకు ఆత్మకు గల తాదాత్మ్యాధ్యాస మూడు విధములు, సహసము, కర్మజము, భ్రమజము అని. చిదాభాసుడు అహంకారము ఒకటియే అనునది సహజము. అంతఃకరణము నందు ఆత్మ ప్రతిఫలనమే చిదాభాసుడు. అహంకారమునకు స్థూలశరీరమునకు గల తాదాత్మ్యాధ్యాస కర్మజము, ప్రారబ్ద వశమున ఇది ఏర్పడును. అహంకారమే ఆత్మ అనే తాదాత్మ్యాధ్యాస భ్రమజము. అజ్ఞాన మూలకమగు భ్రమ వలన ఇది ఏర్పడును. జ్ఞానియందు అజ్ఞానము నశించుటచే భ్రమజమగు అధ్యాస నశించును మరి ఎన్నటికిని అది తిరిగిరాదు. కాని మిగిలిన రెండు అధ్యాసలు రావచ్చును.

**గ్రంథిభేదేపి సంభావ్యా ఇచ్ఛాః ప్రారబ్ధదోషతః ।**
**బుద్ధ్వాపి పాపబాహుల్యా దసంతోషో యథా తవ ॥263॥**

*263.* ప్రారబ్ధవశమున జ్ఞానియందు కోరికలు ఉదయింపవచ్చు, పరోక్షముగ అద్వైత సత్యమును తెలిసికొనినను పాపబాహుళ్యము వలన అసంతోషము ఉన్నట్లే.

**అహంజ్ఞా గతేచ్ఛాద్యైర్దేహ వ్యాధ్యాదిభిస్తథా ।**
**వృక్షాదిజన్మనాశైర్వా చిద్రూపాత్మని కిం భవేత్ ॥264॥**

*264.* తాను చిత్స్వరూపమైన ఆత్మయని తెలిసికొనిన జ్ఞానిని, అహంకారవశములైన కోరికలు శరీరవ్యాధులు మొదలైనవి బాధింపవు, అరణ్యములోని వృక్షముల పెరుగుటలు విరుగుటలు బాధింపనట్లే.

**గ్రంథిభేదా త్పురాప్యేవమితి చేత్తన్న విస్మర ।**
**అయమేవ గ్రంథిభేదస్తవ తేన కృతీ భవాన్ ॥265॥**

*265.* గ్రంథిభేదమునకు పూర్వము కూడా ఆత్మను ఏదీ బాధింపదు కదా అనినచో ఆ సత్యమును మరువకు. ఆ జ్ఞానమేగ్రంథిభేదము దాని వలననే కృతార్థత.

**నైవం జానంతి మూఢాశ్చేత్సోఽయం గ్రంథిర్న చాపరః ।**
**గ్రంథి తద్భేదమాత్రేణ వైషమ్యం మూఢబద్ధయోః ॥266॥**

*266.* మూఢులకు ఈ విషయము తెలియదనినచో అదే అజ్ఞాన గ్రంథి. ఈ గ్రంథి ఉండుట తెగుటలోనే మూఢులకు జ్ఞానులకు గల భేదము.

**ప్రవృత్తౌ వా నివృత్తౌ వా దేహేంద్రియ మనోధియామ్ ।**
**న కిఞ్చిదపి వైషమ్య మస్త్యజ్ఞాని విబుద్ధయోః ॥267॥**

*267.* శరీరము ఇంద్రియములు మనస్సు బుద్ధుల దృష్ట్యా కర్మలు నిర్వహించుటయందును విరమించుట యందును అజ్ఞానులకు జ్ఞానులకు లేశమాత్రమైనను భేదము కన్పింపదు.

**వ్యాఖ్య:** కాని అజ్ఞాని దేహాది సంబంధములగు సుఖదుఃఖములు తనవే అని భావించుకొనగా జ్ఞాని ఆత్మానందమునందే స్థితుడై ఉండును.

**వ్రాత్యశ్రోత్రియయోర్వేదపాఠాపాఠకృతా భిదా ।**
**నాహారాదావస్తి భేదః సోఽయం న్యాయోఽత్ర యోజ్యతామ్ ॥268॥**

*268.* ఉపనయనము కాని వానికిని అయినవానికిని గల భేదము

వేదాధ్యయనము చేయకపోవుట చేయుటలోనే. కాని ఆహారనిద్రాదులన్నీ వారికి సమానములే. ఆ న్యాయమునే జ్ఞానికిని అజ్ఞానికిని అన్వయింపుము.

**నద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి ।**
**ఉదాసీనవదాసీన ఇతి గ్రంథిభిదోచ్యతే ॥269॥**

*269. (భగవద్గీత యందు 14.22-23) జ్ఞాని ఉన్న దుఃఖములను ద్వేషింపడు లేని సుఖములను ఆశింపడు. నిర్లిప్తముగ ఊరకుండును అని చెప్పబడినది. అదే గ్రంథి భేదము.*

**ఔదాసీన్యం విధేయం చేద్వత్ శబ్దవ్యర్థతా తదా ।**
**న శక్తా అస్య దేహాద్యా ఇతి చేద్రోగ ఏవ సః ॥270॥**

*270. ఈ శ్లోకము ఔదాసీన్యమును విధించును గదా గ్రంథిభేదము ఎట్లగును అనినచో విధియే ఉద్దేశమైనచో 'వత్' శబ్దము, వలె అనే అర్థము గలది, వ్యర్థమగును. జ్ఞాని ఉదాసీనుడగనుండడు ఉదాసీనుని వలె ఉండును. అట్లుండుట దేహేంద్రియములందు శక్తి లేకపోవుటచే అనినచో అట్టి అశక్తత రోగము కాని, జ్ఞానము కాదు.*

**తత్త్వబోధం క్షయం వ్యాధిం మన్యన్తే యే మహాధియః ।**
**తేషాం ప్రజ్ఞాతివిశదా కిం తేషాం దుశ్శకం వద ॥271॥**

*271. క్షయవ్యాధియే ఆత్మబోధమని భావించే ఈ మహా బుద్ధిశాలుర ఘనత ఎంతయు విస్పష్టము. వీరికి అసాధ్యమగునది ఎది గలదు?*

**భరతాదేరప్రవృత్తిః పురాణోక్తేతి చేత్తదా ।**
**జక్షన్ క్రీడన్ రతిం విన్దన్నిత్యశ్రౌషీర్న కిం శ్రుతమ్ ॥272॥**

*272. భరతుడు మొదలగు వారు జడునివలె ఉండిరని పురాణములు చెప్పునుగదా అనినచో భక్షించుచు క్రీడించుచు సుఖించుచు ఉండిన ఇతర జ్ఞానులను గూర్చి చెప్పుట వినలేదా? ఛాందోగ్య ఉప.8.12.3.*

**నహ్యాహారాది సంత్యజ్య భరతాద్యాః స్థితాః క్వచిత్ ।**
**కాష్ఠపాషాణవత్కిన్తు సఙ్గభీతా ఉదాసతే ॥273॥**

*273. జడభరతుడు మొదలగు వారు ఆహారము నిద్ర వదలి గాని రాళ్ళు కర్రలవలె గాని పడియుండలేదు. సంగమేర్పడునను భీతిచే మాత్రమే ఉదాసీనముగ ఉండిరి. చూ. భాగవతము 5.9-10.*

**సజ్గీ హి బాధ్యతే లోకే నిఃసజ్గః సుఖమశ్నుతే ।**
**తేన సజ్గః పరిత్యాజ్యః సర్వదా సుఖమిచ్ఛతా ॥274॥**

*274. విషయములందాసక్తి గల పురుషుడు లోకమున బాధలను అనుభవించును. నిస్సంగుడైన పురుషుడు సుఖము నొందును. కనుక సుఖమును కోరేవారు సర్వదా సంగమును విడనాడవలెను.*

**అజ్ఞాత్వా శాస్త్రహృదయం మూఢో వక్త్యన్యథాన్యథా ।**
**మూర్ఖాణాం నిర్ణయస్త్వాస్తామస్మత్సిద్ధాన్త ఉచ్యతే ॥275॥**

*275. శాస్త్రసారము తెలియని మూర్ఖులు అనేక విధములుగ చెప్పుదురు. వారి నిర్ణయములట్లుంచి వేదాంత సిద్ధాంతమును చెప్పెదము.*

**వైరాగ్యబోధోపరమాః సహాయాస్తే పరస్పరమ్ ।**
**ప్రాయేణ సహవర్తన్తే వియుజ్యన్తే క్వచిత్క్వచిత్ ॥276॥**

*276. వైరాగ్యము తత్త్వబోధ ఉపరతి, కోరికలు లేకుండుట ఆత్మజ్ఞానము కర్మ నుండి విరమించుట, అనే మూడూ పరస్పరము సహకరించును. సాధారణముగ మూడూ కలసే ఉండును. ఒక్కొక్కప్పుడు మూడవది లేకయు నుండును.*

**హేతుస్వరూపకార్యాణి భిన్నాన్యేషామసఙ్కరః ।**
**యథావదవగన్తవ్యః శాస్త్రార్థం ప్రవివిచ్యతా ॥277॥**

*277. ఈ గుణముల హేతువులు స్వరూపములు ఫలితములు వేరు వేరుగ ఉండును. వీనిలో భేదము చక్కగా శాస్త్రార్థము ఎరిగిన బోధపడును.*

**దోషదృష్టిర్జిహాసా చ పునర్భోగేష్వదీనతా ।**
**అసాధారణ హేత్వాద్యా వైరాగ్యస్య త్రయోప్యమీ ॥278॥**

*278. విషయ సుఖములు తాత్కాలికములను దృష్టియు, ఆ సుఖములను అనుభవించుట యందు అరుచియు, వాని ఆకర్షణ నుండి స్వేచ్ఛ - ఈ మూడూ వైరాగ్యమునకు విశిష్టమైన కారణములు.*

**వ్యాఖ్య:** తత్త్వమును తెలియవలెననే కోరికచే కలుగునదీ, ప్రపంచమునందలి దుఃఖములను చూచుటచే కలుగునదీ అని వైరాగ్యము రెండు విధములుగ చెప్పబడినది. మొదటిది జిజ్ఞాస రెండువది జిహాస. పతంజలి వశీకార లేదా అపరా వైరాగ్యము పరావైరాగ్యములను గూర్చి చెప్పును. జిహాస వశీకార వైరాగ్యమును

పోలినను జిజ్ఞాస పరావైరాగ్యముతో పోల్చబడదు. జీవన్ముక్తి వివేకమున మంద మధ్యమ తీవ్ర వైరాగ్యములు చెప్పబడినవి. అన్నీ వశీకార వైరాగ్యమున చేర్చబడినవి.

**శ్రవణాదిత్రయం తద్వత్తత్త్వమిథ్యావివేచనమ్ ।**
**పునర్గ్రన్థేరనుదయో బోధస్యైతే త్రయోమతాః ॥279॥**

*279. శ్రవణ మనన నిదిధ్యాసలనే మూడూ సదసద్వివేకము అజ్ఞానగ్రంథి మరల ఏర్పడకుండుట అనే మూడూ తత్త్వబోధకు విశిష్టకారణములు.*

**వ్యాఖ్య:** శ్రవణ మనన నిదిధ్యాసల వలన జ్ఞానము కలుగును (బృహదారణ్యక ఉప. 2. 4. 5, 4. 5. 6). దాని వలన సద్వస్తువగు ఆత్మకూటస్థ బ్రహ్మముతో అసద్వస్తువగు అహంకారము యొక్క తాదాత్మ్యధ్యాస తొలగును. వాని వేరు వేరు స్వరూపముల వివేచన కలుగును. తత్ఫలముగ అజ్ఞానగ్రంథి ఇకమీద ఏర్పడదు. అజ్ఞాననాశము వలన జనన మరణ చక్రము ఆగిపోవును. జ్ఞానము వలన అజ్ఞానము నశించును. తత్ఫలితంగా మన మోక్షము సిద్ధించును.

**యమాదిర్ధీనిరోధశ్చ వ్యవహారస్య సంక్షయః ।**
**స్యుఃహేత్వాద్యా ఉపరతేరిత్యసఙ్కర ఈరితః ॥280॥**

*280. యమ నియమాదుల వలన ఆత్మనిగ్రహము, మనఃసంయమము, వ్యవహార కర్మ తగ్గిపోవుట ఉపరతికి కారణములుగ చెప్పబడినవి.*

**వ్యాఖ్య:** ఉపరతి యొక్క సారమేమనగా అంతఃకరణ వృత్తులు ఆగిపోవుట. ఇది పతంజలి యొక్క అష్టాంగయోగము వలన సిద్ధించును. సమాధిలో పంచవిధ వృత్తులు నిరోధింపబడును. యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధారణధ్యానము సమాధి అనేవి యోగమున ఎనిమిది అంగములు. ప్రమాణము వికల్పము విపర్యయము నిద్ర స్మృతి అనే అయిదు మనోవృత్తులు. మనోవృత్తులాగుటచే సంకల్పము కలుగనందున కర్మవిరమణము సహజమైన ఫలితము.

**తత్త్వబోధః ప్రధానం స్యాత్సాక్షాన్మోక్షప్రదత్వతః ।**
**బోధోపకారిణావేతౌ వైరాగ్యోపరమావుభౌ ॥281॥**

*281. నేరుగా మోక్షము ఒసగునది అగుటచే వీనియందు తత్త్వబోధ ప్రధానము. వైరాగ్యము ఉపరతి అనేవి దానికి సహాయకములు. శ్వేతాశ్వతర ఉప. 3.8., 6.15.; ముండక ఉప.1.2.12 బృహదారణ్యక ఉప.4.4.23.*

**త్రయోఽప్యత్యన్తపక్వాశ్చేన్మహత స్తపసః ఫలమ్ ।**
**దురితేన క్వచిత్కిఞ్చి త్కదాచిత్ప్రతిబధ్యతే ॥282॥**

*282.* మూడూ అత్యంత పక్వమైనచో అది గొప్ప తపః ఫలము. పూర్వసంచిత పాపముండినచో ఎక్కడో ఎప్పుడో ఎంతయో కొంత ఆటంకములు అవరోధములు కలుగును.

**వైరాగ్యోపరతీ పూర్ణే బోధస్తు ప్రతిబధ్యతే ।**
**యస్య తస్య న మోక్షోస్తి పుణ్యలోకస్తపోబలాత్ ॥283॥**

*283.* తత్త్వబోధలేనిచో పూర్ణవైరాగ్యము ఉపరతి కూడా మోక్షమును ఈయజాలవు. అట్లు మోక్షము పొందని వారు తమ తపోబలమున పుణ్య లోకములందు జన్మింతురు. భగవద్గీత. 6.41.

**పూర్ణే బోధే తదన్యౌ ద్వౌ ప్రతిబద్ధౌ యదా తదా ।**
**మోక్షో వినిశ్చితః కిన్తు దృష్టదుఃఖం న నశ్యతి ॥284॥**

*284.* మిగిలిన రెండు కొరవడినను తత్త్వజ్ఞానము పూర్తిగ కలిగినచో మోక్షము నిశ్చయమే. కాని ప్రారబ్దము వలన దృశ్యములగు దుఃఖములు అతనికి తప్పవు.

**వ్యాఖ్య:** అనగా జీవన్ముక్తి ఉండదు. కాని విదేహముక్తి కలుగును.

**బ్రహ్మలోక తృణీకారో వైరాగ్యస్యావధిర్మతః ।**
**దేహాత్మవత్పరాత్మత్వదార్ఢ్యే బోధః సమాప్యతే ॥285॥**

*285.* బ్రహ్మలోకమును కూడా తృణీకరింపగలుగుట వైరాగ్యమునకు పరాకాష్ఠ అని చెప్పబడును. దేహమే ఆత్మ అనే బోధ ఎంత దృఢముగ ఉన్నదో అంత దృఢముగ పరమాత్మ బోధకలుగుట జ్ఞానమునకు పరాకాష్ఠ.

**సుప్తివద్విస్మృతిః సీమా భవేదుపరమస్య హి ।**
**దిశానయా వినిశ్చేయం తారతమ్యమవాన్తరమ్ ॥286॥**

*286.* సుషుప్తి యందువలె విస్మరణము ఉపరమమునకు పరాకాష్ఠ. వీనియందలి తారతమ్యములు తరగతులు పరిశీలన ద్వారా తెలియనగును.

**ఆరబ్ధకర్మ నానాత్వా ద్బుద్ధానామన్యథాఽన్యథా ।**
**వర్తనం తేన శాస్త్రార్థే భ్రమితవ్యం న పణ్డితైః ॥287॥**

*287.* వారివారి ప్రారబ్ధమును అనుసరించి జ్ఞాని పురుషుల ప్రవర్తన భిన్నవిభిన్నములుగ ఉండవచ్చును. అంతమాత్రము చేత విద్వాంసులకు, జ్ఞానము చేతనే మోక్షము లభించుననుటయందు భ్రమ కలుగరాదు.

**వ్యాఖ్య:** కృష్ణుడు భోగమయ జీవితము గడపెను. శుకుడు ఉపనయనమునకు మునుపే సన్న్యసించెను. శ్రీరాముడు జనకుడు రాజ్యములనేలిరి. వశిష్ఠుడు గొప్ప కర్మానుష్ఠానపరుడు. అయినను అందరును జ్ఞానిపురుషులే.

**స్వస్వకర్మానుసారేణ వర్తన్తాం తే యథా తథా ।**
**అవిశిష్టః సర్వబోధః సమా ముక్తిరితి స్థితి ః ॥288॥**

*288.* తమతమ పూర్వకర్మను అనుసరించి జ్ఞాని పురుషులెట్లు ప్రవర్తించినను వారి తత్త్వజ్ఞానమునందు భేదము లేదు. మోక్షము కూడా సమానమే. ఇదే వస్తుస్థితి.

**జగచ్చిత్రం స్వచైతన్యే పటే చిత్రమివార్పితమ్ ।**
**మాయయా తదుపేక్ష్యైవ చైతన్యం పరిశేష్యతామ్ ॥289॥**

*289.* కూటస్థ చైతన్యముపై జగత్తు, వస్త్రముపై తైల చిత్రము వలె రచింపబడినది. చైతన్యముపై మాయారోపమిట్లు జరుగును. ఈ మాయను ఉపేక్షించి చైతన్యమును గ్రహింపవలెను.

**చిత్రదీపమిమం నిత్యం యేఽనుసందధతే బుధాః ।**
**పశ్యంతోఽపి జగచ్చిత్రం తే ముహ్యంతి న పూర్వవత్ ॥290॥**

*290.* ఈ చిత్రదీప ప్రకరణమును నిత్యము అనుసంధానము చేయు విద్వాంసులు ఈ ప్రపంచమనెడి చిత్రమును చూచుచున్నను పూర్వము వలె మోహము నొందరు.

**ఆరవ ప్రకరణము : సమాప్తము.**

# సప్తమము: తృప్తిదీప ప్రకరణము

**ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః ।**
**కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్ ॥1॥**

*1. 'పురుషుడు తన ఆత్మను పరమాత్మయే కదా అని తెలిసికొనినచో ఇక దేనిని కోరి ఎవని కోరిక కొరకు శరీరతాపములను అనుసరించి తపించును?' బృహదారణ్యక ఉప.4.4.12. ప్ర. 14. 5.*

**అస్యాః శ్రుతేరభిప్రాయః సమ్యగత్ర విచార్యతే ।**
**జీవన్ముక్తస్య యా తృప్తిః సా తేన విశదాయతే ॥2॥**

*2. పైన చెప్పిన శ్రుతివాక్యపు అభిప్రాయము ఈ ప్రకరణమున చక్కగా విచారింపబడును. దాని వలన జీవన్ముక్తుని తృప్తి, ఆనందము, విశదమగును.*

**మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతత్వతః ।**
**కల్పితావేవ జీవేశౌ తాభ్యాం సర్వం ప్రకల్పితమ్ ॥3॥**

*3. బ్రహ్మమును ప్రతిఫలించుచు మాయ జీవుని ఈశ్వరుని కల్పించును. జీవేశ్వరులు సమగ్ర ప్రపంచమును సృష్టింతురు అని శ్రుతి చెప్పును. నృసింహ ఉత్తర తాపనీయ ఉప.9.*

**వ్యాఖ్య:** పురుష శబ్దమునకు అర్థము చెప్పబోవుచు ఉపోద్ఘాతముగ జగదుత్పత్తి చెప్పబడినది. పురమునందు, శరీరమునందు, ఉండునది పురుషుడు. వ్యష్టిశరీర మైన జీవుడు సమష్టిశరీరమైన ఈశ్వరుడు అని పురుష శబ్దమునకు అర్థము. చూ. ప్ర. 1. 15. –17.

**ఈక్షణాది ప్రవేశాన్తా సృష్టిరీశేన కల్పితా ।**
**జాగ్రదాది విమోక్షాన్తః సంసారః జీవకల్పితః ॥4॥**

*4.* *సంకల్పము మొదలు ప్రవేశము వరకు గల సృష్టిని ఈశ్వరుడు కల్పించెను. జాగ్రదవస్థ మొదలు మోక్షము వరకు గల సంసారమును జీవుడు కల్పించెను. చూ. ప్ర.6.213. వరాహ. ఉప. 2.54.*

**భ్రమాధిష్ఠానభూతాత్మా కూటస్థాసఙ్గచిద్వపుః ।**
**అన్యోన్యాధ్యాసతోఽ సఙ్గీధీస్థ జీవోఽత్ర పూరుషః ॥5॥**

*5.* *భ్రమకు ఆధారమైన కూటస్థమే సకల జీవులయందలి ఆత్మ, అది అసంగము చైతన్యస్వరూపము అవికారి. అన్యోన్యాధ్యాస వలన బుద్ధితో సంపర్కము కలిగినపుడు అది జీవుడు పురుషుడు అనబడును.*

**వ్యాఖ్య:** బృహదారణ్యక ఉప. 2. 5. 18. మాయాకార్యమగు బుద్ధి మాయ వలెనే మిథ్య. ఆ బుద్ధి యందలి ప్రతిఫలనము జీవుడు కనుక జీవుడు కూడా మిథ్యయే. బుద్ధితో కూటస్థమునకు కలిగే సంపర్కము కూడా మిథ్యయే. కాని బ్రహ్మమును గూర్చిన జ్ఞానము కలిగే వరకు జీవుడు, బుద్ధి అన్నీ సత్యములుగనే ఉండును. రాత్రి, పగలును మిథ్యలే. భూమి పరిభ్రమణము వలన ఏర్పడునవి గనుక. ఈ భూమిని వదలి అంతరిక్షమున ప్రవేశించినచో రాత్రి లేదు పగలు లేదు. కాని భూమి పై ఉన్నంత కాలము రాత్రి, పగలు 'సత్యము'లే.

**సాధిష్ఠానో విమోక్షాదౌ జీవోఽధిక్రియతే న తు ।**
**కేవలో నిరధిష్ఠాన విభ్రాన్తేః క్వాప్యసిద్ధితః ॥6॥**

*6.* *అధిష్ఠానమగు కూటస్థముతో కూడిన జీవుడు కర్తయై మోక్షమును ఇహలోక పరలోకసుఖములను కోరును. ఆధారము లేకయే భ్రమకలుగుట ఎచ్చటగాని సంభవింపదుగదా. అట్లే కేవలము చిదాభాసము మాత్రము ఉండజాలదని ఉద్దేశము.*

**వ్యాఖ్య:** సాధారణముగ చిదాభాసమే జీవుడుగ వ్యవహృతమైనను ఇచ్చట కొంత భేదము చూపబడినది. ఆధారమగు కూటస్థము, ప్రతిఫలనమగు చిదాభాసము, ప్రతిఫలించే అంతఃకరణము ఈ మూడూ కలసి జీవుడనబడును. వీనియందు అన్యోన్యాధ్యాసచే జీవునకు కర్తృత్వబోధ కలిగి మోక్షాదులను అన్వేషించును. కేవలము చిదాభాసుడు అట్లు చేయలేడు (అంతః) కరణము లేకపోవుట చేత.

**అధిష్ఠానాంశ సంయుక్తం భ్రమాంశ మవలమ్బతే ।**
**యదా తదాఽహం సంసారీత్యేవం జీవోఽభిమన్యతే ॥7॥**

*7. అధిష్ఠానమగు కూటస్థముతో కూడిన జీవుడు భ్రమాంశమగు అంతః కరణము సూక్ష్మస్థూలాది శరీరములతో తాదాత్మ్యమును భావించినపుడు ఈ శరీరముల సుఖదుఃఖములు తనవనీ, 'నేను' అనీ, సంసారిననీ జీవుడు అభిమానపడును.*

**భ్రమాంశస్య తిరస్కారా దధిష్ఠాన ప్రధానతా ।**
**యదా తదా చిదాత్మాహ మసఙ్గోఽస్మీతి బుధ్యతే ॥8॥**

*8. విచారణచే భ్రమాంశమగు శరీరములను నిరాకరించుటచే అధిష్ఠానము, ఆధారము, అగు కూటస్థబోధ ప్రధానమగును. అపుడు జీవుడు తాను చిదాత్మ అనీ సంగరహితుడనీ తెలిసికొనును.*

**నాసఙ్గేఽహంకృతిర్యుక్తా కథమస్మీతి చేచ్ఛృణు ।**
**ఏకో ముఖ్యో ద్వావముఖ్యావిత్యర్థ స్త్రి విధోఽహమః ॥9॥**

*9. అసంగమగు కూటస్థమునందు అహంభావము ఎట్లు కలుగుననినచో వినుము. 'నేను'నకు ఒక ముఖ్యార్థము రెండు గౌణార్థములు మొత్తము మూడర్థములు గలవు.*

**వ్యాఖ్య:** కూటస్థబోధ కలిగినచో ఇక జీవునకు 'నేను' అనే భావము కలుగుట సంభవమా అని సంశయము. సంగరహితమగు కూటస్థముతో సంగమేర్పరచనిచో నేను కూటస్థముననే భావము కలుగజాలదు కదా. ఈ సంశయమును వారించుటకు అహం శబ్దపుటర్థ భేదములు వివరింపబడు చున్నవి.

**అన్యోన్యాధ్యాసరూపేణ కూటస్థాభాసయోర్వపుః ।**
**ఏకీభూయ భవేన్ముఖ్యః తత్ర మూఢైః ప్రయుజ్యతే ॥10॥**

*10. అవికారియగు కూటస్థమునకు ప్రతిఫలనమగు చిదాభాసునకు అన్యోన్యాధ్యాసచే ఏకీభావము కల్పించుటచే నేర్పడిన 'నేను' ముఖ్యము. దీనిని మందబుద్ధులు ఉపయోగింతురు.*

**వ్యాఖ్య:** జ్ఞానము లేనివారు కూటస్థమునకు చిదాభాసకు భేదమును ఎరుగలేరు కనుక రెండింటిని ఒకటిగనే భావించి 'నేను'గా వ్యవహరింతురు.

**పృథగాభాసకూటస్థావముఖ్యౌ తత్ర తత్త్వవిత్ ।**
**పర్యాయేణ ప్రయుంజ్తేఽహం శబ్దం లోకే చ వైదికే ॥11॥**

*11. వేరువేరుగా చిదాభాసను కూటస్థమును 'నేను'గా భావించుట గౌణమైన అర్థము. తత్త్వమునెరిగినవారు ఈ అర్థములలో యథావశ్యకముగ 'నేను' అనే శబ్దమును ఉపయోగింతురు. అనగా తత్త్వ విచారమున 'నేను'చే కూటస్థమును లోక వ్యవహారమున 'నేను' చే చిదాభాసను ఉద్దేశింతురని భావము.*

**లౌకిక వ్యవహారేఽహం గచ్ఛామీ త్యాదికే బుధః ।**
**వివిచ్యైవ చిదాభాసం కూటస్థాత్తం వివక్షతి ॥12॥**

*12. లౌకిక వ్యవహారములగు నేను పోవుచున్నాను మొదలగు ప్రయోగములందు జ్ఞాని పురుషుడు కూటస్థము నుండి చిదాభాసను వివక్షించియే 'నేను'ను ఉపయోగించును.*

**అసఙ్గోఽహం చిదాత్మాఽహమితి శాస్త్రీయదృష్టితః ।**
**అహంశబ్దం ప్రయుజ్తేఽయం కూటస్థే కేవలే బుధః ॥13॥**

*13. నేను అసంగుడను, నేను చిదాత్మను అని శాస్త్రీయదృష్టితో కూటస్థమును ఉద్దేశించియే జ్ఞాని పురుషుడు 'నేను' అనే శబ్దమును ఉపయోగించును.*

**జ్ఞానితాజ్ఞానితే త్వాత్మాభాసస్యైవ న చాత్మనః ।**
**తథా చ కథమాభాసః కూటస్థోఽస్మీతి బుధ్యతామ్ ॥14॥**

*14. (ఆక్షేపము) జ్ఞానిత్వము అజ్ఞానిత్వము చిదాభాసను గూర్చియే చెప్పవలెను గాని కూటస్థమగు ఆత్మను గూర్చి కాదు. అట్లుండగా చిదాభాసుడు నేను కూటస్థమునని ఎట్లు తెలియగలడు?*

**నాయం దోషశ్చిదాభాసః కూటస్థైక స్వభావవాన్ ।**
**ఆభాసత్వస్య మిథ్యాత్వాత్కూటస్థత్వావశేషణాత్ ॥15॥**

*15. (సమాధానము) అందు దోషము లేదు. చిదాభాసుడు వాస్తవముగ కూటస్థమే. అభాసత్వము మిథ్య అగుటచే మిగులునది కూటస్థమే.*

**వ్యాఖ్య:** వాస్తవమగు కూటస్థము మిథ్యయగు అంతఃకరణమున ప్రతిఫలింపగా చిదాభాస ఏర్పడును. జ్ఞానము వలన అభాసత్వము తేలిపోవుటచే చిదాభాసయందు చిత్ మాత్రమే కూటస్థము మాత్రమే మిగులును.

**కూటస్థోఽస్మీతి బోధోఽపి మిథ్యాచేన్నేతి కో వదేత్ ।**
**నహి సత్యతయాభీష్టం రజ్జుసర్ప విసర్పణమ్ ॥16॥**

*16. (ఆక్షేపము) చిదాభాసుని 'నేను కూటస్థమును' అను బోధ కూడా మిథ్యయే గదా? (సమాధానము). మిథ్యయే. కాదని ఎవరందురు? త్రాటిపై ఆరోపింపబడిన పాము కదలికలు సత్యమని ఎవరు స్వీకరింతురు?*

**వ్యాఖ్య:** అద్వైతముపై ఇది సాధారణమగు విమర్శ. అంతఃకరణము మిథ్య ఐనచో అది కల్పించిన వేదాంత సిద్ధాంతము కూడా మిథ్యయే అని. కాని ఏ మిథ్యకైనా ఆధారమగు సత్యమొకటి ఉండవలెను గదా. కనుక వేదాంత సిద్ధాంతము మిథ్యయైనా దానికి ఆధారమగు బ్రహ్మము సత్యముగనే మిగులును. ఇక స్వప్నములోని ఆకలి స్వప్నములోని భోజనము వలననే తీరునట్లు మిథ్యయగు అజ్ఞానము మిథ్యయగు వేదాంత జ్ఞానము వలననే తొలగును.

**తాదృశేనాపి బోధేన సంసారో హి నివర్తతే ।**
**యక్షానురూపో హి బలిరిత్యాహు ర్లౌకికా జనాః ॥17॥**

*17. మిథ్యయైనను అట్టి బోధచే మిథ్యయగు సంసారదుఃఖము నశించును గదా. ఏ దేవుడికి ఆ బలియని లౌకిక జనులందురు. చూ. బ్రహ్మసూత్రములు (భామతి) 4.1.16.*

**తస్మాదాభాసపురుషః స కూటస్థో వివిచ్య తమ్ ।**
**కూటస్థోఽస్మీతి విజ్ఞాతు మర్హతీత్యభ్యధాచ్ఛ్రుతిః ॥18॥**

*18. కూటస్థమును ఆధారముగ గలిగి పురుషుడనబడుచున్న చిదాభాసుడు మిథ్య నుండి కూటస్థమును వివేచింపవలెను. అప్పుడు చిదాభాసుడు 'నేను కూటస్థమును. బ్రహ్మమును.' అనుట తగియున్నది. ఇట్లు శ్రుతి చెప్పును. బృహదారణ్యక ఉప. 4.4.12.*

**అసందిగ్ధావిపర్యస్తబోధో దేహాత్మనీక్షతే ।**
**తద్వదత్రేతి నిర్ణేతు మయమిత్యభిధీయతే ॥19॥**

*19. సామాన్యమానవుడు దేహమే తాను అనే బోధను ఎంతమాత్రముగాని సంశయము విభ్రమము లేక కలిగియుండును. అట్టి నిస్సంశయము భ్రమ రహితము అగు బోధయే జ్ఞానికి తాను బ్రహ్మమే అని కలుగునని సూచించుటకు 'ఇది' అని ప్రయోగింపబడినది.*

**దేహాత్మజ్ఞానవత్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్ ।**
**ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే ॥20॥**

*20. దేహమే ఆత్మ అనే జ్ఞానము వలె దృఢమగు జ్ఞానము బ్రహ్మమునందు కలిగినచో అది దేహాత్మ జ్ఞానమును నశింపజేయును. అట్టి పురుషుడు తనకు ఇష్టము లేకున్నను ముక్తుడగును. ఉపదేశసాహస్రి 4.5*

**అయమిత్యపరోక్షత్వముచ్యతే చేత్తదుచ్యతామ్ ।**
**స్వయంప్రకాశచైతన్యమపరోక్షం సదా యతః ॥21॥**

*21. 'ఇదియే నేను' అనే వాక్యములో 'ఇది' జ్ఞేయమగు విషయమును సూచించును. బ్రహ్మము జ్ఞేయవిషయము కాదు గనుక ఆ పదము బ్రహ్మమును సూచింపజాలదు. అనినచో నిజమే కాని ఆ బ్రహ్మము ప్రత్యగాత్మగా స్వయంప్రకాశమే కనుక సర్వదా అపరోక్షముగనే తెలియ బడుచున్నది.*

**పరోక్ష మపరోక్షం చ జ్ఞానమజ్ఞాన మిత్యదః ।**
**నిత్యాపరోక్షరూపేఽపి ద్వయం స్యాద్దశమే యథా ॥22॥**

*22. ఆత్మ నిత్యము అపరోక్షముగ సాక్షాత్తుగ తెలియబడుచునే ఉన్నది. అయినా జ్ఞానము అజ్ఞానము పరోక్షము అపరోక్షము అని రెండును దానికి అన్వయింపబడుచున్నవి. కథయందలి పదవ వాని యందు వలెనే.*

*కథ:* పదిమంది మూర్ఖులు ప్రయాణము చేయుచు ఒక నదిని దాటారు. అందరూ దాటారో లేదో అని లెక్క చూచుకొనగ ప్రతివాడూ తొమ్మిదిమందినే లెక్కింపగలిగెను, తనను లెక్కించుకొనకపోవుటచే. దానితో వారు పదవవాడు నదిలో మునిగి పోయెనని ఏడ్చుచుండగా బాటసారి ఒకడు వారిలో ఒకనిచే తొమ్మిదిమందిని లెక్కింపజేసి లెక్కించిన వాని తలపై గట్టిగా మొట్టి ఇడుగో పదవవాడు అని చూపెను.

**నవసంఖ్యా హృతజ్ఞానో దశమో విభ్రమాత్తదా ।**
**న వేత్తి దశమోఽస్మీతి వీక్ష్యమాణోఽపి తాన్నవ ॥23॥**

*23. లెక్కించిన తొమ్మిదియను సంఖ్యచే జ్ఞానమును పోగొట్టుకొని పరిభ్రాంతుడైన పదవవాడు, తాను తొమ్మిదిమందిని చూచుచున్నను తానే పదవవాడని తెలియజాలడు.*

**న భాతి నాస్తి దశమ ఇతి స్వం దశమం తదా ।**
**మత్వా వక్తి తదజ్ఞానకృతమావరణం విదుః ।।24।।**

*24.* పదవవాడు తానే అగుటచేత, తనకెదురుగా ఆ పదవవానిని చూడలేడు. అందుచేత 'పదవాడు కన్పించుటలేదే, లేడే' అని అనును. దీనినే అజ్ఞానకృతమైన ఆవరణమందురు.

**నద్యాం మమార దశమ ఇతి శోచన్ప్రరోదితి ।**
**అజ్ఞాన కృతవిక్షేపం రోదనాదిం విదుర్బుధాః ।।25।।**

*25.* పదవవాడు నదిలో మరణించెనని దుఃఖించుచు పెద్దగా ఏడ్చుదురు. ఈ ఏడుపులు పెడబొబ్బలనే విద్వాంసులు అజ్ఞానకృతమైన విక్షేపము అందురు.

**న మృతో దశమోऽస్తీతి శ్రుత్వాప్తవచనం తదా ।**
**పరోక్షత్వేన దశమం వేత్తి స్వర్గాదిలోకవత్ ।।26।।**

*26.* చావలేదు, పదవవాడు బ్రతికే ఉన్నాడు అని ఆప్తుల నుండి విని, స్వర్గాది లోకముల ఉనికిని గూర్చి శ్రుతివాక్యముల ద్వారా తెలిసికొనినట్లే పదవవానిని గూర్చి పరోక్షముగ తెలిసికొనును.

**త్వమేవ దశమోऽసీతి గణయిత్వా ప్రదర్శితః ।**
**అపరోక్షతయా జ్ఞాత్వా హృష్యత్యేవ న రోదితి ।।27।।**

*27.* పదవవాడవు నీవే అని వానిచే లెక్కింపజేసి చూపగా అపరోక్షముగ సాక్షాత్తుగ తెలిసికొని హర్షమునొందును. ఇక ఏడువడు.

**అజ్ఞానావృతి విక్షేప ద్వివిధజ్ఞాన తృప్తయః ।**
**శోకాపగమ ఇత్యేతే యోజనీయాశ్చిదాత్మని ।।28।।**

*28.* చిదాత్మను గూర్చి సప్తదశలను చూడవచ్చును. అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షము అపరోక్షము అనే రెండు విధములైన జ్ఞానములు, తృప్తి, దుఃఖనాశము అనేవి ఆ ఏడు దశలు.

**సంసారసక్త చిత్తః సంశ్చిదాభాసః కదాచన ।**
**స్వయంప్రకాశ కూటస్థం స్వతత్త్వం నైవ వేత్త్యయమ్ ।।29।।**

*29.* సంసారమునందే లగ్నమైన మనస్సు గల చిదాభాసుడు తన నిజస్వరూపము స్వప్రకాశము అయిన కూటస్థమును తెలియనే తెలియడు. ఇది అజ్ఞాన దశ.

**న భాతి నాస్తి కూటస్థ ఇతి వక్తి ప్రసఙ్గతః ।**
**కర్తా భోక్తాహమస్మీతి విక్షేపం ప్రతిపద్యతే ॥30॥**

*30.* ప్రసంగవశమున 'కూటస్థము కన్పింపదు, అది లేదు' అనును. ఇది అజ్ఞానము వలన కలుగు ఆవరణ దశ. మీదు మిక్కిలి 'నేనే కర్తను భోక్తను' అని కూడా భావించును. ఇదే విక్షేప దశ.

**అస్తి కూటస్థ ఇత్యాదౌ పరోక్షం వేత్తి వార్తయా ।**
**పశ్చాత్కూటస్థ ఏవాస్మీత్యేవం వేత్తి విచారతః ॥31॥**

*31.* గురూపదేశాదుల వలన పరోక్షముగ కూటస్థము కలదు అని తెలిసికొనును. పిపద విచారణపూర్వకముగ స్వానుభవముననే 'నేను కూటస్థమును' అని తెలియును. (ఇది అపరోక్షజ్ఞానము).

**కర్తా భోక్తేత్యేవమాది శోకజాతం ప్రముఞ్చతి ।**
**కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ తుష్యతి ॥32॥**

*32.* ఆపై 'పుణ్యాపుణ్య కర్మలకు నేను కర్తను, సుఖదుఃఖములను అనుభవించు భోక్తను నేనే' మొదలగు దుఃఖసమూహమును వదలివేయును. చేయవలసినది చేయబడినది, లభింప తగినది లభ్యమైనది అని భావించి సంపూర్ణమైన తృప్తిని పొందును.

**అజ్ఞాన మావృత్తి స్తద్వద్విక్షేపశ్చ పరోక్షధీః ।**
**అపరోక్షమతిః శోక మోక్ష స్తృప్తిర్నిరఙ్కుశా ॥33॥**

*33.* అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము, దుఃఖనివృత్తి, నిరతిశయమైన తృప్తి.

**సప్తావస్థా ఇమాః సన్తి చిదాభాసస్య తాస్విమౌ ।**
**బన్ధమోక్షౌ స్థితౌ తత్ర తిస్రో బంధ కృతః స్మృతాః ॥34॥**

*34.* చిదాభాసుడగు జీవుడు ఈ సప్తదశలనుగడచును. ఇవే బంధమును మోక్షమును కూడ కల్పించును. అందు మొదటి మూడూ బంధకారణములని చెప్పబడినవి.

**న జానామీత్యుదాసీన వ్యవహారస్య కారణమ్ ।**
**విచార ప్రాగభావేన యుక్తమజ్ఞానమీరితమ్ ॥35॥**

*35.* *నాకు తెలియదు అనుభావము, సత్యమును గూర్చి నిర్లక్ష్యము, వివేకము లేకపోవుట అనేవి అజ్ఞానమని చెప్పబడినవి.*

**ఆమార్గేణ విచార్యాథ నాస్తి నో భాతి చేత్యసౌ ।**
**విపరీత వ్యవహృతి రావృతేః కార్యమిష్యతే ॥36॥**

*36.* *అశాస్త్రీయమగు తర్కము ద్వారా కూటస్థము కన్పింపదు అది లేదు అనే విపరీత వ్యవహారము ఆవరణము యొక్క ఫలము.*

**దేహద్వయ చిదాభాసరూపో విక్షేప ఈరితః ।**
**కర్తృత్వా ద్యఖిలః శోకః సంసారాఖ్యోఽస్య బంధక ॥37॥**

*37.* *చిదాభాసుడు సూక్ష్మస్థూల శరీరములతో తాదాత్మ్యము నొందుట విక్షేపమనబడినది. దీని వలన కర్తృత్వభావనతో ప్రారంభమగు సకల దుఃఖములకు లోనగును. ఈ దుఃఖజాతమే సంసారము. అదే బంధము.*

**అజ్ఞాన మావృతిశ్చైతే విక్షేపాత్ ప్రాక్ ప్రసిద్ధ్యతః ।**
**యద్యప్యథా ప్యవస్థే తే విక్షేపస్యైవ నాత్మనః ॥38॥**

*38.* *అజ్ఞానము ఆవరణము అనే దశలు రెండూ విక్షేపదశకు పూర్వము కలుగునవే. చిదాభాసుడు అనగా జీవుడు ఏర్పడునది మూడవ దశయగు విక్షేపము వలననే. అయినను ఆ మొదటి రెండు దశలు జీవునకే గాని ఆత్మకు బ్రహ్మమునకు కావు.*

**వ్యాఖ్య:** జీవుడు ఏర్పడుటకు మునుపటివైన అజ్ఞానము ఆవరణము ఎవరికి చెందగలవని ప్రశ్న. ఇవి దశలు, వికారములు, అగుటచే అవికార్యమైన బ్రహ్మమునకు చెందవు. జీవుడు ఇంకా ఏర్పడక పోవుటచే జీవునకు చెందజాలవు. మరి ఎవరికి చెందునట్లు?

విక్షేపసహితముగ మొదటి మూడుదశలును ఏకకాలమున సంభవించును అనుట కుదురదు. అట్లయిన మూడు దశలనుట ఏల? ఒకే దశ అనరాదా?

జీవునవే అని పరిష్కారము. విక్షేపదశయందు జీవుడు స్పష్టముగ నేర్పడినను దానికి పూర్వము కూడా సూక్ష్మ సంస్కారముల రూపమున ఉండనే ఉన్నాడు. అజ్ఞానము ఆవరణము అనే దశలు సూక్ష్మరూపముననున్న ఆ జీవునకే చెందును. ఇంకను జన్మింపకున్నను, మాతృగర్భమునందున్న శిశువునకు అనేక సంస్కారములు చేయబడుచున్నట్లే.

తార్కికముగ కూడా అజ్ఞానము ఆవరణము లేకుండ విక్షేపము సంభవింప జాలదు. దశముడు తన సంగతి విస్మరించును. దశముని ఉనికి తోచకపోవును. అప్పుడు మాత్రమే దశముడు నదిలో మునిగిపోయెననే విక్షేపము సంభవమగును. కనుక విక్షేపమునకు కారణములగు అజ్ఞాన ఆవరణములు విక్షేపకార్యమగు జీవునకు చెందుట న్యాయమే.

**విక్షేపోత్పత్తితః పూర్వమపి విక్షేప సంస్కృతిః ।**
**అస్త్యేవ తదవస్థాత్వ మవిరుద్ధం తతస్తయోః ॥39॥**

*39. విక్షేపము ఉత్పత్తి అగుటకు పూర్వము కూడా విక్షేప సంస్కారములు ఉండనే ఉన్నవి. కనుక మొదటి రెండు దశలును విక్షేపము యొక్క దశలే అనుట విరుద్ధము కాదు.*

**బ్రహ్మణ్యారోపితత్వేన బ్రహ్మావస్థే ఇమే ఇతి ।**
**న శఙ్కనీయం సర్వాసాం బ్రహ్మణ్యేవాధిరోపణాత్ ॥40॥**

*40. బ్రహ్మముపై ఆరోపింపబడుట చేత మొదటి రెండూ బ్రహ్మము యొక్క దశలని శంకింపరాదు. ఏలన మాయమొదలు అన్ని ఆరోపములకూ అధిష్ఠానము బ్రహ్మమే.*

**సంసార్యహం విబుద్ధోఽహం నిఃశోకస్తుష్ట ఇత్యపి ।**
**జీవగా ఉత్తరావస్థా భాన్తి న బ్రహ్మగా యది ॥41॥**

*41. (ఆక్షేపము) నేను సంసారిని నేను జ్ఞానిని శోకరహితుడను సంతుష్టుడను అనే తరువాతి అవస్థలు జీవునకు గదా బ్రహ్మమునకు చెందవు గదా.*

**తర్హ్యజ్ఞోఽహం బ్రహ్మ సత్త్వభానే మద్దృష్టితో న హి ।**
**ఇతి పూర్వే అవస్థే చ భాసేతే జీవగే ఖలు ॥42॥**

*42. (సమాధానము) అనినచో నేను అజ్ఞానిని నాకు బ్రహ్మము భాసించుట లేదు అనే మొదటి రెండు దశలు కూడ జీవునకే చెందవలయును కదా.*

**అజ్ఞానస్యాశ్రయో బ్రహ్మేత్యధిష్ఠానతయా జగుః ।**
**జీవావస్థాత్వమజ్ఞానాభిమానిత్వాదవాదిషమ్ ॥43॥**

*43. అధిష్ఠానముగ బ్రహ్మము అజ్ఞానమునకు ఆశ్రయమని పూర్వాచార్యులు చెప్పుదురు. కాని జీవుడు అజ్ఞానమునందు అభిమానముంచి నేను అజ్ఞానిని అని భావించును కనుక అజ్ఞానము జీవునదే అని చెప్పవచ్చు.*

**జ్ఞానద్వయేన నష్టేఽస్మిన్నజ్ఞానే తత్కృతావృతిః ।**
**న భాతి నాస్తి చేత్యేషా ద్వివిధాపి వినశ్యతి ॥44॥**

*44.* పరోక్ష అపరోక్ష జ్ఞానములచే ఈ అజ్ఞానము దాని వలన ఏర్పడే ఆవరణము నశింపగా వాని కార్యములగు కన్పించుటలేదు, అసలు లేదు అనే భావములు కూడా నశించును.

**పరోక్షజ్ఞానతో నశ్యేదసత్త్వావృతి హేతుతా ।**
**అపరోక్షజ్ఞాన నాశ్యా హ్యభానావృతిహేతుతా ॥45॥**

*45.* పరోక్షజ్ఞానము వలన బ్రహ్మము లేదు అనే భావమునకు కారణమగు అజ్ఞానము నశించును. బ్రహ్మము అనుభవమున భాసించుట లేదు అనే భావమునకు కారణమగు ఆవరణము అపరోక్షజ్ఞానము వలన నశించును.

**వ్యాఖ్య:** శాస్త్ర వాక్యముల నుండీ గురూపదేశము వలనను బ్రహ్మము కలదని తెలిసికొనును. స్వానుభవమున తానే బ్రహ్మమని తెలిసికొనును.

**అభానావరణే నష్టే జీవత్వారోప సంక్షయాత్ ।**
**కర్తృత్వాద్యఖిలః శోకః సంసారాఖ్యో నివర్తతే ॥46॥**

*46.* బ్రహ్మము భాసించుట లేదను ఆవరణము నశింపగా జీవత్వమనే విక్షేపము కూడా క్షయించిపోవును. దానితోపాటుగ కర్తృత్వము భోక్తృత్వము మొదలుగా గల శోకసముదాయము, సంసారమనే పేరు గలది, నివర్తించును.

**నివృత్త సర్వసంసారే నిత్యముక్తత్వ భాసనాత్ ।**
**నిరఙ్కుశా భవేత్తృప్తిః పునః శోకాసముద్భవాత్ ॥47॥**

*47.* సకలసంసార దుఃఖములు అంతము కాగా తాను నిత్యముక్తుడననే బోధ కలుగుటచే నిరతిశయమైన తృప్తి జనించును. ఇక మరల శోకము కలుగదు.

**అపరోక్షజ్ఞాన శోకనివృత్త్యాఖ్యే ఉభే ఇమే ।**
**అవస్థే జీవగే బ్రూత ఆత్మానం చే దితి శ్రుతిః ॥48॥**

*48.* ఈ ప్రకరణ ప్రారంభమున చెప్పబడిన శ్రుతివాక్యము ఆత్మానంచేత్ అనేది జీవుడనుభవించే ఈ రెండు దశలను, అపరోక్షజ్ఞానము శోకనివృత్తి అనే వానిని గూర్చి చెప్పును.

**అయమిత్యపరోక్షత్వ ముక్తం తద్ద్వివిధం భవేత్ ।**
**విషయ స్వప్రకాశత్వాద్ధియాప్యేవం తదీక్షణాత్ ॥49॥**

*49.* 'అయమ్' ఇది అనే శబ్దముచే అపరోక్షత్వము సూచింపబడినది. ఇదే నేను, అనే వాక్యమున 'ఇది' అనే శబ్దము ఆత్మస్వయం ప్రకాశమనీ, ఆస్వయం ప్రకాశమైన ఆత్మను విషయరూపముగ బుద్ధి చూచుననీ రెండు విధములైన అపరోక్షత్వము సూచింపబడినది.

**పరోక్షజ్ఞాన కాలేపి విషయస్వప్రకాశతా ।**
**సమా బ్రహ్మ స్వప్రకాశమస్తీ త్యేవం విబోధనాత్ ॥50॥**

*50.* పరోక్షజ్ఞాన కాలమునందును ఆత్మస్వప్రకాశమే. ఆత్మ స్వప్రకాశము అది కలదు అని బుద్ధి స్పష్టముగ గ్రహించును. దీని వలన పరోక్షజ్ఞానకాలమున బ్రహ్మము యొక్క స్వయంప్రకాశత్వమునకు ఏమీ బాధ కలుగదు.

**అహం బ్రహ్మేత్యనుల్లిఖ్య బ్రహ్మాస్తీ త్యేవ ముల్లిఖేత్ ।**
**పరోక్షజ్ఞానమేతన్న భ్రాన్తం బాధా నిరూపణాత్ ॥51॥**

*51.* 'నేను బ్రహ్మమును' అనక 'బ్రహ్మము కలదు' అనుట పరోక్ష జ్ఞానము. ఈ పరోక్షజ్ఞానము భ్రాంతి కాజాలదు, దీనిని నిరాకరించు నిరూపణ లేకపోవుట చేత.

**వ్యాఖ్య:** బ్రహ్మము లేని వస్తువేదీ లేకున్నను, బ్రహ్మము పరోక్షజ్ఞానమునకు విషయమగుచున్నది. 'బ్రహ్మము కలదు' మొదలగు వాక్యములు పరోక్షజ్ఞానమును కలిగించును. ఇది భ్రాంతియా అనినచో కాదు. భ్రాంతిని నాలుగు విధములుగ నిరూపింపవచ్చును. వానిలో ఏదీ బ్రహ్మము పట్ల వర్తింపదు. అవే క్రమముగ చెప్పబడుచున్నవి.

**బ్రహ్మ నాస్తీతి మానం చేత్స్యాద్బాధ్యేత తదా ధృవమ్ ।**
**న చైవం ప్రబలం మానం పశ్యామోఽతో న బాధ్యతే ॥52॥**

*52.* 'బ్రహ్మము లేదు' అని నిరూపింప గలిగినచో, అపుడు 'బ్రహ్మము కలదు' అనే జ్ఞానము భ్రాంతి అనవచ్చును. కాని బ్రహ్మము లేదనుటకు ప్రబలమైన ప్రమాణమేమీ లేదు. కనుక బ్రహ్మము కలదనుట భ్రాంతి కాదు.

**వ్యాఖ్య:** మొదటిది విరుద్ధమైన ప్రతిపాదనము సత్యమని నిరూపించుట. ఇది బ్రహ్మము పట్ల నిరూపింపబడలేదు.

**వ్యక్త్యనుల్లేఖమాత్రేణ భ్రమత్వే స్వర్గధీరపి ।**
**భ్రాన్తిః స్యాద్వ్యక్త్యనుల్లేఖా త్సామాన్యోల్లేఖ దర్శనాత్ ॥53॥**

*53. బ్రహ్మమును గూర్చి స్పష్టముగ చెప్పనందున అది భ్రాంతియనినచో స్వర్గాదుల గూర్చి కూడ శ్రుతి స్పష్టముగ చెప్పదు గనుక అవీ భ్రాంతి కావలెను. (అది ఇష్టము కాదు. కనుక స్వర్గాదుల గురించిన పరోక్షజ్ఞానము వలె బ్రహ్మమును గూర్చిన పరోక్షజ్ఞానము కూడా భ్రాంతి కాదు.)*

**వ్యాఖ్య:** రెండవది స్వరూపము స్పష్టముగ చెప్పబడలేదనుట. ఇది కూడా నిరాకరింపబడినది.

**అపరోక్షత్వ యోగ్యస్య న పరోక్షమతిర్భ్రమః ।**
**పరోక్షమిత్యనుల్లేఖాదర్థాత్పారోక్ష్య సంభవాత్ ॥54॥**

*54. అపరోక్షముగ తెలియదగిన దానిని పరోక్షముగ గ్రహించుట భ్రమ కాదు, ఇది పరోక్షము మాత్రమేయని చెప్పబడకపోవుట చేత. అపరోక్షముగ చెప్పబడకపోవుటచే పరోక్షత్వము సిద్ధించుచున్నది.*

**వ్యాఖ్య:** మూడవది పరోక్షజ్ఞానము అపరోక్షము కాజాలదనినచో భ్రమ అగును. బ్రహ్మము గూర్చి అట్లు చెప్పుటలేదు. 'బ్రహ్మము కలదు' అనే పరోక్ష జ్ఞానము 'ఇది బ్రహ్మము' అనే అపరోక్షజ్ఞానము అసంభవమనుట లేదు. మరి దాని పరోక్షత్వమెట్లు? 'ఇదే బ్రహ్మము' అని అపరోక్షముగ చెప్పబడకపోవుట చేత. అట్లు అపరోక్షమగు జ్ఞానము కలిగే వరకు బ్రహ్మము గూర్చిన జ్ఞానము పరోక్షముగనే ఉండును.

అనగా పరోక్షజ్ఞానము వలన బ్రహ్మము యొక్క వస్తుత్వమును గూర్చిన సంశయములు తొలగి అపరోక్షజ్ఞానము సంభవమని నిశ్చయము కలుగును. కాని బ్రహ్మము మనస్సునకు వాక్కునకు అతీతమగుటచే ఇతర విషయజ్ఞానము వలె పరోక్షముగనే పూర్తిగ తెలియబడదు. అపరోక్షముగనే అనుభవముననే తెలియబడును.

**అంశాగృహీతేర్భ్రాన్తిశ్చేద్ఘటజ్ఞానం భ్రమో భవేత్ ।**
**నిరంశస్యాపి సాంశత్వం వ్యావర్త్యాంశ విభేదతః ॥55॥**

*55. బ్రహ్మమును గూర్చి ఒక భాగమును గూర్చి మాత్రమే తెలుపుటచే ఆ పరోక్షజ్ఞానము భ్రమ అనినచో కుండ మొదలగు వానిని గూర్చిన జ్ఞానము*

*కూడ భ్రమయే అగును. నిరవయవమగు బ్రహ్మము సావయవమని చెప్పుట ఉపాధులను బట్టి. ఈ ఉపాధులనే పరోక్షజ్ఞానము తెలుపును.*

**వ్యాఖ్య:** బ్రహ్మమును మాత్రమే సూచించి ప్రత్యగాత్మను వదలెనని ఉద్దేశము. కుండను గూర్చిన జ్ఞానము కలిగినను, కుండయందేమి ఉన్నదో తెలియక పోవుటచే ఘటజ్ఞానము భ్రమకానట్లే, ఇంకను ప్రత్యగాత్మ గురించి చెప్పకున్నను బ్రహ్మమును గూర్చిన జ్ఞానము భ్రమ కాదు. ఇది నాలుగవది.

**అసత్త్వాంశో నివర్తేత పరోక్షజ్ఞానతస్తథా ।**
**అభానాంశ నివృత్తిః స్యాదపరోక్షధియా కృతా ॥56॥**

*56. బ్రహ్మము లేకపోవచ్చును అనే సంశయమును పరోక్షజ్ఞానము తీర్చును. బ్రహ్మము ప్రకాశింపదు అనుభవగతము కాదు అనుభావమును అపరోక్షజ్ఞానము నశింపజేయును.*

**దశమోఽస్తీతి విభ్రాన్తం పరోక్షజ్ఞాన మీక్ష్యతే ।**
**బ్రహ్మాస్తీత్యపి తద్వత్స్యాదజ్ఞానవారణం సమమ్ ॥57॥**

*57. 'పదవవాడు కలడు మునిగిపోలేదు' అనుట పరోక్షజ్ఞానము. అది భ్రమ కాజాలదు. అట్లే బ్రహ్మము కలదు అనే పరోక్షజ్ఞానము భ్రమ కాదు. రెండింటియందు సత్యమునావరించే అజ్ఞానము తొలగుట సమమే.*

**వ్యాఖ్య:** పరోక్షజ్ఞానము పరోక్షమైనంత మాత్రమున భ్రమ కాజాలదు. సోపపత్తికముగ కలిగినపుడు అది అపరోక్షజ్ఞానమునకు దారి తీయును. పదవ వాడు కలడని ఒక విశ్వసనీయుని ద్వారా వినుటవలన శోకము తగ్గును గదా. పిదప వాడెక్కడ కలడని పరీక్ష జరిగి వాడు ప్రత్యక్షమగును.

**ఆత్మా బ్రహ్మేతి వాక్యార్థే నిఃశేషేణ విచారితే ।**
**వ్యక్తి రుల్లిఖ్యతే యద్వద్దశమస్త్వమసీత్యతః ॥58॥**

*58. ఈ ఆత్మయే బ్రహ్మము అనే శ్రుతి వాక్యమును చక్కగా విచారించుటచే 'నేను' బ్రహ్మమును అనే అపరోక్షజ్ఞానము కలుగును. 'నీవే దశముడవు' అని చెప్పబడిన వ్యక్తి ఆలోచించి అదియట్లే అని గ్రహించును గదా.*

**వ్యాఖ్య:** అపరోక్షజ్ఞానమునకు విచారణ ప్రధానమా శ్రుతిలోని మహావాక్యము ప్రధానమా అనుటలో భేదాభిప్రాయములు గలవు. సామాన్యముగ మహావాక్యమే ప్రధానమని స్వీకరింపబడినది.

**దశమః క ఇతిప్రశ్నే త్వమేవేతి నిరాకృతే ।**
**గణయిత్వా స్వేన సహ స్వమేవ దశమం స్మరేత్ ॥59॥**

*59.* పదవవాడెవడు అని ప్రశ్నించినచో అది అతడే అని ఉత్తమరము. వరుసగా లెక్కించుచు తనను కూడా లెక్కించుకొని తానే పదవవాడని గుర్తించును. (ఇదే అపరోక్షజ్ఞానము).

**దశమోఽస్మీతి వాక్యోత్థా న ధీరస్య విహన్యతే ।**
**ఆది మధ్యావసానేషు న నవత్వస్య సంశయః ॥60॥**

*60.* 'నీవే పదవవాడవు' అనే వాక్యముచే జనించిన 'నేనే గదా దశముడను' అనే జ్ఞానము ఏవిధముగనైనా నష్టపడదు. తనను మొదటనే లెక్కించినా మధ్యలో లెక్కించినా చివర లెక్కించినా తాను దశముడనని దృఢముగ తెలియునే గాని తొమ్మిదవవాడనేమో ఆ తొమ్మిదిలో నొకడనేమో మొదలైన సంశయములు కలుగనే కలుగవు.

**వ్యాఖ్య:** అపరోక్షమైన జ్ఞానము అంత దృఢముగ ఉండును.

**సదేవేత్యాదివాక్యేన బ్రహ్మసత్త్వం పరోక్షతః ।**
**గృహీత్వా తత్త్వమస్యాది వాక్యాద్వ్యక్తిం సముల్లిఖేత్ ॥61॥**

*61.* 'సృష్టికి పూర్వము బ్రహ్మము ఉండెను' మొదలగు శ్రుతి వాక్యములు బ్రహ్మమును గూర్చిన పరోక్షజ్ఞానము నొసగును. 'తత్త్వమసి' 'అది నీవే' మొ॥ వాక్యములు అపరోక్ష జ్ఞానమునిచ్చును. ఛాందోగ్య ఉప: ***6.2.1; 6.8.7***

**ఆదిమధ్యావ సానేషు స్వస్య బ్రహ్మత్వధీరియమ్ ।**
**నైవ వ్యభిచరేత్తస్మాదాపరోక్ష్యం ప్రతిష్ఠితమ్ ॥62॥**

*62.* తానే బ్రహ్మమని తెలిసిన పిదప ఈ జ్ఞానము, పంచకోశములలో దేనితో కూడి వ్యవహరించినా, ఇక చలింపదు. ఈ విధముగ అపరోక్షత్వము సుప్రతిష్ఠితమగుచున్నది.

**జన్మాదికారణత్వాఖ్య లక్షణేన భృగుః పురా ।**
**పారోక్ష్యేణ గృహీత్వాథ విచారాద్వ్యక్తిమైక్షత ॥63॥**

*63.* ప్రాచీనకాలమున భృగుమహర్షి జగత్తు యొక్క సృష్టి స్థితి లయము లకు బ్రహ్మమే కారణమని విచారించి పరోక్షముగ తెలిసికొనెను. పిదప పంచకోశములను వివేచన చేసి అపరోక్ష జ్ఞానము పొందెను. తైత్తిరీయ ఉప.***3.1.1***

**వ్యాఖ్య:** అనగా జగత్కారణము బ్రహ్మమని తెలియుట పరోక్షజ్ఞానము పంచకోశములందలి ప్రత్యగాత్మయే బ్రహ్మమని తెలియుట అపరోక్షజ్ఞానము.

**యద్యపి త్వమసీత్యత్ర వాక్యం నోచే భృగోః పితా ।**
**తథాప్యన్నం ప్రాణమితి విచార్య స్థలముక్తవాన్ ॥64॥**

*64. భృగువు యొక్క తండ్రి తత్త్వమసి అనే వాక్యముచే బోధింపకున్నను, అన్నము ప్రాణము అని విచారింపదగిన పంచకోశములను చూపెను. తైత్తిరీయ ఉప.3.6.1.*

**అన్న ప్రాణాది కోశేషు సువిచార్య పునః పునః ।**
**ఆనందవ్యక్తిమీక్షిత్వా బ్రహ్మలక్ష్మాప్యయూయుజత్ ॥65॥**

*65. అన్నమయాది కోశములను మరల మరల విచారించి ఆనందమయ కోశమునందు బ్రహ్మము యొక్క లక్షణములను గమనించి 'నేనే బ్రహ్మమును' అని నిశ్చయించెను.*

**సత్యం జ్ఞానమనన్తం చేత్యేవం బ్రహ్మస్వలక్షణమ్ ।**
**ఉక్త్వా గుహాహితత్వేన కోశేష్వేత త్ప్రదర్శితమ్ ॥66॥**

*66. బ్రహ్మము యొక్క స్వరూపము సత్యము జ్ఞానము అనంతము అని శ్రుతి మొదట వివరించును, పిదప పంచకోశములందు దాగి ఉన్న ప్రత్యగాత్మను వర్ణించును.*

**వ్యాఖ్య:** తైత్తిరీయ ఉప. 2.1.5 సత్యం జ్ఞానమనంతం అనేవి బ్రహ్మము యొక్క స్వరూపలక్షణములు. సృష్టిస్థితిలయ కారణత్వాదులు తటస్థలక్షణములు. స్వరూప లక్షణములకు మార్పు ఉండదు. తటస్థ లక్షణములు ఒకప్పుడుండవచ్చు, ఒకప్పుడు లేకపోవచ్చు. కాకి వ్రాలియుండుట ఒకానొక ఇంటికి తటస్థ లక్షణము. ఇనుప ద్వారము కలిగి ఉండుట స్వరూపలక్షణము.

సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ అని బ్రహ్మము యొక్క స్వరూప లక్షణములను చెప్పిన శ్రుతి '*యోవేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్*' అని పంచకోశ గుహాంతస్థమైన ఆ బ్రహ్మము యొక్క ప్రత్యగాత్మత్వమును కూడా చెప్పుచున్నది.

**పారోక్ష్యేణ విబుద్ధ్వేన్ద్రో య ఆత్మేత్యాదిలక్షణాత్ ।**
**అపరోక్షీకర్తు మిచ్ఛంశ్చతుర్వారం గురుం యయౌ ॥67॥**

*67.* *ఇంద్రుడు లక్షణముల ద్వారా బ్రహ్మమును గూర్చిన పరోక్షజ్ఞానము సంపాదించెను. ఆపై దానిని అపరోక్షము చేసికొనగోరి నాలుగు పర్యాయములు గురువు చెంతకు పోయెను. ఛాందోగ్య ఉప: **8.7.1-3.***

**ఆత్మా వా ఇదమిత్యాదౌ పరోక్షం బ్రహ్మ లక్షితమ్ ।**
**అధ్యారోపాపవాదాభ్యాం ప్రజ్ఞానం బ్రహ్మదర్శితమ్ ॥68॥**

*68.* *ఐతరేయోపనిషత్తునందు **(1.1.1-3.1.3)** సృష్టికి పూర్వము ఆత్మ మాత్రమే ఉండెను మొదలగు వాక్యముల వలన బ్రహ్మము పరోక్షముగ చెప్పబడినది. పిమ్మట అధ్యారోప అపవాదములచే ప్రజ్ఞానం బ్రహ్మయని అపరోక్షముగ చెప్పబడినది.*

**అవాన్తరేణ వాక్యేన పరోక్షా బ్రహ్మధీర్భవేత్ ।**
**సర్వత్రైవ మహావాక్య విచారాదపరోక్షధీః ॥69॥**

*69.* *ఇతర శ్రుతివాక్యముల నుండి బ్రహ్మము గూర్చిన పరోక్షజ్ఞానము పొందవచ్చును. మహావాక్యములను విచారించుట వలననే సర్వదా అపరోక్ష జ్ఞానము కలుగును.*

**బ్రహ్మాపరోక్ష్యసిద్ధ్యర్థం మహావాక్య మితీరితమ్ ।**
**వాక్యవృత్తావతో బ్రహ్మాపరోక్ష్యే విమతిర్నహి ॥70॥**

*70.* *వాక్యవృత్తియందు బ్రహ్మమును అపరోక్షము చేసికొనుటకు మహావాక్యము ఉద్దేశింపబడినదని చెప్పబడినది. కనుక ఆ విషయమునందు సంశయము లేదు.*

**వ్యాఖ్య:** మహావాక్యములు అపరోక్షజ్ఞానము కొరకనుటకు ఏమి ప్రమాణమనిన శంకర భగవత్పాదుల వాక్యవృత్తియే ప్రమాణమని చెప్పుచున్నాడు. అందలి 44, 45, 46, 48, 38–41 శ్లోకములే ఇప్పుడు 71 నుండి 78 వరకు ఉధృతములగుచున్నవి.

**ఆలంబనతయా భాతి యోఽస్మత్ ప్రత్యయ శబ్దయోః ।**
**అన్తకరణ సంభిన్నబోధః స త్వం పదాభిధః ॥71॥**

*71.* *'త్వం' 'నీవు' అనే పదముచే సూచింపబడునది అంతఃకరణము ఉపాధిగా గల చైతన్యము, చిదాత్మ. అదే 'నేను' అనే జ్ఞానమునకు 'నేను' అనే పదమునకు విషయమగుచున్నది.*

**మాయోపాధిర్జగద్యోనిః సర్వజ్ఞత్వాది లక్షణః ।**
**పారోక్ష్యశబలః సత్యాద్యాత్మక స్తత్పదాభిధః ॥72॥**

*72. మాయ ఉపాధిగా గలది, జగత్కారణమైనది, సర్వజ్ఞత్వము సర్వేశ్వరత్వము మొదలైన లక్షణములు గలది, పరోక్షముగ తెలియబడునది, స్వరూపమున సత్యము జ్ఞానము మొదలైనది అగునది, తత్ అనే పదముచే సూచింపబడుచున్నది.*

**వ్యాఖ్య:** త్వం, తత్ అనే పదములకు వాచ్యార్థము, అనగా పైకి తోచుచున్న అర్థము, చెప్పబడినది. ఇట్టి లక్షణములుగల తత్, త్వం అనేవి ఒకటే అగుట, తత్త్వమసి అనుట, అసంగతము కదా. కనుక వాచ్యార్థమునందు ఐక్యత ఉద్దేశింపబడలేదు. ఉద్దేశింపబడిన అర్థమే లక్షణార్థము. అది ఇపుడు వివరింపబడుచున్నది.

ఈ శ్లోకములో ఈశ్వర బ్రహ్మములకు అభేదము కూడా ప్రతిష్ఠింపబడినది.

**ప్రత్యక్పరోక్షతైకస్య సద్వితీయత్వ పూర్ణతా ।**
**విరుధ్యేతే యతస్తస్మాల్లక్షణా సంప్రవర్తతే ॥73॥**

*73. వాచ్యార్థము ననుసరించి నేరుగా తెలియబడునది అనేకములలో ఒక్కటైనది అయినవిషయమే పరోక్షముగ తెలియబడుచున్నది అద్వితీయము సంపూర్ణము అయినది కూడా. ఇట్లు చెప్పుట విరుద్ధము కనుక లక్షణార్థమును అనుసరింపవలెను.*

**వ్యాఖ్య:** తత్త్వమసి అనే వాక్యముచే జీవ ఈశ్వరులకు అభేదము చెప్పబడినది. అనేక జీవులలో ఒకడు నేరుగా తెలియబడువాడు అగు జీవుడే సంపూర్ణుడు అద్వితీయుడు శ్రుతివాక్యములచే తెలియబడువాడు అగు ఈశ్వరుడగుట అసంగతము. కనుక జీవ ఈశ్వరులందు ఇరువురియందూ గల లక్షణములను స్వీకరించి విరోధించు లక్షణములను ఉపేక్షించినచో ఐక్యత సిద్ధించును. ఇట్లు కొన్ని లక్షణములను స్వీకరించి కొన్ని లక్షణములను వదలి అర్థము చెప్పుటను భాగత్యాగ లక్షణార్థమందురు. దీనికే జహదజహల్లక్షణార్థ మనీ పేరు.

'దేవదత్తుడు సింహము' అనినచో దేవదత్తునకు జూలును కోరలును తోక ఉనున్నవని అర్థము కాక దేవదత్తుడు సింహమునకు గల ధైర్యము బలము పరాక్రమము మొదలగు గుణములు కలవాడని అర్థము. దేవదత్తుడు వాచ్యార్థమున సింహమగుట అసంభవము కనుక గుణములే ఉద్దేశింపబడినవని గ్రహింతుము.

అట్లే జీవేశ్వరులు వారి వారి ఉపాధులతో కూడి ఒకటియగుట అసంభవము గనుక వారి స్వరూపమును, ఉపాధిరహితమైన దానిని, గ్రహింపవలెను.

**తత్త్వమస్యాదివాక్యేషు లక్షణా భాగలక్షణా ।**
**సోఽయ మిత్యాదివాక్యస్థపదయోరివ నాపరా ॥74॥**

*74. తత్త్వమసి మొదలగు వాక్యములందు, 'అతడే ఇతడు' మొదలగు వాక్యములందలి పదములందు వలె, అన్వయింపవలసిన లక్షణార్థము భాగలక్షణార్థము (భాగత్యాగలక్షణార్థము). ఇతరము కాదు.*

**వ్యాఖ్య:** లక్షణ మూడు విధములు 1. జహల్లక్షణ 2. అజహల్లక్షణ 3. జహదజహల్లక్షణ లేక భాగత్యాగ లక్షణయని.

జహల్లక్షణయందు పదము యొక్క వాచ్యార్థము పూర్తిగ వదలి మరొక అర్థము స్వీకరింపవలెను. 'గంగయందలి పల్లె' అనగా నిజముగా గంగానది లోనే పల్లె ఉన్నదని గాక గంగానది ఒడ్డున పల్లెయని గ్రహింతుము. గంగయందలి అనే పదమునకు బదులు ఒడ్డున అనే పదము గ్రహింపబడినది గనుక ఇది జహల్లక్షణము.

అజహల్లక్షణమనగా పదమునకున్న అర్థము వదలక విశేషమైన అర్థమును గ్రహించుట. విందు జరుగునపుడు 'అన్నము రావలెను' అనినచో అన్నమే ఎగిరి రావలెనని కాక అన్నముతో గూడ వడ్డించువాడు రావలెనని అర్థము. ఇచ్చట 'అన్నమును' వదలక వడ్డించువానిని కూడ చేర్చుటచే ఇది అజహల్లక్షణము.

జహదజహల్లక్షణమనగా పదములందలి కొన్ని అంశములను వదలి కొన్ని అంశములను మాత్రము స్వీకరించుట. 'ఆ దేవదత్తుడే ఇతడు' అనునపుడు కొన్ని సంవత్సరముల క్రిందట చిన్ని బాలుడై చీమిడి ముక్కుతో మూడవ తరగతి యందుండిన ఆ దేవదత్తుడే దృఢగాత్రుడు ఆజానుబాహువు శాస్త్రపారంగతుడైన ఇతడు అని అర్థము తెలియును. ఈ దేవదత్తులను వివిధ సమయములందు మాత్రమే చూచినవారికి గుర్తు తెలియదు. కాని సోమదత్తుని పుత్రుడను సామాన్య లక్షణము వలన, దేవదత్తులయందలి విరుద్ధాంశములను లక్షణములను వదలి ఓహో ఈ దేవదత్తులు ఒక వ్యక్తియే కదా అని బోధపడును. అట్లే ఉపాధిగతములైన అల్పజ్ఞత్వము అంతఃకరణవర్తిత్వము సర్వజ్ఞత్వము మాయాధీశ్వరత్వము అనే విరుద్ధ లక్షణములను వదలి చైతన్య స్వరూపమను సామాన్య లక్షణమును గ్రహించినచో జీవేశ్వరుల అభేదము సిద్ధించును. ఈ లక్షణయే గ్రహింపవలెను. మొదటి రెండు లక్షణలను కాదు అని శ్లోకార్థము.

**సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః ।**
**అఖండైకరసత్వేన వాక్యార్థో విదుషాం మతః ॥75॥**

*75. తత్త్వమసి అనే వాక్యమునందు సంసర్గము వలన గాని విశేషణయుత మగుట వలన గాని వాక్యార్థమును అంగీకరింపలేము. స్వగతాది భేదములు లేని అఖండము ఏకరసము అగు వస్తుస్వరూపముగ విద్వాంసులు వాక్యార్థమును స్వీకరింతురు.*

**వ్యాఖ్య:** వాక్యమునకు అర్థము దానియందలి పదముల అన్వయముచే గలుగును. ఈ అన్వయమునే సంసర్గమందురు. సంసర్గార్థము తెలియవలెనన్న నాలుగు లక్షణములుండవలెను. 1. ఆకాంక్ష. అనగా వాక్యములోని ఏ పదమైనను లేనిచో వాక్యము యొక్క పూర్తియర్థమునకు లోపము కలుగును. 2. యోగ్యత. పదముల మధ్య పరస్పర సంబంధము 3. తాత్పర్యము అనగా ఆ పదముల ప్రయోగమునకు తగిన సందర్భముండుట. 4. సన్నిధి అనగా వాక్యమునందలి పదములన్నీ సమముగా తగిన క్రమమున తగిన వేగమున ఉచ్ఛరింపబడుట. 'ఆవును కొని రమ్ము' అనే వాక్యమును క్రయవిక్రయ సందర్భమున ఉచ్ఛరించినచో దానియందు ఈ లక్షణములన్నియు ఉండి ఆ వాక్యమునకు సంసర్గార్థమున వాక్యార్థము సిద్ధించును.

విశిష్టార్థమనగా పదములలో ఒకటి మరొక దానిని గాని అన్యోన్యముగగాని విశేషణ రూపమున చెప్పును. దండి దేవదత్తుడు అనినచో దండము గల దేవ దత్తుడని అర్థము. దండము దేవదత్తుని విశేషించి చెప్పుచున్నది. దీనిని విశిష్ట సంబంధమందురు. నీలకమలము అనినచో నీలమైన మరేదియుగాక కమలము మాత్రమే అనీ, ఏ వర్ణమైనను కమలము గాక నీలవర్ణముగల కమలము మాత్రమే అనీ అన్యోన్యము విశేషించి చెప్పుచున్నవి. దీనిని సంసృష్ట సంబంధమందురు.

తత్త్వమసి మొదలగు వాక్యములందు ఈ సంసర్గ విశిష్టార్థములన్వయింపవు. అఖండమైన ఏకత్వమే చెప్పబడినది అని విద్వాంసుల మతము.

**ప్రత్యగ్బోధో య ఆభాతి సోఽద్వయానంద లక్షణః ।**
**అద్వయానంద రూపశ్చ ప్రత్యగ్బోధైక లక్షణః ॥76॥**

*76. ప్రత్యగాత్మగా పంచకోశములందు ప్రకాశించునదే అద్వయానంద మగు బ్రహ్మము. అద్వయానందమైన బ్రహ్మమే సర్వాంతరమై హృద్గుహ యందు ప్రకాశించు ప్రత్యగాత్మ.*

**వ్యాఖ్య:** అదే ఇది, ఇదే అది అనే వ్యతిహారము వలన ఏకత్వము స్థాపింపబడినది.

**ఇత్థమన్యోన్య తాదాత్మ్య ప్రతిపత్తిర్యదా భవేత్ ।**
**అబ్రహ్మత్వం త్వమర్థస్య వ్యావర్తేత తదైవ హి ॥77॥**

*77. ఈ విధముగ అన్యోన్యముగ జీవేశ్వరులకు తాదాత్మ్యబోధ కలిగినపుడు త్వం పదముచే సూచింపబడు జీవుడు బ్రహ్మము కంటె భిన్నుడు అనే బోధ నివారింపబడును.*

**వ్యాఖ్య:** రెండు విధములైన అపోహలు గలవు. ఒకటి జీవుడు అనేకులలో ఒకడు బ్రహ్మము కంటే భిన్నుడు అనేది. రెండవది బ్రహ్మము జీవుని కంటే భిన్నమైనది ఎచ్చటనో ఉన్నది అనేది. ప్రత్యగాత్మయే బ్రహ్మము అనే అపరోక్ష జ్ఞానము వలన రెండు అపోహలును తొలగుచున్నవి.

**తదర్థస్య చ పారోక్ష్యం యద్యేవం కిం తతః శృణు ।**
**పూర్ణానందైకరూపేణ ప్రత్యగ్బోధోఽవతిష్ఠతే ॥78॥**

*78. తత్ అనే పదముల వలన సూచింపబడే బ్రహ్మము యొక్క పరోక్షత్వము పోయినచో ఏమగును అనినచో పూర్ణమగు ఆనందరూపమున ప్రత్యగ్బోధయే మిగులును.*

**ఏవం సతి మహావాక్యా త్పరోక్షజ్ఞాన మీర్యతే ।**
**యైస్తేషాం శాస్త్రసిద్ధాంత విజ్ఞానం శోభతేతరామ్ ॥79॥**

*79. ఇట్లుండగా మహావాక్యముల వలన బ్రహ్మము గూర్చిన పరోక్ష జ్ఞానమే లభించునను వారు తమ అద్భుతమైన శాస్త్రసిద్ధాంత వి(అ)జ్ఞానమును ప్రకటింతురు.*

**ఆస్తాం శాస్త్రస్య సిద్ధాన్తో యుక్త్యా వాక్యాత్పరోక్షధీ: ।**
**స్వర్గాది వాక్యవన్నైవం దశమే వ్యభిచారతః ॥80॥**

*80. యుక్తితో తార్కికముగ సాధించిన శాస్త్రి సిద్ధాంతములు అట్లుండనిమ్ము. శాస్త్రవాక్యముల వలన కలుగునది స్వర్గాదుల వలే బ్రహ్మము గూర్చి పరోక్షజ్ఞానమే కదా అనినచో సర్వదా అట్లు కాదు. 'నీవే దశముడవు' అనే వాక్యము వలన అపరోక్ష జ్ఞానము, పదవ వాని గూర్చి, కలిగినట్లు మహా వాక్యముల వలన బ్రహ్మము గూర్చిన అపరోక్షజ్ఞానము కలుగును.*

**వ్యాఖ్య:** ఇతర శ్రుతి వాక్యముల వలన బ్రహ్మమును గూర్చిన పరోక్ష జ్ఞానమును, మహావాక్యముల వలన అపరోక్షజ్ఞానమును బుద్ధియందు కలుగును. రెండూ ప్రతిబంధకములు తొలగినపుడే కలుగును.

**స్వతో౽పరోక్ష జీవస్య బ్రహ్మత్వ మభివాఞ్ఛతః ।**
**నశ్యే త్సిద్ధాపరోక్షత్వమితి యుక్తిర్మహత్యహో ॥81॥**

*81. జీవుడు స్వయముగనే ఎల్లరకును అపరోక్షముగ తెలియును. ఆ జీవుడే బ్రహ్మము అని మహావాక్యములు చెప్పగా, ఉన్న అపరోక్షత్వము నశించి పరోక్షమగుననుట ఏమి అద్భుతమైన యుక్తి! బొత్తిగా అసంగతమైన విషయ మని భావము.*

**వృద్ధిమిష్టవతో మూలమపి నష్టమితీదృశమ్ ।**
**లౌకికం వచనం సార్థం సంపన్నం త్వత్ప్రసాదతః ॥82॥**

*82. వడ్డీ వచ్చునని ఆశింపగా అసలుకే ముప్పువచ్చెననే సామెత మీ (ప్రతివాదుల) అనుగ్రహము వలన మాయందు సార్థకమైనది.*

**వ్యాఖ్య:** తత్త్వమసి మొదలగు మహావాక్యములందు త్వం పదమునకర్థమైన జీవునందు అపరోక్షత్వము ఉండనే ఉన్నది. ఆ అపరోక్షత్వమే తత్ పదమైన బ్రహ్మమునకును సిద్ధించునని వేదాంతులు, చెప్పుచుండగా బ్రహ్మమునకు ప్రస్తుతమున్న పరోక్షత్వమే మహావాక్యములవలన జీవునకు కలిగి అతని అపరోక్షత్వమే నశించునని ప్రతివాదులనుట హాస్యాస్పదము గదా!

**అన్తఃకరణ సంభిన్న బోధో జీవో౽పరోక్షతామ్ ।**
**అర్హత్యుపాధి సద్భావాన్న తు బ్రహ్మానుపాధితః ॥83॥**

*83.(ఆక్షేపము) జీవుడు అంతఃకరణమనే ఉపాధి గలవాడగుటచే అపరోక్ష జ్ఞానమునకు విషయము కాగలడు. బ్రహ్మమునకు అట్టి ఉపాధి ఏమీ లేదు. కనుక నిరుపాధికమైన బ్రహ్మము అపరోక్షజ్ఞానమునకు విషయము కాజాలదు.*

**నైవం బ్రహ్మత్వ బోధస్య సోపాధి విషయత్వతః ।**
**యావద్విదేహ కైవల్య ముపాధేరనివారణాత్ ॥84॥**

*84. (సమాధానము) విదేహముక్తి కలిగే వరకు ఉపాధి పూర్తిగా నివారింపబడదు. అందుచేత బ్రహ్మత్వబోధ కూడా సోపాధికమే అగును. జ్ఞానము సోపాధికమైనపుడు జ్ఞేయము సోపాధికము కాక తప్పదు కదా.*

**వ్యాఖ్య:** అపరోక్ష జ్ఞానము కలిగిన పిమ్మట ప్రారబ్ధము ఏమగుననుటలో భేదాభిప్రాయములున్నవి. ఆ ప్రారబ్ధము వలన, అపరోక్షమైన బ్రహ్మజ్ఞానము, బ్రహ్మము కూడా సోపాధికములని ప్రస్తుత ప్రతిపాదనము. మరి ఆ బ్రహ్మమునకు గల ఉపాధి ఏది? చెప్పబడుచున్నది.

**అన్తఃకరణ సాహిత్య రాహిత్యాభ్యాం విశిష్యతే ।**
**ఉపాధిర్జీవభావస్య బ్రహ్మతాయాశ్చ నాన్యథా ॥85॥**

*85. అంతఃకరణము ఉండుట జీవునకు ఉపాధి. అంతఃకరణము లేక పోవుట బ్రహ్మమునకు ఉపాధి. జీవబ్రహ్మములకు ఇదే భేదము. వేరు భేదము లేదు.*

**వ్యాఖ్య:** అద్దము ఉండిననే ప్రతిబింబము అందు కన్పించును. అద్దము పోయిన, ప్రతిబింబము కూడ పోవును. బింబము మాత్రము ఎప్పుడును ఉండునదే కదా! అట్టి అద్దమే అంతఃకరణము, అజ్ఞానవికారము.

**యథా విధిరుపాధిః స్యాత్ప్రతిషేధస్తథా న కిమ్ ।**
**సువర్ణ లోహభేదేన శృంఖలాత్వం న భిద్యతే ॥86॥**

*86. విధియుపాధియైనట్లు ప్రతిషేధము మాత్రము ఏల ఉపాధి కాజాలదు? బంగారువైనను ఇనుపవైనను సంకెలలు సంకెలలే గదా! బంధించుటకు సమర్థములే గదా!*

**వ్యాఖ్య:** ఉపాధి యొక్క ఉద్దేశము, కార్యము, ఏమి? భేదము కల్పించుట మాత్రమే. ఉపాధిరూపమేమి అది వేరుగ ఉన్నదా లేదా అనే ప్రశ్నలు అనావశ్యక ములు. అంతఃకరణము ఉండుట జీవునకు ఉపాధి. అది లేకపోవుటయే బ్రహ్మము నకు ఉపాధి. కుండకు పటమునకు భేదముగలదు. అయినచో కుండకు ఈ భేదమునకు భేదము గలదా? మరల ఈ రెండు భేదములకు భేదము గలదా అని తర్కింపము. భేదము తెలియుటతో ఆ భేదము పని తీరినది. అట్లే ఉపాధి యొక్క పని కూడా జీవునకు బ్రహ్మమునకు భేదము కల్పించుట. ఆ పని ఉండుటయు చేయవచ్చును. లేకపోవుటయు చేయవచ్చును.

**అతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేన చ ।**
**వేదాన్తానాం ప్రవృత్తిః స్యాద్ ద్విధేత్యాచార్య భాషితమ్ ॥87॥**

*87.* బ్రహ్మము కాని దానిని, దృశ్యమాన ప్రపంచమును, నిరాకరించే నేతి నేతి (ఇదికాదు ఇదికాదు) అనే నిషేధరూపమునను, బ్రహ్మమును ప్రతి పాదించు సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ అను విధిరూపమునను వేదాంతములు అనగా ఉపనిషత్తులు బోధించుచున్నవి అని శ్రీశంకరభగవత్పాదులు చెప్పిరి. కనుక అంతఃకరణమును నిషేధించుచు బ్రహ్మమున కుపాధి చెప్పుటలో అసంగతమేమీ లేదు అని దృఢపరచుచున్నాడు.

**అహమర్థపరిత్యాగాదహం బ్రహ్మేతి ధీః కుతః ।**
**నైవమంశస్య హి త్యాగో భాగలక్షణయోదితః ॥88॥**

*88.* 'అహం' అనే భావమును వదలినచో ఇక 'అహం బ్రహ్మాస్మి' అనే బోధ కలుగుటెట్లు? అనినచో 'అహం' భావమును పూర్తిగా వదలుట గాక అందలి విరుద్ధాంశమును మాత్రమే వదలుట భాగలక్షణచే జరిగినది.

**వ్యాఖ్య:** తత్ రూపమగు చైతన్యము అతత్ రూపమగు అంతఃకరణము కలసి 'అహం' 'నేను' ఏర్పడినది. భాగత్యాగ లక్షణ వలన అంతఃకరణము కలసి 'అహం' 'నేను' ఏర్పడినది. భాగత్యాగ లక్షణవలన అంతఃకరణమును వదలుట వలన చైతన్య స్వరూపమగు బ్రహ్మముతో ఐక్యము బోధపడుచున్నది.

**అంతఃకరణ సంత్యాగాదవశిష్టే చిదాత్మని ।**
**అహం బ్రహ్మేతి వాక్యేన బ్రహ్మత్వం సాక్షిణీక్ష్యతే ॥89॥**

*89.* అంతఃకరణమును పరిత్యజింపగా మిగిలిన సాక్షియగు చిదాత్మ యందు అహం బ్రహ్మాస్మి అనే వాక్యముచే బ్రహ్మత్వము గుర్తింపబడుచున్నది.

**స్వప్రకాశోఽపి సాక్ష్యేవ ధీవృత్త్యా వ్యాప్యతేఽన్యవత్ ।**
**ఫలవ్యాప్యత్వమేవాస్య శాస్త్రకృద్భిర్నివారితమ్ ॥90॥**

*90.* సాక్షియగు చిదాత్మ స్వప్రకాశమేయైనను బుద్ధివృత్తిచే ఇతర విషయముల వలెనే వ్యాప్యమగుచున్నది. శాస్త్రకారులు ఫలవ్యాప్తిని మాత్రమే ఇచ్చుట నిషేధించిరి.

**వ్యాఖ్య:** దేనినైను గుర్తించునది తెలియునది అంతఃకరణమే గదా, అది లేనపుడు బ్రహ్మత్వము మాత్రమే ఎట్లు గుర్తింపబడును? అని సంశయము. విషయములను గూర్చిన గుర్తింపు ఎట్లు కలుగునో మొదట విచారింతము.

గుర్తింపునందు రెండు దశలున్నవి. ఒకటి జ్ఞేయవిషయమును గూర్చిన అజ్ఞానము తొలగుట. ఇది అంతఃకరణ వికారముచే ఏర్పడును. దీనిని వృత్తివ్యాప్తి అందురు. రెండవది జ్ఞేయవిషయమును గూర్చిన జ్ఞానము అంతఃకరణమునందు ప్రతిఫలించిన చిదాభాసయందు కలుగుట. ఈ వికారము చిదాభాసయందు కలిగినను చిదాభాస అంతఃకరణమునందే ఉన్నది కనుక ఈ రెండూ సామాన్య విషయములందు ఒకటిగనే ఫలించును. చిదాభాసయందు కలిగే వికారమునకు ఫలవ్యాప్తి అని పేరు.

బ్రహ్మము గూర్చిన బోధ కలిగితే, దానిని గూర్చిన అజ్ఞానము తొలగును. అనగా అంతఃకరణమునందు కలిగిన ఈ వికారముచే అంతఃకరణమే నశించును. అజ్ఞానకార్యము గనుక. అనగా బ్రహ్మమును గూర్చిన వృత్తివ్యాప్తి సిద్ధించును. ఇక చిదాభాసుడు గూడ అంతఃకరణముతో నశించుటచే ఫలవ్యాప్తి సిద్ధింపదు. కాని సాక్షియగు చిదాత్మ స్వప్రకాశమగుటచే తానే బ్రహ్మము అని గుర్తించును.

'నేను ఉన్నాను' అనే బోధ 'కుండ ఉన్నది' అనే బోధ వలెనే స్పష్టముగ అంతః కరణము నందేర్పడును. కాని జ్ఞేయవిషయమగుటచే కుండను అంతఃకరణము, చిదాభాస సహితమైనది, గ్రహింపగలదు. కుండవలె జ్ఞేయవిషయము కాకపోవుటచే చిదాభాస సహితమైన అంతఃకరణము బ్రహ్మమును గ్రహింపలేదు. చిదాత్మ, అనగా ప్రత్యగాత్మ, బ్రహ్మము వలెనే స్వప్రకాశము గనుక వాని ఐక్యత, నేను ఉన్నాను అనే బోధ వలెనే, సిద్ధించును.

**బుద్ధి తత్స్థచిదాభాసౌ ద్వావపి వ్యాప్నుతో ఘటమ్ ।**
**తత్రాజ్ఞానం ధియా నశ్యేదాభాసేన ఘటః స్ఫురేత్ ॥91॥**

*91.* *ఘటమును తెలియుట యందు బుద్ధియు దానియందలి చిదాభాసము రెండును వికారము నొందును. ఘటమును గూర్చిన అజ్ఞానము బుద్ధివికారము ద్వారా నశింపగా జడమగు ఘటము స్వయంప్రకాశము కాకపోవుటచే చిదాభాస వికారము ద్వారా స్ఫురించును.*

**బ్రహ్మణ్యజ్ఞాన నాశాయ వృత్తివ్యాప్తిరపేక్షితా ।**
**స్వయం స్ఫురణరూపత్వాన్నాభాస ఉపయుజ్యతే ॥92॥**

*92.* *బ్రహ్మమును తెలియుటయందు అజ్ఞాన నివృత్తికై వృత్తివ్యాప్తి అనగా బుద్ధివికారము, ఆవశ్యకమగును. కాని బ్రహ్మము స్వయముగనే స్ఫురించునది గనుక చిదాభాస వికారమగు ఫలవ్యాప్తి అనావశ్యకము.*

**చక్షుర్దీపావపేక్ష్యేతే ఘటాదేర్దర్శనే యథా ।**
**న దీపదర్శనే కింతు చక్షురేకమపేక్ష్యతే ॥93॥**

*93.* ఘటము మొదలగు అప్రకాశవస్తువులను చూచుటకు కన్ను దీపము రెండును ఆవశ్యకములు. కాని ప్రకాశరూపమగు దీపమును చూచుటకు కన్ను మాత్రమే చాలును.

**స్థితోఽప్యసౌ చిదాభాసో బ్రహ్మణ్యేకీభవేత్పరమ్ ।**
**నతు బ్రహ్మణ్యతిశయం ఫలం కుర్యాద్ఘటాదివత్ ॥94॥**

*94.* చిదాభాస ఉన్నా అది బ్రహ్మమునందే లీనమగును. ఘటాదుల విషయములో వలె విశేష ఫలమును ఈయజాలదు, అది బ్రహ్మము యొక్క ఛాయయే గనుక. ఘటాదుల కంటె భిన్నముగ భాసించినట్లు బ్రహ్మము కంటె భిన్నముగ భాసింపజాలదని భావము.

**అప్రమేయ మనాదించేత్యత్ర శ్రుత్యేదమీరితమ్ ।**
**మనసై వేదమాప్తవ్యమితి ధీవ్యాప్తతా శ్రుతా ॥95॥**

*95.* బ్రహ్మము చిదాభాసచే తెలియబడదనుట 'అప్రమేయమనాదించ' అనే శ్రుతివాక్యము ప్రమాణీకరించుచున్నది. 'మనసై వేదమాప్తవ్యం' అనే శ్రుతి బుద్ధిచే తెలియబడుటను (అజ్ఞాన నివృత్తి వరకు) ప్రమాణీకరించుచున్నది. అమృత. ఉప. 9; కఠ ఉప.4.11; ముండక ఉప. 3.1.7-9; బృహ.ఉప. 4.4.19.

**ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి వాక్యతః ।**
**బ్రహ్మాత్మ వ్యక్తి ముల్లిఖ్య యోబోధః సోఽభిధీయతే ॥96॥**

*96.* 'పురుషుడు తన ఆత్మను పరమాత్మయే గదా అని తెలిసికొనినచో' అనే శ్రుతి వాక్యము, బ్రహ్మము ఆత్మల ఐకత్యను గూర్చి కలుగు బోధనే తెలుపుచున్నది. అదే (48వ శ్లోకమున చెప్పబడిన) అపరోక్షజ్ఞానము.

**అస్తు బోధోఽపరోక్షఽత్ర మహావాక్యాత్తథాప్యసౌ ।**
**న దృఢః శ్రవణాదీనామాచార్యైః పునరీరణాత్ ॥97॥**

*97.* మహావాక్యములచే అపరోక్షమగు బ్రహ్మబోధ కలిగినా అది దృఢముగ ఏర్పడదు. కనుకనే శ్రీశంకరభగవత్పాదులు శ్రవణాదులను విధించిరి.

**అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ।**
**శమాది సహితస్తావదభ్యసే చ్ఛ్రవణాదికమ్ ॥98॥**

*98. 'అహం బ్రహ్మాస్మి' అనే వాక్యము యొక్క బోధ దృఢముగ కలుగు వరకు శమాది గుణములతో కూడా శ్రవణాదులను అభ్యసింపవలెను. వాక్య వృత్తి 49. చూ. బ్రహ్మసూత్రములు 4.1.1; బృహదారణ్యక ఉప. 2.4.5, 4.5.6;*

**బాధం సంతి హ్యదార్ఢ్యస్య హేతవః శ్రుత్యనేకతా ।**
**అసంభావ్యత్వ మర్థస్య విపరీతా చ భావనా ॥99॥**

*99. బోధ అదృఢమగుటకు కారణములు గలవు. విరుద్ధములుగ కన్పించు శ్రుతి వాక్యములు, బ్రహ్మాత్మైక్యము అసంభవమను సంశయము, విపరీతములగు ఆలోచనలు (కర్తృత్వ బోధను కల్పించునవి).*

**శాఖాభేదా త్కామభేదాచ్ఛ్రుతం కర్మాన్యథాన్యథా ।**
**ఏవమత్రాపి మా శంకీత్యతః శ్రవణమాచరేత్ ॥100॥**

*100. అనేకములగు శాఖలుండుట చేతను, కోరికలు కూడా అనేకములు ఉండుట చేతను కర్మ అనేక విధములుగ శ్రుతియందు చెప్పబడినది. కాని ఉపనిషత్తులందు బోధింపబడిన బ్రహ్మజ్ఞానమునందు అట్టి భేదము లేదు. కావున శ్రవణమును అభ్యసింపవలెను. జ్ఞానదార్ఢ్యార్థము.*

**వ్యాఖ్య:** ముక్తికోపనిషత్తునందు వేదశాఖలు 1180 ఉండెనని చెప్పబడినది. ప్రతిశాఖయందును ఒక్కొక్క ఉపనిషత్తుగ 1180 ఉపనిషత్తులును. అందు 840 ఉపనిషత్తులు కర్మకాండను గూర్చియు 232 ఉపాసనాకాండను గూర్చియు 108 ఉపనిషత్తులు బ్రహ్మమును గూర్చియు అనగా జ్ఞానకాండను గూర్చియు చెప్పును.

**వేదాంతానా మశేషాణా మాదిమధ్యావసానతః ।**
**బ్రహ్మాత్మన్యేవ తాత్పర్యమితి ధీః శ్రవణం భవేత్ ॥101॥**

*101. ఉపనిషత్తులు ప్రారంభమునకు మధ్యను అంతమునందు గూడా బ్రహ్మము ప్రత్యగాత్మల ఐక్యమునే బోధించుచున్నవను నిశ్చయమునకు వచ్చుటయే శ్రవణము.*

**సమన్వయాధ్యాయ ఏతత్సూక్తం ధీస్వాస్థ్యకారిభిః ।**
**తర్కైః సంభావనార్థస్య ద్వితీయాధ్యాయ ఈరితా ॥102॥**

*102. వేదవ్యాసులు శ్రీశంకరభగవత్పాదులు బ్రహ్మసూత్రములందు, మొదటిదగు సమన్వయాధ్యాయమున ఉపనిషద్వాక్యము లన్నింటికి*

బ్రహ్మాత్మైక్యము నందే తాత్పర్యమనీ రెండవదగు అవిరోధాధ్యాయమున ఆ విషయము సంభవమే అనీ యుక్తియుక్తముగ నిరూపించిరి.

**బహుజన్మదృఢాభ్యాసాద్దేహాదిష్వాత్మధీః క్షణాత్ ।**
**పునః పునరుదేత్యేవం జగత్సత్యత్వధీరపి ॥103॥**

*103.* అనేక జన్మల నుండి దృఢముగ అభ్యసింపబడుట చేత దేహమే ఆత్మయనే బుద్ధి క్షణములో కలుగును. అట్లే ఈ దృశ్యమాన జగత్తు సత్యమనే బోధ కూడా మరల మరల కలుగును.

**విపరీతా భావనేయమైకాగ్ర్యాత్సా నివర్తతే ।**
**తత్త్వోపదేశా త్ప్రాగేవ భవత్యేతదుపాసనాత్ ॥104॥**

*104.* ఇవే విపరీతపు టాలోచనలు. ఇవి చిత్తైకాగ్ర్యము వలన నశించును. తత్త్వోపదేశమునకు పూర్వమే ఇది ఉపాసన వలన, ఈశ్వరారాధన వలన కలుగును.

**ఉపాస్తయోఽత ఏవాత్ర బ్రహ్మశాస్త్రేఽపి చిన్తితాః ।**
**ప్రాగనభ్యాసినః పశ్చాద్బ్రహ్మాభ్యాసేన తద్భవేత్ ॥105॥**

*105.* కనుకనే వేదాంత గ్రంథములందు అనేక విధములగు ఉపాసనలు కూడా వివరింపబడినవి. బ్రహ్మమును గూర్చిన ఉపదేశమునకు పూర్వము ఉపాసన అభ్యసింపని వారు పిదపనైన బ్రహ్మాభ్యాసమునే చిత్తైకాగ్ర్యమును సాధింపవలెను.

**తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనమ్ ।**
**ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥106॥**

*106.* బ్రహ్మాభ్యాసమనగా బ్రహ్మమును గూర్చి మననము చేయుట దానిని గూర్చి మాటలాడుట పరస్పరము తర్కాదుల ద్వారా బ్రహ్మమును బోధపరచుకొనుట ఇట్లు బ్రహ్మమునందే తత్పరులై ఉండుట అని బుధజనులు చెప్పుదురు. వాసిష్ఠ రామాయణము ఉత్పత్తి ప్రకరణము *22.24.* ఈ శ్లోకమే *13*వ ప్రకరణమున *83*గ మరల చెప్పబడినది.

**తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః ।**
**నానుధ్యాయాన్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్ ॥107॥**

*107.* బుద్ధిమంతుడు బ్రహ్మమును గూర్చి నిస్సంశయముగ తెలిసికొని దానియందే తైలధార వంటి ప్రజ్ఞనుంచవలెను. అనేకములగు మాటలను కల్పింపరాదు. దాని వలన నోటికి శ్రమయే గాని వేరు ఫలితముండదు. బృహదారణ్యక ఉప.*4.4.21;* చూ. ముండక ఉప.*3.1.4; 2.2.5.*

**అనన్యాశ్చింతయంతోమాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥108॥**

*108.* వేరేమీ చింతింపక నన్ను మాత్రమే ఎవరు ఉపాసింతురో అట్లు నిత్యము నాయందే సంలగ్నులైయుండు వారి యోగక్షేమముల భారము నేనే స్వీకరింతును. భగవద్గీత. *9.22.* ఎల్లరకూ ఉత్సాహము శక్తులను, జ్ఞానులకు ఆవశ్యకములగు వానిని, భగవంతుడిచ్చునని మధుసూదన సరస్వతి అనును.

**ఇతిశ్రుతిస్మృతీ నిత్యమాత్మన్యేకాగ్రతాం ధియః ।**
**విధత్తో విపరీతాయా భావనాయాః క్షయాయ హి ॥109॥**

*109.* ఇట్లు శ్రుతిస్మృతులు నిరంతరము ఆత్మయందే చిత్తైకాగ్ర్యమును విధించుచున్నవి. ఇది విపరీత భావన నశించుట కొరకే.

**యద్యథా వర్తతే తస్య తత్త్వం హిత్వాన్యథాత్వధీః ।**
**విపరీతా భావనా స్యాత్పిత్రాదావరిధీర్యథా ॥110॥**

*110.* ఒక విషయమును ఉన్నది ఉన్నట్లుగ గాక దానికి విరుద్ధముగ గ్రహించుట విపరీత భావన. హితకాంక్షియగు తండ్రిని పుత్రుడు శత్రువని భావించుట వలె.

**ఆత్మా దేహాదిభిన్నోఽయం మిథ్యా చేదం జగత్తయోః ।**
**దేహాద్యాత్మత్వ సత్యత్వధీర్విపర్యయ భావనా ॥111॥**

*111.* ఆత్మ దేహేంద్రియాదుల కంటె భిన్నము. ఈ జగత్తు మిథ్య. అట్లుండగా దేహాదులే ఆత్మయని భావించుట జగత్తు సత్యమని భావించుట విపరీత భావనయగును.

**తత్త్వభావనయా నశ్యేత్సాఽతో దేహాతిరిక్తతామ్ ।**
**ఆత్మనో భావయేత్తద్వన్మిథ్యాత్వం జగతోఽనిశమ్ ॥112॥**

*112.* తత్త్వమును గూర్చి విచారించుట వలన ఆ విపరీత భావన

*నశించును. కనుక ముముక్షువు సర్వదా ఆత్మ యొక్క దేహభిన్నత్వమును గూర్చియు జగన్మిథ్యాత్వమును గూర్చియు చింతింపవలెను.*

**కిం మంత్రజపవన్మూర్తిధ్యానవద్వాత్మభేదధీః ।**
**జగన్మిథ్యాత్వధీశ్చాత్ర వ్యావర్త్యా స్యాదుతాన్యథా ॥133॥**

*113. (సంశయము) ఆత్మ యొక్క ~~ఈ~~ దేహాతిరిక్తత జగన్మిథ్యాత్వములను మంత్రజపము మూర్తి ధ్యానముల వలె ఆవర్తించి చెప్పుచుండవలెనా? లేక మరొక విధముననా? నియమములేవైన గలవా అని ప్రశ్న.*

**అన్యథేతి విజానీహి దృష్టార్థత్వేన భుక్తివత్ ।**
**బుభుక్షుర్జపవద్భుంక్తే్న కశ్చిన్నియతః క్వచిత్ ॥114॥**

*114. మరొక విధమున అని తెలిసికొనుము. అనగా జపాదులకు వలె నియమములేవీ లేవని ఉద్దేశము. అన్నము తినుటయందు వలె విచారణనందు కూడా ఫలము నేరుగనే కనబడును. ఆకలిగొనిన వ్యక్తి భుజించునపుడు ఒక్కొక్క ముద్దతో ఆకలి అంతంతగా తగ్గిపోవుట తెలియుచునే ఉండును. ఇచ్చట జపము వలె భుజించుటగాని నియమములతో భుజించుటగాని జరుగదు. అట్లే జిజ్ఞాసువు తత్త్వచింతన చేయునపుడు ఫలము నేరుగనే తెలియుచుండును. ఆవర్తించుటలు నియమములు ఆనావశ్యకములు.*

**అశ్నాతివా న వాశ్నాతి భుంక్తేవా స్వేచ్ఛయాన్యథా ।**
**యేన కేన ప్రకారేణ క్షుధా మపనినీషతి ॥115॥**

*115. క్షుధార్తుడు అన్నమున్నచో తినును. లేనిచో తినడు జూదము మొదలగు వానితో ఆకలిని మరచిపో యత్నించును. లేదా ఇష్టానుసారము చేయును. నడచుచు పవళించియు కూర్చుండియు అతడు తినవచ్చును. ఏదోక విధముగ ఆకలి తీర్చుకొనును. అనగా ఇప్పటి ఆకలి తీరుటకు భోజనము చేయవలసినట్లే ఇహ జీవితపు దుఃఖములు తీరుటకు తత్త్వవిచారణే కర్తవ్యమని భావము. నియమాదులు పరలోకము కొరకు.*

**నియమేన జపం కుర్యాదకృతౌ ప్రత్యవాయతః ।**
**అన్యథాకరణేఽనర్థః స్వరవర్ణ విపర్యయాత్ ॥116॥**

*116. జపం చేసినచో నియమపూర్వకముగ చేయాలి. లేనిచో పాపం కలుగును. విపర్యయముగ స్వరము వర్ణము చెరచి చేసినచో అనర్థమే సిద్ధించును.*

**వ్యాఖ్య:** కామ్యసిద్ధికై చేయు జపమున నిట్టి ప్రమాదములుండును. భగవత్ప్రీతికై చేయు జపమునందు దోషములంటవు.

**క్షుధేవ దృష్టభాధాకృద్విపరీతా చ భావనా ।**
**జేయా కేనాప్యుపాయేన నాస్త్యత్రానుష్ఠితే క్రమః ॥117॥**

*117. ఆకలి వలె విపరీతభావనయు దుఃఖమును కలిగించును. ఏ ఉపాయము చేతనైననా దానిని జయింపవలెను. అందు నియమములు క్రమములు లేవు.*

**ఉపాయః పూర్వమేవోక్తస్తచ్చింతాకథనాదికః ।**
**ఏత దేకపరత్వేఽపి నిర్బంధో ధ్యానవన్న హి ॥118॥**

*118. ఆ ఉపాయము మునుపే చెప్పబడినది, బ్రహ్మచింతనము కథనము మొదలైనవి. **(చూ.106).** తత్పరతయందు కూడా మూర్తిధ్యాసము నందువలె నిర్భందమేమీ లేదు.*

**మూర్తిప్రత్యయసాన్తత్యమన్యానన్తరితం ధియః ।**
**ధ్యానం తత్రాతి నిర్బంధో మనసశ్చంచలాత్మనః ॥119॥**

*119. ఇతర ప్రత్యయములు లేక మూర్తి ప్రత్యయము మాత్రమే తైలధార వలె సంతతముగా ఉండుట ధ్యానమనబడును. మనస్సు సహజముగానే చంచలము కనుక ఇట్టి ధ్యానమునందు నిర్భంధము చాలా ఎక్కువ.*

**చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥120॥**

*120. భగవద్గీతలో **(6.34)** అర్జునుడిట్లనును: కృష్ణా, మనస్సు స్వభావము చేతనే చంచలమైనది, వ్యాకులపరచునది, బలవంతమైనది (సులభముగా లొంగనిదనుట), ఒక విషయమునందు లగ్నమైనచో ఇక అందుండి వేరు పరచుటకు దుష్కరమైనది, అట్టి మనస్సును నిగ్రహించుట వాయువును పిడికిట బట్టుట వలె అసాధ్యమైనదని భావించుచున్నాను.*

**అప్యబ్ధిపానాన్మహతః సుమేరూన్మూలనాదపి ।**
**అపి వహ్న్యశనాత్సాధో విషమశ్చిత్త నిగ్రహః ॥121॥**

*121. యోగావాసిష్ఠమునందిట్లు చెప్పబడినది. చిత్తనిగ్రహము సముద్రము త్రాగివేయుట కంటెను, మేరు పర్వతమును పెల్లగించుట కంటెను, అగ్నిని*

మ్రింగుటకంటెను కఠోరమైన కార్యము. (పురాణములలో ఈ ఘనకార్యము లను క్రమముగా అగస్త్యుడు బ్రహ్మ శ్రీకృష్ణుడు చేసిరని చెప్పబడినది.)

**కథనాదౌ న నిర్బన్ధః శృంఖలాబద్ధదేహవత్ ।**
**కింత్వనన్తేతిహాసాద్యైర్వినోదో నాట్యవద్ధియః ॥122॥**

*122.* తత్త్వమును గూర్చి మాటలాడుట చింతించుట మొదలగు వాని యందు సంకెలలు వేసిన దేహమునందున్నట్లు నిర్బంధముండదు. కాగా, తత్త్వ చింతనకు సహకరించు ఇతిహాస పురాణాదులు అనంతములుగ ఉండి చిత్తమునకు నాట్యదర్శనాదుల వలె వినోదమును కూడా కల్పించును. తత్త్వ సంబంధమైన విషయములందే మనస్సునకు వ్యాపకము కల్పించుట ఉద్దేశము.

**చిదేవాత్మా జగన్మిథ్యే త్యత్ర పర్యవసానతః ।**
**నిదిధ్యాసనవిక్షేపోనేతిహాసాదిభిర్భవేత్ ॥123॥**

*123.* ఇతిహాసాదుల ఉద్దేశము, ఆత్మచిత్స్వరూపము జగత్తు మిథ్యయని బోధించుటయే గనుక వాని వలన నిదిధ్యాసనకు విక్షేపము కలుగదు.

**కృషి వాణిజ్యసేవాదౌ కావ్యతర్కాదికేషు చ ।**
**విక్షిప్యతే ప్రవృత్త్యా ధీస్తైస్తత్త్వస్మృత్యసంభవాత్ ॥124॥**

*124.* వ్యవసాయము వాణిజ్యము సేవ మొదలగు వానియందూ, కావ్యములు తర్కము మొదలగు వానియందూ తత్త్వము జ్ఞప్తియందుండుట అసంభవమగుటచే మనస్సు విక్షిప్తమగును.

**అనుసందధతైవాత్ర భోజనాదౌ ప్రవర్తితుమ్ ।**
**శక్యతేఽత్యంతవిక్షేపాభావాదాశు పునః స్మృతేః ॥125॥**

*125.* తత్త్వమునందే మనస్సును ఉంచగోరే జిజ్ఞాసువు భుజించుట మొదలగు పనుల వలన విక్షేపము నొందడు. అథవా కలిగిననూ అల్పమే కనుక త్వరలో తత్త్వస్మృతిని కొనిరాగలడు.

**తత్త్వ విస్మృతి మాత్రాన్నానర్థః కింతు విపర్యయాత్ ।**
**విపర్యేతుం న కాలోఽస్తి ఝటితి స్మరతః క్వచిత్ ॥126॥**

*126.* తత్త్వమును మరచుట వలన అంత అనర్థము లేదు, క్షణములో స్మరణకు తెచ్చుకొనగలము గనుక. అందు విపరీత భావన దృఢపడుటకు అవకాశము లేదు.

**తత్త్వస్మృతేరవసరో నా స్త్యన్యాభ్యాసశాలినః ।**
**ప్రత్యుతాభ్యాస ఘాతిత్వాద్బలా త్తత్త్వ ముపేక్ష్యతే ॥127॥**

*127. వేదాంత భిన్నములగు విషయములను ఎక్కువగా అభ్యసించే వారికి తత్త్వచింతనకు సమయము మిగులదు. కాగా అట్టి విషయములు తత్త్వ చింతనను ఉపేక్షించేట్లు కూడా చేయును. అభ్యాసభంగము మహా హానికరము.*

**తమేవైకం విజానీథ హ్యన్యా వాచో విముంచథ ।**
**ఇతి శ్రుతం తథాన్యత్ర వాచో విగ్లాపనం త్వితి ॥128॥**

*128. 'ఆ ఏకమును మాత్రము తెలిసికొనుము. ఇతర వాక్కులను పరిత్యజింపుము'. అనీ 'అనేకములగు మాటలను పలుకుట వాక్కునకు పరిశ్రమ మాత్రమే.' అనీ శ్రుతియందు చెప్పబడినది. ముండక ఉప 2.2.5; బృహదారణ్యక ఉప: 4.4.21.*

**ఆహారాది త్యజన్నైవ జీవేచ్ఛాస్త్రాన్తరం త్యజన్ ।**
**కిం న జీవసి యేనైవం కరోష్యత్ర దురాగ్రహమ్ ॥129॥**

*129. ఆహారాదులను త్యజించినచో జీవింపజాలవు. ఇతర శాస్త్రములను పరిత్యజించినచో జీవింపజాలవా? మరి ఈ వ్యర్థశాస్త్రములందు అంత అభినివేశమేల?*

**జనకాదేః కథం రాజ్యమితి చేద్దృఢ బోధతః ।**
**తథా తవాపి చేత్తర్కం పఠ యద్వా కృషిం కురు ॥130॥**

*130. జనకాదులు రాజ్యము లేలిరి కదా అనినచో వారికి తత్త్వబోధ అంత దృఢముగా ఉండెను కనుక పాలింపగలిగిరి. అంతదృఢమైన తత్త్వగ్రహణము నీకును ఉన్నచో తర్కమును అభ్యసింపుము, వ్యవసాయము చేయుము మరి ఏదైనను చేయుము.*

**మిథ్యాత్వ వాసనాదార్ఢ్యే ప్రారబ్ధక్షయకాంక్షయా ।**
**అక్లిశ్యంతః ప్రవర్తంతే స్వస్వకర్మానుసారతః ॥131॥**

*131. ఈ ప్రపంచము మిథ్యయనే సంస్కారము దృఢముగ ఏర్పడిన పిదప అందలి సుఖదుఃఖములచే క్లేశము నొందక జ్ఞాని పురుషులు ప్రారబ్ధ కర్మ తీరుటకై తదనుగుణముగ ప్రవర్తింతురు.*

**అతి ప్రసంగోమా శక్యః స్వకర్మవశవర్తినామ్ ।**
**అస్తు వా కోఽత్ర శక్యేత కర్మ వారయితుం వద ॥132॥**

*132. అనాచారము కూడా ప్రారబ్దవశమే కదా అనినచో అవును. ప్రారబ్ధమును వారింప నెవరి తరము?*

**జ్ఞానినోఽజ్ఞానినశ్చాత్ర సమే ప్రారబ్ధకర్మణీ ।**
**న క్లేశో జ్ఞానినో ధైర్యాన్మూఢః క్లిశ్యత్యధైర్యతః ॥133॥**

*133. జ్ఞానికి అజ్ఞానికి ప్రారబ్ధమును అనుసరించి ప్రవర్తించుట సమమే. కాని మిథ్యాత్వ జ్ఞానము వలన కలిగిన ధైర్యముచే జ్ఞాని వగపు నొందడు. ఆ ధైర్యము లేకపోవుటచే అజ్ఞాని మిగుల దుఃఖించును.*

**మార్గే గంన్త్రోర్ద్వయోః శ్రాన్తౌ సమాయా మప్యదూరతామ్ ।**
**జానన్ ధైర్యాద్ధ్రుతం గచ్ఛేదన్యస్తిష్ఠతి దీనధీః ॥134॥**

*134. సమముగ అలసిపోయిన బాటసారులలో ఒకడు గమ్యము సమీపముననే ఉన్నదని తెలిసి త్వరితముగ నడచును. అది తెలియని రెండవ బాటసారి దైన్యముతో మార్గమున ఆలసించును.*

**సాక్షాత్కృతాత్మధీః సమ్యగవిపర్యయ బాధితః ।**
**కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్ ॥135॥**

*135. చక్కగా ఆత్మసాక్షాత్కారము నొందిన జ్ఞానిని విపరీత భావనలు బాధింపవు. అతడిక దేనిని కోరి దేని కోరికను అనుసరించి శరీరతాపములతో కూడి పరితపించును?*

**జగన్మిథ్యాత్వధీభావాదాక్షిప్తౌ కామ్యకాముకౌ ।**
**తయోరభావే సంతాపః శామ్యేన్నిఃస్నేహదీపవత్ ॥136॥**

*136. జగత్తు మిథ్యయనే బోధ కలిగినంతనే జగత్తునందలి కామ్య విషయములు, వానిని కామించు పురుషుడు రెండూ మిథ్యయే అగును. అవి రెండును లేనపుడు దుఃఖము నూనె లేని దీపము వలె అంతరించును.*

**గంధర్వ పత్తనే కించిన్నైంద్రజాలిక నిర్మితే ।**
**జానన్నామయతే కిన్తు జిహాసతి హసన్నిదమ్ ॥137॥**

*137. ఇంద్రజాలికుడు నిర్మించిన గంధర్వనగరమున తెలిసి తెలిసి*

ఎవడును దేనిని గాని వాంఛింపడు. ఈ భ్రమ ఎంత అద్భుతము అని దానిని జూచి నవ్వును.

**పాతరమణీయేషు భోగేష్వేవం విచారవాన్ ।**
**నానురజ్యతి కిన్త్వేతాన్దోషదృష్ట్యా జిహాసతి ॥138॥**

*138.* పై చూపులకు మాత్రమే రమణీయములైన భోగములను గూర్చి ఈ విధముగ చింతించు జ్ఞాని వానియందు ప్రీతినొందడు. కాగా వానియందలి దుఃఖ యోనిత్వాది దోషములను గమనించి వానిని వదలిపెట్టును.

**అర్థానా మార్జనే క్లేశః తథైవ పరిపాలనే ।**
**నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాన్క్లేశకారిణః ॥139॥**

*139.* సంపదలను ఆర్జించుటయందు దుఃఖము దానిని రక్షించుట యందు దుఃఖము. అవి నశించినా దుఃఖమే ఖర్చయినను దుఃఖమే. దుఃఖము లకు కారణమగు ఈ సంపదలకు ధిక్కారము.

**మాంసపాఞ్చాలికాయాస్తు యన్త్రలోలేఙ్గపఞ్జరే ।**
**స్నాయ్వస్థి గ్రన్థిశాలిన్యాః స్త్రియాః కిమివ శోభనమ్ ॥140॥**

*140.* నరములు ఎముకలు గ్రంథులు గలిగిన మాంసపు బొమ్మలవంటి వారు స్త్రీలు. అంగముచే పంజరము. యంత్రము వలె కదలుచుందురు. అట్టి స్త్రీలయందు శోభనమైనది ఏమి కలదు? వాసిష్ఠరామాయణము వైరాగ్య ప్రకరణము *21.1*

**ఏవమాదిషు శాస్త్రేషు దోషాః సమ్యక్ ప్రపఞ్చితాః ।**
**విమృశన్ననిశం తాని కథం దుఃఖేషు మజ్జతి ॥141॥**

*141.* ఇట్టి శాస్త్రములందు విషయభోగమునందలి దోషములు చక్కగా వివరింపబడినవి. నిరంతరము వానిని పర్యాలోచించుచుండగా దుఃఖము లందెట్లు మునుగగలడు? మునుగడని భావము.

**క్షుధయాపీడ్యమానోఽపి న విషం హ్యత్తుమిచ్ఛతి ।**
**మిష్టాన్నధ్వస్తతృడ్ జానన్నామూఢస్తజ్జిఘత్సతి ॥142॥**

*142.* ఆకలిచే బాధపడుచున్నను తెలిసి తెలిసి ఎవడును విషమును తినగోరడు. అట్లుండ తీయని పదార్థములచే ఆకలి తీరిన బుద్ధిశాలి విషమును

తిన నిచ్ఛించునా? ఎంత మాత్రము ఇచ్ఛగించడు. అట్లే భోగవిషయములందలి దుఃఖ జనకత్వమును ఎరిగిన ప్రాజ్ఞుడు వానిని కోరడని భావము.

**ప్రారబ్ధకర్మప్రాబల్యాద్భోగేష్విచ్ఛా భవేద్యది ।**
**క్లిశ్యన్నేవ తదాప్యేష భుఙ్క్తే విష్టిగృహీతవత్ ॥143॥**

*143.* ప్రారబ్ధవశమున జ్ఞానిపురుషునకు భోగముల యందు ఇచ్ఛ కలిగినచో బలవంతముగ కూలిపనియందు నియోగింపబడినట్లు అయిష్టముగనే వానిని అనుభవించును.

**భుఞ్జానా వా అపిబుధాః శ్రద్ధావన్తః కుటుంబినః ।**
**నాద్యాపి కర్మ నచ్ఛిన్నమితి క్లిశ్యన్తి సన్తతమ్ ॥144॥**

*144.* జ్ఞానులు, ప్రారబ్ధవశమున కుటుంబజీవనము గడపవలసి వచ్చినచో, 'అయ్యో మా కర్మబంధము ఇంకను తెగలేదు కదా' అని సంతతము విచారింతురు.

**నాయం క్లేశోఽత్ర సంసారతాపః కిన్తు విరక్తతా ।**
**భ్రాన్తిజ్ఞాన నిదానో హి తాపః సాంసారికస్స్మృతః ॥145॥**

*145.* వీరి ఈ దుఃఖము సంసారము వలని దుఃఖము కాదు. అది వైరాగ్యము. జగత్తును గూర్చిన భ్రాంతి జ్ఞానము వలన కలిగిన దుఃఖమే సాంసారిక దుఃఖమనబడినది.

**వివేకేన పరిక్లిశ్యన్నల్పభోగేన తృప్యతి ।**
**అన్యథానన్తభోగేఽపి నైవ తృప్యతి కర్హిచిత్ ॥146॥**

*146.* వివేకి భోగములందలి దోషములను జూచుచు అల్పభోగము చేతనే తృప్తినొందును. అవివేకి అనంతములైన భోగములచే కూడా ఏనాటికిని సంతుష్టి నొందడు.

**న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।**
**హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥147॥**

*147.* కోరికలు వానిని అనుభవించుట చేత ఏనాటికిని తీరవు. హవిస్సు ఆహుతులిచ్చిన కొలది అగ్ని ప్రజ్వరిల్లినట్లు కోరికలు తీర్చేకొలది విజృంభించును. మనుసంహిత *2.94* ఈ యయాతి మహారాజు కథ భాగవత పురాణమునందు వచ్చును. నారద పరివ్రాజక. ఉప. *3-37.*

**పరిజ్ఞాయోపభుక్తో హి భోగో భవతి తుష్టయే ।**
**విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రీమేతి న చోరతామ్ ॥148॥**

*148.* భోగములు, వాని అనిత్యత్వాది దోషములు తెలిసి అనుభవింపబడి నపుడు తృప్తినీయవచ్చు. చోరుడని తెలిసియు వానిని ఆదరించిన అతడు చోరుని వలె ప్రవర్తింపడు మిత్రుని వలె ప్రవర్తించును.

**మనసో నిగృహీతస్య లీలాభోగోఽల్పకోఽపి యః ।**
**తమేవాలబ్ధ విస్తారం క్లిష్టత్వాద్బహు మన్యతే ॥149॥**

*149.* మనోజయమునొందిన పురుషుడు భోగములు అనిత్యములు దుఃఖ జనకములు అని తెలిసికొనుటచే లభించినదే ఎక్కువయని భావించును.

**బద్ధముక్తో మహీపాలో గ్రామమాత్రేణ తుష్యతి ।**
**పరేనబద్ధా నాక్రాన్తో న రాష్ట్రం బహుమన్యతే ॥150॥**

*150.* ఇతరునిచే జయింపబడి బంధింపబడిన రాజు బంధమోచనము కలిగి ఒక గ్రామానికి ఆధిపత్యము చేకూరినా తుష్టినొందును. అట్లు జయింప బడని కాలమున దేశపు ప్రభుత్వమును కూడా అతడు గొప్పగా భావింపడు గదా.

**వివేకే జాగ్రతి సతి దోష దర్శన లక్షణే ।**
**కథమాబ్ధ కర్మాపి భోగేచ్ఛాం జనయిష్యతి ॥151॥**

*151. (సంశయము)* భోగవిషయములందలి దోషములను జూచు వివేకము నిరంతరము జాగృతమై ఉండగా ప్రారబ్ధకర్మయైను భోగేచ్ఛ ఎట్లు కలిగించును?

**నైష దోషో యతోఽనేకవిధం ప్రారబ్ధమీక్ష్యతే ।**
**ఇచ్ఛాఽనిచ్ఛా పరేచ్ఛా చ ప్రారబ్ధం త్రివిధం స్మృతమ్ ॥152॥**

*152. (సమాధానము)* అందు దోషము లేదు. ఏలన ప్రారబ్ధము అనేక విధములై కన్పించుచున్నది. తన ఇచ్ఛచే కలుగునది, ఇచ్ఛ లేకపోవుటచే కలుగునది, ఇతరుల ఇచ్ఛచే కలుగునది అని ప్రారబ్ధము మూడు విధములు.

**అపథ్య సేవినశ్చోరా రాజదారరతా అపి ।**
**జానన్త ఏవస్వానర్థమిచ్ఛన్త్యారబ్ధకర్మతః ॥153॥**

*153.* అపథ్యమును తినగోరు రోగులూ, రాజు భార్యను రమించగోరు వారూ, దొంగలూ తమకు కలుగబోవు అనర్థమును స్పష్టముగనే ఎరుగుదురు. అయినా ప్రారబ్ధవశమున వారు అట్టి కోరికలను ఇచ్ఛింతురు.

**న చాత్రైతద్వారయితుమీశ్వరేణాపి శక్యతే।**
**యత ఈశ్వర ఏవాహ గీతాయామర్జునం ప్రతి ॥154॥**

*154.* దీనిని వారించుటకు ఈశ్వరుడు కూడా అశక్తుడే. ఈశ్వరుడే గీత యందర్జునునితో నిట్లనును.

**సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవానపి।**
**ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥155॥**

*155.* జ్ఞానులైనను తమతమ ప్రకృతి కనురూపముగ ప్రవర్తింతురు. సకల జీవులును ప్రకృతినే అనుసరించును. నిగ్రహమేమి చేయగలదు? గీత : 3.33.

**అవశ్యంభావిభావానాం ప్రతీకారో భవేద్యది।**
**తదా దుఃఖైర్న లిప్యేరన్నల రామ యుధిష్ఠిరాః ॥156॥**

*156.* జరుగక తప్పనిదగు ప్రారబ్ధమునకు ప్రతీకారముండినచో నలుడు, శ్రీరాముడు, యుధిష్ఠిరుడు కష్టముల పాలుగాకుండెడి వారు.

**న చేశ్వరత్వమీశస్య హీయతే తావతా యతః।**
**అవశ్యం భావితాప్యేషా మీశ్వరేణైవ నిర్మితా ॥157॥**

*157.* అంత మాత్రముచే ఈశ్వరుని ఈశ్వరత్వము కొరవడదు. ఏలన ఇట్టి ప్రారబ్ధము వీరికి కలిగించినది కూడ ఈశ్వరుడే.

**ప్రశ్నోత్తరాభ్యామేవైతద్గమ్యతేఽర్జున కృష్ణయోః।**
**అనిచ్ఛాపూర్వకం చాస్తి ప్రారబ్ధమితి తచ్ఛృణు ॥158॥**

*158.* అనిచ్ఛాపూర్వకమైన ప్రారబ్ధము కూడా కలదని శ్రీకృష్ణార్జునుల సంవాదము చేతనే తెలియుచున్నది. దానిని వినుము.

**అథ కేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥159॥**

*159.* కృష్ణా, ఇచ్ఛ లేకున్నను దేనిచే ప్రేరితుడై మానవుడు బలవంతముగ నియోగింపబడినట్లు పాపమాచరించును? భగవద్గీత 3.36

**కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥160॥**

*160. రజోగుణము వలన జనించిన కామము దాని వికారమగు క్రోధము సకల పాపకర్మకు కారణములు. వానికి తృప్తి అనేది లేదు. అవే శత్రువులని తెలిసికొనుము. భగవద్గీత : 3-37.*

**స్వభావజేన కౌన్తేయ నిబద్ధః స్వేన కర్మణా ।**
**కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్ ॥161॥**

*161. స్వభావ జనితమైన నీ ప్రారబ్ధముచే బంధింపబడిన వాడవై, ఏది భ్రాంతిచే చేయనిచ్ఛగింపవో దానినే అవశుడవై చేసేదవు. గీత: 18.60*

**వ్యాఖ్య:** తమ అనుభూతి ప్రకాశికయందు శ్రీవిద్యారణ్యులు జ్ఞానులకు గల ప్రారబ్ధమునకు సుప్త, మంద, మధ్యమ, తీవ్రములని నాలుగు రకముల తీవ్రతలను వర్ణింతురు.

**నానిచ్ఛన్తో న చేచ్ఛన్తః పరదాక్షిణ్య సంయుతాః ।**
**సుఖదుఃఖే భజన్త్యేతత్పరేచ్ఛాపూర్వకర్మ హి ॥162॥**

*162. తనకు కోరిక ఉన్నా లేకున్నా, ఇతరుల కొరకై కర్మ నిర్వర్తించి సుఖదుఃఖములనుభవించుట పరేచ్ఛాప్రారబ్ధము.*

**కథం తర్హి కిమిచ్ఛన్ని త్యేవమిచ్ఛా నిషిధ్యతే ।**
**నేచ్ఛా నిషేధః కిన్త్విచ్ఛాబాధో భర్జిత బీజవత్ ॥163॥**

*163. ఇట్లు మూడు విధములైన కోరికలు జ్ఞానికున్నచో 'దేనిని కోరి' అని శ్రుతి జ్ఞానిలో కోరికలను నిషేధించుట ఏల? (సమాధానము) అది నిషేధము కాదు. బాధ. వేపిన గింజలయందు వలె అట్టి కోరికలలో శక్తి ఉండదు.*

**భర్జితాని తు బీజాని సన్త్యకార్యకరాణి చ ।**
**విద్వదిచ్ఛా తథేష్టవ్యాఽసత్త్వబోధన్నా కార్యకృత్ ॥164॥**

*164. వేపిన గింజలు కూడ గింజలే. అయినా అవి నిష్ఫలములు, అంకురింపవు. జ్ఞానుల కోరికలును అట్టివే. వారు కోరు విషయములు మిథ్యలే అన్న జ్ఞానముండుటచే ఆ కోరికలు పుణ్యాపాపములను కలిగింపజాలవు.*

**దగ్ధబీజమరోహేఽపి భక్షణాయోపయుజ్యతే ।**
**విద్వదిచ్ఛాప్యల్పభోగం కుర్యాన్న వ్యసనం బహు ॥165॥**

*165.* అంకురింపకపోయినా తినుటకు వేసిన గింజలుపయోగపడును. అట్లే జ్ఞానుల కోరికలు అల్పభోగము నిచ్చును. గొప్ప దుఃఖమును అవి కల్పింపలేవు.

**భోగేన చరితార్థత్వాత్ప్రారబ్ధం కర్మహీయతే ।**
**భోక్తవ్యసత్యతా భ్రాంత్యా వ్యసనం తత్ర జాయతే ॥166॥**

*166.* అనుభవమే ఉద్దేశమగుటచే, అనుభవింపబడిన ప్రారబ్ధము తీరిపోవును. ఆ అనుభవములు సత్యములను భ్రాంతి వలన వానిచే దుఃఖము కలుగును.

**మా వినశ్యత్వయం భోగో వర్ధతా ముత్తరోత్తరమ్ ।**
**మా విఘ్నాః ప్రతిబధ్నన్తు ధన్యోఽస్మ్యస్మాదితి భ్రమః ॥167॥**

*167.* ఈ భోగము నశింపకుండుగాక, ఇక మీద కూడా అది వర్ధిల్లుగాక. దానికి విఘ్నములు లేకుండుగాక. దీనిచే నేను ధన్యుడనగుదును ఇట్టిదే భ్రమ.

**వ్యాఖ్య:** భ్రమ వలననే దుఃఖము, లోలుపత, దర్పము మొదలగునవి కలిగి ఇతరులకు దుఃఖము కలిగించును.

**యదభావి న తద్భావి భావి చేన్న తదన్యథా ।**
**ఇతి చిన్తావిషఘ్నోఽయం బోధో భ్రమ నివర్తకః ॥168॥**

*168.* కానిది కానేకాదు. కానున్నచో అది గాక పోనేపోదు. అనే బోధ భ్రమను పోగొట్టును, దుఃఖమను విషమును హరించును.

**సమేఽపి భోగే వ్యసనం భ్రాన్తో గచ్ఛేన్న బుద్ధవాన్ ।**
**అశక్యార్థస్య సంకల్పా ద్భ్రాంతస్య వ్యసనం బహు ॥169॥**

*169.* భోగము, అనుభవము, జ్ఞానులకు భ్రాంతులకు సమమేయైనను, సాధ్యముకాని విషయములను సంకల్పించుట చేత భ్రాంతులకు వ్యసనము మెండు.

**మాయామయత్వం భోగస్య బుద్ధ్వాఽఽస్థాముపసంహరన్ ।**
**భుంజ్ఞానోఽపి న సంకల్పం కురుతే వ్యసనం కుతః ॥170॥**

*170.* విషయభోగములు మిథ్యయని జ్ఞానికి తెలియును. కనుక అతడు వానిని గూర్చిన కోరికలను తలలెత్తనీయడు. వానిని అనుభవించుచున్నను అవి

*కావలెనని, చిరకాలము కొనసాగవలెనని సంకల్పింపడు. ఇక అతనికి దుఃఖ మెక్కడిది? లేదని భావము.*

**స్వప్నేన్ద్రజాల సదృశ్య మచిన్త్యరచనాత్మకమ్ ।**
**దృష్టనష్టం జగత్పశ్యన్కథం తత్రానురజ్యతి ॥171॥**

*171. ఈ జగత్తు, అందలి భోగములు, కలల వంటివి ఇంద్రజాలము వంటివి. అవి ఊహకతీతమైన కల్పనలు, చూచుచుండగనే నశించునవి. ఇట్లు తెలిసికొనిన జ్ఞానికి వానియందు ఆస్థ, కోరిక, ఎట్లు జనించును? జనింపదు.*

**స్వ స్వప్నమాపరోక్ష్యేణ దృష్ట్వా పశ్యన్స్వజాగరమ్ ।**
**చిన్తయేదప్రమత్తః సన్నుభావనుదినం ముహుః ॥172॥**

*172. తన కలను తాను నేరుగా చూచి, తన జాగ్రదవస్థను చూచుచు ప్రమాదము లేక ఈ రెండింటిని గూర్చి అనుదినము చింతింపవలెను. కఠ ఉప. 2.1.4.*

**చిరం తయోః సర్వసామ్యమనుసన్ధాయ జాగరే ।**
**సత్యత్వ బుద్ధిం సంత్యజ్య నానురజ్యతి పూర్వవత్ ॥173॥**

*173. చిరకాలము వానిని పరిశీలించి అవి రెండూ అన్ని విధములుగా సమానములే అని గుర్తించినచో ఇక జాగ్రదవస్థ సత్యమను భ్రాంతిని వదలి పూర్వము వలె దానియందు అనుకర్తకుడు కాడు. చూ. ఉపదేశసహస్రి. 17-61.*

**ఇంద్రజాలమిదం ద్వైత మచింత్యరచనాత్వతః ।**
**ఇత్యవిస్మరతో హానిః కా వా ప్రారబ్ధ భోగతః ॥174॥**

*174. ఈ ద్వైతజాతము ఇంద్రజాలము వంటిది. దీనికి కారణము ఊహాతీతము అని విస్మరింపని జ్ఞానికి ప్రారబ్ధమును అనుభవించుట వలన ఏమి హాని? ఏమీ లేదు.*

**నిర్బన్ధస్తత్త్వ విద్యాయా ఇన్ద్రజాలత్వ సంస్మృతౌ ।**
**ప్రారబ్ధస్యాగ్రహో భోగే జీవస్య సుఖదుఃఖయోః ॥175॥**

*175. జ్ఞానము దృశ్యమాన జగత్తంతా ఇంద్రజాలము వలె మిథ్యయని తెలుపును. (అందరి అనుభవములను అది తొలగింపదు.) ప్రారబ్ధము జీవునిచే సుఖదుఃఖము లననుభవింపజేయును. (ఆ అనుభవములను సత్యములుగ జేయజాలదు.)*

**విద్యారబ్ధే విరుధ్యేతే న భిన్నవిషయత్వతః ।**
**జానద్భిరప్యైన్ద్రజాల వినోదో దృశ్యతే ఖలు ॥176॥**

*176.* జ్ఞానమునకు ప్రారబ్ధమునకు విషయములు భిన్నములగుటచే ఆ రెండింటికి విరోధము లేదు. ఇంద్రజాలము సత్యముకాదని తెలిసియు దానిని జూచి ఆనందింతుము కదా.

**జగత్సత్యత్వమాపాద్య ప్రారబ్ధం భోజయేద్యది ।**
**తదా విరోధి విద్యాయా భోగమాత్రాన్న సత్యతా ॥177॥**

*177.* ప్రారబ్ధము జగత్తునకు సత్యత్వము ఆపాదించి అనుభవింప జేసినచో అపుడు జ్ఞానమునకు విరోధియగును. (జ్ఞానముతో ఏకకాలమున ఉండజాలదు.) కేవలము అనుభవించుటచే సత్యత్వము సిద్ధింపదు.

**అనూనో జాయతేభోగః కల్పితైః స్వప్నవస్తుభిః ।**
**జాగ్రద్వస్తుభిరప్యేవ మసత్యైర్భోగ ఇష్యతామ్ ॥178॥**

*178.* అసత్యములైన స్వప్నవిషయములచే అనల్పమైన ఆనందానుభవము కలుగుచున్నది. జాగ్రద్విషయములు కూడా అట్లే అసత్యములైనను భోగమును సుఖదుఃఖానుభవమును కల్పించునని తెలియుము.

**యది విద్యాపహ్నువీత జాగ్రత్ప్రారబ్ధ ఘాతినీ ।**
**తదా స్యాన్న తు మాయాత్వబోధేన తదపహ్నవః ॥179॥**

*179.* జ్ఞానము జాగ్రవస్థనే తొలగింపగలిగినచో అపుడు ప్రారబ్ధమును నశింపజేయగలుగును. జగత్తు మాయయని తెలిసినంత మాత్రమున ఆ జగత్తు తొలగింపబడదు.

**అనపహ్నుత్య లోకాస్తదిన్ద్రజాలమిదం త్వితి ।**
**జానన్త్యేవానపహ్నుత్య భోగం మాయాత్వధీస్తథా ॥180॥**

*180.* ఇంద్రజాలము కల్పితమను జ్ఞానము జనులకున్నను ఆ జ్ఞానము ఇంద్రజాల ప్రదర్శనమును తొలగింపదు. అట్లే జగన్మిథ్యాత్వజ్ఞానము ఉన్నను అది ఆ మిథ్యావిషయముల అనుభవమును తొలగింపదు.

**యత్ర త్వస్య జగత్ స్వాత్మా పశ్యేత్కస్తత్ర కేన కమ్ ।**
**కిం జిఘ్రేత్కిం వదేద్వేతి శ్రుతౌతు బహు ఘోషితమ్ ॥181॥**

*181. (సంశయము) ఈ జగత్తంతా ఆత్మస్వరూపమే అని దర్శించిన జ్ఞాని, ఇక దేనిని దేనిచే చూడగలడు ఘ్రాణింపగలడు పలుకగలడు అని శ్రుతి బహుధాహోషించినది కదా. బృహ. ఉప. 2.4.14; ఈశ ఉప.7; ఛాందోగ్య ఉప.7.24.1 (ఆత్మ సాక్షాత్కారమునందు ద్రష్టదృష్టి దృశ్యము ఏవీ మిగులవు.)*

**తేన ద్వైత మపహ్నుత్య విద్యోదేతి న చాన్యథా ।**
**తథా చ విదుషో భోగః కథం స్యాదితి చేచ్ఛృణు ॥182॥**

*182. కనుక ద్వైతమును తొలగించే జ్ఞానము కలుగును. మరొక విధమున కాదు. అట్లుండగ జ్ఞానికి విషయానుభవమెట్లు కలుగును? అంటే విను.*

**సుషుప్తి విషయా ముక్తివిషయా వా శ్రుతిస్త్వితి ।**
**ఉక్తం స్వాప్యయ సంపత్త్యోర్యితి సూత్రే హ్యతిస్ఫుటమ్ ॥183॥**

*183. (సమాధానము) ఆ శ్రుతి సుషుప్తి అవస్థను గూర్చియు ముక్తి స్థితిని గూర్చియు చెప్పుచున్నదని బ్రహ్మసూత్రములలో (4.4.16) స్పష్టముగ వివరింపబడినది. జీవన్ముక్తి దశను గూర్చి చెప్పుట లేదని భావము.*

**అన్యథా యాజ్ఞవల్క్యాదేరాచార్యత్వం న సమ్భవేత్ ।**
**ద్వైతదృష్టావవిద్వత్తా ద్వైతాదృష్టౌ న వాగ్వదేత్ ॥184॥**

*184. అట్లు కానిచో యాజ్ఞవల్క్య ఋషి మొదలగువారి ఆచార్యత్వము సంభవింపదు. వారు ద్వైతమును చూచినచో అజ్ఞానులగుదురు. చూడనిచో మాటలాడక ఉండవలెను.*

**నిర్వికల్ప సమాధౌ తు ద్వైతాదర్శన హేతుతః ।**
**సైవాపరోక్షవిద్యేతి చేత్సుషుప్తిస్తథా న కిం ॥185॥**

*185. నిర్వికల్ప సమాధియందు ద్వైతదర్శనము లేకపోవుటచే అదే అపరోక్షజ్ఞానమనినచో సుషుప్తియందు కూడ ద్వైతభావము లేదు కనుక అది కూడా అపరోక్షజ్ఞానము కావలెను.*

**ఆత్మతత్త్వం న జానాతి సుప్తో యది తదా త్వయా ।**
**ఆత్మధీరేవ విద్యేతి వాచ్యం న ద్వైతవిస్మృతిః ॥186॥**

*186. నిద్రితుడు ఆత్మతత్త్వము నెరుగడనినచో, నీవు ఆత్మబోధయే జ్ఞానమని చెప్పవలెను కాని ద్వైతవిస్మరణము జ్ఞానమని కాదు కదా.*

**ఉభయం మిలితం విద్యా యది తర్హి ఘటాదయః ।**
**అర్ధ విద్యా భాజినః స్యుః సకలద్వైత విస్మృతేః ॥187॥**

*187.* ఆత్మబోధ, ద్వైతవిస్మృతి రెండూ కలిసియున్ననే జ్ఞానమనినచో కుండ వంటి జడపదార్థములకు ద్వైతభావము లేదు కనుక వానికి సగము జ్ఞానము కలిగినట్లే !

**మశకధ్వని ముఖ్యానాం విక్షేపాణాం బహుత్వతః ।**
**తవ విద్యా తథా న స్యాద్ఘటాదీనాం యథా దృఢా ॥188॥**

*188.* నీకు దోమల శబ్దము మొదలగు విక్షేపములు అనేకములుండుటచే నీ జ్ఞానము ఘటాదుల జ్ఞానము వలె దృఢమైనది కాదు. (అపహాస్యముగ చెప్పబడినది)

**ఆత్మధీరేవ విద్యేతి యది తర్హి సుఖీభవ ।**
**దుష్టచిత్తం నిరుంధ్యాచ్చేన్నిరుంధి త్వం యథా సుఖమ్ ॥189॥**

*189.* కనుక ఆత్మ బోధయే జ్ఞానమందువేని (మా సిద్ధాంతమును అంగీకరించుచున్నావు.) సుఖముగ ఉండుము. ఆత్మబోధకై చిత్తమును నిరోధింప వలెనన్నచో యథేచ్ఛముగ నిరోధింపుము.

**తదిష్ట మేష్టవ్య మాయామయత్వస్య సమీక్షణాత్ ।**
**ఇచ్ఛన్నప్యజ్ఞవన్నేచ్ఛే త్కి మిచ్ఛన్నితి హి శ్రుతమ్ ॥190॥**

*190.* అది మాకును ఇష్టమే, నిరోధించి చిత్తదోషములను తొలగించినచో జగన్మాయామయత్వము చక్కగా గోచరించును కనుక. కిమిచ్ఛన్... అనే శ్రుతి వాక్యమునకు, జ్ఞాని ఇచ్ఛించినను అజ్ఞాని యొక్క ఇచ్ఛల వలె బంధ కారణములగునట్లు ఇచ్ఛింపడని అర్థము.

**రాగో లింగమబోధస్య సంతు రాగాదయో బుధే ।**
**ఇతి శాస్త్రద్వయం సార్థమేవం సత్యవిరోధతః ॥191॥**

*191.* రాగము అజ్ఞానలక్షణమనే శాస్త్రము (నైష్కర్మ్యసిద్ధి 4.67) జ్ఞాని యందు రాగాదులుండిన ఉండనిమ్ము అనే శాస్త్రము (బృహదారణ్యక వార్తికము 1.4.15-39) రెండూ అర్థవంతములే. బంధకారణమగు రాగము అజ్ఞానలక్షణము. జ్ఞాని యొక్క రాగము బంధించు శక్తిలేనిది.

**జగన్మిథ్యాత్వవత్స్వాత్మాసఙ్గత్వస్య సమీక్షణాత్ ।**
**కస్య కామాయేతి వచో భోక్త్రభావవివక్షయా ॥192॥**

*192. జగత్తు మిథ్యయనీ ఆత్మ అసంగమనీ జ్ఞానికి స్పష్టముగ తెలియుటచే అతనిలో కర్తృత్వాభిమానముగాని భోక్తృత్వాభిమానము గాని ఉండదు. కస్య కామాయ (ఎవని కోరిక కొరకు) అనే శ్రుతి ఈ భోక్త లేకుండుటనే సూచించుచున్నది.*

**పతిజాయాదికం సర్వం తత్తద్భోగాయ నేచ్ఛతి ।**
**కిన్త్వాత్మభోగార్థమితి శ్రుతావుద్ఘోషితం బహు ॥193॥**

*193. భర్త భార్యను, భార్య భర్తను ప్రేమించుట వారియందలి ప్రేమచే గాక తమ (ఆత్మ) యందలి ప్రేమచేతనే అని శ్రుతియందు బహుధా ఘోషింపబడినది. బృహదారణ్యక ఉప: 2.4.5; 4.5.6.*

**కిం కూటస్థశ్చిదాభాసోఽథవా కిం వోభయాత్మకః ।**
**భోక్తా తత్ర న కూటస్థోఽసఙ్గత్వాద్భోక్తృతాం వ్రజేత్ ॥194॥**

*194. మరి అచట భోక్త ఎవరు? కూటస్థమా చిదాభాసనమా రెండూ కలిసియా అనినచో అసంగమగుటచే కూటస్థము భోక్త కాజాలదు.*

**సుఖదుఃఖాభిమానాఖ్యో వికారో భోగ ఉచ్యతే ।**
**కూటస్థశ్చ వికారీ చేత్యేతన్న వ్యాహతం కథమ్ ॥195॥**

*195. సుఖదుఃఖములయందు అభిమానముంచుటచే కలుగు వికారము భోగమనబడును. కూటస్థము వికారము నొందుననుట విరుద్ధవచనము గదా. చూ. నైష్కర్మ్యసిద్ధి 2.77*

**వికారి బుద్ధ్యధీనత్వాదాభాసో వికృతావపి ।**
**నిరధిష్ఠాన విభ్రాన్తిః కేవలా న హి తిష్ఠతి ॥196॥**

*196. బుద్ధి యొక్క వికారముల ననుసరించి చిదాభాసము వికృతినొందినను అది కేవలము భ్రాంతియగుటచే అధిష్ఠానము లేకయే తానుగ నిలువజాలదు.*

**ఉభయాత్మక ఏవాతో లోకే భోక్తా నిగద్యతే ।**
**తాదృగాత్మాన మారభ్య కూటస్థః శోషితః శ్రుతౌ ॥197॥**

*197.* కనుక సామాన్యముగ లోకమునందు ఆ రెండింటి కలయికయే భోక్తగా చెప్పబడుచున్నది. (పరమార్థమున అట్టి కలయికయే సంభవింపదని భావము.) శ్రుతి కూడా బుద్ధి ఉపాధిగా కలిగి భోక్తయగు ఆత్మతో ప్రారంభించి కేవలము కూటస్థముతో అంతమగుచున్నది.

**ఆత్మా కతమ ఇత్యుక్తే యాజ్ఞవల్క్యో విబోధయన్ ।**
**విజ్ఞానమయమారభ్యాసఙ్గం తం పర్యశేషయత్ ॥198॥**

*198.* ఆత్మస్వరూపము గూర్చి జనకుడు అడుగగా యాజ్ఞవల్క్యుడు విజ్ఞానమయ కోశముచే ప్రారంభించి అసంగము అధిష్ఠానము అయిన చిదాత్మతో సమాప్తి చేసెను. బృహదారణ్యక ఉప.*4.1.4.*

**కోఽయ మాత్మేత్యేవమాదౌ సర్వత్రాత్మ విచారతః ।**
**ఉభయాత్మకమారభ్య కూటస్థః శేష్యతే శ్రుతౌ ॥199॥**

*199.* 'ఈ ఆత్మ ఎవరు?' అని ఆత్మవిచారణ చేసే శ్రుతులన్నీ ఉభయాత్మకమగు ఆత్మతో ప్రారంభించి కూటస్థముతో అంతమగును. ఐతరేయ ఉప: *3.1.1.*

**కూటస్థ సత్యతాం స్వస్మిన్నధ్యస్యాత్మావివేకతః ।**
**తాత్త్వికీం భోక్తృతాం మత్వా న కదాచిజ్జిహాసతి ॥200॥**

*200.* అజ్ఞానము వలన జీవుడు కూటస్థము యొక్క సత్యత్వమును తనపై ఆరోపించుకొని తత్ఫలముగ తన భోక్తృత్వమును కూడా సత్యమని భావించుచు ఎన్నటికి దానిని విడువ నిచ్ఛింపడు.

**భోక్తా స్వస్యైవ భోగాయ పతిజాయాది మిచ్ఛతి ।**
**ఏష లౌకికవృత్తాన్తః శ్రుత్యా సమ్యగనూదితః ॥201॥**

*201.* భోక్త తన భోగము కొరకే భర్తను భార్యను మొదలైన వానిని కోరును అనే లౌకిక వృత్తాంతము శ్రుతియందు చక్కగ చెప్పబడినది. చూ.*193.*

**భోగ్యానాం భోక్తృశేషత్వాన్మా భోగ్యేష్వనురజ్యతామ్ ।**
**భోక్తర్యేవ ప్రధానేఽతోఽనురాగం తం విధిత్సతి ॥202॥**

*202.* భోగ్యవిషయములన్నీ భోక్తయనుభవము కొరకే కనుక భోగ్యవస్తువులందు ప్రీతిని ఉంచరాదు. భోక్తయే ప్రధానము కనుక అతనినే ప్రేమింపవలెను. బృహదారణ్యక ఉప: *1.4.8; 2.4.5.*

**యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ ।**
**త్వా మనుస్మరతః సా మే హృదయాన్మాప సర్పతు ॥203॥**

*203.* అవివేకులకు భోగ్యవిషయముల పట్ల ఉండే అంతులేని ప్రీతి నా హృదయములో తొలగక ఉండి నిన్నే అనవరతము స్మరించునట్లు చేయుగాక.

**వ్యాఖ్య:** విష్ణుపురాణము 1.20.19 నందు ప్రహ్లాదుని ప్రార్థన ఇది. అవివేకము వలన విషయములందు గాఢమగు ప్రీతి కలుగును. ఆ ప్రీతియే వివేకము వలన భగవంతుని యందు నిలచి ఉండును.

**ఇతి న్యాయేన సర్వస్మాద్భోగ్యజాతాద్విర క్తధీః ।**
**ఉపసంహృత్య తాం ప్రీతిం భోక్త ర్యేవ బుభుత్సతే ॥204॥**

*204.* ఈ న్యాయమును అనుసరించి విరక్తుడగు సాధకుడు విషయ భోగములందలి ప్రీతిని ఉపసంహరించి ఆ ప్రీతిని భోక్తయందు అనగా ఆత్మయందు నిలుపును.

**స్రక్చన్దన వధూవస్త్ర సువర్ణాదిషు పామరః ।**
**అప్రమత్తో యథా తద్వన్న ప్రమాద్యతి భోక్తరి ॥205॥**

*205.* పామరజనులు పూలమాలలు, చందనము, యువతులు, వస్త్రములు, డబ్బు వీనియందు ఏమరుపాటు లేక ఉందురు. అట్లే సాధకుడు కూడా ఆత్మయందు జాగరూకుడై ఏమరుపాటు లేక ఉండును.

**కావ్యనాటకతర్కాది మభ్యస్యతి నిరన్తరమ్ ।**
**విజిగీషుర్యథా తద్వన్ముముక్షుః స్వం విచారయేత్ ॥206॥**

*206.* ప్రతిస్పర్థులను జయింపగోరే పురుషుడు నిరంతరము కావ్యములు, నాటకములు, తర్కము మొదలగు శాస్త్రములను అభ్యసించునట్లే ముముక్షువు సర్వదా ఆత్మవిచారణను అభ్యసింపవలెను.

**జపయాగోపాసనాది కురుతే శ్రద్ధయా యథా ।**
**స్వర్గాది వాంఛయా తద్వత్ శ్రద్దధ్యాత్ స్వే ముముక్షయా ॥207॥**

*207.* స్వర్గాదులను కోరే పురుషుడు జపము, యజ్ఞము, ఉపాసనలు మొదలగు వానిని శ్రద్ధతో అభ్యసించునట్లే మోక్షమును కోరే సాధకుడు ఆత్మయందు శ్రద్ధను ఉంచవలెను.

**చిత్తైకాగ్ర్యం యథా యోగీమహాయాసేన సాధయేత్ ।**
**అణిమాదిప్రేప్సయైవం వివిచ్యాత్మ్వం ముముక్షయా ॥208॥**

*208.* అణిమాది అష్టసిద్ధులను సంపాదించుటకు యోగి మహా కష్టముతో ఈ చిత్తైకాగ్రతను సాధించును. మోక్షమును సాధించే కోరికతో వివేచనను కూడా అంత పరిశ్రమతో చేయవలెను.

**కౌశలాని వివర్ధన్తే తేషామభ్యాసపాటవాత్ ।**
**యథా తద్వద్వి వేకోఽస్యాప్యభ్యాసాద్విశదాయతే ॥209॥**

*209.* అభ్యాసబలముచే వారివారి నైపణ్యములు పెంపొందునట్లే వివేకము కూడా అభ్యాసపాటవముచే అంతంగా విశదమగుచు వచ్చును. అనగా ఆత్మ శరీరములకంటె భిన్నమనే బోధ స్పష్టతరమగుచు దృఢపడుచుండును.

**వివిఞ్చతా భోక్తృతత్త్వం జాగ్రదాదిష్వసఙ్గతా ।**
**అన్వయ వ్యతిరేకాభ్యాం సాక్షిణ్యధ్యవసీయతే ॥210॥**

*210.* భోక్త యొక్క నిజరూపము అన్వయవ్యతిరేక న్యాయముచే తెలియనగును. దాని వలన భోక్త నిజముగా జాగ్రదా ద్యవస్థలయందు సంగరహితుడైన సాక్షియే అని తేటపడును.

**యత్ర యద్దృశ్యతే ద్రష్టా జాగ్రత్ స్వప్న సుషుప్తిషు ।**
**తత్రైవ తన్నేతరత్రే త్యనుభూతిర్హి సంమతా ॥211॥**

*211.* జాగ్రత్ స్వప్నసుషుప్తి అవస్థలయందు ద్రష్ట ఏయే ప్రపంచములను చూచుచున్నాడో అవియన్నీ ఆయా అవస్థలయందు మాత్రమే ఉండుచున్నవి. ఇతర అవస్థలయందు అవి అనుభవింపబడుట లేదు. కాని ఈ మూడు ప్రపంచములను చూచుచున్న ద్రష్ట మూడు అవస్థలయందును ఒకడే. ఈ అనుభవము సర్వులును అంగీకరించునదే.

**సయత్తత్రేక్షతే కిఞ్చిత్తేనానన్వాగతో భవేత్ ।**
**దృష్ట్వైవ పుణ్యం పాపం చేత్యేవం శ్రుతిషు డిండిమః ॥212॥**

*212.* శ్రుతి కూడా ఈ విషయమునే ఘోషించుచున్నది: ఏ అవస్థయందు ఏయే పుణ్యాపాపములను, అనగా సుఖదుఃఖములను, ద్రష్ట చూచుచున్నాడో వానిని ఆ అవస్థయందే వదలి పోవుచున్నాడు. తనతో కూడా అవస్థాంతరము నకు కొనిపోవును. బృహదారణ్యక ఉప: *4.3.15-17*

**జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥213॥**

*213. జాగ్రత్ స్వప్న సుషుప్తి ప్రపంచములను ప్రకాశింపజేసే ఆ బ్రహ్మమే తాను అని తెలిసికొని సర్వబంధముల నుండి ముక్తుడగును. కైవల్య ఉప: 1.17.*

**ఏక ఏవాత్మా మన్తవ్యో జాగ్రత్ స్వప్న సుషుప్తిషు ।**
**స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే ॥214॥**

*214. జాగ్రత్ స్వప్న సుషుప్తులయందున్న ఆత్మ ఒకటియే అని భావింప వలెను. తాను ఈ మూడు స్థానములకును అతీతమని తెలిసికొనిన ఆత్మకు పునర్జన్మ లేదు. అమృతబిందు ఉప: 11.*

**త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్ ।**
**తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥215॥**

*215. మూడు ధామములందూ గల భోగ్యవిషయములు భోక్తలు అనుభవముల కంటె భిన్నుడు, సాక్షిమాత్రుడు, సర్వదా ఆనంద స్వరూపుడు అయిన చైతన్య స్వరూపమే నేను. కైవల్య ఉప: 1.18.*

**వ్యాఖ్య:** విశ్వుడు తైజసుడు ప్రాజ్ఞుడు మూడు అవస్థలందలి భోక్తలు. సదాశివుడనగా చైతన్య స్వరూపమైన పరమాత్మ.

**ఏవం వివేచితే తత్త్వే విజ్ఞానమయశబ్దితః ।**
**చిదాభాసో వికారీ యో భోక్తృత్వం తస్య శిష్యతే ॥216॥**

*216. ఈ విధముగా ఆత్మను వివేచించినపుడు భోక్తగా మిగులునది చిదాభాసయే. ఇదే జీవుడనీ విజ్ఞానమయుడనీ తెలియబడుచున్నది. వికారము నొందునది ఈ జీవుడే.*

**మాయికోఽయం చిదాభాసః శ్రుతేరనుభవాదపి ।**
**ఇంద్రజాలం జగత్ప్రోక్తం తదన్తఃపాత్యయం యతః ॥217॥**

*217. ఈ జగత్తు ఇంద్రజాలమని చెప్పబడినది. చిదాభాసుడు ఈ జగత్తులోనివాడే కనుక చిదాభాసుడు మాయాకల్పితుడు, మిథ్య. ఈ విషయమును శ్రుతి, అనుభవము కూడా బలపరచుచున్నవి.*

**వ్యాఖ్య:** 'కస్యకామాయ' అనే శ్రుతి భోక్తలేకుండుటను సూచించుచున్నది అని 192వ శ్లోకమున చెప్పబడినది. ఇపుడు చిదాభాసుడే భోక్తయనుట

స్వవచోవ్యాఘాతము కదా అనే సంశయము వారింపబడినది. పరమార్థమున భోక్త లేదనుట సత్యమే, భోక్తయనబడుచున్న చిదాభాస మిథ్య కనుక. చూ: నృసింహ ఉత్తర తాపనీయ ఉప: 9; శ్వేతాశ్వతర ఉప: 4.9–10; కైవల్య ఉప: 1.12–14

**విలయోఽస్యస్య సుప్త్యాదౌ సాక్షిణా హ్యనుభూయతే ।**
**ఏతాదృశం స్వస్వభావం వివినక్తి పునః పునః ॥218॥**

*218.* *నిర్వికారమగు సాక్షి సుషుప్తి మొదలగు అవస్థలయందు చిదాభాసుడు లయమగుటను చూచున్నది. మరల మరల వివేచించుచుండగా ఇట్టి స్వభావము గల చిదాభాసుడు మిథ్యయనీ కూటస్థము కంటె భిన్నుడనీ తేటపడును.*

**వివిచ్య నాశం నిశ్చిత్య పునర్భోగం న వాఞ్ఛతి ।**
**ముమూర్షుః శాయితో భూమౌ వివాహం కోఽభివాంఛతి ॥219॥**

*219.* *ఇట్లు వివేచనచే తాను నశించునని నిశ్చయించి చిదాభాసుడు మరల విషయ భోగములను కోరడు. మరణమాసన్న మగుటచే భూమిపై పరుండపెట్టబడిన పురుషుడు వివాహము చేసికొనటానికి అభిలషించునా? చూ: బృహదారణ్యక ఉప: 4.3.23; కఠ ఉప: 2.2.4, 8*

**జిహ్రేతి వ్యవహర్తుం చ భోక్తాహమితి పూర్వవత్ ।**
**ఛిన్ననాస ఇవ హ్రీతః క్లిశ్యన్నారబ్ధమశ్నుతే ॥220॥**

*220.* *పూర్వము వలె నేను భోక్తను అని వ్యవహరించుటకు చిదాభాసుడు లజ్జించును. ముక్కుకోసి వేయబడిన వాని వలె లజ్జనొందుచు ప్రారబ్ధమును అనుభవించుచుండును.*

**యదా స్వస్యాపి భోక్తృత్వం మన్తుం జిహ్రేత్యయం తదా ।**
**సాక్షిణ్యారోపయేదేతదితి కైవ కథా వృథా ॥221॥**

*221.* *తనయందు భోక్తృత్వమును భావించుకొనుటకే చిదాభాసుడు లజ్జించుచుండగా ఇక కూటస్థమగు సాక్షిపై భోక్తృత్వమును ఎట్లా ఆరోపింప గలడు? ఇది అర్థము లేని మాట.*

**ఇత్యభిప్రేత్య భోక్తార మాక్షిపత్యవిశఙ్కయా ।**
**కస్య కామాయేతి తతః శరీరానుజ్వరో న హి ॥222॥**

*222.* *దీనిని ఉద్దేశించియే శ్రుతి 'కస్యకామాయ' అని నిశ్శంకముగ భోక్త లేకుండుటను సూచించుచున్నది (1వ శ్లోకమున). తత్ఫలముగ ముక్త పురుషుడు శరీరతాపములను అనుసరించి పరితపింపడు.*

**స్థూలం సూక్ష్మం కారణం చ శరీరం త్రివిధం స్మృతమ్ ।**
**అవశ్యం త్రివిధో౾స్త్యేవ తత్ర తత్రోచితో జ్వరః ॥223॥**

*223.* *శరీరము స్థూలశరీరము సూక్ష్మశరీరము కారణశరీరము అని మూడు విధములు. ఆయా శరీరములకు తగినట్లు మూడువిధములైన సంతాపములు ఉండనే ఉండును.*

**వాత పిత్తశ్లేష్మజన్యవ్యాధయః కోటిశస్తనౌ ।**
**దుర్గంధత్వ కురూపత్వదేహభఙ్గాదయస్తథా ॥224॥**

*224.* *అసంఖ్యాకములైన వ్యాధులు స్థూలశరీరమున వాతపిత్తశ్లేష్మముల వికారముల వలన కలుగుచుండును. అవిగాక అందు దుర్వాసన, కురూపము, విరుగుట (ఎముకలు మొదలైనవి) మొదలైన సంతాపములు కూడా కలుగుచుండును.*

**కామక్రోధాదయః శాన్తిదాంతాన్యాద్యాః లిఙ్గదేహగాః ।**
**జ్వరా ద్వయే౾పి బాధన్తేప్రాప్త్యాప్రాప్త్యా నరం క్రమాత్ ॥225॥**

*225.* *కామక్రోధలోభమోహ మదమాత్సర్యములు, శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధా సమాధానము అనేవి కూడా సూక్ష్మశరీరమునకు చెందినవి. ఆదిషట్కము అవాంఛనీయము ద్వితీయషట్కము వాంఛనీయము అయినను, ఉండుటచే మొదటిది లేకపోవుటచే రెండవది పురుషుని బాధించును.*

**స్వం పరం చ న వేత్త్యాత్మా వినష్ట ఇదకారణే ।**
**ఆగామిదుఃఖబీజం చేత్యేతదింద్రేణ దర్శితమ్ ॥226॥**

*226.* *సుషుప్తియందు కారణశరీరమున మృతుని వలె తనను గాని ఇతరులనుగాని తెలియడు. రానున్న దుఃఖములకు బీజములు ఇందుండునని ఇంద్రుడు చూపెను. ఛాందోగ్య ఉప: 8.11.1.*

**ఏతే జ్వరాః శరీరేషు త్రిషు స్వాభావికా మతాః ।**
**వియోగే తు స్వరైస్తాని శరీరాణ్యేవ నాసతే ॥227॥**

*227.* ఈ సంతాపములు మూడు శరీరములకును స్వాభావికములని చెప్పబడినవి. వీనిని తొలగించినచో శరీరములు కూడా నశించును.

**తన్తోర్వియుజ్యేన్న పటో వాలేభ్యః కంబలో యథా ।**
**మృదో ఘటస్తథా దేహో జ్వరేభ్యోఽపీతి దృశ్యతామ్ ॥228॥**

*228.* వస్త్రము నుండి నూలుపోగులను, కంబలి నుండి రోమములను, కుండ నుండి మృత్తికను వేరు చేసినచో అవి నశించునట్లే, ఈ సంతాపములను వేరు చేసినచో ఆయా శరీరములు కూడా నశించును.

**చిదాభాసే స్వతః కోఽపి జ్వరో నాస్తి యతశ్చితః ।**
**ప్రకాశైక స్వభావత్వమేవ దృష్టం న చేతరత్ ॥229॥**

*229.* అయినా ఈ సంతాపములు చిదాభాసునకు సహజములు కావు. ఆయా శరీరములతో తాదాత్మ్యమును భావించుట చేత అవి చిదాభాసుని బాధించును. చిదాభాసుడు చైతన్యము కంటె స్వరూపమున భిన్నము కాడు కనుక అది కూడా చైతన్యము వలె ప్రకాశమే స్వభావముగ కలిగియున్నది.

**వ్యాఖ్య:** ఆకాశమును ప్రతిఫలించుచున్న నూనెను కాచినచో ఆ వేడి ఆకాశమునకు గాని ఆకాశ ప్రతిఫలనమునకు గాని అంటదు. అట్లే శరీర తాపములు చిదాభాసను గాని చైతన్యమును గాని బాధింపవు.

**చిదాభాసేప్యసంభావ్యా జ్వరాః సాక్షిణి కా కథా ।**
**ఏవమప్యేకతాం మేనే చిదాభాసో హ్యవిద్యయా ॥230॥**

*230.* ఈ బాధలు చిదాభాసునియందే అసంభవములనినచో సాక్షి యందు అసంభవములని వేరుగ చెప్పవలయునా? అక్కరలేదు. అయినా అవిద్య వలన చిదాభాసుడు శరీరములతో తాదాత్మ్యమును భావించుకొని పరితపించుచుండును.

**సాక్షి సత్యత్వమధ్యస్య స్వేనోపేతే వపుస్త్రయే ।**
**తత్సర్వం వాస్తవం స్వస్య స్వరూపమితి మన్యతే ॥231॥**

*231.* చిదాభాసుడు తనపైనను శరీరత్రయముపైనను సాక్షి యొక్క సత్యత్వమును ఆరోపించుకొని అదంతా వాస్తవమైన తన స్వరూపమని భావించును.

**ఏతస్మిన్‌భ్రాంతి కాలేఽయం శరీరేషు జ్వరత్స్వథ ।**
**స్వయమేవ జ్వరామీతి మన్యతే హి కుటుంబివత్ ॥232॥**

*232. ఈ భ్రాంతి ఉన్నంతకాలము, శరీరములు తపించుచుండగా తానే తపించుచున్నానని భావించును, మోహితుడైన కుటుంబి తన కుటుంబమున కలిగిన విపత్తులు తనకే కలిగెనని భావించునట్లు.*

**పుత్రదారేషు తప్యత్సు తపామీతి వృథా యథా ।**
**మన్యతే పురుషస్తద్వదాభాసోఽప్యభిమన్యతే ॥233॥**

*233. తన భార్యాపుత్రులు బాధపడుచుండగా పురుషుడు తానే బాధ పడుచున్నట్లు వ్యర్థముగ భావించును. అట్లే చిదాభాసుడు శరీరతాపములు తన తాపములే అని నిరర్థకముగ అభిమానించును.*

**వివిచ్య భ్రాంతి ముజ్ఝిత్వా స్వమప్యగణయన్సదా ।**
**చిన్తయన్సాక్షిణం కస్మాచ్ఛరీరమనుసంజ్వరేత్ ॥234॥**

*234. వివేచనచే ఆ భ్రాంతిని తొలగించుకొని తనను కూడా సత్యమని లెక్కింపక సర్వదా కూటస్థమగు సాక్షిని గూర్చి చింతించే చిదాభాసుడు ఇక శరీరతాపములను అనుసరించి ఏల పరితపించును? పరితపింపడు.*

**అయథావస్తు సర్పాదిజ్ఞానం హేతుః పలాయనే ।**
**రజ్జు జ్ఞానేఽహిధీర్ధ్వస్తౌ కృతమప్యనుశోచతి ॥235॥**

*235. పాము అని భావింపబడిన త్రాడు పురుషుని పలాయనమునకు కారణమగుచున్నది. త్రాడు అనే జ్ఞానము పాము అనే భ్రాంతిని తొలగింపగా వ్యర్థముగ భయపడితిని కదా అని పురుషుడు విచారించును.*

**మిథ్యాభియోగదోషస్య ప్రాయశ్చిత్తత్వసిద్ధయే ।**
**క్షమాపయన్నివాత్మానం సాక్షిణం శరణం గతః ॥236॥**

*236. మిథ్యాభియోగము చేసిన వ్యక్తి తన పొరపాటు గుర్తించి ప్రాయశ్చితముగ క్షమాపణము కోరునట్లు, చిదాభాసుడు, తాను భ్రాంతితో కూటస్థముపై ఆరోపించిన దోషములకు ప్రాయశ్చిత్తము వలె, కూటస్థము నందు లీనుడగును.*

**ఆవృత్త పాపనుత్త్యర్థం స్నానాద్యావర్త్యతే యథా ।**
**ఆవర్తయన్నివ ధ్యానం సదా సాక్షిపరాయణః ॥237॥**

*237.* మరల మరల చేసిన పాపములను తొలగించుకొనుటకు స్నాన దానాదులు ప్రాశ్చిత్త రూపమున మరల మరల చేయునట్లే చిదాభాసుడు మరల మరల కూటస్థమగు సాక్షిని ధ్యానించుచు తత్పరాయణుడై ఉండును.

**ఉపస్థ కుష్ఠినీ వేశ్యా విలాసేషు విలజ్జతే ।**
**జానతోఽగ్రే తథాభాసః స్వప్రఖ్యాతౌ విలజ్జతే ॥238॥**

*238.* కుష్ఠువ్యాధి గల వేశ్య ఆ విషయమును ఎరిగిన విటుని ఎదుట తన విలాసములను చూపుటకు లజ్జించును. అట్లే తన మిథ్యాత్వమును ఎరిగిన చిదాభాసుడు తనను కర్తగ భోక్తగ ప్రకటించుకొనుటకు లజ్జించును.

**గృహీతో బ్రాహ్మణో మ్లేచ్ఛైః ప్రాయశ్చిత్తం చరన్పునః ।**
**మ్లేచ్ఛైః సంకీర్యతే నైవ తథాభాసః శరీరకైః ॥239॥**

*239.* మ్లేచ్ఛుల పాలబడి మైల చెందిన బ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తము చేసికొని మరల వారి చెంతకు పోకుండ జాగరూకుడగునో అట్లే శరీర త్రయముతోడి తాదాత్మ్యమనే మైలను తొలగించుకొనిన చిదాభాసుడు మరల వానితో సంగమేర్పడకుండునట్లు జాగ్రత్త వహించును.

**యౌవరాజ్యే స్థితో రాజపుత్రః సామ్రాజ్యవాఞ్ఛయా ।**
**రాజానుకారీ భవతి తథా సాక్ష్యనుకార్యయమ్ ॥240॥**

*240.* యువరాజుగ అభిషేకింపబడిన రాజపుత్రుడు సామ్రాజ్య ఆధిపత్యమును కోరి రాజు వలె ప్రవర్తించునట్లే చిదాభాసుడు కూటస్థమగు సాక్షిని అనుకరించును.

**యో బ్రహ్మ వేద బ్రహ్మైవ భవత్యేవ ఇతి శ్రుతిమ్ ।**
**శ్రుత్వా తదేకచిత్తః సన్ బ్రహ్మ వేత్తి న చేతరత్ ॥241॥**

*241.* బ్రహ్మమును తెలిసికొనిన పురుషుడు బ్రహ్మమే అగును అనే శ్రుతివాక్యమును వినిన వ్యక్తి తదేకచిత్తముతో బ్రహ్మమునే తెలిసికొని బ్రహ్మమే అగును. ఇతరము కాదు. ముండక ఉప: *3.2.9.*

**దేవత్వకామా హ్యగ్న్యాదౌ ప్రవిశన్తి యథా తథా ।**
**సాక్షిత్వేనావశేషాయ స్వవినాశం స వాఞ్ఛతి ॥242॥**

*242.* మానవులు దేవత్వమును పొందుటకు శాస్త్రోక్తములైన అగ్ని

ప్రవేశాదులు చేసి మరణించుటకు సిద్ధపడినట్లే, చిదాభాసుడు కూడా సాక్షి మాత్రముగ ఉండగోరి తన వినాశమును కోరును.

**యావత్స్వదేహదాహం స నరత్వం నైవ ముఞ్చతి ।**
**యావదారబ్ధదేహం స్యాన్నాభాసత్వ విమోచనమ్ ॥243॥**

*243. అగ్నిప్రవేశము చేసిన వ్యక్తికి తన దేహము సంపూర్ణముగ దహింపబడు వరకు దేవత్వబోధ కలుగక నరత్వబోధయే ఉండునట్లు, ప్రారబ్ధమైన దేహమున్నంత కాలము చిదాభాసత్వము వదలదు.*

**రజ్జు జ్ఞానేఽపి కంపాది శనై రేవోపశామ్యతి ।**
**పునర్మన్దాంధకారే సా రజ్జుః క్షిప్తోరగీ భవేత్ ॥244॥**

*244. పామను భ్రాంతి వలన కలిగిన శరీరకంపము చెమటలు రజ్జు జ్ఞానము కలిగి ఉన్నా నిదానముగనే తగ్గును. అంతేగాక చిరుచీకట్లలో మరల ఆ త్రాడే పాముగ కన్పింపవచ్చును.*

**ఏవమారబ్ధ భోగోఽపి శనైః శామ్యతి నో హఠాత్ ।**
**భోగకాలే కదాచిత్తు మర్త్యోహమితి భాసతే ॥245॥**

*245. అట్లే ప్రారబ్ధభోగము కూడా హఠాత్తుగ కాక నిదానముగనే ఉపశమించును. ఆ భోగకాలమున అప్పుడప్పుడు నేను మర్త్యుడను అనే బోధ కలుగవచ్చును.*

**నైతావతాపరాధేన తత్త్వజ్ఞానం వినశ్యతి ।**
**జీవన్ముక్తి వ్రతం నేదం కిన్తు వస్తుస్థితిః ఖలు ॥246॥**

*246. అంతమాత్రపు అపరాధము వలన తత్త్వజ్ఞానము, తానే బ్రహ్మమనెడి జ్ఞానము, నశింపదు. జీవన్ముక్తి మౌనాదుల వలె వ్రతము కాదు గదా, భంగము కలిగినంతనే నష్టమగుటకు వస్తుస్థితియే అది.*

**వ్యాఖ్య:** ముండకోపనిషత్తు (2.2.8) బ్రహ్మసాక్షాత్కారమైనంతనే సర్వ కర్మలను క్షయించునని చెప్పును. ఇది ఔపచారికమని గ్రహింపవలెను. ఏలన ఆగామి, సంచిత కర్మల వలె ప్రారబ్ధము కూడా నశించినచో ఇక శరీరము నిలువదు. జీవన్ముక్తి అసంభవమగును. జ్ఞానికి తన శరీరమునందు ఇదినాది అనే భావము లేకపోవుటచే అది, అతనికి సంబంధించినంత వరకు, మరణించినట్లే. బృహదారణ్యకోపనిషత్తు జ్ఞాని యొక్క శరీరమును పాము కుబుసముతో పోల్చును.

శ్రీ శంకరభగవత్పాదులు ఛాందోగ్యోపనిషత్తు (6.14.2) ను వ్యాఖ్యానించుచు బాణముల ఉపమానము చెప్పిరి. మనము వదలిన బాణముపై మనకింక స్వాతంత్ర్యము లేదు. కాని ఎక్కుపెట్టిన బాణముపై పొదిలోని బాణముపై మనకు సంపూర్ణాధికారము కలదు. అట్లే జ్ఞాని యొక్క ప్రారబ్ధము వదలిన బాణమువలే లోక సంగ్రహార్థము పనిచేయును. దాని వలని పుణ్యపాపములు జ్ఞానినంటవు.

మోక్షప్రయత్నము జీవించి ఉన్నపుడే జరుగును. మరణించిన పిదప సంపాదింప గలుగు విశేష సామర్థ్యమేమీ లేదు. కనుక జీవించి ఉండగనే ముక్తి కలుగుట యుక్తి సమ్మతము.

ఉపనిషత్తులు (కఠ 2.3, 6.4; కేన 2.5; ఛాందోగ్య 6.14.2; బృహదారణ్యక 4.4.6–8; 1.4.10; మాండూక్య 2; ఛాందోగ్య 6.8.7 భగవద్గీత 5.19,23,26) మహావాక్యములు కూడా జీవన్ముక్తి సిద్ధాంతమునే బలపరచును.

**దశమోఽపి శిరస్తాడం రుదన్‌బుద్ధ్వా న రోదితి ।**
**శిరోవ్రణస్తు మాసేన శనైః శామ్యతి నో తదా ॥247॥**

*247. దశముడు కూడ తలగొట్టుకొనుచు ఏడ్చుచుండి దశముడు చావలేదని తెలిసినంతనే ఏడుపు మానును. కాని తలపై తగిలిన గాయములు నయమగుటకు ఒక నెల పట్టవచ్చు.*

**దశమామృతి లాభేన జాతో హర్షో వ్రణవ్యథామ్ ।**
**తిరోధత్తే ముక్తిలాభస్తథా ప్రారబ్ధ దుఃఖితామ్ ॥248॥**

*248. దశముడు జీవితుడే అని గుర్తించుటచే కలిగిన ఆనందము గాయముల వలని నొప్పిని తోపనీయదు. అట్లే ముక్తి లాభము వలన కలిగిన ఆనందము ప్రారబ్ధ దుఃఖమును కప్పివేయును.*

**వ్రతాభావాద్యదాధ్యాసస్తదా భూయో వివిచ్యతామ్ ।**
**రససేవీ దినే భుఙ్క్తే భూయో భూయో యథాతథా ॥249॥**

*249. జీవన్ముక్తి వ్రతము కాకపోవుటచే అప్పుడప్పుడు ప్రమాదము కలిగినా దిగులు లేదు. అధ్యాస కలిగినపుడెల్ల మరల మరల వివేచించుకొన వలెను. వ్యాధి నివారణకై పాదరసమును తినిన వ్యక్తి దాని వలన కలిగిన ఆకలి తీరుటకు పదే పదే భుజించును గదా.*

**వ్యాఖ్య:** అధ్యాస మరల కలుగుట జీవన్ముక్తి ఆనందమునకు భంగము

కలిగించును గాని తత్త్వజ్ఞానమునందు లోపము కల్పింపదు. చూ. 7.39.

**శమయత్యౌషధేనాయం దశమః స్వం వ్రణం యథా ।**
**భోగేన శమయిత్వైతత్ప్రారబ్ధం ముచ్యతే తథా ॥250॥**

*250. దశముడు ఔషధములచే తన గాయములను మాన్పుకొనినట్లు జ్ఞాని అనుభవించుటచే ప్రారబ్ధమును క్షయింపజేసి ముక్తి నొందును.*

**వ్యాఖ్య:** ప్రారబ్ధము జ్ఞానముచే నశింపనిచో మరెట్లు నశించుననే ప్రశ్నకు అనుభవించుట చేతనే అని సమాధానము.

**కిమిచ్ఛన్నితి వాక్యోక్తః శోకమోక్ష ఉదీరితః ।**
**ఆభ్యాసస్య హ్యవస్థైషా షష్ఠీ తృప్తిస్తు సప్తమీ ॥251॥**

*251. మొదటి శ్లోకంలోని 'కిమిచ్ఛన్' (దేనిని కోరి) అనే పదము దుఃఖము నుండి మోక్షమును అనగా దుఃఖనాశమును సూచించును. ఇది చిదాభాసుని ఆరవ స్థితి. ప్రస్తుతము చెప్పబోవుచున్న తృప్తి ఏడవ స్థితి.*

**వ్యాఖ్య:** శ్లో 126-251 నందు శోకమోక్షదశ వర్ణింపబడినది. 252 నుండి 298 వరకు నిరంకుశతృప్తి వర్ణింపబడును.

**సాఙ్కుశా విషయై స్తృప్తిరియం తృప్తిర్నిరఙ్కుశా ।**
**కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ తృప్యతి ॥252॥**

252. విషయభోగము వలన తృప్తి పరిమితము. బ్రహ్మానుభవము వలన ఈ తృప్తి అపరిమితము. చేయవలసినదంతా చేయబడినది. పొందవలసినదంతా పొందబడినది అనే తృప్తిజెందును.

**ఐహికాముష్మిక వ్రాతసిద్ధ్యై ముక్తేశ్చ సిద్ధయే ।**
**బహు కృత్యం పురాస్యాభూత్తత్సర్వమధునా కృతమ్ ॥253॥**

*253. బ్రహ్మజ్ఞానమునకు పూర్వము ఇహలోకమునందు పరలోకము నందు లభింపవలసిన ఆనందముల కొరకు మోక్షము కొరకు కృషి వాణిజ్యాదులు, యోగము, ఉపాసనాదులు శ్రవణాదులు అనేకములైన కర్మలు చేయబడినవి. తత్త్వజ్ఞానోదయముచే ఇపుడు ఇహపరసుఖములందు ఇచ్ఛ లేకపోవుట చేతను బ్రహ్మానందము ప్రాప్తమగుటచేతను ఇక కర్తవ్యమేమీ మిగులదు. అంతా చేయబడినట్లే. అవధూత. ఉప. 9.*

**సూచన:** 253–270 శ్లోకములు 14వ ప్రకరణమున ఆవర్తింపబడినవి (40–57). అవధూతోపనిషత్తు 9–25.

**తదే తత్కృతకృత్యత్వం ప్రతియోగిపురః సరమ్ ।**
**అనుసందధదేవాయమేవం తృప్యతి నిత్యశః ॥254॥**

*254. ఆ కృతకృత్యత్వమునే దాని వ్యతిరేకదశతో కూడా సమీక్షించుకొనుచు పరమమైన తృప్తిననుభవించును. (వ్యతిరేకదశ క్రింద వర్ణింపబడుచున్నది.) అవ.10.*

**దుఃఖినోఽజ్ఞాః సంసంన్తు కామం పుత్రాద్యపేక్షయా ।**
**పరమానన్దపూర్ణోఽహం సంసరామి కిమిచ్ఛయా ॥255॥**

*255. అజ్ఞానులు దుఃఖవశులు అగువారు దారపుత్రవిత్తాదులను కోరుచు ఇష్టానుసారము సంసారచక్రమున తిరుగుచుందురు గాక. పరమానంద భరితుడనైన నేను దేనిని కోరి సంసారమున సంచరింతును? అవ.11.*

**అనుతిష్ఠంతు కర్మాణి పరలోక యియాసవః ।**
**సర్వలోకాత్మకః కస్మాదనుతిష్ఠామి కిం కథమ్ ॥256॥**

*256. పరలోకములకు పోగోరినవారు అనేక కర్మలను అనుష్ఠింతురు గాక. సర్వలోక స్వరూపుడనైన నేను దేనిని ఎట్లు ఏల అనుష్ఠింపగలను? అవ. 12.*

**వ్యాచక్షతాం తే శాస్త్రాణి వేదానధ్యాపయన్తు వా।**
**యేఽత్రాధికారిణో మే తు నాధికారోఽక్రియత్వతః ॥257॥**

*257. అధికారులైనవారు శాస్త్రములను వ్యాఖ్యానింతురు గాక. లేదా వేదములను అధ్యయనము చేయింతురుగాక. నిష్క్రియమైన బ్రహ్మము నగుటచే నాకు వీనియందు అధికారము లేదు. అవ. 13.*

**నిద్రాభిక్షే స్నానశౌచే నేచ్ఛామి న కరోమి చ ।**
**ద్రష్టారశ్చే త్కల్పయన్తి కిం మే స్యాదన్య కల్పనాత్ ॥258॥**

*258. నిద్రింపవలెనని గాని భిక్ష చేయవలెనని గాని స్నానశౌచములకై గాని నాకు కోరిక లేదు. నేనవి చేయుటయు లేదు. చూచువారు నేను చేయుచున్నాని భావించినచో, ఇతరుల భావనల వలన నాకు కలుగునదేమి? అవ. 14.*

**గుఞ్జా పుఞ్జాది దహ్యేత నాన్యారోపిత వహ్నినా ।**
**నాన్యారోపిత సంసారధర్మానేవ మహం భజే ॥259॥**

*259.* *గుంజ ఫలముల గుత్తులను చూచి ఇతరులు అది అగ్నియని భావించినచో ఆ అగ్ని గుంజపాదలను దహింపదు గదా. అట్లే ఇతరులు నా యందు కల్పించుకొనిన సంసారధర్మములు నన్ను అంటవు. అవ. 15.*

**శృణ్వంత్వజ్ఞాత తత్త్వాస్తే జానన్కస్మాచ్ఛృణోమ్యహమ్ ।**
**మన్యంతాం సంశయాపన్నాః న మన్యేఽహమసంశయః ॥260॥**

*260.* *తత్త్వము తెలియని వారు శ్రవణము చేయుదురు గాక. తత్త్వబోధ కలిగిన నేనేల శ్రవణము చేయుదును? సంశయగ్రస్తులు మననము చేయుదురుగాక. ఎట్టి సంశయము లేని నేను మననము చేయను. అవ. 16.*

**విపర్యస్తో నిదిధ్యాసేత్కిం ధ్యానమవిపర్యయాత్ ।**
**దేహాత్మత్వ విపర్యాసం న కదాచి ద్భజామ్యహమ్ ॥261॥**

*261.* *విపర్యాసము కలిగినవాడు నిదిధ్యాసన చేయుగాక. విపర్యయమే లేనపుడు ధ్యానమేల? దేహమే యాత్మ అనే విపర్యాసమును నేనెన్నడును ఆశ్రయింపను. అవ. 17.*

**అహం మనుష్య ఇత్యాదివ్యవహారో వినాప్యముమ్ ।**
**విపర్యాసం చిరాభ్యస్త వాసనాతోఽవకల్పతే ॥262॥**

*262.* *దేహాత్మ విపర్యాసము లేకున్నను చిరకాలము నుండి అభ్యాసమైన వాసనాబలమున నేను మనుష్యుడను ఇత్యాది వ్యవహారము నడచును. అవ. 18.*

**ప్రారబ్ధ కర్మణి క్షీణే వ్యవహారో నివర్తతే ।**
**కర్మాక్షయే త్వసౌ నైవ శామ్యేద్ధ్యాన సహస్రతః ॥263॥**

*263.* *ప్రారబ్ధకర్మ తీరిన పిదప లోకవ్యవహారము ఆగిపోవును. ఆ కర్మ తీరనిచో వేలకొద్ది ధ్యానములు చేసినను ఈ వ్యవహారము శాంతింపదు.అవ.19.*

**విరలత్వం వ్యవహృతేరిష్టం చేద్ధ్యానమస్తు తే ।**
**అబాధికాం వ్యవహృతిం పశ్యన్ ధ్యాయామ్యహం కుతః ॥264॥**

*264.* *వ్యవహారమును తగ్గించుట ఇష్టమైనచో అట్టివారు ధ్యానము చేయుదురుగాక. వ్యవహారము వలన బాధేమీ లేకుండుటను చూచుచు నేను ధ్యానమేల చేయుదును? అవ. 20.*

**విక్షేపో నాస్తి యస్మాన్మే న సమాధిస్తతో మమ ।**
**విక్షేపో వా సమాధిర్వా మనసః స్యాద్వికారిణః ॥265॥**

*265.* నాకు విక్షేపము లేదు. అందుచే సమాధి కూడా లేదు. విక్షేపముగాని సమాధిగాని వికారియగు మనస్సునకు మాత్రమే. అవ. *21.*

**నిత్యానుభవరూపస్యకో మే ఽ త్రానుభవః పృథక్ ।**
**కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ నిశ్చయః ॥266॥**

*266.* నిత్యమును అనుభవస్వరూపుడనగు నాకు వేరుగా అనుభవమేమి గలదు? చేయవలసినదంతా చేయబడినది. లభింపవలసినదంతా లభ్యమైనది అనే నిశ్చయము.

**వ్యవహారో లౌకికో వా శాస్త్రీయో వాన్యథాపి వా ।**
**మమాకర్తురలేపస్య యథారబ్ధం ప్రవర్తతామ్ ॥267॥**

*267.* వ్యవహారము లౌకికమే గానిమ్ము శాస్త్రీయమే గానిమ్ము తదితరమే గానిమ్ము అకర్తను అసంగుడను అయిన నన్ను అది అంటదు. కనుక ప్రారబ్ధమెట్లుండిన అట్లే వ్యవహారము నడచు గాక. అవ. *22.*

**అథవా కృత కృత్యోఽపి లోకానుగ్రహ కామ్యయా ।**
**శాస్త్రీయేణైవ మార్గేణ వర్తేఽహం కా మమ క్షతిః ॥268॥**

*268.* లేదా, కృతకృత్యుడనైనను లోకానుగ్రహము కొరకు శాస్త్రీయమైన మార్గముననే నడచుకొందునుగాక. నాకు పోవునదేమున్నది? అవ. *23.*

**దేవార్చన స్నానశౌచభిక్షాదౌ వర్తతాం వపుః ।**
**తారం జపతు వాక్తద్వత్పఠత్వామ్నాయ మస్తకమ్ ॥269॥**

*269.* నా శరీరము దేవపూజనము స్నానము శౌచభిక్షాదులయందు ప్రవర్తించు గాక. వాక్కు ప్రణవమును జపము చేయుగాక లేదా ఉపనిషత్తులను పఠించుగాక. అవ. *24.*

**విష్ణుం ధ్యాతు ధీర్యద్వా బ్రహ్మానన్దే విలీయతామ్ ।**
**సాక్ష్యహం కిఞ్చిదప్యత్ర న కుర్వేనాపి కారయే ॥270॥**

*270.* నా మనస్సు విష్ణువును ధ్యానించుగాక. లేదా బ్రహ్మానందమునందు లీనమగుగాక. నేను సాక్షిని మాత్రమే. నేను చేయునదిగాని చేయించునదిగాని అణుమాత్రమైనను లేదు. అవధూత. ఉపనిషత్తు *25.*

**ఏవం చ కలహః కుత్ర సంభవేత్కర్మిణో మమ ।**
**విభిన్న విషయత్వేన పుర్వాపర సముద్రవత్ ॥271॥**

*271. ఇట్లుండగా కర్మపరునకు నాకు వివాదమెక్కడిది? పూర్వపశ్చిమ సముద్రముల వలె భిన్నమైనవి మా విషయములు.*

**వ్యాఖ్య:** కర్మవరుడు అనగా జ్ఞాని యొక్క కర్మలనిగాని, మనస్సనిగాని, కర్మతత్పరులైన ప్రతివాదులనిగాని అర్థము చెప్పవచ్చును. ఏ అర్థములో నైనను జ్ఞానికి వానితో విరోధము లేదు.

**వపుర్వాగ్ధీషు నిర్బంధః కర్మిణో న తు సాక్షిణి ।**
**జ్ఞానినః సాక్ష్యలేపత్వే నిర్బంధో నేతరత్ర హి ॥272॥**

*272. కర్మికి వాఙ్మనః కాయములతో మాత్రమే సంబంధము. సాక్షితో ఏ సంబంధమును లేదు. జ్ఞానులకు సంగరహితమైన సాక్షితో మాత్రమే సంబంధము. ఇతరములతో వారికి పని లేదు. (కనుక వారి నిశ్చయములు ఆసక్తి విషయములు భిన్నములు.)*

**ఏవం చాన్యోన్య వృత్తాంతానభిజ్ఞౌ బధిరావివ ।**
**వివదేతాం బుద్ధిమన్తో హసన్త్యేవ విలోక్య తౌ ॥273॥**

*273. మరియు వారు పరస్పరవృత్తాంతము తెలియని ఇద్దరు చెవిటి వారి వలె కలహింతురుగాక. బుద్ధిమంతులు మాత్రము వారిని జూచి నవ్వుదురు.*

**వ్యాఖ్య:** కర్మయే ప్రధానమనువారు, జ్ఞానమే ముఖ్యమనువారు పరస్పరము వివాదపడుట హాస్యాస్పదము. ఒకరు చెప్పునది మరొకరికి తెలియదు.

**యం కర్మీ న విజానాతి సాక్షిణ తస్య తత్త్వవిత్ ।**
**బ్రహ్మత్వం బుధ్యతాం తత్ర కర్మిణః కిం విహీయతే ॥274॥**

*274. కర్మికి తెలియని సాక్షియే బ్రహ్మమని తత్త్వవిదుడు తెలిసికొనుగాక. దాని వలన కర్మికి నష్టమేమి?*

**దేహవాగ్బుద్ధయస్త్యక్తా జ్ఞానినానృతబుద్ధితః ।**
**కర్మీ ప్రవర్తతా మాభిర్జ్ఞానినో హీయతేఽత్ర కిమ్ ॥275॥**

*275. శరీరము వాక్కు మనస్సులను జ్ఞాని అవి అసత్యములు మిథ్య అనే భావముతో త్యజించెను. కర్మి వానియందు ప్రవర్తించినచో జ్ఞానికి పోవునదేమి?*

**ప్రవృత్తిర్నోపయుక్తా చే న్నివృత్తిః క్వోపయుజ్యతే ।**
**బోధహేతు ర్నివృత్తిశ్చేద్ బుభుత్సాయాం తథేతరా ॥276॥**

*276. (సంశయము) జ్ఞానికి ప్రవృత్తి వలన నుపయోగము లేదు కదా. (సమాధానము) నివృత్తి వలన మాత్రమేమి ఉపయోగము? (సంశయము) జ్ఞానప్రాప్తికి నివృత్తి సహకారి. (సమాధానము) అట్లే ప్రవృత్తి కూడా సహకారి, జిజ్ఞాసువునకు.*

**వ్యాఖ్య:** జ్ఞానికి ప్రవృత్తి వలనగాని నివృత్తి వలనగాని ప్రయోజనము లేదు, అవి మిథ్యయగు శరీరత్రయమునకే గాని సత్యమగు సాక్షికి కాకపోవుట చేత. అజ్ఞానికి ప్రవృత్తి వలన క్రమముగా చిత్తశుద్ధి కలిగి నివృత్తికి అర్హత కలుగును. నివృత్తి ద్వారా జిజ్ఞాస తీవ్రతరమై జ్ఞానప్రాప్తి కలుగును. ప్రవృత్తి అనగా సత్కర్మాచరణమని అర్థము, దుష్కర్మను శాస్త్రము నిషేధించుట చేత తీవ్రమగు జిజ్ఞాస కలుగు వరకు సత్కర్మ చేయవలసినదేనని ఆచార్యులందరూ అంగీకరించిరి.

**బుద్ధశ్చేన్న బుభుత్సేత నాప్యసౌ బుధ్యతే పునః ।**
**ఆబాధాదనువర్తేత బోధో న త్వన్యసాధనాత్ ॥277॥**

*277. (సంశయము) బోధ కలిగినచో బోధ కలుగవలెనని కోరడు గదా. (కనుక ప్రవృత్తి అనవసరము.) (సమాధానము) ఒకసారి బోధ కలిగిన పిమ్మట మరల కలుగు బోధ ఏమీ లేదు (కనుక నివృత్తియు అనవసరమే). బోధ స్థిరముగ ఉండుటకు బాధకములు లేకుండవలెను గాని ఇతర సాధనములు అవసరము లేదు. (మహావాక్యజనితమైన జ్ఞానముచే బాధకములు తొలగుట వలన బోధ స్థిరముగ ఉండును.)*

**నావిద్యా నాపి తత్కార్యం బోధం బాధితుమర్హతి ।**
**పురైవ తత్త్వబోధేన బాధితే తే ఉభే యతః ॥278॥**

*278. అవిద్యగాని దాని కార్యమగు ద్వైతజ్ఞాతము గాని తత్త్వజ్ఞానమును బాధింపలేవు. జ్ఞానికి జ్ఞానోదయమైనంతనే అవిద్యా తమస్సు శాశ్వతముగ నిర్మూలింపబడును.*

**బాధితం దృశ్యతామక్షైస్తేన బాధో న దృశ్యతే ।**
**జీవన్నాఖుర్న మార్జారం హన్తి హన్యాత్కథం మృతః ॥279॥**

*279. జ్ఞానముచే మిథ్య అని తెలియబడిన ద్వైతప్రపంచమును ఇంద్రియములు చూచుగాక, అనుభవించునుగాక. అట్టి దర్శనము అనుభవము తత్త్వజ్ఞానమును స్పర్శింపజాలవు. బ్రతికున్నపుడే ఎలుక పిల్లిని చంపజాలదు. చచ్చిన ఎలుక ఇక చంపగలుగునా?*

**అపి పాశుపతాస్త్రేణ విద్ధః చేన్న మమార యః ।**

**నిష్ఫలేషు వితున్నాంగో నజక్ష్యతీత్యత్ర కా ప్రమా ॥280॥**

*280. పాశుపతాస్త్రముచే కొట్టబడినను చావని బలశాలి, ములుకు లేని బాణముతో మరణించుననే మాట నమ్ముట ఎట్లు?*

**వ్యాఖ్య:** అవిద్య, అవిద్యాకార్యమైన ప్రపంచం అమోఘమైన పాశుపతాస్త్రంతో పోల్చబడినది. జ్ఞానిని అంటజాలని ఇంద్రియగోచరములైన సుఖదుఃఖములు ములుకు, మొన, లేని బాణముతో పోల్చబడినవి.

**ఆదావవిద్యయా చిత్రైః స్వకార్యైర్ జృంభమాణయా ।**

**యుద్ధ్వాబోధోఽజయత్సోఽద్య సుదృఢో బాధ్యతాం కథమ్ ॥281॥**

*281. అవిద్య తన చిత్రవిచిత్రములైన కల్పనలతో విజృంభించియున్నపుడే తత్త్వజ్ఞానము దానితో యుద్ధము చేసి విజయము నొందెను. అట్లు సుదృఢమైన జ్ఞానమునకు ఇపుడు బాధకలుగుట ఎట్లు?*

**తిష్ఠన్త్వజ్ఞాన తత్కార్యశవా బోధేన మారితాః ।**

**న భీతిర్బోధ సమ్రాజః కీర్తిః ప్రత్యుత తస్యతై ॥282॥**

*282. తత్త్వజ్ఞానము హతమార్చిన అజ్ఞానపు శవమును దాని కార్యముల శవములను పడియుండనిమ్ము. వాని వలన బోధసమ్రాట్టునకు భీతిలేదు. కాగా అవి అతని కీర్తినే ప్రకటించును.*

**య ఏవమతిశూరేణ బోధేన న వియుజ్యతే ।**

**ప్రవృత్త్యా వా నివృత్త్యా వా దేహాదిగతయాస్య కిమ్ ॥283॥**

*283. మహావీరుడైన ఈ బోధ నెడబాయక ఉండే జ్ఞానికి, దేహాదులకు సంబంధించి ప్రవృత్తితోగాని నివృత్తితోగాని ఏమి సంపర్కము? రెండూ అతని పట్ల నిరర్థకములే అని భావము.*

**ప్రవృత్తావాగ్రహో న్యాయ్యో బోధహీనస్య సర్వథా ।**

**స్వర్గాయ వాపవర్గాయ యతితవ్యం యతో నృభిః ॥284॥**

*284. అజ్ఞానికి ప్రవృత్తియందు ఆసక్తి ఉండుట సర్వవిధముల న్యాయము. మానవులు స్వర్గాదుల కొరకుగాని మోక్షము కొరకు గాని ప్రయత్నింపవలెను.*

**విద్వాంశ్చే త్తాదృశాం మధ్యే తిష్ఠేత్తదనురోధతః ।**
**కాయేన మనసా వాచా కరోత్యేవాఖిలాః క్రియాః ॥285॥**

*285.* *జ్ఞానియగు పురుషుడు అట్టివారి నడుమ ఉండినచో వారి అనురోధమును అనుసరించి వాఙ్మనశ్శరీరములచే అన్ని కర్మలను చేయనే చేయును.*

**ఏష మధ్యే బభుత్సూనాం యదా తిష్ఠేత్తదా పునః ।**
**బోధాయైషాం క్రియాః సర్వాః దూషయంస్త్యజతు స్వయమ్ ॥286॥**

*286.* *అట్లుగాక ఈ జ్ఞాని జిజ్ఞాసువుల నడుమ ఉండుట సంభవించినచో అట్టి కర్మలయందలి దోషములను చూపుచు తాను కూడా కర్మత్యాగము చేయవలెను. చూ. కైవల్య ఉప. 3; మహానారాయణ ఉప. 10.5; గీత 18.66.*

**అవిద్వదనుసారేణ వృత్తిర్బుద్ధస్య యుజ్యతే ।**
**స్తనన్ధయానుసారేణ వర్తతే తత్పితా యతః ॥287॥**

*287.* *ఇంకా చనుబాలు వదలని శిశువుల ఇష్టానుసారము తండ్రి నడచుకొనునట్లు, అజ్ఞానుల ఇష్టానుసారము కృపాళువైన జ్ఞాని నడచుకొనుట తగినదే.*

**అదిక్షిప్తస్తాడితో వా బాలేన స్వపితా తదా ।**
**న క్లిశ్నాతి న కుప్యేత బాలం ప్రత్యుత లాలయేత్ ॥288॥**

*288.* *శిశువుల తన పట్ల అగౌరవము చూపినా, కొట్టినా వారి తండ్రి కించపడడు, కోపింపడు. కాగా వారిని లాలించును.*

**నిన్థితః స్తూయమానో వా విద్వానజ్ఞైర్న నిన్దతి ।**
**న స్తౌతి కింతు తేషాం స్యాద్యథా బోధస్తథాచరేత్ ॥289॥**

*289.* *అజ్ఞానులు తనను స్తుతించినా, నిందించినా జ్ఞాని ప్రతిగా వారిని నిందింపడు స్తుతింపడు. కాగా వారికి జ్ఞానము కలుగునట్లు ప్రవర్తించును.*

**యేనాయం నటనేనాత్ర బుధ్యతే కార్యమేవ తత్ ।**
**అజ్ఞ ప్రబోధాన్నై వాన్యత్కార్యమస్త్యత్ర తద్విదః ॥290॥**

*290.* *అజ్ఞానులతో వారికి జ్ఞానోదయము కలుగునట్లుగ జ్ఞాని ప్రవర్తింపవలెను. అజ్ఞానులకు బోధ కలిగించుట తప్ప జ్ఞానులకు ఈ లోకమున కార్యమేమీ లేదు.*

**కృత కృత్యయా తృప్తః ప్రాప్తప్రాప్యతయా పునః ।**
**తృప్యన్నేవం స్వమనసా మన్యతేఽసౌ నిరన్తరమ్ ॥291॥**

*291. చేయవలసినదంతా చేసి పొందవలసిన దంతా పొంది సంతృప్తుడైన జ్ఞాని నిరంతరము తనయందిట్లను కొనును. అవ. 26.*

**గమనిక:** 291–297వ శ్లోకము వరకు 14వ ప్రకరణమున ఆవర్తింప బడినవి (58–64). *అవధూత. ఉన. 26-32.*

**ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమఞ్జసా వేద్మి ।**
**ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్ ॥292॥**

*292. ధన్యుడను! కృతార్థుడను! దేశకాలాద్యపరిచ్ఛిన్నమైన ప్రత్యగాత్మను నిరంతరము సాక్షాత్తుగ తెలిసికొనుచున్నాను. (తత్ఫలమైన) బ్రహ్మానందము నాకు యథాతథముగ స్ఫురించుచున్నది! అవ. 27.*

**ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం న వీక్షేఽద్య ।**
**ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాపి ॥293॥**

*293. ధన్యుడను! ధన్యుడను! సాంసారిక దుఃఖములు నేడు నాకు లేవు. నా యజ్ఞాన మెచ్చటికో పారద్రోలబడినది. అవ. 28.*

**ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కిఞ్చిత్ ।**
**ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్ ॥294॥**

*294. ధన్యుడను! ధన్యుడను! నాకిక కర్తవ్యమేమీ లేదు. పొందదగిన దంతా సమకూడినది. అవ. 29.*

**ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే ।**
**ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః ॥295॥**

*295. ధన్యుడను! ధన్యుడను! ఈ లోకమున నా సంతృప్తికి సాటి ఏమున్నది! ధన్యుడను. చరితార్థుడను. మరల మరల ధన్యుడను. అవ. 30.*

**వ్యాఖ్య:** ఆనందసంప్లవమున మునుగుచు బుద్ధుడు బోధివృక్షము చెంత వరుసగా ఏడు దినములు పరిక్రమించుచుండెనని విందుము.

**అహో పుణ్య మహో పుణ్యం ఫలితం ఫలితం దృఢమ్ ।**
**అస్య పుణ్యస్య సంపత్తేరహో వయమహో వయమ్ ॥296॥**

*296. ఆహా! ఏమి నా పుణ్యము! ఎంత శాశ్వతముగ నది ఫలించినది! ఇంత పుణ్యసంపన్నులమైన మేము ఎంత భాగ్యవంతులము! అవ. 31.*

**అహో శాస్త్రమహో శాస్త్రమహో గురురహో గురుః ।**
**అహో జ్ఞానమహో జ్ఞానమహో సుఖమహో సుఖమ్ ॥297॥**

*297. ఆహా: శాస్త్రమెంత అద్భుతము! గురువెంతటి మహాత్ముడు! ఈ జ్ఞానమెంత అద్భుతము! ఈ సుఖమెంత అనంతము! అవ. 32.*

**తృప్తిదీపమిమం నిత్యం యేఽనుసన్దధతే బుధా ।**
**బ్రహ్మానన్దే నిమజ్జన్తస్తే తృప్యన్తి నిరన్తరమ్ ॥298॥**

*298. ఈ తృప్తిదీపము అనుదినము అధ్యయనము చేయు విద్వాంసులు బ్రహ్మానందమున మునుగుచు నిరంతరముగ తృప్తినొందుదురు.*

## సప్తమ ప్రకరణము: సమాప్తము

# అష్టమము : కూటస్థదీప ప్రకరణము

**ఖాదిత్యదీపితే కుడ్యే దర్పణాదిత్యదీప్తివత్ ।**
**కూటస్థభాసితో దేహో ధీస్థజీవేన భాస్యతే ।1॥**

*1. ఆకాశమునందలి సూర్యునిచే ప్రకాశితమగుచున్న గోడ అద్దమునందలి సూర్యునిచే ప్రకాశితమగునట్లు కూటస్థము (ప్రత్యగాత్మ)చే దీపితమైన శరీరము బుద్ధియందలి జీవునిచే ప్రకాశింపబడుచున్నది.*

**వ్యాఖ్య:** ప్రత్యగాత్మకు జీవునకు గల భేదము వివరింపబడుచున్నది. చూ. ఉపదేశసాహస్రి 15-33.

**అనేక దర్పణాదిత్య దీప్తీనాం బహుస్థిషు ।**
**ఇతరా వ్యజ్యతే తాసామభావేపి ప్రకాశతే ॥2॥**

*2. అనేకములగు అద్దముల నుండి సూర్యప్రకాశము గోడపై పడినపుడు ఆ ప్రతిఫలిత ప్రకాశముల నడుమనున్న స్థలములపై ఆకాశమునందలి సూర్య ప్రకాశము ప్రకాశించుచుండును. ప్రతిఫలిత ప్రకాశములు లేకపోయినా గోడపై సూర్యప్రకాశము ప్రకాశించుచునే ఉండును.*

**వ్యాఖ్య:** అట్లే శరీరము ప్రతిఫలనమైన చిదాభాస (జీవుని) చేతను కూటస్థమైన ప్రత్యగాత్మ చేతను ప్రకాశితమగుచున్నది.

**చిదాభాస విశిష్టానాం తథానేకధియామసౌ।**
**సన్ధిం ధియామభావం చ భాసయన్ ప్రవివిచ్యతామ్ ॥3॥**

*3. అదేవిధముగ చిదాభాస ప్రతిఫలించే బుద్ధివృత్తుల నడుమను, బుద్ధి వృత్తులతో చిదాభాస లేనపుడు కూడా (గాఢ సుషుప్తిలో) కూటస్థమగు ప్రత్యగాత్మ స్వయంప్రకాశముగ ఉండును. కనుక చిదాభాస ప్రత్యగాత్మ భిన్నమని తెలియవలెను.*

**వ్యాఖ్య:** సంధి రెండు విధములు. రెండు బుద్ధి వృత్తుల నడుమ ఉండునది రెండు అవస్థల నడుమ ఉండునది. రెండు ఆలోచనలకు, పదములకు, నడుమనున్న వ్యవధానము సంధి. జాగ్రత్ స్వప్నసుషుప్తి మూర్ఛాదుల నడుమ ఉన్నది కూడా సంధి అనబడును.

**ఘటైకాకారధీస్థా చిద్ఘటమేవావభాసయేత్ ।**
**ఘటస్య జ్ఞాతతా బ్రహ్మచైతన్యేనావభాసతే ॥4॥**

*4. ఘటము యొక్క ఆకారమును పొందిన బుద్ధియందలి చిదాభాసుడు ఘటమున్నదని తెలియజేయును. ఇట్లు ఘటమున్నదని తెలియుటను తెలుపునది బ్రహ్మచైతన్యము, కూటస్థము.*

**వ్యాఖ్య:** బుద్ధి ఘటాదుల ఆకారమును పొందుటను బుద్ధివృత్తులందురు. ఈ బుద్ధివృత్తులు ఆయా విషయముల గూర్చిన అజ్ఞానమును తొలగించును. అపుడు ఆ విషయజ్ఞానము బ్రహ్మచైతన్యము చేతనే, అది జ్ఞానస్వరూపమగుటచే తెలియ బడుచున్నది.

బుద్ధివృత్తులు చంచలములగుటచే వాని వల్ల కలిగే అజ్ఞాన నిరాసము కూడా క్షణికమే అగును. స్థిరమగు కూటస్థస్పర్శచే జ్ఞానమునకు స్థిరత్వము కలుగుచున్నది.

**అజ్ఞాతత్వేన భాతోఽయం ఘటో బుద్ధ్యుదయాత్పురా ।**
**బ్రహ్మణైవోపరిష్టాత్తు జ్ఞాతత్వేనేత్యసౌ భిదా ॥5॥**

*5. బుద్ధివృత్తి ఏర్పడుటకు పూర్వము 'ఘటమున్నదని తెలియదు' అని బ్రహ్మచైతన్యము చేతనే తెలియును. బుద్ధివృత్తి ఏర్పడిన పిదప ఆ బ్రహ్మ చైతన్యము చేతనే 'ఘటమున్నదని తెలియును' అని తెలియును.*

**వ్యాఖ్య:** విషయముల గూర్చి తెలిసిననే గదా ప్రయోజనము. ఆ తెలియుట బ్రహ్మచైతన్యము వలననే అయినచో ఇక బుద్ధి వలని ఆవశ్యకత ఏమి అనే ప్రశ్న సమాధానింపబడినది. బ్రహ్మము జ్ఞానస్వరూపము కనుక అది స్వప్రకాశమై విషయముల గూర్చి అజ్ఞానమునుగాని జ్ఞానమునుగాని తెలుపుచుండును. విషయముల జ్ఞానాజ్ఞానముల సిద్ధికి మాత్రమే బుద్ధివృత్తి ఆవశ్యకమగును. ఒక

విషయము గూర్చిన బుద్ధి వృత్తి ఏర్పడక పూర్వము, ఆ విషయమును గూర్చిన మన అజ్ఞానము మనకు తెలియును. ఆ బుద్ధివృత్తి ఏర్పడిన పిదప ఆ విషయమును గూర్చిన జ్ఞానము మనకు తెలియును. ఈ జ్ఞానము తెలియుటయే పరిభాషయందు 'జ్ఞానస్య జ్ఞాతతా' అనబడినది.

**చిదాభాసాన్త ధీవృత్తిర్ జ్ఞానం లోహాన్తకున్తవత్ ।**
**జాడ్యమజ్ఞానమేతాభ్యాం వ్యాప్తః కుమ్భో ద్విధోచ్యతే ॥6॥**

*6. చిదాభాసతో కూడిన బుద్ధివృత్తి జ్ఞానము. ఇది ఇనుప ములుకు గల అంకుశము వంటిది. జడత్వమనగా అజ్ఞానము. ఈ రెండింటి చేత, ఘటము ఒకటియే అయినా, తెలిసిన కుండ తెలియని కుండ అని రెండు విధములుగా చెప్పబడుచున్నది.*

**వ్యాఖ్య:** జాడ్యము అనగా జడత్వము బ్రహ్మేతర విషయముల లక్షణము. దాని వల్ల విషయములు తమంత తామే తెలియబడక ఉండును. అనగా విషయములను ఈ జడత, అజ్ఞానము, లేపనము వలె ఆవరించి ఉండును. ఈ లేపనమును దూసికొని విషయమును గూర్చిన బుద్ధివృత్తి కలిగినపుడు జ్ఞానము కలుగును. బుద్ధి కూడా జడమే అగుటచే బుద్ధియందున్న చిదాభాసయే ఇనుప ములుకు వలె అజ్ఞాన లేపనమును భేదింపగలుగును.

ఇట్లు చిదాభాసతో కూడిన బుద్ధివృత్తి ఆవరించుట, జాఢ్యము, అజ్ఞానము, ఆవరించుట అనే రెండు విధములుగ అన్ని విషయములు తెలియబడుచున్నవి.

అజ్ఞానము గూర్చి ఒకమాట. అది కేవలము జ్ఞానము లేకపోవుట మాత్రమే కాదు. అది స్వయముగ ఇతర ఉన్న వస్తువుల వలె పని చేయుచు, జ్ఞానమును అడ్డగించుచున్నది కనుక. కాని అది వాస్తవముగ ఉన్నచో దానికి నాశనము లేదు (చూ. భగవద్గీత 2.16). అయినా జ్ఞానముచే అజ్ఞానము నశించుచున్నది. కనుక అజ్ఞానము వాస్తవముగ ఉన్నదని గాని లేదని గాని చెప్పుటకు వీలుకాదు. అది సత్ అని గాని అసత్ అని గాని నిర్వచింప వీలులేదు. 'సదసద్భ్యామ్ అనిర్వచనీయమ్' అది ఉన్నట్లు కన్పించునది మాత్రమే. 'భావరూపమ్'

**అజ్ఞాతో బ్రహ్మణా భాస్యో జ్ఞాతః కుంభస్తథా న కిమ్ ।**
**జ్ఞాతత్వజననేనైవ చిదాభాస పరిక్షయః ॥7॥**

*7. తెలియని కుండ బ్రహ్మముచే తెలియబడినచో తెలిసిన కుండ మాత్రము బ్రహ్మము చేతనే ఏల తెలియబడదు అని అంటే అది కూడా బ్రహ్మము*

*చేతనే తెలియబడుచున్నది. చిదాభాస ఆ అజ్ఞానావరణమును తొలగించి జ్ఞాతత్వమును కలిగించిన వెంటనే ఆగిపోవును. చూ. 7.; 8-4; 8.6; మానసోల్లాసము 3-6.*

**ఆభాస హీనయా బుద్ధ్యా జ్ఞాతత్వం నైవ జన్యతే ।**
**తాదృగ్బుద్ధేర్విశేష కో మృదాదేః స్యాద్వికారిణః ॥8॥**

*8. చిదాభాస లేని బుద్ధి జ్ఞాతత్వమును కలిగింపజాలదు. ఇతర వికార వంతములైన మట్టి వంటి జడముల కంటె బుద్ధికి గల విశేషమేమి? ఏమీ లేదని భావము.*

**వ్యాఖ్య:** అజ్ఞాతత్వమును అజ్ఞానము కలిగించినట్లే జ్ఞాతత్వమును బుద్ధి మాత్రమే ఏల కల్పింపదు? చిదాభాస యొక్క ఆవశ్యకత ఏమి అని సంశయము. మట్టి వలె బుద్ధి కూడా జడమే కనుక అది స్వయముగ విషయములను ప్రకాశింప జేయజాలదు. స్వయంప్రకాశమైన బ్రహ్మపు లక్షణములను తనపై ఆరోపించుకొనిన చిదాభాసయే అట్లు ప్రకాశింపజేయగలుగును. కాని చిదాభాస జడమైన బుద్ధి యందే ఉండుట వలన దాని జడత్వము కూడ చిదాభాసయందు ఆరోపితమగు చున్నది. అందుచే అది అజ్ఞానావరణమును తొలగించి జ్ఞాతత్వమును కలిగించుటచే ఆగిపోవుచున్నది. ఆ జ్ఞాతత్వమునకు స్థిరత స్వప్రకాశమగు బ్రహ్మముచే కలుగును. బుద్ధి యొక్క జడత్వము క్రింది శ్లోకమున నిరూపింపబడుచున్నది. చూ. మానసోల్లాసము 1.22-23.

**జ్ఞాత ఇత్యుచ్యతే కుంభో మృదా లిప్తో న కుత్రచిత్ ।**
**ధీమాత్ర వ్యాప్తకుంభస్య జ్ఞాతత్వం నేష్యతే తథా ॥9॥**

*9. మట్టిపూయబడుట చేతనే కుండ తెలియబడినదని ఎచ్చట గాని అనరు. అట్లే చిదాభాస లేని బుద్ధివృత్తిచే మాత్రము ఆవరింపబడిన కుండ తెలియబడినదని చెప్పబడదు.*

**జ్ఞాతత్వం నామ కుంభే తచ్చిదాభాస ఫలోదయః ।**
**న ఫలం బ్రహ్మచైతన్యం మానాత్ప్రాగపి సత్త్వతః ॥10॥**

*10. కనుక జ్ఞాతత్వమనగా కుండయందు చిదాభాసతో కూడిన బుద్ధి వృత్తి ఫలించుట. బ్రహ్మచైతన్యము ఇట్టి ఫలమనుటకు వీలు లేదు. ఏలన అది కుండ తెలియబడుటకు పూర్వము కూడా దానియందు ఉన్నదే.*

**వ్యాఖ్య:** చూ. 8.3, 5. బ్రహ్మచైతన్యము ఎప్పుడును ఎల్లయెడలను ఉన్నదే. అజ్ఞానముచే అది ఆవరింపబడియున్నది. ఈ అజ్ఞానావరణమును తొలగించుటకే చిదాభాస. బ్రహ్మము అఖండమైన జ్ఞానస్వరూపము. చిదాభాస భిన్నవిభిన్న విషయ జ్ఞాన కారణము.

**పరాగర్థప్రమేయేషు యా ఫలత్వేన సమ్మతా ।**
**సంవిత్సవేహ మేయోఽర్థో వేదాంతోక్తి ప్రమాణతః ॥11॥**

*11. బాహ్యావిషయములకు సంబంధించినంత వరకు, జ్ఞానక్రియకు ఫలమైన చైతన్యమే (సంవిత్) జ్ఞేయవిషయమని వేదాంతమున ప్రమాణ గ్రంథములు చెప్పును. (అని సురేశ్వరాచార్యుల వార్తికము. ఈ వార్తికము లభ్యము కాలేదు.)*

**ఇతివార్తిక కారేణ చిత్సాదృశ్యం వివక్షితమ్ ।**
**బ్రహ్మచిత్ఫలయోర్భేదః సాహస్ర్యాం విశ్రుతోయతః ॥12॥**

*12. ఇచ్చట వార్తికకారుడు 'సంవిత్' పదముచే చెప్పదలచినది ఫలమైన ప్రతిఫలిత చైతన్యము (చిదాభాస) మాత్రమే. బ్రహ్మచైతన్యము కాదు. బ్రహ్మ చైతన్యమునకు ఫలచైతన్యమునకు గల భేదము ఉపదేశసహస్రి యందు (14.7, 8) శ్రీశంకరభగవత్పాదులే స్పష్టము చేసిరి.*

**వ్యాఖ్య:** వార్తికమునందలి 'సంవిత్' శబ్దమునకు బ్రహ్మచైతన్యమని అర్థమా ఫలచైతన్యమని అర్థమా అని వివాదము. గ్రంథకర్త ఫలచైతన్యమే 'సంవిత్' శబ్దానికి అర్థమని దృఢపరచుచు శ్రీశంకరుల ఉపదేశమునే ప్రమాణంగా చూపుచున్నారు. అవచ్ఛేదవాదులు 'సంవిత్' శబ్దమునకు అర్థము బ్రహ్మచైతన్యమే అందురు. గ్రంథకర్త అభాసవాదమును బోధించును. ఇది ప్రతిబింబవాదములో ఒక భేదము.

**ఆభాస ఉదితస్తస్మాద్ జ్ఞాతత్వం జనయేద్ఘటే ।**
**తత్పునర్ బ్రహ్మణాభ్యాస్య మజ్ఞాతత్వవదేవ హి ॥13॥**

*13. కనుక ఘటమును గూర్చిన జ్ఞాతత్వమునకు కారణము ఘటముపై కలిగిన చైతన్య ప్రతిఫలనమే, అభాసయే. ఈ జ్ఞాతత్వమును గూర్చిన జ్ఞానము, అజ్ఞాతత్వమును గూర్చిన జ్ఞానము వలనే, బ్రహ్మచైతన్యముచే కలుగును.*

**ధీవృత్త్యాభాసకుంభానాం సమూహో భాస్యతే చిదా ।**
**కుంభమాత్ర ఫలత్వాత్స ఏకః ఆభాసతః స్ఫురేత్ ॥14॥**

*14. బుద్ధివృత్తి, ఘటముపై చిదాభాస, ఘటము, ఈ మూడంటిని బ్రహ్మచైతన్యము ప్రకాశింపజేయును. చిదాభాస ఘటముపై మాత్రమే ఫలించుట చేత అది ఘటమును మాత్రమే ప్రకాశింపజేయును.*

**వ్యాఖ్య:** అనాది కాలము నుండి బ్రహ్మచైతన్యము సర్వావస్థలయందు ప్రకాశించుచు సకలమును ప్రకాశింపజేయుచునే ఉన్నది. అయినా ఇంతవరకు ప్రకాశింపని ఘటము తటాలున ఇప్పుడు ప్రకాశించుటకు ఒక విశేషకారణము ఉండవలెను గదా! ఆ విశేష కారణమే ఫలచైతన్యము.

**చైతన్యం ద్విగుణం కమ్భే జ్ఞాతత్వేన స్ఫురత్యతః ।**
**అన్యైఽనువ్యవసాయాఖ్య మాహురేతద్యథోదితమ్ ॥15॥**

*15. కనుక ఘటజ్ఞానమున రెండు చైతన్యములున్నవి. ఒకటి బ్రహ్మ చైతన్యము రెండవది బుద్ధివృత్తితో కూడిన చైతన్యాభాస (చిదాభాస). బ్రహ్మచైతన్యమునే నైయాయికులు అనువ్యవసాయమని అంటారు.*

**వ్యాఖ్య:** నైయాయికుల (తార్కికుల) మతమున ఇంద్రియములు పని చేసి మనస్సున తగిన వికారము కలుగుట వలన 'ఇది ఘటము' అనే జ్ఞానము కలుగును. ఇట్లు ఇంద్రియములు మనస్సు పనిచేసిన పిదప మాత్రమే 'ఇది ఘటము అని నాకు తెలియును' అనే జ్ఞానము కలుగును. మొదటి జ్ఞానమును అనుసరించి ఈ జ్ఞానము కలుగుచున్నది కనుక దీనిని అనువ్యవసాయమని వారందురు. ఈ అనువ్యవసాయము మనస్సు యొక్క లక్షణమని వారి మతము.

వేదాంతులు దీనికి సమ్మతింపరు. అనువ్యవసాయమును గూర్చిన జ్ఞానము కలుగుటకు మరియొక్క అను-అనువ్యవసాయము ఆవశ్యకమై అనవస్థాదోషము ప్రాప్తించును. ఈ అనువ్యవసాయము సర్వాధారమైన బ్రహ్మచైతన్యమే అని వేదాంతుల సిద్ధాంతము.

**ఘటోఽయ మిత్యసావుక్తిరాభాసస్య ప్రసాదతః ।**
**విజ్ఞాతో ఘట ఇత్యుక్తిర్బ్రహ్మానుగ్రహతో భవేత్ ॥16॥**

*16. 'ఇది ఘటము' అనే జ్ఞానమునకు చిదాభాస కారణము. 'ఇది ఘటమని నాకు తెలియును' అనే జ్ఞానమునకు బ్రహ్మచైతన్యము కారణము.*

**వ్యాఖ్య:** చిదాభాస ఘటము యొక్క జ్ఞానము (ఘటజ్ఞానము)ను కలిగించును. బ్రహ్మచైతన్యము ఘటజ్ఞానము యొక్క జ్ఞానము కలిగించును. చూ. 8.4.

**ఆభాస బ్రహ్మణీ దేహాద్బహిర్యద్వద్వివేచితే ।**
**తద్వదాభాస కూటస్థౌ వివిచ్యేతాం వపుష్యపి ॥17॥**

*17. శరీరమునకు బాహ్యములగు విషయములందు చిదాభాస బ్రహ్మములను వివేచించి తెలిసికొనినట్లే శరీరమునందు కూడా కూటస్థము నుండి చిదాభాసను వేరుపరచి తెలిసికొనవలెను.*

**అహంవృత్తౌ చిదాభాసః కామక్రోధాదికేషు చ ।**
**సంవ్యాప్య వర్తతే తప్తే లోహే వహ్నిర్యథా తథా ॥18॥**

*18. 'నేను' అనే వృత్తి (భావము) నందు కామక్రోధాదులందు చిదాభాస వ్యాపించి ఉండును, కాలిన ఇనుమునందు అగ్ని వ్యాపించి ఉండునట్లే.*

**వ్యాఖ్య:** అన్ని భావములు (వృత్తులు) 'అహం' భావమును ఆశ్రయించే ఉండును. ఈ అహంభావము మిథ్యయగు చిదాభాస యొక్క మొదటి ఆవిర్భావము. 'నేను' ఉన్న తరువాత 'నాకు' కామక్రోధాదులు కలుగును. కనుక ఈ అహంవృత్తిని పరిశీలించినచో మిథ్యయగు చిదాభాసపోయి సత్యమగు బ్రహ్మము మిగులును.

**స్వమాత్రం భాసయేత్తప్తం లోహం నాన్యత్కదాచన ।**
**ఏవమాభాస సహితా వృత్తయః స్వస్వభాసికాః ॥19॥**

*19. ఎర్రగా కాలిన ఇనుము తనను మాత్రమే ప్రకాశింపజేయును గాని ఇతరములను ప్రకాశింపజేయలేదు. అట్లే చిదాభాసతో కూడిన బుద్ధివృత్తులు తమను మాత్రమే అనగా తాము ఆవరించిన విషయములను మాత్రమే ప్రకాశింప జేయగలవు.*

**వ్యాఖ్య:** చిదాభాస వ్యాపింపని బుద్ధివృత్తులు గుర్తింపబడవు. చూ. మాన సోల్లాసము 4. 2.

**క్రమాద్విచ్ఛిద్య విచ్ఛిద్య జాయన్తే వృత్తయోఽఖిలాః ।**
**సర్వా అపి విలీయన్తే సుప్తిమూర్ఛా సమాధిషు ॥20॥**

*20. సకల వృత్తులు క్రమముగ ఒకదాని తరువాత ఒకటిగ వ్యవధానములతో కలుగుచుండును. సుషుప్తి మూర్ఛసమాధి అవస్థలయందు లయమునొందుచుండును.*

**సన్ధయోఽఖిల వృత్తీనా మభావాశ్చావ భాసితాః ।**
**నిర్వికారేణ యేనాసౌ కూటస్థ ఇతి చోచ్యతే ॥21॥**

*21.* అన్ని వృత్తుల నడుమనున్న వ్యవధానములను వృత్తులు లేకుండుటను కూడా ప్రకాశింపజేయుచు స్వయముగ ఏ వికారము లేకుండు చైతన్యమే కూటస్థమనబడుచున్నది. చూ. *3*వ శ్లోకము.

**ఘటే ద్విగుణచైతన్యం యథా బాహ్యే తథాన్తరే ।**
**వృత్తిష్వపి తతస్తత్ర వైశద్యం సన్ధితోఽధికమ్ ॥22॥**

*22.* బాహ్యమగు ఘటమునందు రెండు చైతన్యములు ఉన్నట్లే ఆంతరములగు బుద్ధివృత్తులందు కూడా రెండు చైతన్యములున్నవి. అందుచే వ్యవధానముల కంటె వృత్తులు విశదముగ కన్పించును.

**జ్ఞాతతాజ్ఞాతతే న స్తో ఘటవద్వృత్తిషు క్వచిత్ ।**
**స్వస్య స్వేనాగృహీతత్వాత్తాభిశ్చాజ్ఞాన నాశనాత్ ॥23॥**

*23.* బుద్ధివృత్తులు ఘటము వలె జ్ఞానమునకు గాని అజ్ఞానమునకు గాని విషయములు కాజాలవు. వృత్తులు తమను తామే గ్రహింపజాలవు కనుక అవి జ్ఞానమునకు విషయములు కాజాలవు. కాని వాని వలన ఇతర విషయము లను గూర్చిన అజ్ఞానము నశించుచుండుట చేత అవి అజ్ఞానమునకు కూడా విషయములు కాజాలవు. అనగా ఘటము మొదలగు వానివలె బుద్ధి వృత్తులు తెలిసినవనిగాని తెలియనివనిగాని చెప్పజాలము.

**వ్యాఖ్య:** ఘటాదుల జ్ఞానమునందు వలె వృత్తుల జ్ఞానమునకు కూటస్థ చైతన్యము అవసరము కదా అనే సంశయము వారింపబడినది. చిదాభాసతో కూడిన వృత్తులు స్వయంప్రకాశములగుచున్నవి కనుక మరల కూటస్థము అనావశ్యకము. చూ. 19వ శ్లోకము. చిదాభాసకు కూటస్థమునకు గల భేదము క్రింద చెప్పబడుచున్నది.

**ద్విగుణీకృతచైతన్యే జన్మనాశానుభూతితః ।**
**అకూటస్థం తదన్యత్తు కూటస్థమవికారతః ॥24॥**

*24.* చిదాభాసయందు ప్రతిఫలిత చైతన్యము దానికి ఆధారమగు కూటస్థ చైతన్యము అనే రెండు చైతన్యములు గలవు. ప్రతిఫలిత చైతన్యము జన్మించుచు నశించుచుండుట వలన అది కూటస్థము కాజాలదు. ఎట్టి వికారములు గాని లేని రెండవదే కూటస్థ చైతన్యము.

**వ్యాఖ్య:** కూటస్థము అవిద్య యొక్క సాత్త్వికాంశమగు అంతఃకరణముపై

ప్రతిఫలించుట చేత చిదాభాస ఏర్పడుచున్నది. బాహ్యమగు జగత్తు అవిద్య యొక్క తామసాంశ వికారము. బాహ్యాంతరమగు అవిద్యకు కూడా ఆధారము కూటస్థమే. కనుక చిదాభాసయందు సాక్షిగనున్నను జగత్తుకు ఆశ్రయముగనున్నను కూటస్థము అవికారి. చిదాభాస అవిద్యా వికారమగు అంతఃకరణపు జననమరణములతో గూడి ఉండుటచే అది వికారి. అందుచే చిదాభాస కూటస్థము కాదు.

**అన్తః కరణ తద్వృత్తిసాక్షీ త్యాదావనేకథా ।**
**కూటస్థ ఏవ సర్వత్ర పూర్వాచార్యై ర్వినిశ్చితః ।25॥**

*25. 'అంతఃకరణమునకు దాని వృత్తులకు సాక్షి' మొదలైన అనేక వాక్యములచే పూర్వాచార్యులు సర్వత్ర కూటస్థమే సాక్షియని నిశ్చయించిరి. చూ. వాక్యవృత్తి 11; ప్ర.4.31.*

**ఆత్మాభాసాశ్రయాశ్చైవం ముఖాభాసాశ్రయా యథా ।**
**గమ్యన్తే శాస్త్రయుక్తిభ్యామిత్యాభాసశ్చవర్ణితః ॥26॥**

*26. కూటస్థము (ఆత్మ), ఆభాస (ప్రతిఫలనము), ఆశ్రయము (మనస్సు) అనే ఈ మూడూ ముఖము, ప్రతిబింబము అద్దముల వలె సంబంధపడి ఉన్నవని శాస్త్రము నుండి, తర్కము చేతను తెలియుచున్నది. ఈ విధముగ చిదాభాస కూడా వర్ణింపబడినది. చూ. ఉపదేశసాహస్రి 18-43, 109.*

**బుద్ధ్యవచ్ఛిన్న కూటస్థో లోకాన్తరగమాగమౌ ।**
**కర్తుం శక్తో ఘటాకాశ ఇవాభాసేన కిం వద ॥27॥**

*27. బుద్ధిచే అవచ్ఛిన్నమైన (పరిమితమైన) కూటస్థమే లోకాంతరములకు పోవుచు వచ్చుచుండ (జనించి మరణింప) గలదుగదా, కుండచే పరిమితమైన ఆకాశము సంచరించునట్లే. కనుక ఇక చిదాభాస యొక్క ఆవశ్యకత ఏమి?*

**వ్యాఖ్య:** ఇది అవచ్ఛేదవాదుల ఆక్షేపము. చూ. కఠ ఉప: 2.24.

**శృణ్వసఙ్గః పరిచ్ఛేదమాత్రాజ్జీవో భవేన్నహి ।**
**అన్యథా ఘటకుడ్యాద్యైరవచ్ఛిన్నస్య జీవతా ॥28॥**

*28. (సమాధానము) వినుము. కూటస్థమునకు పరిచ్ఛేదము కల్పించినంత మాత్రమున జీవుడు ఏర్పడడు. కానిచో కుండ గోడ మొదలగు వానిచే పరిచ్ఛిన్నమైన కూటస్థము కూడా జీవుడు కావలసి వచ్చును.*

**న కుడ్యసదృశీ బుద్ధిః స్వచ్ఛత్వాదితి చేత్తథా ।**
**అస్తునామ పరిచ్ఛేదే కిం స్వాచ్ఛ్యేన భవేత్తవ ॥29॥**

*29. బుద్ధి స్వచ్ఛమగుటచే గోడవంటిది కాదనినచో స్వచ్ఛమే కానిమ్ము. పరిచ్ఛేదము యొక్క స్వచ్ఛత-మలినతల వలన కలుగు లాభమేమున్నది?*

**వ్యాఖ్య:** పరిచ్ఛిన్నమైన కూటస్థమే జీవుడనినచో మనకు పరిచ్ఛేదకముతోనే పనిగాని దాని గుణదోషములతో ఏమి పని?

**ప్రస్థేన దారుజన్యేన కాంస్య జన్యేన వా నహి ।**
**విక్రేతుస్తండులాదీనాం పరిమాణం విశిష్యతే ॥30॥**

*30. కుంచము కర్రతో జేసినదైనను కంచుతో జేసినదైనను బియ్యము మొదలగువాని కొలతయందు విక్రేతకు విశేషమేమీ లేదు గదా.*

**పరిమాణావిశేషేఽపి ప్రతిబింబో విశిష్యతే ।**
**కాంస్యే యది తదా బుద్ధావప్యాభాసో భవేద్బలాత్ ॥31॥**

*31. పరిమాణమునందు విశేషము లేకున్నను కంచుకుంచమునందు ప్రతిబింబం ఏర్పడుననినచో అంతఃకరణపు లక్షణమట్టిదే, కూటస్థచైతన్యమును చిదాభాసగా ప్రతిఫలించునని తప్పనిసరిగ అంగీకరింపవలెను.*

**వ్యాఖ్య:** పరిచ్ఛేదకము యొక్క విశేషము ప్రతిఫలనమును ఒసగుటయేయైన అంతఃకరణమునందు చిత్‌ప్రతిఫలనము (ఆభాస) లభించుచునే ఉన్నది. పరిచ్ఛేద వాదము నిరర్థకమగుచున్నది. చూ. మానసోల్లాసము 4.4.10.

**ఈషద్భాసన మాభాసః ప్రతిబిమ్బస్తథా విధః ।**
**బిమ్బలక్షణహీనః సన్బిమ్బవద్భాసతే స హి ॥32॥**

*32. పూర్తిగా భాసింపక కొంచెముగా భాసించుట ఆభాస. అట్టిదే ప్రతిబింబము కూడా. అది బింబలక్షణములు లేకున్నను బింబము వలెనే భాసించును.*

**వ్యాఖ్య:** విషయజ్ఞానమునందు చిదాభాస యొక్క ఆవశ్యకతను నిరూపించుట గ్రంథకర్త ఉద్దేశము. ఆభాసమైనను ప్రతిబింబమైనను ఈ ఆవశ్యకత సిద్ధించుటచే వానియందలి సూక్ష్మభేదములను గ్రంథకర్త ఉపేక్షించుచున్నాడు.

**నసంగత్వ వికారాభ్యాం బిమ్బలక్షణ హీనతా ।**
**స్ఫూర్తి రూపత్వమేతస్య బిమ్బవద్భాసనం విదుః ॥33॥**

*33.* చిదాభాస విషయములతో సంగమించినదీ వికారశీలమూ అగుటచే దాని యందు అసంగము నిర్వికారము అగు కూటస్థపు (బింబము) లక్షణములు లేవు. కాని కూటస్థము వలె ప్రకాశరూపమగుటచే బింబము వలె భాసించును, కూటస్థము వలె భాసించును అని బుధజనుల అభిప్రాయము.

**నహి ధీబావ భావిత్వాదాభాసోఽస్తి ధియః పృథక్ ।**
**ఇతి చేదల్ప మేవోక్తం ధీరప్యేవం స్వదేహతః ॥34॥**

*34.* చిదాభాస బుద్ధి కంటే భిన్నము కాదు, దాని అస్తిత్వము బుద్ధిపైనే ఆధారపడుటచేత అనినచో ఇందు గొప్పగా చెప్పబడినదేమీ లేదు. బుద్ధి యొక్క అస్తిత్వము కూడా శరీరముపై ఆధారపడుటచే బుద్ధి శరీరము కంటే భిన్నము కాదు, అనవలసి వచ్చును.

**దేహే మృతేఽపి బుద్ధిశ్చేచ్ఛాస్త్రాదస్తి తథాసతి ।**
**బుద్ధేరన్యశ్చిదాభాసః ప్రవేశ శ్రుతిషు శ్రుతః ॥35॥**

*35.* దేహము మరణించినా బుద్ధి ఉన్నదని శాస్త్రము ద్వారా తెలియుననినచో అట్లే బుద్ధి కంటె భిన్నమైన చిదాభాస ప్రవేశము కూడా శ్రుతులందు వినుచున్నాను. చూ. బృహదారణ్యాక ఉప.*4.4.2;* ఐతరేయ ఉప: *1.3.12;* తైత్తిరీయ ఉప. *2.6.*

**ధీయుక్తస్య ప్రవేశశ్చేన్నైతరేయే ధియః పృథక్ ।**
**ఆత్మా ప్రవేశం సంకల్ప్య ప్రవిష్ట ఇతి గీయతే ॥36॥**

*36.* బుద్ధి, చిదాభాస ఒక్కసారిగ శరీరమును ప్రవేశించుననినచో అట్లు కాదు. ఐతరేయోపనిషత్తునందు బుద్ధి కంటె వేరుగ ఆత్మ సంకల్పించి శరీరమున ప్రవేశించెనని చెప్పబడినది.

**వ్యాఖ్య:** బుద్ధి శరీరమున ప్రవేశించే ప్రశ్నయే లేదు, అది శరీరములోని భాగమగుట చేత. చూ. ఐతరేయ ఉప. 1.3.11-12

**కథం న్విదం సాక్షదేహం మదృతే స్యాదితీరణాత్ ।**
**విదార్య మూర్ధసీమానం ప్రవిష్టః సంసరత్యయమ్ ॥37॥**

*37.* 'ఇంద్రియ సహితమైన ఈ శరీరము నేను లేక ఎట్లు జీవింపగలదు?' అని తలచి ఆత్మ మూర్ధమును చీల్చి శరీరమున ప్రవేశించి అవస్థాత్రయమున సంసరింపసాగెనని ఉపనిషత్తు చెప్పును.

**కథం ప్రవిష్టో౽సంఙ్గశ్చే త్సృష్టిర్వాస్య కథం వద ।**
**మాయికత్వం తయోస్తుల్యం వినాశశ్చ సమస్తయోః ॥38॥**

*38.* అసంగమైన ఆత్మ ఎట్లు ప్రవేశించెననినచో సృష్టియైనను అసంగమైన ఆత్మ ఎట్లుచేసెనో చెప్పుము. రెండును మాయచే కల్పింపబడినవనినచో మాయను నశింపజేసినపుడు అవి కూడా నశించును.

**సముత్థాయైష భూతేభ్యస్తాన్యేవాను వినశ్యతి ।**
**విస్పష్టమితి మైత్రేయ్యై యాజ్ఞవల్క్య ఉవాచ హి ॥39॥**

*39.* ప్రజ్ఞాన ఘనమైన ఆత్మయే పంచభూతాత్మకమైన శరీరమును ఉపాధిగ చేసికొని జీవత్వము పొందుచున్నది. ఆ శరీరము ఆత్యంతికముగ నశించినపుడు ఆత్మ జీవత్వమును కూడా వదలుకొనుచున్నది అని మైత్రేయికి యాజ్ఞవల్క్యుడు చెప్పెను. బృహదారణ్యక ఉప. *4.5.13.*

**అవినాశ్యయ మాత్మేతి కూటస్థః ప్రవివేచితః ।**
**మాత్రాసంసర్గ ఇత్యేవమసఙ్గత్వస్య కీర్తనాత్ ॥40॥**

*40.* 'ఈ ఆత్మకు వినాశము లేదు' అని శ్రుతి కూటస్థమును ఇతరముల నుండి వివేచించుచున్నది. దేహాదులతో సంసర్గము లేనిది అని ఆత్మ యొక్క అసంగత్వమును శ్రుతి గానము చేయుచున్నది. బృహదారణ్యక ఉప. *4.5.14, 4.3.15, 4.4.22.*

**జీవాపేతం వావ కిల శరీరం మ్రియతే న సః ।**
**ఇత్యత్ర న విమోక్షా౽ర్థః కిన్తు లోకాన్తరే గతిః ॥41॥**

*41.* జీవుడు తొలగినచో శరీరము మరణించును జీవుడు మరణింపడు అని పలికే శ్రుతి జీవునకు మోక్షమును సూచింపదు. మరొక లోకమునకు పోవుటను సూచించును. ఛాందోగ్య ఉప. *6.11.3,* బృహదారణ్యక ఉప. *4.4.2-4.*

**నాహం బ్రహ్మేతి బుధ్యేత స వినాశీతి చేన్నతత్ ।**
**సామానాధికరణ్యస్య బాధాయామపి సమ్భవాత్ ॥42॥**

*42. (ఆక్షేపము) బ్రహ్మము అవినాశి అగుటచే వినాశియగు జీవుడు అహం బ్రహ్మాస్మి (నేనే బ్రహ్మమును) అని ఎట్లనగలడు? (సమాధానము) తాను జీవుడనను భావము నశింపగ (బాధ చెందగా) తాను బ్రహ్మమునని తెలుసు కొనగలడు. జీవునకు బ్రహ్మమునకు ముఖ్య సామానాధికరణ్యము లేకపోయినా, ఇట్లు బాధసామానాధికరణ్యము సంభవమే.*

**వ్యాఖ్య:** రెండు నామవాచకములు ఒకే విభక్తి కలిగి ఉండి ఒకే విషయమును సూచించినచో వానికి సమానాధికరణ్యము కలదందురు. అవి రెండూ సర్వ విధముల ఒకటియే ఐనచో అది ముఖ్య సామానాధికరణము అనబడును. 'ఘటము నందలి ఆకాశము ఘటము వెలుపలి ఆకాశమే' అనినపుడు ఘటాకాశమునకు మహాకాశమునకు ముఖ్యసామానాధికరణ్యము చెప్పబడినది.

రెండింటిలో ఒకటి లోపించి రెండవది మాత్రమే నిలిచినచో అది బాధసామానాధికరణము అనబడును. 'ఆ పామే ఈ త్రాడు' అనినపుడు పామునకు త్రాడునకు ఏకత్వము చెప్పబడుటలేదు. ఇంతకాలము పాముగ కన్పించినది నిజమునకు త్రాడు మాత్రమే అని ఉద్దేశము. అనగా 'పాము' లోపించి 'త్రాడు' మిగులుచున్నది. ఇట్లు వాస్తవత్వము లోపించుటయే 'బాధ'.

జీవుడు బ్రహ్మమే అనినపుడు ఇంతకాలము జీవుడని భావించినది వాస్తవమునకు, బ్రహ్మమేయని ఉద్దేశము. అనగా జీవభావము లోపించును, బాధజెందును, వాస్తవికతను కోలుపోవును. బ్రహ్మభావము మాత్రము మిగులును. కనుక జీవ బ్రహ్మముల సంబంధము బాధ సామానాధికరణ్యమని చెప్పబడినది.

**యోఽయం స్థాణుః పుమానేష పుంధియా స్థాణుధీరివ ।**
**బ్రహ్మాస్మీతి ధియాఽశేషాహ్యహం బుద్ధిర్నివర్త్యతే ॥43॥**

*43. 'ఆ స్థాణువు ఈ పురుషుడే' అనునపుడు పురుషుడనే భావముచే స్థాణువనే భావమునకు లోపము కలుగుచున్నది. అట్లే నేను బ్రహ్మమును అనే బోధన కలిగినపుడు నేను అహం అనే భావము తొలగిపోవును. నైష్కర్మ్యసిద్ధి 2.29*

**నైష్కర్మ్య సిద్ధావప్యేవమాచార్యైః స్పష్టమీరితమ్ ।**
**సామానాధికరణ్యస్య బాధార్థత్వమతోఽస్తు తత్ ॥44॥**

*44. నైష్కర్మ్యసిద్ధియందు సురేశ్వరాచార్యులు ఈ విషయమునే*

స్పష్టముగ చెప్పిరి. జీవుని గూర్చిన భ్రాంతి (బుద్ధితోడి తాదాత్మ్యము) తొలగినపుడు జీవబ్రహ్మములు ఒక సత్తయే అని తెలియును. కనుక జీవబ్రహ్మములకు బాధార్థముననే సామానాధికరణ్యము చెప్పబడినదని నిశ్చయము.

**సర్వం బ్రహ్మేతి జగతా సామానాధికరణ్యవత్ ।**
**అహం బ్రహ్మేతి జీవేన సామానాధికృతిర్భవేత్ ॥45॥**

***45.*** *మరొక శ్రుతియందు 'సర్వము బ్రహ్మమే' అని జగత్తుతో బ్రహ్మమునకు సామానాధికరణ్యము చెప్పబడినది. జగత్తుగా కన్పించుచున్న ఈ సర్వము కూడా వాస్తవమునకు బ్రహ్మమే. అట్లే అహం బ్రహ్మాస్మి అనే వాక్యమున జీవబ్రహ్మముల ఐక్యత బాధసామానాధికరణ్యము ద్వారా సూచింపబడినది. ఛాందోగ్య ఉప. 3.14.1; బృహదారణ్యక ఉప. 1.4.0.*

**సామానాధికరణ్యస్య బాధార్థత్వం నిరాకృతమ్ ।**
**ప్రయత్నతో వివరణే కూటస్థస్య వివక్షయా ॥46॥**

***46.*** *పంచపాదికా వివరణమున అహం బ్రహ్మాస్మి అనే వాక్యమున బాధ సామానాధికరణ్యము అతి ప్రయత్నముతో నిరాకరింపబడినది. కారణ మేమన అహం శబ్దమునకు చిదాభాసయని కాక కూటస్థమని ఆ గ్రంథకర్త అర్థము చెప్పెను.*

**వ్యాఖ్య:** అందు జీవబ్రహ్మముల ఐక్యత గాక కూటస్థబ్రహ్మముల ఐక్యతను ఉద్దేశించి ముఖ్యసామానాధికరణ్యము స్వీకరింపబడినది.

**శోధితస్త్వంపదార్థో యః కూటస్థో బ్రహ్మరూపతామ్ ।**
**తస్య వక్తుం వివరణే తథోక్తమితరత్ర చ ॥47॥**

***47.*** *'తత్త్వమసి' అని వాక్యమున ఉపాధులన్నియు తొలగించినచో త్వం పదమునకు కూటస్థమనియే అర్థము. వివరణ తదితర గ్రంథములందు బ్రహ్మముతో ఈ కూటస్థపు ఐక్యతయే చెప్పబడినది.*

**దేహేంద్రియాది యుక్తస్య జీవాభాసభ్రమస్య యా ।**
**అధిష్ఠానచితిః సైషాకూటస్థాత్ర వివక్షితా ॥48॥**

***48.*** *దేహము ఇంద్రియములు చిదాభాస అనెడి భ్రమ అన్నీ ఆరోపింప బడిన అధిష్ఠాన చైతన్యము వేదాంతమునందు కూటస్థమని చెప్పబడినది.*

**జగద్భ్రమస్య సర్వస్య యదధిష్ఠాన మీరితమ్ ।**
**త్రయ్యంతేషు తదత్ర స్యాద్బ్రహ్మశబ్ద వివక్షితమ్ ॥49॥**

*49. జగత్తనెడి భ్రమ సర్వమునకు అధిష్ఠానమైన చైతన్యము బ్రహ్మమని చెప్పబడినది.*

**ఏతస్మిన్నేవ చైతన్యే జగదారోప్యతే యదా ।**
**తదా తదేకదేశస్య జీవాభాసస్య కా కథా ॥50॥**

*50. ఈ చైతన్యముపై సకల జగత్తు ఆరోపింపబడుచుండగా అందొక అల్పాంశమైన జీవుని మాట చెప్పవలయునా?*

**జగత్తదేక దేశాఖ్య సమారోప్యస్య భేదతః ।**
**తత్త్వం పదార్థౌ భిన్నౌస్తో వస్తుతస్త్వేకతా చితేః ॥51॥**

*51. జగత్తు అందలి అంశమైన జీవుడు అనే ఉపాధులను ఆరోపించుట చేత తత్ త్వం అనే పదములు విభిన్న విషయములను సూచించునట్లు తోచును. వాస్తవమునకు అవి రెండూ ఒకే చైతన్యము. భేదము ఉపాధులయందేగాని నిజమునకు లేదు.*

**కర్తృత్వాదీన్బుద్ధిధర్మాన్ స్ఫూర్త్యాఖ్యాం చాత్మరూపతామ్ ।**
**దధద్విభాతి పురత ఆభాసోఽతో భ్రమో భవేత్ ॥52॥**

*52. ప్రతిఫలిత చైతన్యమగు చిదాభాసయందు చైతన్యమనెడి ఆత్మ లక్షణము కర్తృత్వము భోక్తృత్వము మొదలగు బుద్ధిధర్మములు రెండూ కన్పించును. అందుచే అది, చిదాభాస, మాయా కల్పితమైన భ్రమ.*

**కా బుద్ధిః కోఽయమాభాసః కో వాత్మాత్ర జగత్కథమ్ ।**
**ఇత్యనిర్ణయతో మోహ సోఽయం సంసార ఇష్యతే ॥53॥**

*53. ఈ బుద్ధి అనగానేమి? ఆభాస ఎట్టిది? ఆత్మ ఎవరు? ఈ జగత్తు ఇచ్చటి కెట్లు వచ్చినది? ఈ ప్రశ్నలు ఇదమిత్థముగా నిర్ణయింపబడక పోవుటచే అజ్ఞానము ఏర్పడినది. దానినే సంసారమనీ అందురు.*

**బుద్ధ్యాదీనాం స్వరూపం యో వివినక్తి స తత్త్వవిత్ ।**
**స ఏవ ముక్తః ఇత్యేవం వేదాన్తేషు వినిశ్చయః ॥54॥**

*54. బుద్ధి మొదలగు వాని వాస్తవ స్వరూపమును వివేచించి తెలిసికొనిన వ్యక్తియే తత్త్వవిదుడు. అతడే ముక్తుడని వేదాంతపు నిశ్చయము.*

**ఏవం చ సతి బన్ధః స్యాత్క స్యేత్యాది కుతర్కజాః ।**
**విడంబనా దృఢం ఖణ్డ్యాః ఖణ్డనోక్తి ప్రకారతః ॥55॥**

*55. వస్తుస్థితి ఇట్లుండగా 'బంధమెవరికి' మొదలగు కుతర్కములు ఖండన ఖండఖాద్యమున చెప్పబడిన రీతిగా దృఢముగా ఖండింపవలెను.*

**వ్యాఖ్య:** బ్రహ్మమే సత్యమైనచో ఇక బంధమెవరికి మోక్షమెవరికి? ఎవరూ లేనిచో వానిని బోధించే ఉపనిషత్తులు నిరర్థకములు కదా? ఇట్టి ప్రశ్నలకు వేదాంతులిట్లు సమాధింతురు: ఈ ప్రశ్నలకు సమాధానము తెలిసియే అడుగ బడినవా? లేక తెలియకయా? తెలియక అడిగినచో ఆ తెలియమియే అజ్ఞానము, అదియే బంధము. తెలిసియే అడిగినచో ఆ ప్రశ్నలు నిరర్థకములు. మాకు సమాధానము తెలిఽనా నీవేమందువో తెలియక అడిగితిమి అనినచో ఈ తెలియమి కూడా అజ్ఞానమే. కనుక మీరు బంధమునందుండుట స్పష్టమే అని సమాధానము.

కుతర్కములను కుతర్కములతోనే సమాధానింపవలెను. ఖండన ఖండఖాద్యము శ్రీహర్షమిశ్ర విరచితమైన అద్వైత గ్రంథము.

**వృత్తేః సాక్షితయా వృత్తి ప్రాగభావస్య చ స్థితః ।**
**బుభుత్సాయాః తథాజ్ఞోఽస్మీత్యాభాతజ్ఞాన వస్తునః ॥56॥**

*56. మనస్సున ఉదయించే కామాది వృత్తులకు సాక్షిగను అవి ఉదయింపక పూర్వము వాని అభావమునకు సాక్షిగను బుభుత్సకు (తెలిసికొన వలెననే ఇచ్ఛకు) సాక్షిగను దానికి పూర్వము నేను అజ్ఞుడను అని అనుభవింప బడుచున్న అజ్ఞానమునకు సాక్షిగను శివుడే (కూటస్థచైతన్యమే) ఉన్నాడు.*

**వ్యాఖ్య:** శ్రుత్యనుసారముగ తర్కబద్ధముగ కూటస్థమును బుద్ధి మొదలగు వాని నుండి వివేచించి పురాణములందు కూడా ఈ వివేచనము చేయబడినదని చూపుచు శివపురాణము నుండి మూడు శ్లోకములను ఉదాహరించుచున్నాడు.

**అసత్యాలంబనత్వేన సత్యః సర్వజడస్య తు ।**
**సాధకత్వేన చిద్రూపః సదా ప్రేమాస్పదత్వతః ॥57॥**

**ఆనందరూపః సర్వార్థ సాధకత్వేన హేతునా ।**
**సర్వసంబంధవత్త్వేన సంపూర్ణః శివసంజ్ఞితః ॥58॥**

*57 & 58. అసత్యమగు ప్రపంచమునకు ఆధారమగుటచే అది సత్యము. సకల జడపదార్థములను ప్రకాశింపజేయుటచే అది చైతన్య స్వరూపము. సర్వదా*

ప్రేమాస్పదమగుటచే అది ఆనందస్వరూపము. అన్ని విషయములను సిద్ధింప జేయుట చేతను అన్నింటితో ఆధారభూతముగ సంబంధపడుట చేతను అది అనంతము. అదియే శివము.

**ఇతి శైవ పురాణేషు కూటస్థః ప్రవివేచితః ।**
**జీవేశత్వాదిరహితః కేవలః స్వప్రభః శివః ॥59॥**

*59. ఈ విధముగ శైవపురాణములందు, జీవత్వము ఈశత్వము మొదలగునవి లేనిది, అద్వయమైనది స్వయంప్రకాశమైనది సర్వమంగళమైనది అగు కూటస్థము వివేచింపబడినది.*

**మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతత్వతః ।**
**మాయికావేవ జీవేశౌ స్వచ్ఛౌ తౌ కాచకుంభవత్ ॥60॥**

*60. జీవుడు ఈశ్వరుడు ఇరువురును మాయపై బ్రహ్మము యొక్క ప్రతిఫలనములే అని శ్రుతులు చెప్పును. అయినా ఇవి ఇతర మాయాకార్యముల కంటె భిన్నములు, స్వచ్ఛములగుటచేత. గాజుకుండ ఇతరముల కంటె భిన్నమైనట్లే.*

**వ్యాఖ్య:** నృసింహ ఉత్తర తాపనీయ ఉప. 9. జీవుని ఉపాధి రజస్తమస్సులచే మలినమైన సత్త్వము, ఈశ్వరుని ఉపాధి శుద్ధసత్త్వము అగుటచే అవి బ్రహ్మమును చక్కగ ప్రతిఫలింపగలవు.

**అన్నజన్యం మనోదేహాత్ స్వచ్ఛం యద్వత్తథైవ తౌ ।**
**మాయికావపి సర్వ స్మాదన్యస్మాత్ స్వచ్ఛతాం గతౌ ॥61॥**

*61. అన్నముచే ఏర్పడిన మనస్సు దేహము కంటె స్వచ్ఛమైనది. అట్లే జీవేశ్వరులును మాయికులైనను మాయాకార్యములైన ఇతరములన్నింటి కంటెను స్వచ్ఛతను పొందిరి.*

**చిద్రూపత్వం చ సంభావ్యం చిత్త్వేనైవ ప్రకాశనాత్ ।**
**సర్వకల్పన శక్తాయా మాయాయా దుష్కరం నహి ॥62॥**

*62. చైతన్యమునకు మాత్రమే ప్రకాశన శక్తి ఉన్నది. జీవేశ్వరుల యందు ఈ శక్తి కన్పించుటచే అవి చైతన్యస్వరూపములని చెప్పవలెను. సకలమును సృష్టించు శక్తిగల మాయకు దుష్కరమేమీ లేదు.*

**అస్మన్నిద్రాపి జీవేశౌ చేతనౌ స్వప్నగౌ సృజేత్ ।**
**మహామాయా సృజత్యేతావిత్యాశ్చర్యం కిమత్ర తే ॥63॥**

*63.* మన నిద్రయే స్వప్నమునందు చేతనులైన జీవేశ్వరులను సృష్టించుచుండగా మహామాయ వానిని జాగ్రదవస్థయందే సృష్టించుటలో ఆశ్చర్యమేమున్నది? ఏమీ లేదు.

**సర్వజ్ఞత్వాదికం చేశే కల్పయిత్వా ప్రదర్శయేత్ ।**
**ధర్మిణం కల్పయేద్యాఽస్యాః కో భారో ధర్మకల్పనే ॥64॥**

*64.* ఆ మహామాయయే సర్వజ్ఞత్వాది ధర్మములను ఈశ్వరునియందు సృష్టించి ప్రదర్శించును. ధర్మి (ధర్మములను కలిగి ఉండునది)ని సృష్టించు మహామాయకు ధర్మములను సృష్టించుట ఒక భారమా?

**కూటస్థేఽప్యతిశంకా స్యాదితి చేన్మాఽతి శంక్యతామ్ ।**
**కూటస్థమాయికత్వే తు ప్రమాణం న హి విద్యతే ॥65॥**

*65.* కూటస్థమునందు కూడా అతిశంక చేయరాదు. కూటస్థమును కూడా మాయయే సృష్టించినదనుటకు ప్రమాణము లేదు.

**వస్తుత్వం ఘోషయంత్యస్య వేదాంతాః సకలా అపి ।**
**సపత్నరూపం వస్త్వన్యన్న సహంతేఽత్ర కించన ॥66॥**

*66.* కూటస్థము మాత్రమే వాస్తవమని సకల వేదాంతములు ఘోషించుచున్నవి. దాని కంటే భిన్నమైనది మరొకటి కలదనుటకు అవి సహింపవు.

**శ్రుత్యర్థం విశదీకుర్మో న తర్కాద్వచ్మి కించన ।**
**తేన తార్కిక శంకానామత్ర కోఽవసరో వద ॥67॥**

*67.* శ్రుతుల అర్థమును విశదీకరించుచున్నాను. కేవల తర్కముచే ఏమీ చెప్పుటలేదు. ఇచ్చట తార్కికుల సంశయములతో ఏమి పని? ఏమీ లేదు.

**తస్మాత్కుతర్కం సంత్యజ్య ముముక్షుః శ్రుతిమాశ్రయేత్ ।**
**శ్రుతౌ తు మాయా జీవేశౌ కరోతీతి ప్రదర్శితమ్ ॥68॥**

*68.* కనుక ముముక్షువు కుతర్కమును వదలివేసి శ్రుతినాశ్రయింప వలెను. శ్రుతి జీవేశ్వరులను మాయయే సృష్టించెనని చెప్పుచున్నది. నృసింహ ఉత్తరతాపనీయ ఉప.*4.*

**ఈక్షణాదిప్రవేశాంతా సృష్టిరీశకృతా భవేత్ ।**
**జాగ్రదాదివిమోక్షాంతః సంసారో జీవకర్తృకః ॥69॥**

*69.* సృష్టిని సంకల్పించుట మొదలు సృష్టియందు ప్రవేశించుట వరకు ఈశ్వరసృష్టి. జాగ్రదవస్థ మొదలు మోక్షము వరకు గల సంసారము జీవుడు సృష్టించినది. చూ. ప్ర. *6.213; 7.4.*

**అసఙ్గ ఏవ కూటస్థః సర్వదా నాస్య కశ్చన ।**
**భవత్యతిశయస్తేన మనస్యేవం విచార్యతామ్ ॥70॥**

*70.* కూటస్థము సర్వదా అసంగమే. దానికి వికారము లేదు. ఈ విధముగ మనస్సునందు విచారింపవలెను.

**న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః ।**
**న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా ॥71॥**

*71.* (కూటస్థమునకు) మరణము లేదు జన్మము లేదు. బద్ధుడైనవాడు లేడు సాధకుడును లేడు. మోక్షమును కోరువాడు లేడు. మోక్షము పొందినవాడును లేడు. ఇదే పరమసత్యము. చూ. అమృతబిందు ఉప. *10*

**అవాఙ్మనసగమ్యం తం శ్రుతిర్బోధయితుం సదా ।**
**జీవమీశం జగద్వాపి సమాశ్రిత్య ప్రబోధయేత్ ॥72॥**

*72.* వాక్కు చేతను మనస్సు చేతను గ్రహింప శక్యముగాని తత్త్వమును బోధించుటకు జీవుడు జగత్తు ఈశ్వరుడు అనే కల్పనలను ఆశ్రయించి శ్రుతి ప్రయత్నించును.

**యయా యయా భవేత్పుంసాం వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని ।**
**సాసైవ ప్రక్రియేహ స్యాత్సాధ్వీత్యాచార్య భాషితమ్ ॥73॥**

*73.* ఏయే ప్రక్రియచే మానవులకు ప్రత్యగాత్మయందు తత్పరత కలుగునో ఆయా ప్రక్రియే సరియైనదే అని సురేశ్వరాచార్యులనిరి.

**వ్యాఖ్య:** వస్తుతత్త్వము ఒకటియే అని శ్రుతులు బోధింపవలసినపుడు ఒక విధమున చెప్పక వివిధములుగ శ్రుతివాక్యములుండుట ఏల? శ్రోతల గ్రహణశక్తి వివిధములుగ ఉండుట చేత వారికర్థమగు వివిధ రీతులలో శ్రుతి బోధించును. శ్రుతి బోధ్యమగు తత్త్వము ఒకటియే.

**శ్రుతితాత్పర్యమఖిలమబుద్ధ్వా భ్రామ్యతే జడః ।**
**వివేకీ త్వఖిలం బుద్ధ్వా తిష్ఠత్యానంద వారిధౌ ॥74॥**

*74.* మందబుద్ధులు శ్రుతి తాత్పర్యమును సమగ్రముగ తెలియజాలక పరిభ్రమింతురు. వివేకి సమగ్రముగ తెలిసికొని ఆనంద సముద్రమునందు పవ్వళించును.

**మాయామేఘో జగన్నీరం వర్షత్వేష యథా తథా ।**
**చిదాకాశస్య నో హానిర్న వా లాభ ఇతి స్థితిః ॥75॥**

*75.* మాయయనెడి మేఘము జగత్తు అనెడి జలమును ఎట్లైనను వర్షింపనిమ్ము. దాని వలన శుద్ధ చైతన్యమనే ఆకాశమునకు కలుగు హానియు లేదు వచ్చు లాభము లేదు. ఇదియే వస్తుస్థితి.

**ఇమం కూటస్థదీపం యోనుసంధత్తే నిరంతరమ్ ।**
**స్వయం కూటస్థరూపేణ దీప్యతేఽసౌ నిరంతరమ్ ॥76॥**

*76.* ఈ కూటస్థదీపప్రకరణమును నిరంతరముగ అనుసంధానము చేయు పురుషుడు స్వయముగ కూటస్థస్వరూపుడై నిరంతరముగ దీపించును.

**అష్టమ ప్రకరణము: సమాప్తము**

# నవమము : ధ్యాన దీప ప్రకరణము

**సంవాది భ్రమవద్బ్రహ్మతత్త్వోపాస్త్యాపి ముచ్యతే ।**
**ఉత్తరే తాపనీయేఽతః శ్రుతోపాస్తిరనేకధా ॥1॥**

*1. సంవాదిభ్రమచే కార్యరతుడైనవానికి ఫలము లభించినట్లు బ్రహ్మ తత్త్వమును ఉపాసించుటచే కూడ మోక్షము నొందవచ్చును. కనుకనే నృసింహ ఉత్తరతాపనీయ ఉపనిషత్తు నందు పలు విధములైన ఉపాసనలు వర్ణింప బడినవి.*

**వ్యాఖ్య:** సాధన చతుష్టయ సంపన్నులై శ్రవణమననాదులచే బ్రహ్మతత్త్వమును వివేచించి అపరోక్షానుభూతి పొందుటకు సామర్థ్యము లేని వారు బ్రహ్మమును ఉపాసించుటచే కూడా మోక్షము పొందవచ్చును. సంవాది భ్రమ ఎట్టిదో సోదాహరణముగ క్రింది శ్లోకములలో వర్ణింపబడుచున్నది.

**మణి ప్రదీపప్రభయోర్మణిబుద్ధ్యాభిధావతోః ।**
**మిథ్యాజ్ఞానావిశేషేఽపి విశేషోఽర్థక్రియాం ప్రతి ॥2॥**

*2. మణి యొక్క కాంతిని దీపము యొక్క కాంతిని మణియే అని భ్రమించి దానికై పరుగెత్తిన వారిలో మిథ్యాజ్ఞానము వరకు విశేషము లేక పోయినా వారి పరుగు ఫలవంతమగుటలో విశేషమున్నది.*

**వ్యాఖ్య:** మణికాంతిని మణి అని భ్రమించి పరుగెత్తిన వానికి మణి లభించును. భ్రాంతియే ఐనా ఫలవంతమగు భ్రాంతి అగుటచేత ఇది సంవాది భ్రమ అనబడినది.

**దీపోఽపవరకస్యాంతర్వర్తతే తత్ప్రభా బహిః ।**
**దృశ్యతే ద్వార్యథాఽన్యత్ర తద్వద్దృష్టా మణే ప్రభా ॥3॥**

*3.* దీపము గది లోపల ఉన్నది. దాని కాంతి బయట కనిపించు చున్నది. అట్లే మణి యొక్క కాంతి కూడా మరొకచోట కనుపించినది.

**దూరే ప్రభాద్వయం దృష్ట్వా మణిబుద్ధ్యాభిధావతోః ।**
**ప్రభాయాం మణిబుద్ధిస్తు మిథ్యాజ్ఞానం ద్వయోరపి ॥4॥**

*4.* దూరము నుండి ఇరువురు పురుషులు రెండు కాంతులను చూచి ఆ కాంతులే మణులని భ్రమించి వానికై పరుగెత్తిరి. కాంతియే మణియని భావించే మిథ్యాజ్ఞానము ఇరువురకును సమానమే.

**న లభ్యతే మణిర్దీపప్రభాం ప్రత్యభిధావతా ।**
**ప్రభాయాం ధావతావశ్యం లభ్యేత్తైవ మణిర్మణేః ॥5॥**

*5.* దీపకాంతిని గూర్చి పరుగెత్తిన వానికి మణి లభింపదు. కాని మణి కాంతిని గూర్చి పరుగెత్తినవానికి మణి అవశ్యము లభించును.

**దీపప్రభామణిభ్రాంతిర్విసంవాదిభ్రమః స్మృతః ।**
**మణిప్రభామణిభ్రాంతిః సంవాదిభ్రమ ఉచ్యతే ॥6॥**

*6.* దీపకాంతిని మణి అని భ్రమించుట విసంవాది భ్రమ అనబడినది, క్రియాసాఫల్యము లేకపోవుట చేత. మణికాంతిని మణి అని భ్రమించుట సంవాది భ్రమ అనబడినది, దానిని గూర్చిన క్రియ సఫలమగుట చేత.

**బాష్పం ధూమతయా బుద్ధ్వా తత్రాఙ్గారానుమానతః ।**
**వహ్నిర్యదృచ్ఛయా లబ్ధః న సంవాదిభ్రమో మతః ॥7॥**

*7.* మంచును పొగయని భ్రమించి అచ్చట అగ్ని ఉండునని అనుమానించి యాదృచ్ఛికముగా అగ్నిని సంపాదించినచో అది సంవాదిభ్రమ అగును.

**గోదావర్యుదకం గంగోదకం మత్వా విశుద్ధయే ।**
**సంప్రోక్ష్య శుద్ధిమాప్నోతి స సంవాదిభ్రమో మతః ॥8॥**

*8.* గోదావరీ జలమును గంగాజలమని భ్రమించి శుద్ధిని ఆశించి సంప్రోక్షణ చేసికొని శుద్ధిపొందినచో అది సంవాది భ్రమ అగును.

**జ్వరేణాప్తః సన్నిపాతం భ్రాంత్యా నారాయణం స్మరన్ ।**
**మృతః స్వర్గమవాప్నోతి స సంవాది భ్రమో మతః ॥9॥**

*9.* సన్నిపాత జ్వరముచే పలవరించుచు ఒకడు నారాయణ స్మరణము చేసి మరణించి స్వర్గమును పొందినచో అది సంవాది భ్రమ అగును.

**వ్యాఖ్య:** అనగా ఫలప్రాప్తి ఐనచో దానికి కారణమెట్టి అసంగతమైనను సంవాది భ్రమయే అగును.

**ప్రత్యక్షస్యానుమానస్య తథా శాస్త్రస్య గోచరే ।**
**ఉక్తన్యాయేన సంవాదిభ్రమాః సంతి హి కోటిశః ॥10॥**

*10. ప్రత్యక్ష, అనుమాన, శాస్త్రప్రమాణములందు పైన చెప్పబడిన రీతిగా సంవాది భ్రమలు కోట్లకొలది గలవు.*

**అన్యథా మృత్తికాదారుశిలాః స్యుర్దేవతాః కథమ్ ।**
**అగ్నిత్వాదిధియోపాస్యాః కథం వా యోషి దాదయః ॥11॥**

*11. అట్లుగానిచో మట్టి కొయ్య రాళ్ళు దేవతలెట్లైనవి? యువతి మొదలగునవి అగ్ని మొదలైనవిగా ఉపాసింపబడుటెట్లు?*

**వ్యాఖ్య:** చూ. ఛాందోగ్య ఉప. 3వ అధ్యాయము, 5. 8. 1; మృత్తికాదులు దేవతలు కాకపోయినను దేవభావముతో పూజింపబడి ఫలమునిచ్చుచున్నవి. పంచాగ్ని విద్యయందు స్త్రీ అగ్నిగా ఉపాసింప బడును.

**అయథావస్తువిజ్ఞానాత్ఫలం లభ్యత ఈప్సితమ్ ।**
**కాకతాలీయతః సోఽయం సంవాది భ్రమ ఉచ్యతే ॥12॥**

*12. శాస్త్రవిహితమైనను కాకపోయినను ఒక మార్గమున కాకతాలీయ న్యాయమున ఇష్టార్థ సిద్ధియైనచో అది సంవాది భ్రమ అనబడును.*

**స్వయం భ్రమోఽపి సంవాదీ యథా సమ్యక్ఫలప్రదః ।**
**బ్రహ్మతత్త్వోపాసనాపి తథా ముక్తి ఫలప్రదా ॥13॥**

*13. స్వతః భ్రమయే ఐనను సంవాదిభ్రమ ఫలప్రదమైనట్లే బ్రహ్మ తత్త్వమును ఉపాసించుట కూడా అట్లే ముక్తి ఫలము నొసగును.*

**వ్యాఖ్య:** బ్రహ్మమునకు కల్పించిన రూపములు మిథ్యయైనను అట్టి బ్రహ్మపు ఉపాసన ముక్తి నొసగును. ప్రతీకల ద్వారా తప్ప బ్రహ్మమును ఉపాసింపసాధ్యము కాదు.

**వేదాంతేభ్యో బ్రహ్మతత్త్వమఖండైక రసాత్మకమ్ ।**
**పరోక్ష మవగమ్యైతదహ మస్మీత్యుపాసతే ॥14॥**

*14. వేదాంతముల నుండి అఖండము ఏకరసము అగు బ్రహ్మ*

తత్త్వమును పరోక్షముగ తెలిసికొని ఇదియే (ఈ బ్రహ్మమే) నేను అని ఉపాసింపవలెను.

**ప్రత్యగ్వ్యక్తిమనుల్లిఖ్య శాస్త్రాద్విష్ణ్వాది మూర్తివత్ ।**
**అస్తి బ్రహ్మేతి సామాన్యజ్ఞానమత్ర పరోక్షధీః ॥15॥**

*15.* ప్రత్యగాత్మయే బ్రహ్మమని తెలిసికొనక శాస్త్రాది పఠనజన్యమైన విష్ణువు మొదలగు దేవతల వలె బ్రహ్మము కలదు అనే సామాన్య జ్ఞానము ఇచ్చట పరోక్ష జ్ఞానమనబడినది.

**చతుర్భుజాద్యవగతావపి మూర్తిమనుల్లిఖన్ ।**
**అక్షైః పరోక్షజ్ఞాన్యేవ న తదా విష్ణుమీక్షతే ॥16॥**

*16.* విష్ణువు చతుర్భుజుడు మొదలగు జ్ఞానము శాస్త్రము నుండి ఎంత వివరముగా తెలిసినను సాక్షాత్తుగ విష్ణుదర్శనము కానంత వరకు, కన్నులతో చూడనంత వరకు, అది పరోక్ష జ్ఞానమే అగును.

**పరోక్షత్వాపరాధేన భవేన్నాతత్త్వవేదనమ్ ।**
**ప్రమాణేనైవ శాస్త్రేణ సత్త్వమూర్తేర్విభాసనాత్ ॥17॥**

*17.* పరోక్షమైనంత మాత్రమున ఈ జ్ఞానము దోషయుక్తము కాజాలదు. ప్రమాణములగు శాస్త్రముల చేతనే విష్ణువు యొక్క మూర్తి వర్ణింపబడినది.

**సచ్చిదానందరూపస్య శాస్త్రాద్భానేఽప్యనుల్లిఖన్ ।**
**ప్రత్యఞ్చ సాక్షిణం తత్తు బ్రహ్మ సాక్షాన్న వీక్షతే ॥18॥**

*18.* శాస్త్రము నుండి బ్రహ్మము సచ్చిదానందాత్మకమని తెలిసికొనినను తన యందలి సాక్షియగు ప్రత్యగాత్మయే బ్రహ్మమని తెలియు వరకు బ్రహ్మమును అపరోక్షముగ తెలిసికొనలేడు.

**శాస్త్రోక్తేనైవ మార్గేణ సచ్చిదానంద నిశ్చయాత్ ।**
**పరోక్షమపి తద్జ్ఞానం తత్త్వజ్ఞానం న తు భ్రమః ॥19॥**

*19.* శాస్త్రోక్త మార్గమున సచ్చిదానంద బ్రహ్మమును తెలిసికొనినచో ఆ జ్ఞానము పరోక్షమైనను తత్త్వజ్ఞానమే, భ్రమ కాదు.

**బ్రహ్మ యద్యపి శాస్త్రేషు ప్రత్యక్త్వేనైవ వర్ణితమ్ ।**
**మహావాక్యైస్తథాప్యేతద్ దుర్బోధమవిచారిణః ॥20॥**

*20.* బ్రహ్మము ప్రత్యగాత్మయే అని శాస్త్రములందును మహావాక్యము లందును వర్ణింపబడినను ఈ విషయము విచారణ లేక అవగతము కాదు.

**దేహాద్యాత్మత్వవిభ్రాంతౌ జాగ్రత్యాం న హఠాత్పుమాన్ ।**
**బ్రహ్మాత్మత్వేన విజ్ఞాతుం క్షమతే మందధీత్వతః ॥21॥**

*21.* మందబుద్ధిచే దేహాదులే ఆత్మ అనే భ్రాంతి ఉన్నంత వరకు మానవులు హఠాత్తుగ బ్రహ్మమే ఆత్మయని గ్రహింపజాలరు.

**బ్రహ్మమాత్రం సువిజ్ఞేయం శ్రద్ధాలోః శాస్త్రదర్శినః ।**
**అపరోక్ష ద్వైతబుద్ధిః పరోక్షాద్వైతబుద్ధ్యనుత్ ॥22॥**

*22.* ప్రత్యక్షముగ ద్వైతమును చూచుటతో పరోక్షముగ అద్వైతమును ఎరుగుటకు విరోధము లేదు కనుక శ్రద్ధాళువు శాస్త్రపారంగతుడు అగు పురుషుడు సులభముగనే బ్రహ్మమును గూర్చి పరోక్షముగ తెలిసికొనగలడు.

**అపరోక్షశిలాబుద్ధిర్న పరోక్షేశతాం నుదేత్ ।**
**ప్రతిమాదిషు విష్ణుత్వే కో వా విప్రతిపద్యతే ॥23॥**

*23.* ప్రత్యక్షముగ శిలావిగ్రహమును చూచుచున్నను అది ఈశ్వరుడను పరోక్షజ్ఞానము తొలగదు. ప్రతిమాదులయందు విష్ణు భావమును ఏ భక్తుడు కాదనును?

**అశ్రద్ధాలోరవిశ్వాసో నోదాహరణ మర్హతి ।**
**శ్రద్ధాలోరేవ సర్వత్ర వైదికే ష్వధికారతః ॥24॥**

*24.* శ్రద్ధారహితుల అవిశ్వాసము గణింప పనిలేదు. వైదిక కర్మలన్నీ నిర్వర్తించే అధికారము, అర్హత, శ్రద్ధావంతులకే కలదు.

**సకృదాప్తోపదేశేన పరోక్షజ్ఞాన ముద్భవేత్ ।**
**విష్ణుమూర్త్యుపదేశో హి న మీమాంసా మపేక్షతే ॥25॥**

*25.* ఆప్తపురుషుల ఉపదేశముచే అరుదుగా బ్రహ్మము గూర్చిన పరోక్ష జ్ఞానము కలుగవచ్చును. విష్ణుమూర్తి స్వరూపము తెలియుటకు మీమాంసా శాస్త్రము పఠింప పనిలేదు కదా.

**కర్మోపాస్తీ విచార్యేతే అనుష్ఠేయవినిర్ణయాత్ ।**
**బహుశాఖా విప్రకీర్ణం నిర్ణేతుం కః ప్రభుర్నరః ॥26॥**

*26.* *అనుసరణయందు సంశయములుండుట వలన కర్మలు ఉపాసనలు శాస్త్రమునందు చర్చింపబడినవి. కానిచో అనేక శాఖలయందు చెదరి ఉన్న నిర్దేశములను సంగ్రహించుటకు మానవమాత్రుడెవడు సమర్థుడగును?*

**నిర్ణీతోఽర్థః కల్పసూత్రైర్గ్రథిస్తావతాస్తికః ।**
**విచార మంతరేణాపి శక్తోనుష్ఠాతు మఞ్జసా ॥27॥**

*27.* *అట్టి కర్మలు ఉపాసనలు చక్కగా అర్థనిర్ణయము చేయబడి కల్పసూత్రములందు పొందుపరపబడినవి. ఆస్తికుడైన పురుషుడు వానిని ఏ విచారము లేకయే అనుష్ఠింపవచ్చు.*

**వ్యాఖ్య:** శిక్ష, కల్పము, నిరుక్తము, వ్యాకరణము, ఛందము జ్యోతిషము అని వేదమునకు ఆరు అంగములు. కల్పమునందు ఆరు ఉపాంగములను జైమిని, ఆశ్వలాయన, ఆపస్తంబ, బోధాయన, కాత్యాయన, వైఖానస ఋషులు రచించిరి.

**ఉపాస్తీనామనుష్ఠాన మార్షగ్రంథేషు వర్ణితమ్ ।**
**విచారాక్షమమర్త్యాశ్చ తచ్ఛ్రుత్వోపాసతే గురోః ॥28॥**

*28.* *ఉపాసనలను అనుష్ఠించే విధములు ఇతర గ్రంథములందు ఋషులు వర్ణించిరి. విచారణ చేయు సామర్థ్యము లేని మానవులు గురువు నుండి వానిని విని ఉపాసింతురు.*

**వేదవాక్యాని నిర్ణేతుమిచ్ఛన్మీమాంసతాం జనః ।**
**ఆప్తోపదేశమాత్రేణహ్యనుష్ఠానంతు సంభవేత్ ॥29॥**

*29.* *వేదవాక్యములకు అర్థము నిర్ణయింపగోరే మానవులు మీమాంస చేయుదురుగాక. కర్మానుష్ఠానము ఆప్తపురుషుల (గురువుల) ఉపదేశము చేతనే చేయవచ్చు.*

**బ్రహ్మసాక్షాత్కృతిస్త్వేవం విచారేణ వినా నృణామ్ ।**
**ఆప్తోపదేశమాత్రేణ న సంభవతి కుత్రచిత్ ॥30॥**

*30.* *కాని బ్రహ్మమును గూర్చిన అపరోక్ష జ్ఞానము విచారణ లేక గురూపదేశ మాత్రమున ఎచ్చటను కలుగదు.*

**వ్యాఖ్య:** విచారణము అనగా విమర్శనాయుతమైన మననము ఏకాగ్రమైన ధ్యానము కూడా. చూ. వివేకచూడామణి 13,15.

**పరోక్ష జ్ఞాన మశ్రద్ధా ప్రతిబధ్నాతి నేతరమ్ ।**
**అవిచారోఽ పరోక్షస్య జ్ఞానస్య ప్రతిబంధకః ॥31॥**

*31.* పరోక్షజ్ఞానము కలుగుటకు అశ్రద్ధయే ఆటంకము. విచారణ చేయ లేకపోవుట అపరోక్ష జ్ఞానమునకు ఆటంకము. చూ. వివేకచూడామణి *11;* అపరోక్షానుభూతి *11.*

**విచార్యాప్యాపరోక్ష్యేణ బ్రహ్మాత్మానం న వేత్తి చేత్ ।**
**అపరోక్ష్యావసానాత్ భూయో భూయో విచారయేత్ ॥32॥**

*32.* విచారణ చేసి కూడా బ్రహ్మాత్మైక్యము అపరోక్షముగ తెలియనిచో అపరోక్షజ్ఞానము కలుగు వరకు మరల మరల విచారింపవలెను.

**విచారయన్నామరణం నైవాత్మానం లభేత చేత్ ।**
**జన్మాంతరే లభేతైవ ప్రతిబంధక్షయే సతి ॥33॥**

*33.* మరణము వరకు విచారించినను ఆత్మజ్ఞానము కలుగనిచో జన్మాంతరమున ప్రతిబంధములు తీరగా లభింపనే లభించును.

**ఇహ వాఽ ముత్ర వా విద్యేత్యేవం సూత్రకృతోదితమ్ ।**
**శృణ్వంతోఽ ప్యత్ర బహవో యన్న విద్యురితి శ్రుతిః ॥34॥**

*34.* ఈ జన్మము నందైనను మరుజన్మమునందైనను అపరోక్షజ్ఞానము కలుగునని బ్రహ్మసూత్రకారుడు చెప్పెను. అద్వైతసత్యమును వినియు ఈ జన్మమున సాక్షాత్కరించుకొననివారు అనేకులని శ్రుతియు చెప్పును. చూ. బ్రహ్మసూత్రములు *3.4.51;* కఠ ఉప. *2.7*

**గర్భ ఏవ శయానః సన్వామదేవోఽ వ బుద్ధవాన్ ।**
**పూర్వాభ్యస్తవిచారేణ యద్వదధ్యయనాదిషు ॥35॥**

*35.* పూర్వజన్మమున అభ్యసించిన విచారణ బలముచే గర్భము నందుండగనే వామదేవునకు బ్రహ్మాత్మైక్య బోధ కలిగెను. అధ్యయనాదు లందు కూడా ఇట్టి ఫలితములను చూచుచుందుము. చూ. ఐతరేయ ఉప. *2.5*

**బహువారమధీతేఽ పి యదానాయాతి చేత్పునః ।**
**దినాంతరేఽ నధీత్యైవ పూర్వాధీతం స్మరేత్పుమాన్ ॥36॥**

*36.* పలుమార్లు చదివినా జ్ఞాపకమునకు రాని పాఠము మరొకనాడు చదువకనే గుర్తునకు వచ్చును, పూర్వము చదివి ఉండుట చేత.

**కాలేన పరిపచ్యంతే కృషిగర్భాదయో యథా ।**
**తద్వదాత్మవిచారోఽపి శనైః కాలేన పచ్యతే ॥37॥**

*37. పైర్లు, గర్భము మొదలగునవి యథాకాలమున పంటకు వచ్చునట్లే ఆత్మవిచారణ కూడా నిదానముగ యథాకాలమున పక్వమునకు వచ్చును.*

**పునః పునర్విచారేఽపి త్రివిధ ప్రతిబంధతః ।**
**న వేత్తి తత్త్వమిత్యేతద్వార్తికే సమ్యగీరితమ్ ॥38॥**

*38. మరల మరల విచారణ చేసినా మూడు విధముల ప్రతిబంధకముల వలన తత్త్వజ్ఞానము కలుగదు. శ్రీ సురేశ్వరాచార్యులు తమ వార్తికమున ఈ విషయమును స్పష్టముగా చెప్పిరి.*

**వ్యాఖ్య:** ఆ వార్తిక శ్లోకముల తాత్పర్యము 39 నుండి 45 వరకు చెప్పబడు చున్నది. 39, 40 శ్లోకములు సంబంధవార్తికమున 294,295. వార్తిక సారమున 203 నుండి 206 వరకు ఇచ్చట 41 నుండి 45 వరకు చెప్పబడినవి.

**కుతస్తద్ జ్ఞానమితి చేత్తద్ధి బంధ పరిక్షయాత్ ।**
**అసావపి చ భూతో వా భావీ వా వర్తతేఽథ వా ॥39॥**

*39. (మునుపు కలుగని) తత్త్వజ్ఞానము ఇప్పుడేల కలుగుచున్నదనినచో భూత భవిష్య వర్తమానములైన ఆటంకములు పూర్తిగ తొలగినంతనే జ్ఞానము కలుగును.*

**అధీతవేదవేదార్థోఽప్యత ఏవ న ముచ్యతే ।**
**హిరణ్యనిధిదృష్టాంతాదిదమేవ హి దర్శితమ్ ॥40॥**

*40. కనుకనే వేదమును వేదార్థమును చక్కగా అధ్యయనము చేసినా మోక్షము కలుగదు. దాచిపెట్టబడిన సువర్ణనిధి ఉదాహరణముచే ప్రతి బంధకములు ఉండుటచే జ్ఞానము కలుగదని చూపబడినది.*

**వ్యాఖ్య:** ఛాందోగ్య ఉప. 8.3.2. బంగారు బిందెలు పూడ్చి ఉంచబడిన నేలపై అనుదినము నడచుచున్నను అచ్చట బంగారము కలదని అతనికి తెలియక పోవచ్చును.

**అతీతేనాపి మహిషీస్నేహేన ప్రతిబంధతః ।**
**భిక్షుస్తత్త్వం న వేదేతి గాథా లోకే ప్రగీయతే ॥41॥**

*41.* పూర్వము తనకు తన గేదెపై గల స్నేహము వలన పిదప సన్న్యసించి భిక్షువైనను ఆ స్నేహము వదలనందున అతనికి తత్త్వజ్ఞానము కలుగలేదని పురాణములందు చదువుదుము.

**అనుసృత్య గురుః స్నేహం మహిష్యాం తత్త్వముక్తవాన్ ।**
**తతో యథావద్వేదైష ప్రతిబంధస్య సంక్షయాత్ ॥42॥**

*42.* అది తెలిసిన గురువు గేదె ఉపాధిగా గల బ్రహ్మమును గూర్చి ఉపదేశించెను. అపుడు గేదెయందలి స్నేహమనే ఆటంకము తొలగగా భిక్షువునకు జ్ఞానోదయమయ్యెను.

**ప్రతిబంధో వర్తమానో విషయాసక్తిలక్షణః ।**
**ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః ॥43॥**

*43.* మందబుద్ధి, వితండవాదము, విపరీతభావనయగు ఆత్మ యొక్క కర్తృత్వభోక్తృత్వములందు దృఢవిశ్వాసము, విషయభోగములందు ఆసక్తి అనునవి వర్తమానములగు ప్రతిబంధములు.

**శమాద్యైః శ్రవణాద్యైశ్చ తత్ర తత్రోచితైః క్షయమ్ ।**
**నీతేఽస్మిన్ ప్రతిబంధేఽతః స్వస్య బ్రహ్మత్వ మశ్నుతే ॥44॥**

*44.* శమదమాదుల అభ్యాసము చేతను శ్రవణమననాదుల చేతను ఆయా ప్రతిబంధములు నశింపగా ప్రత్యగాత్మయే బ్రహ్మమని తెలిసికొనును. చూ. బృహదారణ్యక ఉప.*4.4.23; 2.4.5;* వివేక చూడామణి *22-27, 69,70.*

**ఆగామి ప్రతిబంధశ్చ వామదేవే సమీరితః ।**
**ఏకేన జన్మనాక్షీణో భరతస్య త్రిజన్మభిః ॥45॥**

*45.* మరుజన్మలను కలిగించే ప్రారబ్ధశేషము ఆగామి లేక భావి ప్రతిబంధము. వామదేవమహర్షికి అది ఒక జన్మమున తొలగెను. భరతునకు మూడు జన్మములు పట్టెను.

**యోగభ్రష్టస్య గీతాయామతీతే బహుజన్మని ।**
**ప్రతిబంధక్షయః ప్రోక్తో న విచారోఽప్యనర్థకః ॥46॥**

*46.* భగవద్గీతయందు ఈ జన్మమున ముక్తినొందని యోగి బహు జన్మముల అనంతరమైనా ప్రతిబంధములను తొలగించుకొనునని చెప్ప

*బడినది. ప్రతిబంధములు తొలగగనే ముక్తి కలుగుట చేత విచారణ నిష్ఫలము నిరర్థకము కాదు. చూ. భగవద్గీత 6.41-45. 47 నుండి 50 వరకు .*

**ప్రాప్య పుణ్యకృతాన్ లోకానాత్మతత్త్వవిచారతః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే సాభిలాషోఽభిజాయతే ॥47॥**

*47. ఆత్మ తత్త్వవిచారబలమున స్వర్గాది పుణ్యలోకములను అనుభవించి ఇంకా భోగేచ్ఛ ఉన్నచో శుచిమంతులు ధనవంతులు అయిన తల్లిదండ్రులకు జనించును.*

**అథవా యోగినామేవకులే భవతి ధీమతాం ।**
**నిఃస్పృహో బ్రహ్మతత్త్వస్య విచారాత్తద్ధి దుర్లభమ్ ॥48॥**

*48. లేదా, భోగేచ్ఛ లేక, అత్యంతమగు వైరాగ్యమున్నచో ఆత్మ విచారణ దక్షులగు యోగుల కుటుంబముననే జన్మించును. ఇట్టి జన్మము అల్ప పుణ్యముచే లభింపకపోవుటచే దుర్లభము.*

**తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్ ।**
**యతతే చ తతో భూయస్తస్మాదేతద్ధి దుర్లభమ్ ।49॥**

*49. ఇట్టి జన్మమున పూర్వజన్మమునందు సంపాదించిన తత్త్వవిచార సంబంధమగు బుద్ధిని మరల పొందును. అంత మాత్రమే గాక మునుపటి కంటే తీవ్రమగు ప్రయత్నము చేయును. ఈ కారణము చేతనే ఇట్టి జన్మము దుర్లభము.*

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**
**అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్ ॥50॥**

*50. ఇష్టములేకున్నను అతడు పూర్వాభ్యాస బలమున పురోగతి చెందును. ఇట్లనేక జన్మములందు చేసిన ప్రయత్నము వలన తత్త్వజ్ఞాన సంపన్నుడై మోక్షము నొందును.*

**బ్రహ్మలోకాభివాంఛాయాం సమ్యక్సత్యాం నిరుధ్య తామ్ ।**
**విచారయేద్య ఆత్మానం న తు సాక్షాత్కరోత్యయమ్ ॥51॥**

*51. బ్రహ్మలోకానుభవమును గూర్చి తీవ్రమగు కోరిక ఉన్నను దానిని అణచి ఆత్మవిచారణము చేసిన మోక్షము లభింపదు.*

**వ్యాఖ్య:** మరొక విధమైన ఆగామి ప్రతిబంధకము సూచింపబడినది. ముక్తికి కోరికలు లేకుండుట వలన అర్హత కలుగనేగాని వానిని అణచుట వలన కాదు. చూ. ముండక ఉప. 3.2.1–2

**వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా ఇతి శాస్త్రతః ।**
**బ్రహ్మలోకే స కల్పాంతే బ్రహ్మణా సహ ముచ్యతే ॥52॥**

*52. అట్టి కోరికలు గలవారు, వేదాంతమునందలి అర్థమును దృఢముగ గ్రహించినవారు, బ్రహ్మలోకమునకేగి అచ్చట నుండి కల్పాంతమున (నాలుగు యుగములు గడచిన పిదప) బ్రహ్మతో కూడా ముక్తులగుదురు. చూ. ముండక ఉప. 3.2.6; బృహదారణ్యక ఉప. 6.2.15*

**కేషాంఞ్చిత్స విచారోఽపి కర్మణా ప్రతిబధ్యతే ।**
**శ్రవణాయాపి బహుభిర్యో న లభ్య ఇతి శ్రుతేః ॥53॥**

*53. మరికొందరికి ఆత్మవిచారమే వారి పాపకర్మముల వలన అడ్డగింపబడును. పలువురకు వినుటకు కూడా ఇది లభింపదని శ్రుతి చెప్పుచున్నది.*

**వ్యాఖ్య:** కఠ ఉప. 1.2.7. ఆత్మవిచారణ చేసినవారికి ముందు వెనుకలుగ ముక్తి కలుగుచుండ తీవ్రపాపులను అట్టి విచారణ చేయవలెననే బుద్ధి కూడా జనింపదు.

**అత్యంత బుద్ధిమాంద్యాద్వా సామగ్ర్యా వాప్యసంభవాత్ ।**
**యో విచారం న లభతే బ్రహ్మోపాసీత సోఽనిశమ్ ॥54॥**

*54. మిక్కిలి మందబుద్ధిచేగాని పరిస్థితులు అనుకూలింపకపోవుట వలన గాని విచారణ సాధ్యము కానిచో అట్టి ముముక్షువు నిరంతరము బ్రహ్మమును ఉపాసింపవలెను.*

**నిర్గుణ బ్రహ్మతత్త్వస్య న హ్యుపాస్తేరసంభవః ।**
**సగుణబ్రహ్మణీవాత్ర ప్రత్యయావృత్తి సంభవాత్ ॥55॥**

*55. నిర్గుణ బ్రహ్మ తత్త్వమును ఉపాసించుట అసంభవమేమీ కాదు. ఉపాసన అనగా ప్రత్యయము నావృత్తి చేయుట గనుక అది సగుణ బ్రహ్మము పట్ల సాధ్యమైనట్లే నిర్గుణబ్రహ్మము పట్ల కూడా సాధ్యమగును.*

**వ్యాఖ్య:** ఏ ప్రత్యయమును, భావమును మనస్సున నిరంతరాయముగ ఉంచుకొనిన ఆ విధముగ మనస్సు పరిణమించును.

**అవాజ్ మనస గమ్య తన్నో పాస్యమితి చేత్తదా ।**
**అవాఙ్మనస గమ్యస్య వేదనం న చ సంభవేత్ ॥56॥**

*56.* నిర్గుణబ్రహ్మము అవాఙ్మానసగోచరము కనుక అది ఉపాస్య విషయము కాజాలదనినచో అట్టి వాక్కు మనస్సులకు అతీతమైన విషయము ఒకటి ఉన్నదని తెలియుటచే అసంభవము కావలెను.

**వాగాద్యగోచరాకారమిత్యేవం యది వేత్త్యసౌ।**
**వాగాద్యగోచరాకారమిత్యుపాసీత నో కుతః ॥57॥**

*57.* నిర్గుణ బ్రహ్మము వాక్కు మొదలగు వానిచే గోచరము కాదని తెలియుననినచో వాగాదులకు అతీతమైనదనియే ఉపాసింపవచ్చు.

**వ్యాఖ్య:** 'నేను' వాగాదులకు అతీతమైనను తెలియుచునే ఉన్నది. అదియే అవాఙ్మానసగోచరమైన బ్రహ్మముగ దానిపైననే ధ్యానముంచి ఉపాసింపవచ్చు.

**సగుణత్వముపాస్యత్వాద్యది వేద్యత్వతోఽపి తత్ ।**
**వేద్యం చేల్లక్షణా వృత్త్యా లక్షితం సముపాస్యతామ్ ॥58॥**

*58.* బ్రహ్మము ధ్యేయవిషయము ఉపాసనావిషయము అయినచో సగుణత్వము కలుగునని శంకించినచో తెలియబడుటచే కూడా సగుణత్వము ఏర్పడుచున్నది. బ్రహ్మము లక్షణ ద్వారా సూచితమగు చున్నదనినచో ఆ ఉద్దేశింపబడిన దానినే ఉపాసింపుము.

**బ్రహ్మ విద్ధి తదేవ త్వం న త్విదం యదుపాసతే ।**
**ఇతి శ్రుతేరుపాస్యత్వం నిషిద్ధం బ్రహ్మణో యది ॥59॥**

*59.* "మనస్సుచే ఏది తెలియబడదో దేనిచే మనస్సు తెలియబడునో అదియే బ్రహ్మమని తెలియును. జనులు ఉపాసించే ఇది బ్రహ్మము కాదు" కేన ఉప. *1.5* అనే శ్రుతి బ్రహ్మము ఉపాస్యమగుటను నిషేధించు చున్నదనినచో.

**విదితాదన్యదేవేతి శ్రుతేర్వేద్యత్వమస్య న ।**
**యథా శ్రుత్యైవ వేద్యం చేత్తథా శ్రుత్యాప్యుపాస్యతామ్ ॥60॥**

*60.* "అన్యదేవతద్విదితాదథో అవిదితాదధి" కేన ఉప. *1.4* అనే శ్రుతి బ్రహ్మము తెలియబడిన దానికంటె భిన్నమని వేద్యత్వమును కూడా నిషేధించు చున్నది. బ్రహ్మము తెలియబడినది తెలియబడనిది కూడా కాదని శ్రుతి చెప్పుచున్నదనినచో శ్రుతి చెప్పినట్లే ఉపాసింపవచ్చును. అనగా బ్రహ్మము

*గూర్చి ఎట్లు తెలిసిన నట్లే ఉపాసింపవచ్చునని భావము. చూ. 7.86-87 అమృతబిందు ఉప. 6; కఠ ఉప. 1.3.12; బృహదారణ్యక ఉప. 4.4.21.*

**అవాస్తవీ వేద్యతా చేదుపాస్యత్వం తథా న కిమ్ ।**
**వృత్తివ్యాప్తిర్వేద్యతా చేదుపాస్యత్వేఽపి తత్సమమ్ ॥61॥**

*61. బ్రహ్మము యొక్క జ్ఞేయ విషయత్వము సత్యము కాదనినచో ఉపాస్యత్వము కూడా అట్టిదే. బుద్ధివృత్తి జ్ఞేయవిషయమునందు వ్యాపించుట ఉపాసన అగుచున్నది.*

**వ్యాఖ్య:** బ్రహ్మమును గూర్చి పరోక్షజ్ఞానము వలె ఉపాసనయు చేయవచ్చును. వ్యవహారస్థితియందు రెండును సాధ్యములే ఫలవంతములే. చూ. 7.90.

**కా తే భక్తిరుపాస్తౌ చేత్కస్తే ద్వేషస్తదీరయ ।**
**మానాభావో న వాచ్యోఽస్యాం బహుశ్రుతిషు దర్శనాత్ ॥62॥**

*62. నిర్గుణ బ్రహ్మపు ఉపాసనయందు ఇంత శ్రద్ధ ఏల అనినచో నీకింత ద్వేషమేలనో చెప్పుము. నిర్గుణ బ్రహ్మోపాసనను విధించే శ్రుతలు అనేకములు ఉండగా దానికి ప్రమాణము లేదనుట తగదు.*

**ఉత్తరస్మిం స్తాపనీయే శైబ్యప్రశ్నేఽథ కాఠకే ।**
**మాండూక్యాదౌ చ సర్వత్ర నిర్గుణోపాస్తి రీరితా ॥63॥**

*63. నృసింహ ఉత్తరతాపనీయ ఉపనిషత్తు (1-1) నందు ప్రశ్నోపనిషత్తు (5-5) నందు కఠోపనిషత్తు (1.2.15-17) నందు మాండూక్య ఉపనిషత్తు (1-12) నందు తదితరములందు ఎల్లెడల నిర్గుణోపాసన వర్ణింపబడినది.*

**అనుష్ఠాన ప్రకారోఽస్యా పంచీకరణ ఈరితః ।**
**జ్ఞాన సాధన మేతచ్చేన్నేతి కేనాత్ర వారితమ్ ॥64॥**

*64. దాని అనుష్ఠానమే శ్రీ సురేశ్వరాచార్యుల పంచీకరణ వార్తికమున చెప్పబడినది. ఇది పరోక్షజ్ఞానసాధనము అనినచో దానినెవరూ కాదునుటలేదు.*

**నాను తిష్ఠతి కోఽప్యేతదితి చేన్మాను తిష్ఠతు ।**
**పురుషస్యాపరాధేన కిముపాస్తిః ప్రదుష్యతి ॥65॥**

*65. ఈ ఉపాసనను ఎవరూ అనుష్ఠించుట లేదననిచో అనుష్ఠింపక పోనిమ్ము. వారి లోపములకై ఉపాసననేల దూషింపవలెను?*

**ఇతోఽ ప్యతిశయం మత్వా మంత్రాన్వశ్యాదికారిణః ।**
**మూఢాజపన్తు తేభ్యోఽ తిమూఢాః కృషిముపాసతామ్ ॥66॥**

*66. సగుణోపాసనకంటె వశీకారాది శక్తులు చాల గొప్పవని తలచి మూఢ జనులు వానికై జపింతురు గాక. అంతకంటె మూఢజనులు వ్యవసాయ వాణిజ్యములు అత్యంత ఫలదాయకములని ఎంచి వాని యందు ప్రవర్తింతురు గాక. అంతమాత్రమున వివేకులు నిర్గుణోపాసనను పరిత్యజించుట తగదు.*

**తిష్ఠంతు మూఢాః ప్రకృతా నిర్గుణోపాస్తి రీర్యతే ।**
**విద్యైక్యాత్సర్వశాఖాస్థాన్ గుణానత్రోపసంహరేత్ ॥67॥**

*67. మూఢజనులు వారికి ఇష్టమైనట్లే చేయుదురు గాక. ప్రస్తుత విషయము నిర్గుణోపాసనము. అది ఉపనిషత్తులందు విద్యలుగ ఉపాసనలుగ చెప్పబడుట చేత వివిధ వేదశాఖలందు బ్రహ్మము గూర్చి చెప్పబడిన లక్షణము లన్నీ ధ్యానమునకై సేకరింపవలెను.*

**ఆనందాదేర్విధేయస్య గుణసంఘస్య సంహృతిః ।**
**ఆనందాదయ ఇత్యస్మిన్ సూత్రే వ్యాసేన వర్ణితా ॥68॥**

*68. బ్రహ్మమును ధ్యానించునపుడు ఆనందము మొదలగు విధేయ గుణములన్నింటిని అన్వయించుకొనవలెను. 'ఆనందాదయః ప్రధానస్య' అనే బ్రహ్మసూత్రమున వ్యాసమహర్షి ఈ విషయమునే చెప్పెను. చూ. బ్రహ్మ సూత్రములు 3.3.11; తైత్తిరీయ ఉప. 3.6.1; బృహదారణ్యక ఉప. 3.9.28; నృసింహ ఉత్తరతాపనీయ ఉప.9*

**వ్యాఖ్య:** ఆనందము, విజ్ఞానము, నిత్యము, శుద్ధము, బుద్ధము, సత్యము ముక్తము, నిరంజనము, విభువు, అద్వయము, ప్రత్యక్, ఏకరసము మొదలగునవి విధేయగుణములు (positive qualities).

**అస్థూలాదేర్నిషేధ్యస్య గుణసంఘస్య సంహృతిః ।**
**తథా వ్యాసేన సూత్రేఽ స్మిన్నుక్తాక్షరధియాం త్వితి ॥69॥**

*69. అట్లే నిషేధ్యగుణములైన అస్థూలము మొదలగు వానిని "అక్షర ధియాం..." అనే సూత్రమున వ్యాసమహర్షి వర్ణించెను.*

**వ్యాఖ్య:** అస్థూలము, అనణువు, అహ్రస్వము, అద్రేశ్యము, అగ్రాహ్యము, అశబ్దము, అస్పర్శము, అరూపము, అవ్యయము మొదలగునవి నిషేధ్యగుణములు.

చూ. బ్రహ్మసూత్రములు 3. 3. 33; బృహదారణ్యక ఉప. 3. 8. 8; ముండక ఉప. 1. 1. 5–6; ప్రకరణము 7. 87.

**నిర్గుణబ్రహ్మతత్త్వస్య విద్యాయాం గుణసంహృతిః ।**
**న యుజ్యేతే త్యుపాలంభో వ్యాసం ప్రత్యేవ మాం న తు ॥70॥**

*70. నిర్గుణబ్రహ్మ విద్యయందు గుణములను సేకరించుట తగి ఉండదు గదా అనినచో ఈ ఆక్షేపము వ్యాసునికే తగులును. నాకు తగులదు.*

**హిరణ్య శ్మశ్రు సూర్యాది మూర్తీనా మనుదాహృతేః ।**
**అవిరుద్ధం నిర్గుణత్వమితి చేత్తుష్యతాం త్వయా ॥71॥**

*71. వ్యాసమహర్షి బంగారు మీసములు గల సూర్యుడు మొదలగు మూర్తులను చేర్చక పోవుటచే నిర్గుణత్వమునకు భంగము లేదనినచో దానితోనే తృప్తి పడుము. మేము కూడ వానిని కోరుటలేదు. ఛాందోగ్య ఉప. 1.6.6.*

**గుణానాం లక్షకత్వేన న తత్త్వేఽన్తః ప్రవేశనమ్ ।**
**ఇతిచేదస్త్వేవమేవ బ్రహ్మతత్త్వ ముపాస్యతామ్ ॥72॥**

*72. గుణములు సూచకములు మాత్రమే గదా తత్త్వమునందు అవి ప్రవేశింపజాలవు గదా అనినచో కానిమ్ము. ఆ విధముగ సూచింపబడినట్లే ధ్యానింపుము.*

**ఆనందాదిభిరస్థూలాదిభిశ్చాత్మాత్ర లక్షితః ।**
**అఖండై కరసః సోఽహమస్మీత్యేవముపాసతే ॥73॥**

*73. ఆనందము మొదలగు విధేయగుణముల చేతను అస్థూలము మొదలగు నిషేధగుణముల చేతను ఆత్మయే సూచింపబడినది. అఖండము ఏకరసము అగు ఆ ఆత్మయే నేను అని ఉపాసింపవలెను.*

**బోధోపాస్త్యోర్విశేషః క ఇతి చేదుచ్యతే శృణు ।**
**వస్తుతంత్రో భవేద్బోధః కర్తృతంత్రముపాసనమ్ ॥74॥**

*74. జ్ఞానమునకు ఉపాసనకు భేదమేమనినచో చెప్పుచున్నాము వినుము. జ్ఞానం వస్తువుపై ఆధారపడియుండును. ఉపాసన కర్తపై ఆధారపడి ఉండును.*

**విచారాజ్జాయతే బోధోఽనిచ్ఛా యం న నివర్తయేత్ ।**
**స్వోత్పత్తి మాత్రాత్సంసారే దహత్యఖిల సత్యతామ్ ॥75॥**

*75.* విచారణచే జ్ఞానం కలుగును. ఇచ్ఛలేకున్నను అది కలుగక మానదు. కలిగినంతనే అది ఈ సంసారము సత్యమను భావనను దహించివేయును.

**తావతా కృతకృత్యః సన్నిత్యతృప్తిముపాగతః ।**
**జీవన్ముక్తిమనుప్రాప్య ప్రారబ్ధక్షయమీక్షతే ॥76॥**

*76.* జ్ఞానోత్పత్తిచే సాధకుడు కృతకృత్యుడగును. నిరంతరాయమైన తృప్తి లభించును. జీవన్ముక్తిని పొంది మిగిలిన జీవన పరిమితియందు ప్రారబ్ధకర్మ క్షయించుటను చూచుచుండును.

**ఆప్తోపదేశం విశ్వస్య శ్రద్ధాలు రవిచారయన్ ।**
**చింతయే త్ప్రత్యయై రన్యైరనంతరిత వృత్తిభిః ॥77॥**

*77.* విచారణ చేయని శ్రద్ధావంతుడు గురూపదేశమును విశ్వసించి ఇతరములగు ఆలోచనలచే అంతరాయము కలుగనీయక గురూపదిష్టమైన ధ్యేయమునే ధ్యానింపవలెను.

**యావచ్చింత్య స్వరూపత్వాభిమానః స్వస్య జాయతే ।**
**తావద్విచింత్య పశ్చాచ్చ తథైవామృతి ధారయేత్ ॥78॥**

*78.* ధ్యేయముతో తాదాత్మ్యాభిమానము కలుగువరకు ధ్యానించి పిదప కూడా మరణించే వరకు ఆ అభిమానమును నిలుపుకొనవలెను. చూ. బ్రహ్మ సూత్రములు *4.1.12.*

**బ్రహ్మచారీ భిక్షమాణోయుతః సంవర్గవిద్యయా ।**
**సంవర్గరూపతాం చిత్తే ధారయిత్వా హ్యభిక్షత ॥79॥**

*79.* భిక్షువై పోవుచున్న ఒకానొక బ్రహ్మచారి సంవర్గత్వగుణవిశిష్టమగు ప్రాణమును ఉపాసించుచు దానితో తాదాత్మ్యమును పొంది భిక్షాటనము చేసెను. చూ. ఛాందోగ్య ఉప. *4.3.1-8.*

**పురుష స్యేచ్ఛయా కర్తుమకర్తుం కర్తుమన్యథా ।**
**శక్యోపాస్తిరతో నిత్యం కుర్యాత్ప్రత్యయ సంతతిమ్ ॥80॥**

*80.* ఉపాసన పురుషతంత్రమగుటచే చేయుటకు చేయకుండుటకును విపరీతముగ చేయుటకును సంభవమగును. కనుక నిత్యము ప్రయత్న పూర్వక ముగ సజాతీయ ప్రత్యయ ప్రవాహమును మనస్సున నిలుపు కొనవలెను.

**వేదాధ్యాయీ హ్యమప్రమత్తోఽధీతే స్వప్నేఽధివాసితః ।**
**జపితా తు జపత్యేవ తథాధ్యాతాపి వాసయేత్ ॥81॥**

*81.* అప్రమత్తుడై శ్రద్ధతో వేదమును అధ్యయము చేయునతడు స్వప్నమునందు కూడా వేదాధ్యయనమే చేయును. అట్లే జపించువాడు కలలో కూడా జపమునే చేయును. కనుక ధ్యానించువాడు కూడ అట్టి అభ్యాసమునే ఏర్పరుచుకొనవలెను.

**విరోధిప్రత్యయం త్యక్త్వా నైరంతర్యేణ భావయన్ ।**
**లభతే వాసనావేశా త్స్వప్నాదావపి భావనామ్ ॥82॥**

*82.* ఇతర భావనలు వదలి నిరంతరముగ ధ్యానించినచో ఆ వాసనా బలమున కలయందును నిద్రయందును కూడా ఆ ధ్యానమే నిలచును.

**భుంజానోఽపి నిజారబ్ధమాస్థాతిశయతోఽనిశమ్ ।**
**ధ్యాతుంశక్తో న సందేహో విషయవ్యసనీయథా ॥83॥**

*83.* ప్రారబ్ధ కర్మను అనుభవించుచున్నను, ధ్యానింపవలెనని తీవ్రమగు కోరిక ఉన్నచో నిస్సందేహముగ నిరంతరముగ ధ్యానింపగలము. విషయ సుఖములపై ఆసక్తి గల పురుషుడు నిరంతరము వానినే ధ్యానించునట్లే.

**పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి ।**
**తదేవాస్వాదయత్యంతః పరసంగ రసాయనమ్ ॥84॥**

*84.* జారిణియైన స్త్రీ ఇంటిపనులయందు మునిగి ఉన్నను మనసులో తన జారుని సౌఖ్యమునే ఆస్వాదించుచుండును. అట్లే సాధకుడు ప్రారబ్ధకర్మములు నిర్వర్తించుచున్నను మనస్సును ధ్యానమగ్నము చేయ గలుగునని భావము.

**పరసంగం స్వాదయంత్యా అపి నో గృహకర్మ తత్ ।**
**కుంఠీ భవేదపి త్వేతదాపాతేనైవ వర్తతే ॥85॥**

*85.* మనసునందు జారసౌఖ్యమును అనుభవించుచుండుటచే గృహ కర్మలు కుంటుపడును. అంతేగాక ఏదోక విధముగ పూర్తియగును.

**గృహకృత్యవ్యసనినీ యథా సమ్యక్కరోతి తత్ ।**
**పరవ్యసనినీ తద్వన్న కరోత్యేవ సర్వథా ॥86॥**

*86.* ఇంటిపనులయందు ఆసక్తి గల ఇల్లాలు ఉత్సాహముతో వానిని సుందరముగ నెరవేర్చినట్లు జారిణి ఎంతమాత్రము చేయజాలదు.

**ఏవం ధ్యానైక నిష్ఠోఽపి లేశాల్లౌకిక మారభేత్ ।**
**తత్త్వవిత్త్వవిరోధిత్వాల్లౌకికం సమ్యగాచరేత్ ॥87॥**

*87.* అట్లే ధ్యానాసక్తచిత్తుడైన పురుషుడు తన పనులను ఏదోక విధముగ నెరవేర్చును. కాని తత్త్వవిదుడు తన లౌకికకర్మలను, వానితో ఏ విరోధము లేకపోవుటచే, చక్కగా నిర్వర్తించును.

**మాయామయః ప్రపంచోయ మాత్మాచైతన్యరూపధృక్ ।**
**ఇతి బోధే విరోధః కో లౌకిక వ్యవహారిణః ॥88॥**

*88.* ఈ ప్రపంచము మాయామయము. ఆత్మ శుద్ధచైతన్య స్వరూపము. ఇట్టి జ్ఞానము లౌకికవ్యవహారముతో ఎట్లు విరోధించును? విరోధింపదు.

**అపేక్షతే వ్యవహృతిర్న ప్రపంచస్య వస్తుతామ్ ।**
**నాప్యాత్మజాడ్యం కిం త్వేషా సాధనాన్యేవ కాంక్షతి ॥89॥**

*89.* లోకవ్యవహారానికై ప్రపంచము సత్యమని భావింపనక్కరలేదు. ఆత్మ జడమనీ భావింపనావశ్యకత లేదు. దానికి కావలసినది సాధనాలు మాత్రమే.

**మనోవాక్కాయ తద్బాహ్య పదార్థాః సాధనాని తాన్ ।**
**తత్త్వవిన్నోపమృద్నాతి వ్యవహారోఽస్య నో కుతః ॥90॥**

*90.* వ్యవహారమునకు కావలసినది మనస్సు వాక్కు శరీరము బాహ్య విషయములు. ఇవే సాధనములు. తత్త్వజ్ఞానము కలుగగనే ఇవి అదృశ్యములు కావు. మరి వ్యవహారమేల సాధ్యము కాదు? ఆవశ్యము సాధ్యమే.

**ఉపమృద్నాతి చిత్తం చేద్ధ్యాతాసౌ న తు తత్త్వవిత్ ।**
**న బుద్ధిమర్దయన్ దృష్టో ఘట తత్త్వస్య వేదితా ॥91॥**

*91.* మనస్సును లయింపజేస్తే అతడు ధ్యాతయగును గాని తత్త్వవిదుడు కానేరడు. ఘటమును తెలియుటకు మనస్సును లయింప జేయవలెనా?

**సకృత్ప్రత్యయమాత్రేణ ఘటశ్చేద్భాసతే సదా ।**
**స్వప్రకాశోఽయమాత్మా కిం ఘట వచ్చ న భాసతే ॥92॥**

*92.* ఒకప్పుడు కలిగిన ప్రత్యయము చేతనే ఘటము ఎప్పటికిని తెలిసినచో స్వయంప్రకాశమైన ఆత్మమాత్రము కుండ తెలిసి ఉండునట్లు ఏల తెలిసి ఉండదు? స్వయంప్రకాశమగుటచే జడమైన ఘటము కంటె స్పష్టముగా తెలియునని భావము.

**స్వప్రకాశతయా కిం తే తద్బుద్ధిస్తత్త్వవేదనమ్ ।**
**బుద్ధిశ్చ క్షణనా శ్యేతి చోద్యం తుల్యం ఘటాదిషు ॥93॥**

*93. ఆత్మ యొక్క స్వయం ప్రకాశత్వము బ్రహ్మజ్ఞానము కలిగించునా, బుద్ధి యందలి బ్రహ్మాకార వృత్తి కలిగించును. ఆ బుద్ధివృత్తి క్షణములో నశించును అనినచో ఈ ఆక్షేపము ఘటజ్ఞానమునందు కూడా సమముగ వర్తించును.*

**వ్యాఖ్య:** బ్రహ్మజ్ఞానము బ్రహ్మాకారవృత్తిచే కలుగును కనుక ఆ జ్ఞానము నిరంతరాయముగ ఉండవలెనన్నచో ఆ వృత్తియు నిరంతరాయముగ ఉండవలెను. బుద్ధియందు బ్రహ్మాకార వృత్తియే నిలచియున్నచో ఇక లౌకికవృత్తులు తద్వారా లోకవ్యవహారము అసంభవము కదా అని సంశయము, కాని లౌకికవృత్తులు కూడా ఉదయించుట తోడనే నశించును అయినను ఆ జడవిషయముల జ్ఞానము నశింపదు. అట్లుండగా చైతన్య స్వరూపమైన బ్రహ్మము యొక్క జ్ఞానమెట్లు నశించును? నశింపదు, కాగా ఘటాదుల జ్ఞానము కంటె మరింత విస్పష్టముగా సర్వదా ఉండును. బ్రహ్మాకారవృత్తి నిరంతరాయముగ ఉండుట అనావశ్యకము కనుక బుద్ధి యందు లౌకికవృత్తులేర్పడవచ్చును. లోకవ్యవహారము నిరాఘాటముగ నడువవచ్చును. దాని వలన బ్రహ్మజ్ఞానమునకు ఏ లోపము కలుగదు. వ్యవహారము కూడా కుంటుపడదు. ధ్యానమునందు ధ్యేయవృత్తిని మాత్రము మనస్సున నిలిపి ఇతర వృత్తులను రానీయకుండ చూడవలెను కనుక వ్యవహారము కొంచెము కుంటుపడుట సహజమే.

**ఘటాదౌ నిశ్చితే బుద్ధిర్నశ్యత్యేవ యదా ఘటః ।**
**ఇష్టో నేతుం తదాశక్య ఇతి చేత్సమమాత్మని ॥94॥**

*94. ఘటాదులయందు నిశ్చయమైన జ్ఞానము కలుగగనే ఆ బుద్ధి వృత్తి నశించును. ఘటజ్ఞానము కావలసినప్పుడు దానిని ఇచ్ఛానుసారం ఉపయోగింప వచ్చుననినచో ఈ విషయము ఆత్మజ్ఞానమునకును సమముగ వర్తించును.*

**నిశ్చిత్య సకృదాత్మానం యదాపేక్షా తదైవ తమ్ ।**
**వక్తుం మంతుం తథా ధ్యాతుం శక్నోత్యేవ హి తత్త్వవిత్ ॥95॥**

*95. ఆత్మను గూర్చి ఒకసారి నిశ్చయముగ తెలిసికొనిన పిదప తత్త్వవిదుడు తన ఇష్టానుసారము దానిని గూర్చి మాటలాడవచ్చును ఆలోచింప వచ్చును ధ్యానింపవచ్చును.*

**ఉపాసక ఇవ ధ్యాన్ లౌకికం విస్మరేద్యది ।**
**విస్మరత్యేవ సా ధ్యానాద్విస్మృతిర్న తు వేదనాత్ ॥96॥**

*96.* ఉపాసకుని వలె బ్రహ్మమును ధ్యానించుచు లోకమును మరచినచో అనిన మరచిపోనిమ్ము. ఆ మరపు ధ్యానము వలన గాని బ్రహ్మజ్ఞానము వలన కాదు గదా!

**ధ్యానం త్వైచ్ఛికమేతస్య వేదనాన్ముక్తి సిద్ధితః ।**
**జ్ఞానాదేవ తు కైవల్యమితి శాస్త్రేషు డిండిమః ॥97॥**

*97.* జ్ఞానముచే ముక్తి సిద్ధించియుండగా ఇక ధ్యానము చేయుటయా మానుటయా అనునది తత్త్వవిదుని ఇచ్ఛాధీనము. జ్ఞానము చేత మాత్రమే మోక్షము కలుగునని శాస్త్రములందు ఘంటాఘోషముగ చెప్పబడినది గదా.

**తత్త్వ విద్యది న ధ్యాయే త్ప్రవర్తేత తదా బహిః ।**
**ప్రవర్తతాం సుఖేనాయం కో బంధోఽ స్య ప్రవర్తనే ॥98॥**

*98.* తత్త్వవిదుడు ధ్యానింపనిచో బహిర్ముఖుడై ప్రవర్తించును. అనినచో సంతోషముగ ప్రవర్తింపనిమ్ము. అట్టి ప్రవర్తన కేమియాటంకము?

**అతి ప్రసంగ ఇతి చేత్ప్రసంగం తావదీరయ ।**
**ప్రసంగో విధిశాస్త్రం చేన్న తత్త్వవిదం ప్రతి ॥99॥**

*99.* ఇట్లు వాదించుట అధికప్రసంగమనినచో మరి ప్రసంగమేదో చెప్పు. శాస్త్రోక్తములైన విధి నిషేధములను పాటించుట ప్రసంగము అనినచో అవి తత్త్వవేత్త విషయమున అన్వయింపవు.

**వర్ణాశ్రమ వయోవస్థాభిమానో యస్య విద్యతే ।**
**తస్యైవ చ నిషేధాశ్చ విధయః సకలా అపి ॥100॥**

*100.* బ్రాహ్మణాది వర్ణము బ్రహ్మచర్యాది ఆశ్రమము వయస్సు జాగ్రదాది అవస్థలు వీనియందు అభిమానము గలవానికి మాత్రమే శాస్త్రోక్తములైన విధినిషేధములన్నీ వర్తించును.

**వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః ।**
**నాత్మనో బోధరూపస్యేత్యేవం తస్య వినిశ్చయః ॥101॥**

*101.* వర్ణాశ్రమాదులు దేహమునకు సంబంధించినవనీ మాయచే కల్పింప

బడినవనీ అవి జ్ఞానస్వరూపమైన ఆత్మకు చెందవనీ తత్త్వజ్ఞాని యొక్క దృఢనిశ్చయము.

**సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా ।**
**హృదయేనాస్త సర్వాస్థో ముక్త ఏవోత్తమాశయః ॥102॥**

*102. హృదయము నుండి సర్వవిధములైన ఆశలును తొలగిపోయిన ఉదాత్తచిత్తుడు సమాధినిగాని కర్మలనుగాని అనుష్ఠించినను అనుష్టింపక పోయినను ముక్తపురుషుడే.*

**నైష్కర్మ్యేణ న తస్యార్థస్తస్యార్థోఽస్తి న కర్మభిః ।**
**న సమాధాన జప్యాభ్యాం యస్య నిర్వాసనం మనః ॥103॥**

*103. ఎవని మనస్సునందు కోరికలు గాని వాసనలుగాని లేశమాత్రమైనా లేకుండునో అతడు కర్మలను చేసినా చేయకున్నను సమాధి జపాదులను అనుష్ఠించినను అనుష్ఠింపకపోయినను కలుగు లాభమేమీ లేదు.*

**ఆత్మాఽసంగస్తతోఽన్యత్స్యాదింద్రజాలం హి మాయికమ్ ।**
**ఇత్యచంచల నిర్ణీతే కుతో మనసి వాసనా ॥104॥**

*104. ఆత్మ సంగరహితము. తదితరమంతా మాయాకల్పితమైన ఇంద్రజాలము. ఇట్లు అచంచలముగ నిర్ణయించిన మనస్సునందు వాసన లెట్లు ఉండగలవు? ఉండజాలవు.*

**ఏవం నాస్తి ప్రసంగోఽపి కుతోఽస్యాతిప్రసంజనమ్ ।**
**ప్రసంగో యస్య తస్యైవ శంక్యేతాతిప్రసంజనమ్ ॥105॥**

*105. కనుక తత్త్వవేత్త విషయమున ప్రసంగమే, అనగా విధినిషేధములే లేవు. ఇక అతిప్రసంగమెచ్చటి నుండి వచ్చును? ప్రసంగమున్న పురుషుని పట్ల వాని భంగమును శంకింపవచ్చును.*

**విధ్యభావాన్న బాలస్య దృశ్యతేతిప్రసంజనమ్ ।**
**స్యాత్కుతోఽతిప్రసంగోఽస్య విధ్యభావే సమే సతి ॥106॥**

*106. బాలకునకు విధులేవీ లేనందున అతనియందు విధి భంగములు కూడ కన్పింపవు. తత్త్వవిదునకు కూడ విధులేమీ లేనందున అతి ప్రసంగ మెచ్చట నుండి వచ్చును? రాదు.*

**న కించిద్వేత్తి బాలశ్చేత్సర్వం వేత్త్యేవ తత్త్వవిత్ ।**
**అల్పజ్ఞస్యైవ విధయః సర్వే స్యుర్నాన్యయోర్ద్వయోః ॥107॥**

*107. బాలునకేమీ తెలియదు అందుచే విధులు లేవనినచో నిశ్చయముగ తత్త్వవేత్తకంతా తెలియును కనుక అతనికిని విధులుండవు. అన్ని విధులు కొంతమాత్రమే తెలిసినవారికిగాని బొత్తిగా తెలియని, లేక పూర్తిగా తెలిసిన వారికి కాదు.*

**శాపానుగ్రహసామర్థ్యం యస్యాసౌ తత్త్వవిద్యది ।**
**తన్న శాపాది సామర్థ్యం ఫలం స్యాత్తపసో యతః ॥108॥**

*108. శపింపను అనుగ్రహింపను సామర్థ్యమున్ననే తత్త్వవిదుడు అనినచో అది సరికాదు. ఈ నిగ్రహానుగ్రహశక్తి తపస్సుచే కలుగును.*

**వ్యాసాదేరపి సామర్థ్యం దృశ్యతే తపసో బలాత్ ।**
**శాపాది కారణాదన్యత్తపో జ్ఞానస్య కారణమ్ ॥109॥**

*109. తపోబలముచే ఈ శక్తులు వ్యాసుడు మొదలగువారియందు కల వనినచో ఈ శక్తులకు కారణమగు తపస్సులు వేరు. జ్ఞానమునకు కారణమగు తపస్సులు వేరు.*

**ద్వయం యస్యాస్తి తస్యైవ సామర్థ్య జ్ఞానయోర్జనిః ।**
**ఏకైకం తు తతః కుర్వన్నేకైకం లభతే ఫలమ్ ॥110॥**

*110. రెండు విధములైన తపస్సులను చేయువారి యందు జ్ఞానము శక్తులు రెండును కలుగును. ఒక విధమైన తపస్సునే చేసినచో దానికి తగిన ఫలము మాత్రమే లభించును.*

**సామర్థ్య హీనో నింద్యశ్చేద్యతిభిర్విధివర్జితః ।**
**నింద్యతే తత్తపోఽప్యన్యైరనిశం భోగలంపటైః ॥111॥**

*111. విధులను పాటింపని సామర్థ్యము కూడ లేని జ్ఞానిని ఇతర యతులు నిందింతురనినచో అట్టి యతుల తపస్సులను కూడా నిరంతరము భోగ లంపటులగు వారు నిందింతురు.*

**భిక్షావస్త్రాది రక్షేయుర్యద్యేతే భోగతుష్టయే ।**
**అహో యతిత్వమేతేషాం వైరాగ్యభరమంథరమ్ ॥112॥**

*112.* ఈ యతులు కూడా భిక్షను వస్త్రములను పోగు చేసికొనుచు ఆనందింతురనినచో ఇట్టి వైరాగ్యభారముచే కదల శక్తిలేని వీరి యతిత్వమెంత అద్భుతము! వైరాగ్యమే లేదని భావము.

**వర్ణాశ్రమపరాన్మూఢా నిందంత్విత్యుచ్యతే యది ।**
**దేహాత్మమతయో బుద్ధం నిందంత్వాశ్రమ మానినః ॥113॥**

*113.* వర్ణాశ్రమధర్మములను నిర్వర్తించే కర్మపరులను మూర్ఖులు నిందించిననేమి అనినచో దేహమే ఆత్మయని భావించే ఈ కర్మనిష్ఠులు తత్త్వజ్ఞానిని నిందించిన మాత్రమున ఏమి?

**తదిత్థం తత్త్వవిజ్ఞానే సాధనానుపమర్దనాత్ ।**
**జ్ఞానినాచరితుం శక్యం సమ్యగ్రాజ్యాది లౌకికమ్ ॥114॥**

*114.* కనుక తత్త్వజ్ఞానము మనస్సు మొదలగు కర్మసామాగ్రిని బాధింపదు. అందుచే రాజ్యపాలనము మొదలగు లౌకిక కర్మలను జ్ఞాని చేయ గలుగును. (90వ శ్లోకము నుండి అన్వయము)

**మిథ్యాత్వబుద్ధ్యా తత్రేచ్ఛా నాస్తి చేత్తర్హి మాస్తు తత్ ।**
**ధ్యాయన్వాఽథ వ్యవహరన్ యథారబ్ధం వసత్వయమ్ ॥115॥**

*115.* అట్టి కర్మలన్నీ మిథ్యయనే భావముచే వానియందు ఇచ్ఛ ఉండదనినచో ఉండకపోనిమ్ము. ప్రారబ్ధానుసారము ధ్యానించుచుగాని వ్యవహరించుచుగాని జీవింపనిమ్ము.

**ఉపాసకస్తు సతతం ధ్యాయన్నేవ వ సేద్యతః ।**
**ధ్యానేనైవ కృతం తస్య బ్రహ్మత్వం విష్ణు తాదివత్ ॥116॥**

*116.* కాని ఉపాసకుని బ్రహ్మత్వము ధ్యానముచే కలుగుచున్నది కనుక అతడు సర్వదా ధ్యానించుచునే జీవింపవలెను. విష్ణుభక్తునకు విష్ణుత్వము కలిగినట్లే. చూ. శ్లో. 30,31, 74-80.

**ధ్యానోపాదానకం యత్తద్ధ్యానాభావే విలీయతే ।**
**వాస్తవీ బ్రహ్మతా నైవ జ్ఞానాభావే విలీయతే ॥117॥**

*117.* ధ్యానము వలన కలుగు తాదాత్మ్యభావము ధ్యానము లేనపుడు నశించును. కాని వాస్తవమగు బ్రహ్మభావము జ్ఞానము లేకున్నను నశింపదు.

**తతోఽభిజ్ఞాపకం జ్ఞానం న నిత్యం జనయత్యదః ।**
**జ్ఞాపకాభావమాత్రేణ న హి సత్యం విలీయతే ॥118॥**

*118.* జ్ఞానము నిత్యమగు బ్రహ్మత్వమును జ్ఞాపకమునకు తెచ్చునేగాని దానిని సృష్టింపదు. సత్యమగు బ్రహ్మము జ్ఞాపకము లేనంత మాత్రమున విలయము చెందదు *గదా!*

**అస్త్యేవోపాసకస్యాపి వాస్తవీ బ్రహ్మతేతి చేత్ ।**
**పామరాణాం తిరశ్చాం చ వాస్తవీ బ్రహ్మతా న కిమ్ ॥119॥**

*119.* ఉపాసకునకు కూడా వాస్తవమగు బ్రహ్మత ఉన్నది గదా అనినచో పామరజనులకు పశుపక్ష్యాదులకు మాత్రము వాస్తవమగు బ్రహ్మత లేకున్నదా?

**అజ్ఞానాదపుమర్థత్వముభయత్రాపి తత్సమమ్ ।**
**ఉపవాసాద్యథా భిక్షా వరం ధ్యానం తథాఽన్యతః ॥120॥**

*120.* ఆ బ్రహ్మత్వము తెలియక పోవుటచే పురుషార్థము (మోక్షము) సిద్ధింపకపోవుట ఉపాసకులకు పామరులకు కూడ సమానమే. ఉపవాసము కంటె భిక్షమేలగునట్లు ఇతర విషయకర్మల కంటె ధ్యానము ఉపాసనము మేలు.

**పామరాణాం వ్యవహృతేర్వరం కర్మాద్యనుష్ఠితిః ।**
**తతోఽపి సగుణోపాస్తిర్నిర్గుణోపాసనా తతః ॥121॥**

*121.* పామరజనుల వలె వ్యవహరించుట కంటె శాస్త్ర విహిత కర్మలను అనుష్ఠించుట ఉత్తమము. కర్మానుష్ఠానము కంటె సగుణోపాసనము శ్రేష్ఠము. దాని కంటె నిర్గుణోపాసనము సర్వశ్రేష్ఠము.

**యావద్విజ్ఞానసామీప్యం తావచ్ఛ్రైష్ఠ్యం వివర్ధతే ।**
**బ్రహ్మజ్ఞానాయతే సాక్షాన్నిర్గుణోపాసనం శనైః ॥122॥**

*122.* బ్రహ్మజ్ఞానమునకు సమీపతరమగు కొలది ఆ సాధనము యొక్క శ్రేష్ఠత ఇనుమడించుచుండును. నిర్గుణోపాసన కాలక్రమమున సాక్షాత్తుగ బ్రహ్మజ్ఞానమే అగును.

**యథా సంవాది విభ్రాంతిః ఫలకాలే ప్రమాయతే ।**
**విద్యాయతే తథోపాస్తిర్ముక్తి కాలేఽతిపాకతః ॥123॥**

*123.* సంవాదిభ్రమ ప్రారంభమున భ్రమయేయైనను ఫలము సిద్ధించి

నపుడు యథార్థ జ్ఞానమే అగుచున్నది. అట్లే యథాకాలమున చక్కగా పక్వము చెందిన ఉపాసన బ్రహ్మవిద్య అగుచున్నది.

**సంవాది భ్రమతః పుంసః ప్రవృత్తస్యాన్యమానతః ।**
**ప్రమేతి చేత్తథోపాస్తిర్మాంతరే కారణాయతామ్ ॥124॥**

*124.* సంవాదిభ్రమచే ప్రేరితుడై కార్యరతుడైన పురుషుడు మరొక ప్రమాణముచే ఫలమునొందును గాని సంవాదిభ్రమచే కాదనినచో అట్లే నిర్గుణ ఉపాసనము కూడ నిదిధ్యాసమనే మరొక ప్రమాణమునకు కారణం కానిమ్ము.

**మూర్తిధ్యానస్య మంత్రాదేరపి కారణతా యది ।**
**అస్తు నామ తథాప్యత్ర ప్రత్యాసత్తిర్విశిష్యతే ॥125॥**

*125.* మూర్తిధ్యానము మంత్రములు మొదలగునవి కూడా మోక్ష కారణములే అనినచో అట్లే కానిమ్ము. అయినను నిర్గుణోపాసన సమీపతమమగు సాధనమగుటయే విశేషము.

**నిర్గుణోపాసనం పక్వం సమాధిః స్యాచ్ఛనైస్తతః ।**
**యః సమాధిర్నిరోధాఖ్యః సోఽనాయాసేన లభ్యతే ॥126॥**

*126.* నిర్గుణోపాసన మెల్లమెల్లగా పక్వమైనపుడు సమాధియగును. ఆ సమాధి సులభముగా నిరోధస్థితికి చేర్చును.

**వ్యాఖ్య:** నిర్గుణోపాసన సవికల్పసమాధిని కల్పించి తదుపరి నిర్వికల్ప సమాధియగును. దీనినే నిర్బీజసమాధియనీ అందురు. నిర్బీజసమాధిలో మనస్సున వాసనలు పూర్తిగా తొలగింపబడును. అపుడు అసంగమైన ఆత్మ బ్రహ్మము మాత్రమే మిగులును. అందుచేతనే ధ్యాతధ్యేయము అనే భేదము కూడ పూర్తిగా నశించును. నిరోధ శబ్దమునకర్థము అణచిపెట్టుటయని గాక వాసనలు తొలగించుట అని. నిరోధము సిద్ధింపగనే మెరపు మెరసినట్లు నిర్వికల్పమైన బ్రహ్మజ్ఞానము కలుగును. ఈ నిరోధము సిద్ధించుటకే మరల మరల నేను బ్రహ్మమును అనే వాసనను కల్పించుకొను చుండవలెను.

**నిరోధలాభే పుంసోఽన్తరసంగం వస్తు శిష్యతే ।**
**పునః పునర్వాసితేఽస్మిన్వాక్యాజ్జాయేత తత్త్వధీః ॥127॥**

*127.* మనస్సునందలి వాసనలన్నీ తొలగి నిరోధము సిద్ధించినపుడు అందు అసంగము అద్వయము అయిన వస్తువు మిగులును. దానినే మరల

మరల నిలుపుకొనుచు ఆ వాసననే కల్పించుకొనగా మహావాక్యముల వలన తత్త్వజ్ఞానము కలుగును.

**నిర్వికారాసంగ నిత్య స్వప్రకాశైక పూర్ణతాః ।**
**బుద్ధౌ ఝటితి శాస్త్రోక్తా ఆరోహంత్యవివాదతః ॥128॥**

*128.* శాస్త్రమునందు చెప్పబడిన నిర్వికారత్వము అసంగత నిత్యత స్వప్రకాశము అద్వయత్వము పూర్ణత అన్నీ తటాలున బుద్ధిగోచరములగును.

**యోగాభ్యాసస్త్వేతదర్థో౽మృత బింద్వాదిషు శ్రుతః ।**
**ఏవం చ దృష్టద్వారాపి హేతుత్వాదన్యతో వరమ్ ॥129॥**

*129.* అమృతబిందు తదితర ఉపనిషత్తులు ఈ ఉద్దేశముతోనే యోగ అభ్యాసమును ప్రోత్సహించును. కనుక ఇతర ఆరాధన, ఉపాసనల కంటె నిర్గుణ ఉపాసనయే శ్రేష్ఠమనుట స్పష్టము. చూ. అమృతబిందు ఉప. *7-9, 16-17.*

**ఉపేక్ష్య తత్తీర్థయాత్రాజపాదీనేవ కుర్వతామ్ ।**
**పిండం సముత్సృజ్య కరం లేఢీతి న్యాయ ఆపతేత్ ॥130॥**

*130.* అట్టి నిర్గుణోపాసనను ఉపేక్షించి తీర్థయాత్రలు జపము మొదలైనవి చేయువారు, మిఠాయిని వదలిపెట్టి చేయినాకికొను వారికి గుర్తునకు తెత్తురు.

**ఉపాసకానామప్యేవం విచారత్యాగతో యది ।**
**బాఢం తస్మాద్విచారస్యాసంభవేయోగ ఈరితః ॥131॥**

*131.* విచారమును వదలి నిర్గుణోపాసన చేయువారును ఇట్టివారే కదా అనినచో నిజమే. కనుకనే విచారణమునకు అసమర్థులైన వారికి మాత్రమే నిర్గుణోపాసన విధింపబడినది.

**బహువ్యాకుల చిత్తానాం విచారాత్తత్త్వధీర్నహి ।**
**యోగో ముఖ్యస్తతస్తేషాం ధీదర్పస్తేన నశ్యతి ॥132॥**

*132.* మిక్కిలి చంచలమనస్కులైన వారికి విచారణముచే తత్త్వజ్ఞానము అసంభవము. అట్టివారికి యోగమే ముఖ్యసాధనము. యోగము వలన మనస్సు నిశ్చలమగును.

**అవ్యాకులధియాం మోహమాత్రేణాచ్ఛాదితాత్మనామ్ ।**
**సాంఖ్యనామా విచారః స్యాన్ముఖ్యో ఝటితి సిద్ధితః ॥133॥**

*133.* నిశ్చలమైన మనస్సుగల వారికి అజ్ఞానముచే మాత్రము ఆవరించబడిన ఆత్మ గలవారికి సాంఖ్యమనే పేరు గల విచారణ మార్గము సూచింపబడినది. అది శీఘ్రముగ సిద్ధినొసగును.

**యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం తద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥134॥**

*134.* సాంఖ్యమార్గమున లభించే స్థానమే యోగమార్గమున కూడ లభించును. సాంఖ్యము యోగము ఒకటియే అని తెలిసికొనినవాడు నిజముగ తత్త్వమును తెలిసికొనును. భగవద్గీత *5.5*

**తత్కారణం సాంఖ్యయోగాధిగమ్యమితి హి శ్రుతిః ।**
**యస్తు శ్రుతేర్విరుద్ధః స ఆభాసః సాంఖ్య యోగయోః ॥135॥**

*135.* బ్రహ్మజ్ఞానము సాంఖ్యయోగములచే సిద్ధించునని శ్రుతి. కాని సాంఖ్యయోగ గ్రంథములందు వేద విరుద్ధములైన విషయములు మిథ్యా వాక్యములు అగుటచే త్యాజ్యములు.

**ఉపాసనం నాతి పక్వమిహ యస్య పరత్ర సః ।**
**మరణే బ్రహ్మలోకే వా తత్త్వం విజ్ఞాయ ముచ్యతే ॥136॥**

*136.* ఉపాసన ఈ జీవితమున పక్వముగాని పురుషుడు పరలోకమున గాని మరణసమయమునగాని బ్రహ్మలోకమునందుగాని తత్త్వమును తెలిసి కొని ముక్తినొందును.

**యం యం వాపి స్మరన్ భావం త్యజన్త్యంతే కలేవరమ్ ।**
**తం తమేవైతి యచ్చిత్తస్తేన యాతీతి శాస్త్రతః ॥137॥**

*137.* మరణసమయమునందు దేనిని చింతించునో పురుషుడు దానినే పొందునని భగవద్గీత చెప్పును. శ్రుతి కూడా చిత్తము దేనియందు లగ్నమై ఉండునో అచటికే పోవునని చెప్పుచున్నది. భగవద్గీత *8.6;* ప్రశ్న ఉప. *3.10;* చూ. ఛాందోగ్య ఉప. *3.14.1;* బృహదారణ్యక ఉప. *4.4.5-6.*

**అంత్యప్రత్యయతో నూనం భావి జన్మ తథా సతి ।**
**నిర్గుణప్రత్యయోఽపి స్యాత్సగుణోపాసనే యథా ॥138॥**

*138.* కనుక మరణకాలమున పురుషుడు దేనిని చింతించునో దానిపై మరుజన్మ ఆధారపడి ఉండును. మూర్తిధ్యానము చేసే భక్తుడు ఆ మూర్తి

*యందు లీనమగును. నిర్గుణోపాసకుడు బ్రహ్మమునందు లీనుడై ముక్తుడగును.*

**నిత్యనిర్గుణ రూపం తన్నామమాత్రేణ గీయతామ్ ।**
**అర్థతో మోక్ష ఏవైష సంవాదిభ్రమవన్మతః ॥139॥**

*139. నిత్యము నిర్గుణము అని బ్రహ్మము వర్ణింపబడుగాక. నిజమునకు అది మోక్షస్వరూపమే. ఇష్టఫలమునిచ్చు సంవాదిభ్రమ పేరునకు మాత్రమే భ్రమ గదా!*

**వ్యాఖ్య:** బ్రహ్మము ఎన్ని విధముల వర్ణింపబడినా బ్రహ్మజ్ఞానికి లభించునది మోక్షము. కనుక బ్రహ్మము మోక్షస్వరూపమనుట సరైన వర్ణన.

అట్లే వాంఛితఫలమునొసగే భ్రమ సంవాదిభ్రమ అనబడినది. అట్టి ఫలమును ఈయనిచో అది విసంవాది భ్రమ. భ్రమా, అనగా యధార్థజ్ఞానము, కూడ వాంఛితఫలము నిచ్చును. నిర్వచనము ప్రకారము ఎల్లప్పుడు వాంఛితఫలమును ఇచ్చు సంవాది భ్రమ, భ్రమయెట్లగును? అది యథార్థజ్ఞానమే అనవచ్చును గదా!

**తత్సామర్థ్యా జ్జాయతే ధీర్మూలావిద్యానివర్తికా ।**
**అవిముక్తోపాసనేన తారకబ్రహ్మ బుద్ధివత్ ॥140॥**

*140. సగుణబ్రహ్మోపాసనచే ఈశ్వరస్వరూపమును గూర్చిన జ్ఞానము కలిగినట్లు నిర్గుణోపాసన వలన నిర్గుణబ్రహ్మము గూర్చిన జ్ఞానము కలుగును. ఈ జ్ఞానము అజ్ఞానమును నిర్మూలించి మోక్షము నొసగును.*

**సోఽకామో నిష్కామ ఇతి హ్యశరీరో నిరింద్రియః ।**
**అభయం హీతి ముక్తత్వం తాపనీయే ఫలం శ్రుతమ్ ॥141॥**

*141. బ్రహ్మమును ధ్యానించే ఉపాసకుడు, అసంగము కామనా రహితము అశరీరము ఇంద్రియ రహితము అభయము అగు బ్రహ్మమే అగునని నృసింహ ఉత్తరతాపనీయ ఉపనిషత్తు (5,7,8) చెప్పుచున్నది.*

**ఉపాసనస్య సామర్థ్యాద్విద్యోత్పత్తిర్భవేత్తతః ।**
**నాన్యః పంథా ఇతి హ్యేతచ్ఛాస్త్రం నైవ విరుధ్యతే ॥142॥**

*142. నిర్గుణోపాసనా బలముచే బ్రహ్మజ్ఞానము కలుగును. కనుక మోక్షమునకు వేరు మార్గము లేదు అనే శ్రుతితో విరోధము లేదు. శ్వేతాశ్వతర ఉప. 3.8; 6.15.*

**నిష్కా మోపాసనాన్ముక్తిస్తాపనీయే సమీరితా ।**
**బ్రహ్మలోకః సకామస్య శైబ్యప్రశ్నే సమీరితః ॥143॥**

*143.* కామనారహితమైన ఉపాసనచే ముక్తి లభించునని తాపనీయోప నిషత్తు చెప్పుచున్నది. సకామమైన ఉపాసన వలన బ్రహ్మలోకము సిద్ధించునని ప్రశ్నోపనిషత్తు ఉపదేశించుచున్నది.

**య ఉపాస్తే త్రిమాత్రేణ బ్రహ్మలోకే స నీయతే ।**
**స ఏతస్మా జ్జీవఘనాత్పరం పురుషమీక్షతే ॥144॥**

*144.* సకామముగ ప్రణవమును ధ్యానించేవాడు బ్రహ్మలోకమునకు కొనిపోబడుననీ అచ్చట హిరణ్యగర్భునకు అతీతమగు నిర్గుణ బ్రహ్మమును తెలిసికొని ముక్తుడగుననీ ప్రశ్నోపనిషత్తునందు *(5.5)* చెప్పబడినది.

**అప్రతీకాధికరణే తత్క్రతుర్న్యాయ ఈరితః ।**
**బ్రహ్మలోకఫలం తస్మాత్సకామస్యేతి వర్ణితమ్ ॥145॥**

*145.* బ్రహ్మసూత్రములందు *(4.3.15)* అప్రతీకాధికరణమున బ్రహ్మ లోకమును కోరుచు సకామముగ నిర్గుణ బ్రహ్మమును ధ్యానించువాడు అచటికే పోవునని చెప్పబడినది.

**నిర్గుణోపాస్తి సామర్థ్యాత్తత్ర తత్త్వమవేక్షతే ।**
**పునరావర్తతే నాయం కల్పాంతే చ విముచ్యతే ॥146॥**

*146.* నిర్గుణోపాసనా బలమున బ్రహ్మలోకమున తత్త్వజ్ఞానము పొందును. అతనికిక పునర్జన్మ లేదు. కల్పాంతమున విముక్తుడు కూడ నగును. ఛాందోగ్య ఉప. *4.15.5; 5.10.2*

**ప్రణవోపాస్తయః ప్రాయో నిర్గుణా ఏవ వేదగాః ।**
**క్వచిత్సగుణతాఽప్యుక్తా ప్రణవోపాసనస్య హి ॥147॥**

*147.* వేదమున చెప్పబడిన ప్రణవోపాసనలు సాధారణముగ నిర్గుణోపాసనలే. అచ్చటచ్చట అది సగుణోపాసనగ కూడ చెప్పబడినది.

**పరాపరబ్రహ్మరూప ఓంకార ఉపవర్ణితః ।**
**పిప్పలాదేన మునినా సత్యకామాయ పృచ్ఛతే ॥148॥**

*148.* సత్యకాముడనే శిష్యుడడుగగా పిప్పలాదమహర్షి ఓంకారమునకు

*సగుణ బ్రహ్మము నిర్గుణబ్రహ్మముకూడ యని యర్థము చెప్పును. ప్రశ్న ఉప. 5.2*

**ఏతదాలంబనం జ్ఞాత్వా యోయదిచ్ఛతి తస్యతత్ ।**
**ఇతి ప్రోక్తం యమేనాపి పృచ్ఛతే నచికేతసే ॥149॥**

*149. నచికేతుని ప్రశ్నకు యముడు కూడా ఓంకారమును నిర్గుణ బ్రహ్మమని ధ్యానించువాడు ఇష్టార్థసిద్ధి నొందునని చెప్పెను. కఠ ఉప. 1.2.16-17.*

**ఇహ వా మరణే వాస్య బ్రహ్మలోకేఽథవా భవేత్ ।**
**బ్రహ్మ సాక్షాత్కృతిః సమ్యగుపాసీనస్య నిర్గుణమ్ ॥150॥**

*150. నిర్గుణబ్రహ్మమును చక్కగా ధ్యానించువాడు ఈ లోకమునగాని మరణకాలమునగాని బ్రహ్మలోకమునగాని బ్రహ్మసాక్షాత్కారము నొందును.*

**అర్థోఽయమాత్మగీతాయామపి స్పష్టముదీరితః ।**
**విచారాక్షమ ఆత్మాన ముపాసీతేతి సంతతమ్ ॥151॥**

*151. విచారణను అభ్యసింపలేనివారు ఆత్మను ధ్యానింపవలెనని ఆత్మగీత యందు స్పష్టముగ చెప్పబడినది. ఆత్మగీత లేక ఆత్మపురాణము 131. (భారతీతీర్థులకు విద్యారణ్యులకు పూర్వము శృంగేరి మఠాధిపతులైన శంకరానందులు గాని విద్యాశంకరులుగాని దీనిని రచించిరి.)*

**సాక్షాత్కర్తుమశక్తోఽపి చింతయేన్మామశంకితః ।**
**కాలేనానుభవారూఢో భవేయం ఫలితో ధ్రువమ్ ॥152॥**

*152. (ఆత్మ అనుచున్నది:) నన్ను సాక్షాత్కరించుకొనుటకు అశక్తుడనైనను నిస్సంశయముగ ధ్యానింపుము. యథాకాలమున నేను అనుభవమునకు రాగలను.*

**యథాఽగాధనిధేర్లబ్ధౌ నోపాయః ఖననం వినా ।**
**మల్లాభేఽపి తథా స్వాత్మ చింతాం ముక్త్వా న చాపరః ॥153॥**

*153. భూగర్భమున ఉన్న నిధిని పొందవలెనన్న త్రవ్వుట తప్ప మరొక ఉపాయము లేదు. అట్లే నన్ను (ఆత్మను) పొందవలెనన్న ఆత్మచింతన తప్ప వేరే ఉపాయము లేదు. చూ. వివేకచూడామణి 65.*

**దేహోపలమపాకృత్య బుద్ధికుద్దాలకాత్పునః ।**
**ఖాత్వామనోభువం భూయోగృహ్ణీయాన్మాం నిధిం పుమాన్ ॥154॥**

*154. దేహబుద్ధియనే రాళ్ళను మనస్సు నుండి తొలగించి బుద్ధి అనే గునపముతో మనస్సనెడి భూమిని త్రవ్వి నిధినగు నన్ను (ఆత్మను) మానవుడు పొందగలడు.*

**అనుభూతేరభావేఽపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్ ।**
**అప్యసత్ప్రాప్యతే ధ్యానాన్నిత్యాప్తం బ్రహ్మ కిం పునః ॥155॥**

*155. అనుభవము లేకున్నను నేను బ్రహ్మముననియే ధ్యానింపుము. ధ్యానము వలన ఇతరములు (దేవతాదులు) లభ్యమగుచుండగా నిత్యసిద్ధమగు బ్రహ్మమేల లభింపదు? ఆవశ్యము లభించును.*

**అనాత్మ బుద్ధిశైథిల్యం ఫలం ధ్యానాద్దినే దినే ।**
**పశ్యన్నపి న చేద్ధ్యాయేత్కోఽపరోఽస్మాత్పశుర్వద ॥156॥**

*156. ధ్యానము వలన అనాత్మయే ఆత్మయనే బుద్ధి దినదినమునకు నశించునని తెలిసికొనియు సోమరియై ధ్యానింపకున్నచో అతని కంటె పశువు వేరొకటున్నదా?*

**దేహాభిమానం విధ్వస్య ధ్యానాదాత్మాన మద్వయమ్ ।**
**పశ్యన్మర్త్యోఽమృతో భూత్వా హ్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥157॥**

*157. దేహాత్మ బోధను నశింపజేసి ధ్యానము ద్వారా అద్వయమగు ఆత్మను దర్శించి మానవుడు అమరుడై ఈ శరీరముననే బ్రహ్మసాక్షాత్కారము నొందును.*

**ధ్యానదీపమిమం సమ్యక్పరామృశతి యో నరః ।**
**ముక్త సంశయ ఏవాయం ధ్యాయతి బ్రహ్మ సంతతమ్ ॥158॥**

*158. ధ్యానదీపమనే ఈ ప్రకరణమును చక్కగా విచారించు పురుషుడు సర్వసంశయములు తొలగి బ్రహ్మమునే సంతతము ధ్యానించుచుండును.*

**నవమ ప్రకరణము : సమాప్తము**

# దశమము: నాటక దీప ప్రకరణము

**పరమాత్మాఽద్వయానందపూర్ణః పూర్వం స్వమాయయా ।**
**స్వయమేవ జగద్భూత్వా ప్రావిశజ్జీవ రూపతః ॥1॥**

*1.* సృష్టికి పూర్వము అద్వయము ఆనందస్వరూపము సంపూర్ణము అగు పరమాత్మయే ఉండెను. ఆ పరమాత్మ తన మాయచే తానే జగత్తుగ మారి అందు తానే జీవరూపమున ప్రవేశించెను.

**వ్యాఖ్య:** అద్వైతబోధసిద్ధికి ఆచార్యులు అద్వయతత్త్వముపై జీవ జగత్తులను ఆరోపించి, అధ్యారోపము చేసి, విచారణచే దానిని తొలగించి అనగా అపవాదము చేసి తత్త్వనిరూపణము చేయుదురు. ఆ క్రమమున ఇపుడు అధ్యాపరోపము ప్రదర్శింపబడుచున్నది. చూ. ఛాందోగ్య ఉప. 6.2.1; బృహదారణ్య ఉప. 3.9.34; 5.1.1; శ్వేతాశ్వతర ఉప. 4.10; తైత్తిరీయ ఉప. 2.7; 2.6

**విష్ణ్వాద్యుత్తమదేహేషు ప్రవిష్టో దేవతా భవత్ ।**
**మర్త్యాద్యధమదేహేషు స్థితో భజతి దేవతామ్ ॥2॥**

*2.* ఆ పరమాత్మ విష్ణువు మొదలగు ఉత్తమ దేహములందు ప్రవేశించి దేవతలయ్యెను. మానవులు మొదలగు అధమదేహములందుండి ఆ దేవతలను పూజించును.

**అనేక జన్మభజనాత్ స్వవిచారం చికీర్షతి ।**
**విచారేణ వినష్టాయాం మాయాయాం శిష్యతే స్వయమ్ ॥3॥**

*3.* అనేక జన్మములందు దేవతలను పూజించిన పిదప తన స్వరూపమును గూర్చి విచారింపగోరును. విచారణచే మాయ నశింపగా తానే (పరమాత్మయే) మిగులును.

**వ్యాఖ్య:** సంక్షేపముగ అపవాదక్రమము ప్రదర్శింపబడినది. దేవతా పూజ వలన క్రమముగా చిత్తశుద్ధి కలిగి విచారణకు ఇచ్ఛయు సామర్థ్యమును కలుగును. శ్రవణమననాదులైన విచారణ ద్వారా కలిగిన జ్ఞానముచే అజ్ఞానాది నామకమగు మాయ నశించును. అపుడు అద్వయము ఆనందపూర్ణము అగు పరమాత్మ శేషించును.

**అద్వయానందరూపస్య సద్వయత్వం చ దుఃఖితా ।**
**బంధః ప్రక్తః స్వరూపేణ స్థితిర్ముక్తిరితీర్యతే ॥4॥**

*4. అద్వయానందస్వరూపము అగు పరమాత్మ అనేకముగను దుఃఖము తోను ఉండుట బంధమనబడినది. తన నిజస్వరూపమున ఉండుట ముక్తి అనబడినది.*

**అవిచారకృతో బంధో విచారేణ నివర్తతే ।**
**తస్మాజ్జీవ పరాత్మానౌ సర్వదైవ విచారయేత్ ॥5॥**

*5. విచారణ (వివేకము) లేకపోవుట వలన బంధమేర్పడును. ఆ బంధము విచారణచే తొలగును. కనుక సర్వకాలమునందును జీవ పరమాత్మలను గూర్చి విచారించవలెను.*

**అహమిత్యభిమంతా యఃకర్తాసౌ తస్యసాధనమ్ ।**
**మనస్తస్య క్రియే అంతర్బహిర్వృత్తీ క్రమోత్థితే ॥6॥**

*6. 'నేను' అని అభిమానించువాడే కర్త. అతని సాధనమే మనస్సు. దాని క్రియలే క్రమముగా నేర్పడు అంతర్వృత్తులు బహిర్వృత్తులు.*

**అంతర్ముఖాహ మిత్యేషా వృత్తిః కర్తారముల్లిఖేత్ ।**
**బహిర్ముఖేదమిత్యేషా బాహ్యం వస్త్విదముల్లిఖేత్ ॥7॥**

*7. అంతర్ముఖమైన 'నేను' అనే వృత్తి కర్తను సూచించును. బహిర్ముఖమైన 'ఇది' అనే వృత్తి బాహ్యవస్తువులను కర్తకు తెలియజేయును.*

**ఇదమో యే విశేషాః స్యుర్గంధరూపరసాదయః ।**
**అసాంకర్యేణ తాన్భింద్యాత్ ఘ్రాణాదీంద్రియ పంచకమ్ ॥8॥**

*8. 'ఇది' అని సామాన్యముగ మనస్సుకు తెలిసిన వస్తువును విశేషముగ గంధము రూపము రసము స్పర్శ శబ్దము అని సంకరము లేక విభజించి ఘ్రాణము మొదలగు ఇంద్రియ పంచకము తెలుపును.*

**కర్తారం చ క్రియాం తద్వద్వ్యావృత్తవిషయానపి।**
**స్ఫోరయేదేకయత్నేన యోఽసౌ సాక్ష్యత్ర చిద్వపుః ॥9॥**

*9. కర్తను క్రియను దాని విషయములను కూడా ఒక్కసారిగనే స్ఫురింపజేయు చైతన్యము ఇచ్చట (వేదాంతమున) సాక్షి అనబడినది.*

**ఈక్షే శృణోమి జిఘ్రామి స్వాదయామి స్పృశామ్యహమ్ ।**
**ఇతి భాసయతే సర్వం నృత్యశాలాస్థదీపవత్ ॥10॥**

*10. నేను రూపమును చూచుచున్నాను, నేను శబ్దమును వినుచున్నాను, నేను గంధమును వాసన చూస్తున్నాను, నేను రసమును ఆస్వాదిస్తున్నాను, నేను శీతోష్ణాదులను స్పర్శిస్తున్నాను అనే త్రిపుటుల నన్నింటిని ఈ అవికారియైన సాక్షియే నృత్యశాలయందలి దీపము వలె ప్రకాశింప జేయును.*

**వ్యాఖ్య:** చూ. ఉపదేశసాహస్రి 18.120, 123. ద్రష్టదృశ్యము దర్శన క్రియ ఈ మూడూ కలిసి త్రిపుటి అనబడును. ఇట్లే ప్రతి ఇంద్రియమునకును త్రిపుటిని గ్రహింపవలెను. ఈ మూడింటిని ఒక్కసారిగనే సాక్షి స్ఫురింపజేస్తున్నది. అంతేగాక పంచేంద్రియములు కొనివచ్చే వివిధ అనుభవములను ఒక్కసారిగనే అనుభవించుట సాధ్యమగునదియు సాక్షి వలననే.

సాక్షి చేయునదేమీ లేదు. దాని సాన్నిధ్య మాత్రముననే అంతా జరుగు చుండును. నాట్యశాలలో దీపము విశేషముగ చేయునదేమీ లేదు. అది ఉండుట వలననే శాలయందలి అన్ని వస్తువులును కన్పించుచుండును. అట్లే సాక్షియు.

మనస్సునందలి వృత్తి క్షణికము. అంతఃకరణముపై సాక్షి యొక్క ప్రతిఫలనమైన చిదాభాస వృత్తితో కూడినదైనను వృత్తి ఉపశమించి నంతనే విషయమును కూడా కోలుపోవును. కనుక స్థాయియైన విషయజ్ఞానము కలుగునది నిత్యమగు సాక్షి ప్రభావముననే.

**నృత్యశాలాస్థితో దీపః ప్రభుం సభ్యాంశ్చ నర్తకీమ్ ।**
**దీపయేదవిశేషేణ తదాభావేఽపి దీప్యతే ॥11॥**

*11. నాట్యశాలలో దీపము ఆసీనులై ఉన్న ప్రభువును సభాసదులను నాట్యము చేయు నర్తకిని అందరిని సమానముగ ప్రకాశింపజేయును. వారెవ్వరును లేకపోయినను దీపము ప్రకాశించుచునే ఉండును.*

**అహంకారం ధియం సాక్షీ విషయానపి భాసయేత్ ।**
**అహంకారాద్యభావేఽపి స్వయం భాత్యేవ పూర్వవత్ ॥12॥**

*12. (అట్లే) సాక్షి అహంకారమును బుద్ధిని విషయములను కూడా భాసింపజేయును. అహంకారాదులు లేకున్నను స్వయముగ పూర్వము వలెనే భాసించుచునే ఉండును.*

**నిరంతరం భాసమానే కూటస్థే జ్ఞప్తి రూపతః ।**
**తద్భాసా భాసమానేయం బుద్ధిర్నృత్యత్యనేకథా ॥13॥**

*13. కూటస్థము నిర్వికారము అగు సాక్షి జ్ఞప్తి రూపమున అనగా స్వయం ప్రకాశమైన చైతన్యముగ భాసించుచుండగా దానిచే భాసితమైన ప్రకాశింప జేయబడిన బుద్ధి అనేక విధములుగ నర్తించును. బుద్ధి స్వతంత్రముగ ఏమీ చేయజాలదని భావము.*

**అహంకారః ప్రభుః సభ్యా విషయా నర్తకీ మతిః ।**
**తాలాదిధారీణ్యక్షాణి దీపః సాక్ష్యవభాసకః ॥14॥**

*14. జీవితమనే నాట్యశాలలో అహంకారమే ప్రభువు. సభికులే ఇంద్రియ విషయములు. నర్తకియే బుద్ధి. తాళము వేయువాడు మృదంగము వాయించు వాడు మొదలగునవే ఇంద్రియాలు. దీపమే అన్నింటిని ప్రకాశింపజేయు సాక్షి.*

**స్వస్థాన సంస్థితో దీపః సర్వతో భాసయేద్యథా ।**
**స్థిరస్థాయీ తథా సాక్షీ బహిరంతః ప్రకాశయేత్ ॥15॥**

*15. తన స్థానమున కదలక ఉండే దీపము సర్వత్ర అన్నింటిని ప్రకాశింప జేయునట్లే అవికార్యము అచలము అయిన సాక్షి లోపలి భావములను వెలుపలి విషయములను ప్రకాశింపజేయును.*

**బహిరంతర్విభాగోఽయం దేహాపేక్షో న సాక్షిణి ।**
**విషయా బాహ్యదేశస్థా దేహస్యాంతరహం కృతిః ॥16॥**

*16. లోపల-బయట అనే ఈ విభాగము దేహసంబంధమైనది. సాక్షి యందు లేదు. దేహమునకు వెలుపలి స్థలములందుండునవి విషయములు. దేహము లోపల ఉండునది అహంకారము.*

**అంతఃస్థా ధీః సహైవాక్షై ర్బహిర్యాతి పునః పునః ।**
**భాస్య బుద్ధిస్థచాంచల్యం సాక్షిణ్యారోప్యతే వృథా ॥17॥**

*17. లోపల ఉన్న బుద్ధి ఇంద్రియములతో గూడి పదే పదే వెలుపలికి*

పోవుచుండును. సాక్షిచే ప్రకాశితమగుచున్న ఈ బుద్ధి చాంచల్యమును ప్రజలు వ్యర్థముగ సాక్షిపై నారోపింతురు.

**గృహాంతరగతః స్వల్పో గవాక్షాదాతపోఽచలః ।**
**తత్ర హస్తే నర్త్యమానే నృత్యతీవాతపో యథా ॥18॥**

*18.* కిటికీ ద్వారా ఇంటిలోనికి వచ్చిన సూర్యకాంతికి స్వతఃచలనము లేదు. కాని దానిలో చేయిపెట్టి చేయి కదలించినచో సూర్యకాంతి కదలుచున్నట్లు కల్పించును.

**నిజస్థాన స్థితః సాక్షీ బహిరంతర్గమాగమౌ ।**
**అకుర్వ న్బుద్ధిచాంచల్యా త్కరోతీవ తథా తథా ॥19॥**

*19.* అట్లే తన స్థానమునందున్న సాక్షి లోపలికి వెలుపలికి రాకపోకలను చేయకున్నను బుద్ధి యొక్క చంచలత్వము వలన వచ్చుచుపోవుచున్నట్లు తోచును.

**న బాహ్యోనాంతరః సాక్షీ బుద్ధేర్దేశౌ హి తావుభౌ।**
**బుద్ధ్యా ద్యశేష సంశాంతౌ యత్ర భాత్యస్తి తత్ర సః ॥20॥**

*20.* సాక్షి చైతన్యము లోపలిది కానీ వెలుపలిది కానీ కాదు. ఈ రెండు పదములు మనస్సుకు సంబంధించినవి. ఆ మనస్సు సంపూర్ణముగ ఉపశాంత మైనపుడు సాక్షి ఎచ్చట ప్రకాశించునో అచ్చటనే ఉండును.

**దేశః కోఽపి న భాసేత యది తర్హ్యస్త్వదేశభాక్ ।**
**సర్వదేశ ప్రక్లుప్త్యైవ సర్వగత్వం న తు స్వతః ॥21॥**

*21.* (మనస్సు పూర్తిగ ఉపశమించినచో) ఏ ప్రదేశముగాని ఉండదనినచో ఉండకపోనిమ్ము. మనస్సు దేశమును సృష్టించుట చేతనే సాక్షి సర్వగతమున బడినది గాని స్వరూపముచేతకాదు.

**అంతర్బహిర్వా సర్వం వా యం దేశం పరికల్పయేత్ ।**
**బుద్ధిస్తద్దేశగః సాక్షీ తథా వస్తుషు యోజయేత్ ॥22॥**

*22.* లోపలగాని వెలుపలగాని బుద్ధి ఏ దేశమును కల్పించునో సాక్షి ఆ దేశమున వ్యాపించును. అట్లే విషయముల తోడను సాక్షి సంబంధపడును.

**యద్యద్రూపాది కల్ప్యేత బుద్ధ్యా తత్తత్ప్రకాశయన్ ।**
**తస్య తస్య భవేత్సాక్షీ స్వతో వాగ్బుద్ధ్యగోచరః ॥23॥**

*23.* *బుద్ధిచే కల్పింపబడిన రూపాదులను సాక్షి చైతన్యము స్వయముగ వాఙ్మనోతీతమై ఉండుచు, ప్రకాశింపజేయును.*

**కథం తాదృఙ్మయా గ్రాహ్య ఇతి చేన్మైవ గృహ్యతామ్ ।**
**సర్వగ్రహోప సంశాంతౌ స్వయమేవావశిష్యతే ॥24॥**

*24.* *అట్టి అగోచరమైన తత్త్వమును నేనెట్లు గ్రహింపగలనని నచో గ్రహింపవలదు. సకల గ్రహణములు పూర్తిగా ఉపశమించినపుడు ఆ చైతన్యము తానుగనే మిగిలియుండును.*

**న తత్ర మానాపేక్షాస్తి స్వప్రకాశ స్వరూపతః ।**
**తాదృగ్ వ్యుత్పత్త్య పేక్షా చేచ్ఛ్రుతిం పఠ గురోర్ముఖాత్ ॥25॥**

*25.* *ఆ చైతన్యము స్వయం ప్రకాశమగుట చేత దానిని నిరూపించుటకు మరొక ప్రమాణము అవసరము లేదు. ఈ సంగతి తెలియుటకు ప్రమాణము కావలసినచో గురు సాన్నిధ్యమున శ్రుతిని అధ్యయనము చేయుము.*

**యది సర్వగ్రహత్యాగోఽ శక్యస్తర్హి ధియం వ్రజ ।**
**శరణం తదధీనోఽ న్తర్బహిర్వైషోఽ నుభూయతామ్ ॥26॥**

*26.* *దృశ్యమగు ద్వైతజాతమును పరిత్యజించుట సాధ్యము కానిచో బుద్ధిని గూర్చి చింతింపుము. అంతర్బహిర్విషయములన్నీ దానిచే కల్పితములనీ అన్నింటికీ చైతన్యమే సాక్షియనియు గుర్తింపుము.*

**దశమప్రకరణము: సమాప్తము**

# ఏకాదశము : బ్రహ్మానందమున యోగానంద ప్రకరణము

**బ్రహ్మానందం ప్రవక్ష్యామి జ్ఞాతే తస్మిన్నశేషతః ।**
**ఐహికాముష్మికానర్థవ్రాతం హిత్వా సుఖాయతే ॥1॥**

*1. పరబ్రహ్మమగు ఆనందమును ఇపుడు చెప్పుచున్నాను. దీనిని నిశ్శేషముగ తెలిసికొనినచో పురుషుడు ఇహపరలోకములందలి తాపములను అన్నింటిని నశింపజేసి సుఖస్వరూపమగు బ్రహ్మమే అగును.*

**వ్యాఖ్య:** 'ఆనందోఽబ్రహ్మ' తైత్తిరీయ ఉప. 3.6.1

**బ్రహ్మవిత్పరమాప్నోతి శోకంతరతి చాత్మవిత్ ।**
**రసో బ్రహ్మ రసం లబ్ధ్వాఽఽనందీభవతి నాన్యథా ॥2॥**

*2. బ్రహ్మమును తెలిసికొనిన పురుషుడు సర్వోత్కృష్టమగు ఆనందమును పొందును. ఆత్మను తెలికొనిన పురుషుడు సకల శోకములను దాటిపోవును. ఆనందమే బ్రహ్మ. ఈ బ్రహ్మమును పొంది నిస్సీమము నిరతిశయము అగు ఆనందమును అనుభవించును. మరొక విధమున కాదు.*

**వ్యాఖ్య:** చూ. తైత్తిరీయ ఉప. 2.1.1, 2.7.1; ఛాందోగ్య ఉప. 7.1.3. తైత్తిరీయమున బ్రహ్మమునకు ఆత్మకు అబేధము సూచింపబడినది. ఈ బ్రహ్మాత్మైక్య జ్ఞానము కలిగితేనే పరమానందము కలుగుననీ ఆ జ్ఞానము లేనిచో అట్టి ఆనందము కూడా కలుగదనీ దృఢముగ చెప్పబడినది. శోకమనగా శోకమూలమగు సంసారము.

**ప్రతిష్ఠాం విందతే స్వస్మిన్యదా స్యాదథ సోఽభయః ।**
**కురుతేఽస్మిన్నంతరం చేదథ తస్య భయం భవేత్ ॥3॥**

*3.* తనయందే ఆత్మయందే ప్రతిష్ఠితుడైనపుడు పురుషుడు భయరహితుడు అగును. ఆత్మ నుండి ఎంత అల్పముగనైనను భేద దర్శనము చేసినచో ఇక సంసార ప్రయుక్తమగు భయము కలుగుచునే ఉండును.

చూ. తైత్తిరీయ ఉప. 2.7.1; బృహదారణ్యక ఉప. 1.4.2; కఠ ఉప. 2.1.10-11.

**వాయుః సూర్యో వహ్నిరింద్రో మృత్యుర్జన్మాంతరేంతరమ్ ।**
**కృత్వా ధర్మం విజానంతోఽప్యస్మాద్భీత్యా చరంతి హి ॥4॥**

*4. పూర్వ జన్మములందు అనేక సాధనలను చేసి వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు మృత్యువు మొదలగు స్థానములను పొందినవారు కూడా బ్రహ్మాత్మైక్య జ్ఞానము లేకపోవుటచే భయముతో తమ తమ ధర్మములను నెరవేర్తురు. చూ. తైత్తిరీయ ఉప. 2.8.1; కఠ ఉప. 2.3.*

**ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన ।**
**ఏతమేవ తపేన్నైషా చింతా కర్మాగ్ని సంభృతా ॥5॥**

*5. బ్రహ్మానందమును పొందిన పురుషుడు ఇహలోకమునందలి తాపత్రయమును గూర్చిగాని పారలౌకికమగు పాపమును గూర్చి గాని భీతిజెందడు. సాధారణ మానవులను దహించే సంశయాగ్ని, నేను మంచి చేసితినా చెడ్డ చేసితినా అనే సంశయాగ్ని, అతనిని తపింపజేయదు. చూ. తైత్తిరీయ ఉప. 2.9.1.*

**ఏవం విద్వాన్కర్మణీ ద్వే హిత్వాత్మానం స్మరేత్సదా ।**
**కృతే చ కర్మణీ స్వాత్మరూపేణైవైష పశ్యతి ॥6॥**

*6. ప్రత్యగాత్మ, బ్రహ్మము రెండూ ఏకమే అని తెలిసిన విద్వాంసుడు పుణ్యాపాపములనే రెండు కర్మలను పరిత్యజించి సదా ఆత్మసంస్థితుడై ఉండును. కర్మను నిర్వర్తించినను ఆ కర్మను కూడా ఆత్మస్వరూపముగనే దర్శించును.*

**వ్యాఖ్య:** చూ. బృహదారణ్యక ఉప. 2.4.4-7 పుణ్యాపాపములు కర్తృత్వబోధ ఉంటేనే కలుగును. నిరంతరముగ ఆత్మరతుడైన విద్వాంసునకు అది ఉండదు కనుక అతనిని, ఆ ఆత్మస్వరూపుని, పుణ్యాపాపములంటవు. ప్రారబ్ధవశమున మనశ్శరీరములు కర్మపరమైనట్లు ఇతరులకు కన్పించినను అతడు అట్టి కర్మను

కూడా ఆత్మగనే దర్శించును. సర్వము ఆత్మయే అయి ఉండగా దానికి భిన్నముగ మరొక దానిని దర్శించుటెట్లు?

**భిద్యతే హృదయగ్రంథిశ్ఛింద్యంతే సర్వసంశయాః ।**
**క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥7॥**

*7. పరమాత్మ సాక్షాత్కారము కలిగినపుడు హృదయగ్రంథి తెగిపోవును. ఆత్మను గూర్చిన సంశయములన్నీ తీరును. సంచిత కర్మలన్నీ నశించును.*

**వ్యాఖ్య:** ముండ. ఉప. 2.2.8 హృదయగ్రంథి అనగా బుద్ధి చిదాత్మల అన్యోన్యాధ్యాస.

**తమేవవిద్వానత్యేతి మృత్యుం పంథా న చేతరః ।**
**జ్ఞాత్వాదేవం పాశహానిః క్షీణైః క్లేశైర్న జన్మభాక్ ॥8॥**

*8. ఆ పరమాత్మను తెలిసికొనుట చేతనే పురుషుడు మృత్యువును అతిక్రమించును. మరొక మార్గము లేదు. జ్యోతిర్మయమైన ఆత్మను తెలిసికొనుటచే కామక్రోధాదులగు పాశములన్నీ నశించును. రాగద్వేషాది క్లేశములు నశింపగా పునర్జన్మకు హేతువు లేకపోవుటచే మరల జన్మింపడు. శ్వేతాశ్వతర ఉప. 6.15; 1.10*

**దేవం మత్వా హర్షశోకౌ జహాత్యత్రైవ ధైర్యవాన్ ।**
**నైనం కృతాకృతే పుణ్యపాపే తాపయతః క్వచిత్ ॥9॥**

*9. స్వయంప్రకాశమగు పరమాత్మను తెలుసుకున్న ధైర్యశాలి ఈ జన్మమునందే సుఖదుఃఖములకు అతీతుడగును. చేసినవిగాని చేయనివిగాని అయిన పాపపుణ్య కర్మముల గూర్చిన ఆలోచనల వలన అతడు సంతాపమును పొందడు. కఠ ఉప.1.2.12; బృహదారణ్యక ఉప. 4.4.22*

**ఇత్యాదిశ్రుతయో బహ్వ్యః పురాణైః స్మృతిభిః సహ ।**
**బ్రహ్మజ్ఞానేఽనర్థహాని మానందం చాప్యఘోషయన్ ॥10॥**

*10. ఇటువంటి అనేకములైన శ్రుతివాక్యములు స్మృతులు పురాణములు కూడా "బ్రహ్మజ్ఞానము వలన ఆత్యంతిక దుఃఖ నివృత్తి, పరమానంద ప్రాప్తి కలుగున"ని ఘోషించినవి.*

**ఆనంద స్త్రివిధో బ్రహ్మానందో విద్యాసుఖం తథా ।**
**విషయానంద ఇత్యాదౌ బ్రహ్మానందో వివిచ్యతే ॥11॥**

*11.* *బ్రహ్మానందము, విద్యానందము, విషయానందము అని ఆనందము మూడు విధములు. అందు ప్రథమమున బ్రహ్మానందము వివేచింపబడు చున్నది. (మూడు ప్రకరణములందు)*

**భృగుః పుత్రః పితుః శ్రుత్వా వరుణాద్బ్రహ్మలక్షణమ్ ।**
**అన్నప్రాణమనోబుద్ధీస్త్యక్త్వానందం విజజ్ఞివాన్ ॥12॥**

*12.* *తండ్రియగు వరుణుని వద్ద పుత్రుడగు భృగువు బ్రహ్మ స్వరూపమును గూర్చి వినెను. తదుపరి అన్నమయ, ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయ కోశములను వివేచించి పరిత్యజించి ఆనందమయ కోశమున బ్రహ్మమును తెలిసికొనెను. తైత్తిరీయ ఉప. 3*

**ఆనందాదేవ భూతాని జాయంతే తేన జీవనమ్ ।**
**తేషాం లయశ్చ తత్రాతో బ్రహ్మానందో న సంశయః ॥13॥**

*13.* *ఆనందము నుండే సకల భూతములు జనించును. ఆనందము నందే అవి జీవించును. ఆనందముననే అన్నీ లయించును. కనుక నిస్సంశయముగ ఆనందమే బ్రహ్మము. తైత్తిరీయ ఉప. 3.6.1; 2.7.1*

**భూతోత్పత్తేః పురా భూమా త్రిపుటీద్వైతవర్జనాత్ ।**
**జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయరూపా త్రిపుటీ ప్రలయే హి నో ॥14॥**

*14.* *పంచభూతముల ఉత్పత్తికి పూర్వము అనంతమగు బ్రహ్మము మాత్రమే ఉండెను. అప్పుడు జ్ఞాత జ్ఞానము జ్ఞేయవిషయము అనెడి త్రిపుటి లేకుండెను. కనుక ప్రళయమునందును ఆ త్రిపుటి ఉండదు. ఛాందోగ్య ఉప. 7.24.2*

**విజ్ఞానమయ ఉత్పన్నో జ్ఞాతా జ్ఞానం మనోమయః ।**
**జ్ఞేయాః శబ్దాదయో నైతత్త్రయ ముత్పత్తితః పురా ॥15॥**

*15.* *సృష్టియందు విజ్ఞానమయ కోశమే జ్ఞాత. మనోమయకోశమే జ్ఞానము. శబ్దము స్పర్శ మొదలగునవి జ్ఞేయవిషయములు. సృష్టికి పూర్వము ఈ మూడూ లేవు.*

**త్రయాభావే తు నిర్ద్వైతః పూర్ణ ఏవానుభూయతే ।**
**సమాధి సుప్తి మూర్ఛాసు పూర్ణః సృష్టేః పురా తథా ॥16॥**

*16.* ఈ మూడూ లేనపుడు అద్వితీయము అవిభాజ్యము అగు బ్రహ్మము మాత్రమే అనుభూతమగును. సృష్టికి పూర్వము బ్రహ్మమే ఉండెను. సమాధి సుషుప్తి మూర్ఛావస్థలయందూ బ్రహ్మమే ఉండును. చూ. ప్రశ్న ఉప. *4.1-2;* బృహదారణ్యక ఉప. *4.2.23-32;* కఠ ఉప. *2.2.8.*

**యో భూమా స సుఖం నాల్పే సుఖం త్రేధా విభేదిని ।**
**సనత్కుమారః ప్రాహైవం నారదాయాతిశోకినే ॥17॥**

*17.* అనంతమగు బ్రహ్మమునందే సుఖము కలదు. అల్పమగు త్రిపుటి యందు సుఖము లేదు. ఇట్లు అతి దుఃఖితుడగు నారదునకు సనత్కుమారుడు చెప్పెను. ఛాందోగ్య ఉప. *7.1.3; 7.23.1*

**సపురాణాన్పంచవేదాన్ శాస్త్రాణి వివిధాని చ ।**
**జ్ఞాత్వా ప్యనాత్మవిత్త్వేన నారదోఽతిశుశోచ హ ॥18॥**

*18.* పురాణములతో కూడా అయిదు వేదములను వివిధ శాస్త్రములను అభ్యసించినను ఆత్మజ్ఞానము లేకపోవుటచే నారదుడు మిక్కిలి శోకించెనని శ్రుతి. ఛాందోగ్య ఉప. *7.1.2*

**వేదాభ్యాసాత్పురా తాపత్రయమాత్రేణ శోకితా ।**
**పశ్చాత్త్వభ్యాస విస్మారభంగగర్వైశ్చ శోకితా ॥19॥**

*19.* వేదాభ్యాసమునకు పూర్వము అతనికి సాధారణమగు తాపత్రయము వలననే దుఃఖము కలిగెను. వేదాధ్యయనము చేసిన పిమ్మట దానిని అభ్యసించే పరిశ్రమ, మరచిపోవుట, వాదమున ఓడిపోవుట, గెలుచుట వలన గర్వించుట మొదలగు దుఃఖములు కూడా తోడయ్యెను.

**సోఽహం విద్వన్ప్రశోచామి శోకపారం నయాత్ర మామ్ ।**
**ఇత్యుక్తః సుఖమేవాస్య పారమిత్యభ్యధాదృషిః ॥20॥**

*20.* 'మహర్షీ, సకల శాస్త్ర విదుడనైనను నేను దుఃఖమగ్నుడనై ఉన్నాను. నన్ను ఈ దుఃఖసాగరమును తరింపజేయుము' అని నారదుడు ప్రార్థింపగా సనత్కుమార మహర్షి 'సుఖమే, బ్రహ్మానందమే, ఈ శోక సముద్రమునకు అవ్వలి తీరము' అని చెప్పెను. ఛాందోగ్య ఉప. *7.1.26*

**సుఖం వైషయికం శోక సహస్రేణావృతత్వతః ।**
**దుఃఖమేవేతి మత్వాహ నాల్పేఽస్తి సుఖమిత్యసౌ ॥21॥**

*21.* ఇంద్రియ విషయముల వలన కలిగే సుఖము, దుఃఖ సహస్రములతో ఆవరింపబడి ఉండుట చేత, దుఃఖమనియే భావించి సనత్కుమారుడు అల్పమునందు సుఖము లేదని చెప్పెను.

**నను ద్వైతే సుఖం మా భూదద్వైతేఽప్యస్తి నో సుఖమ్ ।**
**అస్తి చేదుపలభ్యేత తథా చ త్రిపుటీ భవేత్ ॥22॥**

*22. (ఆక్షేపము)* ద్వైతమునందు సుఖము లేక పోవచ్చును. అద్వైతమున కూడా సుఖము లేదు. ఉన్నచో లభింపవలెను. లభించినచో మరల సుఖము, సుఖించుట, సుఖించువాడు అనే త్రిపుటి ఏర్పడుచున్నది.

**మాస్త్వద్వైతే సుఖం కింతు సుఖమద్వైత మేవ హి ।**
**కిం మానమితి చేన్నాస్తి మానాకాంక్షా స్వయంప్రభే ॥23॥**

*23. (సమాధానము)* అద్వైతమున సుఖము లేకపోనిమ్ము. కాని అద్వైతమే సుఖము. దీనికేమి ప్రమాణమనినచో స్వయంప్రకాశమగు తత్త్వమునకు వేరు ప్రమాణము అవసరము లేదు. అద్వైతత్వమే సుఖ రూపమున ప్రకాశించునని భావము.

**స్వప్రభత్వే భవద్వాక్యం మానం యస్మాద్భవానిదమ్ ।**
**అద్వైత మభ్యుపేత్యాస్మిన్సుఖం నాస్తీతి భాషతే ॥24॥**

*24.* అద్వైతము స్వయంప్రకాశమనుటకు మీ వాక్యమే ప్రమాణము. మీరు అద్వైతస్థితిని అంగీకరించి అందు సుఖము మాత్రమే లేదనుచున్నారు.

**నాభ్యుపైమ్యహమద్వైతం తద్వచోఽనూద్య దూషణమ్ ।**
**వచ్మీతి చేత్తదా బ్రూహి కిమాసీద్వైతతః పురా ॥25॥**

*25. (ఆక్షేపము)* నేను అద్వైతమును అంగీకరించుట లేదు. నిరాకరింప వలసిన ప్రతిపాదనగా మాత్రమే స్వీకరించితిని. *(సమాధానము)* అయినచో ద్వైతమునకు పూర్వమేముండెనో చెప్పుము.

**కిమద్వైత ముతద్వైతమన్యో వా కోటిరంతిమః ।**
**అప్రసిద్ధో న ద్వితీయోఽనుత్పత్తేః శిష్యతేఽగ్రిమః ॥26॥**

*26.* అపుడు అద్వైతముండెనా ద్వైతముండెనా లేక రెండు కానిది మరొకటి ఉండెనా? రెండును కానిది లోకమున కన్పింపదు కనుక మూడవ

పక్షము అసంభవము. ఇంకను ఉత్పత్తి జరుగలేదు కనుక రెండవ పక్షము సిద్ధింపదు. ఇక మొదటి పక్షమే మిగులుచున్నది. అనగా సృష్టికి పూర్వం అద్వైతమే ఉండెను.

**అద్వైతసిద్ధిర్యుక్త్యైవ నానుభూత్యేతి చేద్వద ।**
**నిర్దృష్టాంతా సదృష్టాంతా వా కోట్యంతరమత్ర నో ॥27॥**

*27. అద్వైతము యుక్తిచేతనే తర్కముచేతనే సిద్ధించును. అది అనుభవమునకు రాదు అనినచో ఈ తర్కము దృష్టాంతరహితమా దృష్టాంత సహితమా చెప్పుము. మూడవ వర్గము లేదు కదా.*

**నానుభూతిర్న దృష్టాంత ఇతి యుక్తిస్తు శోభతే ।**
**సదృష్టాంతత్వపక్షేతు దృష్టాంత వద మే మతమ్ ॥28॥**

*28. అద్వైతము అనుభవమునకు రాదు. ఈ తర్కమునకు దృష్టాంతము కూడా లేదు అనినచో ఇట్టి తర్కము బహురమణీయము! దృష్టాంతమున్నచో అది ఏదో చెప్పు.*

**వ్యాఖ్య:** తర్కమున ప్రధానాంశము ఉదాహరణము. దానిని బట్టి తర్కించి ఒక నిర్ణయమునకు వచ్చుట జరుగును. "పర్వతమునందు అగ్ని కలదు, పొగ ఉండుట వలన, వంటయింటిలో వలె." ఇచ్చట వంట ఇల్లు ఉదాహరణము. అందు పొగ, అగ్ని ఉండుట వలన పర్వతమునందలి పొగను చూచి తర్కించి అందు అగ్ని ఉండవలెనని నిర్ణయము జరుగును. కనుక ఉదాహరణము లేకయే తర్కించుట అనగా అసంబద్ధప్రలాపమని సిద్ధాంతి అపహాసము చేయుచున్నాడు.

**అద్వైతః ప్రలయో ద్వైతానుపలంభేన సుప్తివత్ ।**
**ఇతి చేత్సుప్తిరద్వైతే త్యత్ర దృష్టాంత మీరయ ॥29॥**

*29. "ప్రళయమునందు అద్వైతము సిద్ధించును, ద్వైతము లేకపోవుట వలన, సుషుప్తి యందువలె", అనినచో సుషుప్తియందు అద్వైతము సిద్ధించుననుటకు దృష్టాంతము చెప్పుము.*

**వ్యాఖ్య:** అద్వైతము అనుభవమునకు రాదు అని ఆక్షేపించుటచే ప్రతివాది తన సుషుప్తిని దృష్టాంతముగ చెప్పజాలడు.

**దృష్టాంతః పరసుప్తిశ్చేదహో తే కౌశలమ్ మహత్ ।**
**యః స్వసుప్తిం న వేత్త్యస్య పరసుప్తౌ తు కా కథా ॥30॥**

*30.* ఇతరుల సుషుప్తియే ఉదాహరణమనినచో మీ తర్కనైపుణ్యము మహాద్భుతము కదా! తన నిద్ర గురించి తనకే తెలియకుండగా ఇతరుల నిద్ర గురించి ఇక చెప్పవలసినదేమి?

**నిశ్చేష్టత్వాత్పరః సుప్తో యథాహమితి చేత్తదా ।**
**ఉదాహర్తుః సుషుప్తేస్తే స్వప్రభత్వం బలాద్భవేత్ ॥31॥**

*31.* ప్రాణములుండగనే చేష్టలు దక్కి ఉండుట వలన ఇతరులు సుషుప్తి యందున్నారు, నా విషయమునందు వలె, అనినచో నీ విషయమున సుషుప్తి యొక్క స్వయంప్రకాశత్వము బలవంతముగ సిద్ధించుచున్నది.

**నేంద్రియాణి న దృష్టాంత స్తథాప్యంగీకరోషి తామ్ ।**
**ఇదమేవ స్వప్రభత్వం యద్భానం సాధనైర్వినా ॥32॥**

*32.* సుషుప్తిని తెలియజేయుటకు ఇంద్రియములు లేవు. అవి పని చేయుట లేదు. దృష్టాంతము లేదు, ఇతరుల సుషుప్తిని గూర్చి నీకు తెలియక పోవుట వలన. అయినను సుషుప్తి కలదని అందు అద్వైతము సిద్ధించుననీ అంగీకరిస్తున్నావు. ఇదే అద్వైతపు స్వయం ప్రకాశత్వము. జ్ఞాన సాధనములు లేకయే జ్ఞానము కలుగుటను స్వయం ప్రకాశమందురు.

**స్తామద్వైత స్వప్రభత్వే వద సుప్తౌ సుఖం కథమ్ ।**
**శృణు దుఃఖం తదానాస్తి తతస్తే శిష్యతే సుఖమ్ ॥33॥**

*33. (ఆక్షేపము)* సరి. సుషుప్తియందు అద్వైతము కలదనీ ఇది స్వయం ప్రకాశమనీ అంగీకరించితిమి. కాని అందు సుఖము కలుగుట ఎట్లు సిద్ధించును? *(సమాధానము)* వినుము. అప్పుడు దుఃఖము లేదు అందుచే సుఖమే మిగులును.

**అంధః సన్నప్యనంధః స్యాద్విద్ధోఽవిద్ధోఽథ రోగ్యపి ।**
**అరోగీతి శ్రుతిః ప్రాహ తచ్చ సర్వే జనా విదుః ॥34॥**

*34.* సుషుప్తియందు అంధులైనను అంధులు కారు, గాయపడినవారు అట్టి వారు కారు. అట్లే రోగులు కూడ రోగరహితులే అని శ్రుతి చెప్పును. అది అందరికీ తెలిసిన విషయమే. ఛాందోగ్య ఉప. *8.4.2; 8.10.3*

**న దుఃఖాభావ మాత్రేణ సుఖం లోష్టశిలాదిషు ।**
**ద్వయాభావస్య దృష్టత్వాదితి చేద్విషమం వచః ॥35॥**

*35.* *(ఆక్షేపము) దుఃఖము లేనంతమాత్రమున సుఖమున్నదనుటకు వీలులేదు. మట్టి, రాళ్ళలో ఈ రెండూ లేకుండుటను చూడగలము. (సమాధానము) ఇది విషమ దృష్టాంతము.*

**ముఖదైన్య వికాసాభ్యాం పరదుఃఖ సుఖోహనమ్ ।**
**దైన్యాద్యభావతో లోష్టే దుఃఖాద్యూహో న సంభవేత్ ॥36॥**

*36.* *ముఖమునందలి దీనత్వము వికాసములను బట్టి ఇతరుల దుఃఖమును సుఖమును ఊహింపవచ్చు. మట్టియందు దీనత మొదలగునవి లేకుండుటచే దాని సుఖదుఃఖములను ఊహింపలేము.*

**స్వకీయే సుఖదుఃఖే తు మోహనీయే తతస్తయోః ।**
**భావో వేద్యోఽనుభూత్యైవ తదభావోఽపి నాన్యతః ॥37॥**

*37.* *స్వంతములైన సుఖదుఃఖములు ఊహింపనక్కరలేదు. అవి ఉండుట అనుభవము చేతనే తెలియును. లేకపోవుట కూడా అనుభవము వలననే తెలియును. మరొక మార్గము లేదు.*

**తథాసతి సుషుప్తౌచ దుఃఖాభావోఽనుభూతిభిః ।**
**విరోధి దుఃఖరాహిత్యాత్సుఖం నిర్విఘ్నమిష్యతామ్ ॥38॥**

*38.* *కనుక సుషుప్తియందు దుఃఖము లేకుండుట అనుభవసిద్ధము. దుఃఖమునకు విరోధి సుఖమగుటచే దుఃఖము లేకుండుట వలన నిర్విఘ్నమైన సుఖము సిద్ధించుచున్నది.*

**మహత్తర ప్రయాసేన మృదుశయ్యాది సాధనమ్ ।**
**కుతః సంపాద్యతే సుప్తౌ సుఖం చేత్తత్ర నో భవేత్ ॥39॥**

*39.* *సుషుప్తియందు సుఖము కలుగనిచో దానికై ఎంతో కష్టపడి మెత్తటి పడక మొదలగు సాధనములను ఏల సంపాదింతురు?*

**దుఃఖ నాశార్థమేవైతదితి చే ద్రోగిణస్తథా ।**
**భవత్వరోగిణస్త్వేతత్సుఖాయైవేతి నిశ్చిను ॥40॥**

*40.* *(ఆక్షేపము) దుఃఖమును తొలగించుటకే. (సమాధానము) రోగుల విషయమున అట్లు కావచ్చును. ఆరోగ్యవంతులు కూడా అట్లు చేయుట సుఖము కొరకే అని తెలియుము.*

**తర్హి సాధనజన్య త్వాత్సుఖం వైషయికం భవేత్ ।**
**భవత్వేవాత్ర నిద్రాయాః పూర్వం శయ్యాసనాదిజమ్ ॥41॥**

*41.* (ఆక్షేపము) అయినచో ఈ సుఖము ఉపకరణముల వలన కలుగుటచే విషయ సుఖమగుచున్నది. (సమాధానము) నిద్రకు పూర్వము శయ్య మొదలగు వానిచే కలిగే సుఖము విషయసుఖమే కానిమ్ము.

**నిద్రాయాం తుసుఖం యత్తజ్జన్యతే కేన హేతునా ।**
**సుఖాభిముఖ ధీరాదౌ పశ్చాన్మజ్జేత్పరే సుఖే ॥42॥**

*42.* కాని నిద్రయందు కలిగే సుఖము మరి ఏ ఇతర కారణముల వలనను కలుగదు. సుఖమును బుద్ధిశరీరము మొదలగునవి శయ్యాదుల వలన నిద్రకు పూర్వము అనుభవింపగా నిద్రయందు జీవుడు స్వరూపమగు సుఖముననే లీనుడగును.

**జాగ్రద్వ్యావృత్తిభిః శ్రాంతో విశ్రమ్యాథ విరోధిని ।**
**అపనీతే స్వస్థచిత్తోఽనుభవేద్విషయే సుఖమ్ ॥43॥**

*43.* ప్రపంచవ్యాపారములచే అలసిపోయిన పురుషుడు విశ్రమించి సుఖమున కాటంకములను తొలగించును. స్వస్థచిత్తుడై మెత్తని పడక చల్లని గాలి మొదలగు విషయములందు సుఖమును అనుభవించును.

**ఆత్మాభిముఖధీవృత్తౌ స్వానందః ప్రతిబింబతి ।**
**అనుభూయైనమత్రాపి త్రిపుట్యా శ్రాంతి మాప్నుయాత్ ॥44॥**

*44.* తన ఆలోచనలను ఆత్మవైపుకు మరలించి బుద్ధి వృత్తులందు ప్రతిబింబించు ఆనందమును అనుభవించును. ఇచ్చట కూడా అనుభవము, అనుభోక్త, అనుభవించుట అనే త్రిపుటి వలన పరిశ్రాంతుడగును.

**తచ్ఛ్రమస్యాపనుత్త్యర్థం జీవో ధావేత్పరాత్మని ।**
**తేనైక్యం ప్రాప్య తత్రత్యో బ్రహ్మానందః స్వయంభవేత్ ॥45॥**

*45.* ఆ శ్రమను తొలగించుటకై జీవుడు పరమాత్మవైపు పరుగు తీయును. దానితో ఐక్యము నొంది తానే బ్రహ్మానందమగును. ఛాందోగ్య ఉప. *6.8.1*

**దృష్టాంతాః శకునిః శ్యేనః కుమారశ్చ మహానృపః ।**
**మహాబ్రాహ్మణ ఇత్యేతే సుప్త్యానందే శ్రుతీరితాః ॥46॥**

*46.* సుషుప్తియందలి ఆనందమునకు దృష్టాంతములుగా వేదమునందు డేగ పక్షి శిశువు మహారాజు బ్రహ్మజ్ఞానియు చెప్పబడిరి.

**శకునిః సూత్రబద్ధః సన్ దిక్షువ్యాపృత్య విశ్రమమ్ ।**
**అలబ్ధ్వా బంధనస్థానం హస్తస్తంభాద్యుపాశ్రయేత్ ॥47॥**

*47.* దారముతో కట్టబడిన పక్షి ఆహారాదులకై నాలుగు దిక్కులకు ఎగిరి విశ్రామస్థానము లభింపక తుదకు ఆధారస్థానమగు యజమాని చేతినో స్తంభమునో ఆశ్రయించి విశ్రమించును. ఛాందోగ్య ఉప. *6.8.2*

**జీవోపాధి మనస్తద్వద్ధర్మాధర్మ ఫలాప్తయే ।**
**స్వప్నే జాగ్రతి చ భ్రాంత్వా క్షీణే కర్మణి లీయతే ॥48॥**

*48.* జీవునకు ఉపాధియగు మనస్సు కూడా అట్లే ధర్మాధర్మముల వలన కలిగే పుణ్యాపాపముల ఫలమైన సుఖదుఃఖములను అనుభవించుటకై జాగ్రత్ స్వప్నావస్థలయందు పరిభ్రమించి ఆ కర్మక్షయించినపుడు ఉపాదాన కారణమగు అజ్ఞానమునందు లయించును. ఆ అజ్ఞానము కూడా లయము నొందినపుడు దానిచే ఉపహితుడైన జీవుడు పరబ్రహ్మమునందు లయించును.

**శ్యేనో వేగేన నీడైక లంపటః శయితుం వ్రజేత్ ।**
**జీవః సుప్త్యైతథా ధావేద్ బ్రహ్మానందైక లంపటః ॥49॥**

*49.* డేగ విశ్రమించుటకై వేగముగ తన గూటికి దూసికొని పోవును. అట్లే బ్రహ్మానందమును కోరే జీవుడు సుషుప్తి కొరకై పరుగుతీయును. బృహదారణ్యక ఉప. *4.3.19*

**అతిబాలః స్తనంపీత్వా మృదుశయ్యాగతో హసన్ ।**
**రాగద్వేషాద్యనుత్పత్తేరానందైక స్వభావభాక్ ॥50॥**

*50.* శిశువు తల్లిపాలను త్రాగి మెత్తటి పడకపై నవ్వుచు పరుండి రాగద్వేషాదులు లేకపోవుట చేత స్వభావమగు ఆనందమునే అనుభవించు చుండును. బృహదారణ్యక ఉప. *2.1.9 (51, 52* శ్లోకములకు కూడా ఇదే.*)*

**మహారాజః సార్వభౌమః సంతృప్తః సర్వభోగతః ।**
**మానుషానందసీమానం ప్రాప్యానందైక మూర్తిభాక్ ॥51॥**

*51.* సార్వభౌముడైన మహారాజు సకల భోగముల చేతను సంతృప్తుడై

మానవులకు సాధ్యమగు ఆనందపుటెల్లలను చేరి మూర్తీభవించిన ఆనందమే అగును.

**మహావిప్రో బ్రహ్మవేదీ కృతకృత్యత్వ లక్షణామ్ ।**
**విద్యానందస్య పరమాం కాష్ఠాం ప్రాప్యావతిష్ఠతే ॥52॥**

*52.* బ్రహ్మవిదుడగు బ్రాహ్మణశ్రేష్ఠుడు సాధ్యమయినదంతా సిద్ధము చేసికొని జ్ఞానము వలన కలిగే ఆనందము యొక్క పరాకాష్ఠను చేరి అందు స్థితుడై ఉండును. ప్రత్యగభిన్నమైన బ్రహ్మసాక్షాత్కారము నొందిన బ్రాహ్మణుడు జీవన్ముక్తి నొంది పరమానంద స్వరూపుడై ఉండును.

**ముగ్ధబుద్ధాతిబుద్ధానాం లోకే సిద్ధా సుఖాత్మతా ।**
**ఉదాహృతానామన్యే తు దుఃఖినో న సుఖాత్మకాః ॥53॥**

*53.* అవివేకులు వివేకులు జ్ఞానులలో ఈ చెప్పబడినవారే సుఖవంతులు. ఇతరులు రాగి కారణములచే దుఃఖాభాజనులు.

**కుమారాదివదేవాయం బ్రహ్మానందైక తత్పరః ।**
**స్త్రీ పరిష్వక్తవద్వేద న బాహ్యం నాపి చాంతరమ్ ॥54॥**

*54.* శిశువు మొదలగువారి వలె సుషుప్తి నొందిన పురుషుడు కూడా బ్రహ్మానందమునే అనుభవించును. ప్రియురాలు కౌగిలించిన పురుషుని వలె అతడు బాహ్యవిషయములను ఆంతరవిషయములను మరచిపోయి ఆనందముననే మునిగి తేలుచుండును. బృహదారణ్యక ఉప. *4.3.21*

**బాహ్యం రథ్యాదిక వృత్త గృహకృత్యం యథాంతరమ్ ।**
**తథా జాగరణం బాహ్యం నాడీస్థః స్వప్న ఆంతరః ॥55॥**

*55.* వ్యవహారమున ఇంటివెలుపల వీథిలోని వృత్తాంతమును బాహ్యమనీ ఇంటిలోని గృహకృత్యములను ఆంతరమనీ అనినట్లే తాత్త్వికముగ జాగ్రదవస్థను బాహ్యమనీ స్వప్నావస్థను ఆంతరమనీ అనవచ్చును.

**పితాపి సుప్తావపితేత్యాదౌ జీవత్వవారణాత్ ।**
**సుప్తౌ బ్రహ్మైవ నో జీవః సంసారిత్వాసమీక్షణాత్ ॥56॥**

*56.* శ్రుతి కూడా సుషుప్తియందు జీవధర్మములగు తండ్రి మొదలగు సంబంధముంలు ఉండవని వారించుటచే ఆ స్థితిలో జీవుడు తన సంసారిత్వ మును కోలుపోయి బ్రహ్మముగనే నిలుచును. బృహదారణ్యక ఉప.*4.3.22*

**పితృత్వాద్యభిమానో యః సుఖదుఃఖాకరః స హి ।**
**తస్మిన్నపగతే తీర్ణః సర్వాన్ శోకాన్భవత్యయమ్ ॥57॥**

*57.* దేహాభిమానమే సంసార మూలమగుటచే దేహధర్మములగు పితృత్వాది సంబంధములను అభిమానించువాడు సంసారికములగు సుఖదుఃఖముల పాలగును. ఆ అభిమానము తొలగగా సర్వశోకములను తరించును.

**సుషుప్తికాలే సకలే విలీనే తమసావృతః ।**
**సుఖరూపముపైతీతి బ్రూతే యాజుషీయ శ్రుతిః ॥58॥**

*58.* యజుర్వేదమునందొక వాక్యమిట్లనును: 'సుషుప్తి సమయమున విషయములన్నీ లయమునొంది తమస్సు మాత్రమే ఆవరించి ఉండునపుడు జీవుడు సుఖస్వరూపుడై ఉండును.' కైవల్య ఉప. *13*

**సుఖమస్వాప్సమత్రాహం న వైకించిదవేదిషమ్ ।**
**ఇతి సుప్తే సుఖాజ్ఞానే పరామృశతి చోత్థితః ॥59॥**

*59.* సుషుప్తి నుండి జాగృతుడైన పురుషుడు సుఖముగ నిద్రించితిని ఏమీ తెలియలేదు అని తాననుభవించిన సుఖమును అజ్ఞానమును పరామర్శించును.

**పరామర్శోఽనుభూతేఽస్తీత్యాసీదనుభవస్తదా ।**
**చిదాత్మత్వాత్స్వతో భాతి సుఖమజ్ఞానధీస్తతః ॥60॥**

*60.* ఇట్టి పరామర్శ అనుభూత విషయములందే ఉండును కనుక సుఖానుభవము సుషుప్తియందు నిశ్చయముగనుండెను. సుఖము స్వయం ప్రకాశమగుటచే మనస్సు మొదలగు జ్ఞానసాధనములు లీనమైనను అనుభవమగును. స్వయంప్రకాశమగు సుఖము అనుభూతమగుట చేతనే తదావరకమగు అజ్ఞానము తెలియుచున్నది. సుఖము చిదాత్మయే అగుటచే అది స్వయంప్రకాశము.

**బ్రహ్మ విజ్ఞాన మానందమితి వాజసనేయినః ।**
**పఠంత్యతః స్వప్రకాశం సుఖం బ్రహ్మైవ నేతరత్ ॥61॥**

*61.* యజుర్వేదమునందలి వాజసనేయిశాఖ వారు 'బ్రహ్మము విజ్ఞాన స్వరూపము ఆనందస్వరూపము' అని పఠింతురు. కనుక స్వయంప్రకాశమైన సుఖము బ్రహ్మమేగాని ఇతరము కాదు. బృహదారణ్యక ఉప. *3.9.28*

**యదజ్ఞానం తత్రలీనౌ తౌ విజ్ఞానమనోమయౌ ।**
**తయోర్హి విలయావస్థా నిద్రాజ్ఞానం చ సైవ హి ॥62॥**

*62. అజ్ఞానమునందు విజ్ఞానమయ మనోమయ కోశములు లీనమై ఉండును. ఆ రెండూ లయమగు అవస్థనే నిద్రయందురు. నిద్రనే అజ్ఞానమనీ అందురు.*

**వ్యాఖ్య:** విజ్ఞానమయ కోశమగు జీవుడే సుఖమును అజ్ఞానమును అనుభవించుననే సంశయము వారింపబడినది. విజ్ఞాన, మనోమయ కోశములు రెండూ అజ్ఞానకార్యములే. నిద్రయందు అవి రెండూ తమ స్వరూపమును కోల్పోయి అజ్ఞానమునందు, తమ కారణమునందు, లయించును. కనుక స్వయం ప్రకాశమగు సుఖము భాసించుచు అజ్ఞానమును కూడా భాసింపజేయును.

**విలీన ఘృతవత్పశ్చాత్స్యాద్విజ్ఞానమయో ఘనః ।**
**విలీనావస్థ ఆనందమయ శబ్దేన కథ్యతే ॥63॥**

*63. కరిగిన నెయ్యి మరల ఘనీభవించినట్లు, స్వరూపమును కోల్పోయిన విజ్ఞానమయ కోశములు సుషుప్తి అంతరింపగనే మరల రూపు దాల్చును. ఆ రెండు కోశముల విలీనావస్తనే ఆనందమయ కోశమందురు.*

**సుప్తిపూర్వక్షణే బుద్ధివృత్తిర్యా సుఖబింబితా ।**
**సైవ తద్బింబసహితా లీనానందమయస్తతః ॥64॥**

*64. (విలీనావస్థ వివరింపబడుచున్నది:) నిద్రకు పూర్వక్షణమున బుద్ధి వృత్తి అంతర్ముఖమై స్వరూపమగు సుఖమును ప్రతిబింబించును. పిదప ఆ సుఖప్రతిబింబ సహితమైన బుద్ధివృత్తి నిద్రారూపమున లయము నొందును. ఆ విలీనావస్థ ఆనందమయ మనబడుచున్నది.*

**వ్యాఖ్య:** బుద్ధివృత్తులు జాగ్రత్స్వప్నావస్థల యందు బహిర్ముఖములై చిదాభాసతో కూడి ఉండును. ఈ చిదాభాస బాహ్యవిషయ జ్ఞానము కలిగించును. బుద్ధివృత్తి అంతర్ముఖమైనపుడు చిదాభాసతో కూడా మనస్సు మొదలగు జ్ఞాన సాధనములన్నీ బాహ్యములుగనే వదలివేయబడును. జ్ఞానస్వరూపము సుఖ స్వరూపము అగు సాక్షిచైతన్యమే అంతర్ముఖమైన బుద్ధివృత్తియందు ప్రతిఫలించి స్వయంవేద్యమగును. ఈ అంతర్ముఖమైన బుద్ధివృత్తి కూడా తన కారణమగు అజ్ఞానమునందు లయించుటచే నిద్ర సంభవించుచున్నది. కనుక నిద్రయందు

అజ్ఞానము మాత్రమే జీవబ్రహ్మము లను ఐక్యతను ఆవరించి ఉండును. కనుకనే నిద్ర బ్రహ్మానుభవమేయైనను అట్లని స్పష్టముగ తెలియదు.

**అంతర్ముఖో య ఆనందమయో బ్రహ్మ సుఖం తదా ।**
**భుంక్తే చిద్బింబయుక్తాభిరజ్ఞానోత్పన్న వృత్తిభిః ॥65॥**

*65. ఈ అంతర్ముఖమైన వృత్తి, ఆనందమయ కోశమనబడుచునది, అజ్ఞానము నుండి జనించిన వృత్తులతో చైతన్య ప్రతిబింబసహితమై బ్రహ్మసుఖము ననుభవించును.*

**అజ్ఞాన వృత్తయః సూక్ష్మావిస్పష్టా బుద్ధి వృత్తయః ।**
**ఇతి వేదాంత సిద్ధాంతపారగాః ప్రవదంతి హి ॥66॥**

*66. సూక్ష్మములు అతి స్పష్టములు అయిన బుద్ధివృత్తులే అజ్ఞానవృత్తులని వేదాంత సిద్ధాంతమును కూలంకషముగ ఎరిగినవారు చెప్పుదురు కదా.*

**మాండూక్య తాపనీయాది శ్రుతిష్వేతదతిస్ఫుటమ్ ।**
**ఆనందమయ భోక్తృత్వం బ్రహ్మానందే చ భోగ్యతా ॥67॥**

*67. ఈ విషయము మాండూక్య, తాపనీయ ఉపనిషత్తులందు స్పష్టముగ వివరింపబడినది. ఆనందమయ కోశమే భోక్త. బ్రహ్మానందమే భోగ్యవిషయము.*

**వ్యాఖ్య:** మాండూక్య ఉప. 5. ఆనందమయ కోశమునందు ప్రతిఫలించిన బ్రహ్మమే ప్రాజ్ఞుడు. అతడే భోక్త. అజ్ఞాన వృత్తులందు ప్రతిఫలించిన బ్రహ్మానందమే భోగ్యవిషయము.

**ఏకీభూతః సుషుప్తస్థః ప్రజ్ఞాన ఘనతాం గతః ।**
**ఆనందమయ ఆనందభుక్చేతోమయ వృత్తిభిః ॥68॥**

*68. సుషుప్తిలో ఆనందమయకోశం ఏకీభావము చెంది ఘనీభవించిన ప్రజ్ఞానమై చైతన్యమయమైన వృత్తుల ద్వారా బ్రహ్మానందాన్ని అనుభవించును.*

**వ్యాఖ్య:** ఇది మాండూక్యోపనిషత్తునందలి అయిదవ మంత్రమునకు వ్యాఖ్యానము. అందలి 'చేతోముఖః' అనే శబ్దమునకు బదులు ఇచ్చట 'చేతోమయ వృత్తిభిః' అనే శబ్దము చేర్చబడినది.

అజ్ఞానవృత్తులే చైతన్యమయమైన వృత్తులనుట విరుద్ధముగా తోచవచ్చును. కాని అజ్ఞానవృత్తులు చైతన్యముచే వ్యాపింపబడుట చేత చైతన్యవృత్తులనియే

చెప్పవలసివచ్చును. బుద్ధివృత్తులు బహిర్ముఖములు వానియందు చిదాభాస కూడుట చేత బాహ్య విషయజ్ఞానము కలుగును. బుద్ధివృత్తుల కంటె అతి సూక్ష్మములైనవి అజ్ఞానవృత్తులు. అంతేగాక అవి అంతర్ముఖములు కూడా. కనుక వాని యందు చైతన్యమే నేరుగా వ్యాపించును. చిదాభాస అచ్చట పనిచేయదు. కనుక అజ్ఞాన వృత్తులని జీవదృష్ట్యా చెప్పినను ప్రాచుర్యము చేత అవి చైతన్యమయమైన వృత్తులే.

పరమార్థమున బ్రహ్మము ఆనందము జ్ఞానము చైతన్యము అన్నీ పర్యాయ పదములే అగుటచేతను, అనిర్వచనీయమైన అజ్ఞానము ద్వైతమునకు ప్రథమ కారణమగుట చేతను, అజ్ఞానవృత్తులే చైతన్యమయవృత్తులనుట ఎంత విపరీతముగ తోచినను అనుభవమున సరియే అగును.

**విజ్ఞానమయ ముఖ్యైర్యో రూపైర్యుక్తః పురాధునా ।**
**స లయేనైకతాం ప్రాప్తో బహుతండుల పిష్టవత్ ॥69॥**

*69. పూర్వము విజ్ఞానమయాది బహురూపములను పొందిన చిదాభాస ఇపుడు ఏకత్వమునొంది ఘనీభవించి ముద్దచేసిన రొట్టెపిండి వలె ఉండును.*

**వ్యాఖ్య:** విజ్ఞానమయ కోశము వరకు చిదాభాస స్పష్టముగ ఉండి జీవుడనే పేరుతో అనేక వ్యవహారములను జాగ్రత్స్వప్నావస్థలయందు నడుపును. సుషుప్తి యందు చిదాభాస మాయమైనట్లే. దానికి బదులుగా ఘనీభవించిన ప్రజ్ఞానము అజ్ఞానవృత్తులయందు ప్రతిఫలించుచుండును.

**ప్రజ్ఞానాని పురా బుద్ధివృత్తయోథ ఘనోఽభవత్ ।**
**ఘనత్వం హిమబిందూనా ముదగ్దేశే యథా తథా ॥70॥**

*70. పూర్వము బుద్ధివృత్తులుగా ఉండినవే ఇప్పుడు సూక్ష్మములై ప్రజ్ఞాన రూపమున ఘనీభవించును. మంచుబిందువులు హిమాలయము లందు గడ్డ కట్టినట్లే.*

**వ్యాఖ్య:** జాగ్రదాది అవస్థలందు విషయములను గూర్చిన జ్ఞానము కలిగించే బుద్ధివృత్తులు ప్రజ్ఞానములనబడును. విషయ వైవిధ్యము వలన జాగ్రత్స్వప్నము లందు ప్రజ్ఞానములు అనేకములుగ ఉన్నా విషయశూన్యమగు సుషుప్తియందు అవి ఘనీభవించిన ప్రజ్ఞానమగును.

**తద్ఘనత్వం సాక్షిభావం దుఃఖాభావం ప్రచక్షతే ।**
**లౌకికాస్తార్కికా యావద్దుఃఖవృత్తి విలోపనాత్ ॥71॥**

*71.* వేదాంతమునందు సాక్షిభావమని చెప్పబడుచున్న ఈ ప్రజ్ఞాన ఘన మునే లౌకికులు తార్కికులు, దుఃఖవృత్తులు లోపించుటచే, దుఃఖాభావమనీ అందురు.

**అజ్ఞాన బింబితా చిత్స్యాన్ముఖమానందభోజనే ।**
**భుక్తం బ్రహ్మసుఖం త్యక్త్వా బహిర్యాత్యథ కర్మణా ॥72॥**

*72.* సుషుప్తియందు బ్రహ్మానందమును అనుభవించుటకు అజ్ఞానము నందు ప్రతిఫలించిన చైతన్యమే సాధనము. పుణ్యాపాప కర్మలచే ప్రేరితుడై ఆ బ్రహ్మానందమును వదలి మరల బహిర్ముఖతనొంది జాగ్రదాది అవస్థలలోనికి జీవుడు పోవును.

**కర్మ జన్మాంతరేఽభూద్యత్తద్యోగాద్బుధ్యతే పునః ।**
**ఇతి కైవల్యశాఖాయాం కర్మజో బోధ ఈరితః ॥73॥**

*73.* జీవుడు సుషుప్తి నుండి జాగ్రదవస్థకు పోవుట పూర్వజన్మ కర్మ వలన అని కైవల్యోపనిషత్తు చెప్పును. కనుక నిద్ర నుండి మేలుకొనుట కర్మఫలమని చెప్పబడినది. కైవల్య ఉప. *14*

**కంచిత్కాలం ప్రబుద్ధస్య బ్రహ్మానందస్య వాసనా ।**
**అనుగచ్ఛేద్యతస్తూష్ణీమాస్తే నిర్విషయః సుఖీ ॥74॥**

*74.* మేలుకొనిన పిదప అల్పసమయము వరకు ఆ బ్రహ్మానందవాసన అనుసరించవచ్చును. అందుచే ఆ సమయమున బాహ్య విషయములందు ఆసక్తి లేకయే స్వస్థుడుగా, ఆనందముగా ఉండును.

**కర్మభిః ప్రేరితః పశ్చాన్నానాదుఃఖాని భావయన్ ।**
**శనైర్విస్మరతి బ్రహ్మానందమేషోఽఖిలో జనః ॥75॥**

*75.* ఆ పైన ప్రారబ్ధ కర్మచే ప్రేరితుడై అనేకములైన బాధ్యతలను వానిని అనుసరించి వచ్చే దుఃఖములను గూర్చి చింతించుచు క్రమముగా ఆ బ్రహ్మానందమును మరచును.

**ప్రాగూర్ధ్వమపి నిద్రాయాః పక్షపాతో దినేదినే।**
**బ్రహ్మానందే నృణాం తేన ప్రాజ్ఞోఽస్మిన్వివదేత కః ॥76॥**

*76.* దినదినము నిద్రకు మునుపు పిదప కూడా ఇట్లు బ్రహ్మానందమును

*అనుభవించుచు మానవుడు దానియందొక అభిరుచి పెంచుకొనును. ఈ ఆనందమును ప్రాజ్ఞుడెవడు సంశయింపగలడు?*

**నను తూష్ణీం స్థితౌ బ్రహ్మానందశ్చేద్భాతి లౌకికాః ।**
**అలసాశ్చరితార్థాః స్యుః శాస్త్రేణ గురుణాత్ర కిమ్ ॥77॥**

*77. (ఆక్షేపము) ఊరకయుండుటయే బ్రహ్మానందానుభవమైనచో సోమరులు లౌకికులు చరితార్థులే అగుదురు. ఇక శాస్త్రముతోను గురువుతోను పనియేమి?*

**బాఢం బ్రహ్మేతి విద్యుశ్చేత్కృతార్థ స్తావతైవ తే ।**
**గురు శాస్త్రే వినాఽత్యంతం గంభీరం బ్రహ్మవేత్తి కః ॥78॥**

*78. (సమాధానము) అది బ్రహ్మానందమని తెలిసికొనగలిగినచో వారు కృతార్థులే అగుదురు. కాని అత్యంత గంభీరమగు బ్రహ్మతత్త్వమును గురూపదేశము శాస్త్రాధ్యయనము లేక ఎవరు తెలిసికొనగలరు?*

**జానామ్యహం త్వదుక్త్యాఽద్య కుతో మే న కృతార్థతా ।**
**శృణ్వత్ర త్వాదృశో వృత్తం ప్రాజ్ఞంమన్యస్య కస్యచిత్ ॥79॥**

*79. (ఆక్షేపము) నీ మాటల వలన బ్రహ్మమును గూర్చి నేను తెలిసి కొంటిని. ఇక నేను కృతార్థుడనేల కాకపోదును? (సమాధానము) తానే బుద్ధిశాలి ననుకొనిన నీవంటి వాని వృత్తాంతమొకటి చెప్పెదను వినుము.*

**చతుర్వేద విదే దేయమితి శృణ్వన్నవోచత ।**
**వేదాశ్చత్వార ఇత్యేవం వేద్మి మే దీయతాం ధనమ్ ॥80॥**

*80. నాలుగు వేదములు తెలిసినవానికి బహుమానమని ప్రకటింపగా విని ఇతడు 'వేదములు నాలుగని మీరు చెప్పగా నాకు తెలిసినది కనుక నాకు బహుమాన మీయవలసినది' అని అనెను.*

**సంఖ్యామేవవైష జానాతి న తు వేదానశేషతః ।**
**యది తర్హి త్వమప్యేవం నాశేషం బ్రహ్మవేత్సి హి ॥81॥**

*81. (ఆక్షేపము) అతడు సంఖ్యను మాత్రమే తెలిసికొనెను. సంపూర్ణముగ నాలుగు వేదములను తెలిసికొనలేదు. (సమాధానము) అట్లే నీవు కూడా బ్రహ్మమును సంపూర్ణముగ తెలిసికొనలేదు కదా.*

**అఖండైక రసానందే మాయా తత్కార్యవర్జితే ।**
**అశేషత్వ సశేషత్వ వార్తావసర ఏవ కః ॥82॥**

*82. (ఆక్షేపము) బ్రహ్మము అఖండము ఏకరసము అగు ఆనంద స్వరూపము. అందు మాయ, దాని వికారములు, వాసనా మాత్రముగనైన లేవు. అట్టి బ్రహ్మమును గూర్చిన జ్ఞానము సంపూర్ణము అసంపూర్ణము అనుటయే అనావశ్యకము గదా.*

**శబ్దానేవ పఠస్యాహో తేషామర్థం చ పశ్యసి ।**
**శబ్ద పాఠేఽర్థబోధస్తే సంపాద్యత్వేన శిష్యతే ॥83॥**

*83. (సమాధానము) నీవు ఊరకే ఈ శబ్దములను మాత్రము పలుకుచున్నావా లేక అర్థమును కూడా తెలిసికొంటివా? పదములను మాత్రమే పలికినచో వాని అర్థము తెలిసికొనుట అసంపూర్ణముగ మిగిలియున్నది.*

**అర్థే వ్యాకరణాద్బుద్ధేః సాక్షాత్కారోఽవశిష్యతే ।**
**స్యాత్కృతార్థత్వధీర్యావత్తావద్గురుముపాస్వభోః ॥84॥**

*84. వ్యాకరణాదుల సహాయంతో అర్థము తెలుసుకున్నా సాక్షాత్కారము మిగిలియే ఉండును. కనుక బ్రహ్మసాక్షాత్కారమై ఇక చేయవలసినదేమీ లేదని తెలియు వరకు గురువును ఉపాసింపుము. చూ. కఠ ఉప: 1.2.9*

**ఆస్తామేతద్యత్ర యత్ర సుఖం స్యాద్విషయైర్వినా ।**
**తత్ర సర్వత్ర విద్ధ్యేతాం బ్రహ్మానందస్య వాసనామ్ ॥85॥**

*85. ఈ శుష్క తర్కములు అట్లుంచి, ఎచ్చటెచ్చట విషయములు లేకయే ఆనందము కలుగుచున్నదో అచ్చటచ్చట బ్రహ్మానంద సంస్కారమే ఉన్నదని తెలిసికొనుము.*

**విషయేష్వపి లబ్ధేషు తదిచ్ఛోపరమే సతి ।**
**అంతర్ముఖ మనోవృత్తా వానందః ప్రతిబింబతి ॥86॥**

*86. బాహ్యవిషయములు లభించినపుడు కూడా వానిని గూర్చిన వాంఛ శాంతించినపుడు మనస్సు యొక్క వృత్తులు అంతర్ముఖములు కాగా అందు బ్రహ్మానందమే ప్రతిఫలించును.*

**బ్రహ్మానందో వాసనా చ ప్రతిబింబ ఇతి త్రయమ్ ।**
**అంతరేణ జగత్యస్మిన్నానందో నాస్తి కశ్చన ॥87॥**

*87.* కనుక బ్రహ్మానందము, వాసనానందము, విషయానందము అనే మూడు మాత్రమే తప్ప ప్రపంచమున వేరొక ఆనందము లేదు.

**తథా చ విషయానందో వాసనానంద ఇత్యముమ్ ।**
**ఆనందౌ జనయన్నాస్తే బ్రహ్మానందః స్వయంప్రభః ॥88॥**

*88.* ఇట్లుండగా, స్వయంప్రకాశమైన బ్రహ్మానందము వలన వాసనానందము విషయానందము అనే రెండూ కలుగుచుండును.

**శ్రుతియుక్త్యనుభూతిభ్యః స్వప్రకాశ చిదాత్మకే ।**
**బ్రహ్మానందే సుప్తికాలే సిద్ధే సత్యన్యదా శృణు ॥89॥**

*89.* శ్రుతి యుక్తి అనుభవములచే సుషుప్తికాలమున బ్రహ్మానందము స్వయంవేద్యమని సిద్ధించినది. ఇక ఇతర సమయములందు దాని అనుభవమున వినుము. మాండూక్య ఉప. *5;* కైవల్య ఉప. *13.*

**య ఆనందమయః సుప్తౌ స విజ్ఞానమయాత్మతామ్ ।**
**గత్వా స్వప్నం ప్రబోధం వా ప్రాప్నోతి స్థానభేదతః ॥90॥**

*90.* సుషుప్తియందు బ్రహ్మానందమును అనుభవించుచు ఆనందమయు డనబడే జీవుడు అవస్థాభేదము వలన విజ్ఞానమయుడై కర్మననుసరించి స్వప్నమునుగాని జాగ్రత్తను గాని పొందును.

**నేత్రే జాగరణం కంఠే స్వప్నః సుప్తిర్ హృదంబుజే ।**
**ఆపాదమస్తకం దేహం వ్యాప్య జాగర్తి చేతనః ॥91॥**

*91.* జీవుడు నేత్రమునందుండగా జాగ్రదవస్థయు కంఠమునందుండగా స్వప్నావస్థయు హృదయ పద్మము నందుండగా సుషుప్తావస్థయు కలుగును. జాగ్రదవస్థయందు జీవుడు శరీరమునందాపాదమస్తకము వ్యాపించి ఉండును. (నేత్రమనగా సర్వశరీరమని యర్థము.) చూ. ఐతరేయ ఉప. *1.3.12;* బ్రహ్మ ఉప. *3.7*

**దేహ తాదాత్మ్యమాపన్నస్తప్తాయః పిండవత్తతః ।**
**అహం మనుష్య ఇత్యేవం నిశ్చిత్యైవాతిష్ఠతే ॥92॥**

*92.* ఎర్రగా కాలిన ఇనుముతో అగ్ని తాదాత్మ్యము నొందినట్లు జీవుడు దేహముతో తాదాత్మ్యము నొంది 'నేను మనుష్యుడను' అని దృఢముగ నిశ్చయించి మనుష్యభావము నొందును. దృగ్దృశ్యవివేకము. *7*

**ఉదాసీనః సుఖీ దుఃఖీత్యవస్థాత్రయమేత్యసౌ ।**
**సుఖదుఃఖే కర్మకార్యే త్వౌదాసీన్యం స్వభావతః ॥93॥**

*93. జీవుడు ఉదాసీనత సుఖిత్వము దుఃఖిత్వము అనే మూడు స్థితులను పొందును. అందు ఔదాసీన్యము స్వభావసిద్ధము. సుఖదుఃఖాలు కర్మ ఫలాలు.*

**బాహ్యభోగాన్మనోరాజ్యాత్సుఖ దుఃఖే ద్విధా మతే ।**
**సుఖదుఃఖాంతరాలేషు భవేత్తూష్ణీమవస్థితిః ॥94॥**

*94. బాహ్య భోగముల వలన కలుగునవి, ఊహా ప్రపంచమునందలివి - అని సుఖదుఃఖములు రెండు విధములు. సుఖ దుఃఖముల వ్యవధానమున ఉదాసీన స్థితి కలుగుచుండును.*

**న కాపిచింతా మేఽస్త్యద్య సుఖమాస ఇతి బ్రువన్ ।**
**ఔదాసీన్యే నిజానందభావం వక్త్యఖిలో జనః ॥95॥**

*95. 'నాకిపు ఏ చింతా లేదు. సుఖముగ ఉన్నాను' అని ఉదాసీన స్థితి యందలి సహజమగు ఆనందమును సకలజనులు వర్ణింతురు.*

**అహమస్మీత్యహంకార సామాన్యాచ్ఛాదితత్వతః ।**
**నిజానందో న ముఖ్యోఽయం కింత్వసౌ తస్య వాసనా ॥96॥**

*96. కాని 'నేనున్నాను' అనే సామాన్యమగు అహంకారముచే ఆవరింప బడుట చేత జాగ్రదవస్థయందలి ఈ బ్రహ్మానందము, ముఖ్యముగాక వాసనానందము మాత్రమే అగుచున్నది.*

**నీరపూరితభాండస్య బాహ్యేశైత్యం న తజ్జలమ్ ।**
**కింతు నీరగుణస్తేన నీరసత్తాను మీయతే ॥97॥**

*97. నీరు నింపిన కుండ వెలుపల చల్లగానుండును. వెలుపల నీరు లేదు. కాని నీటి లక్షణమున్నది. దాని నుండి కుండలో నీరున్నదని అనుమానింతుము.*

**యావద్యావదహంకారో విస్మృతోఽభ్యాసయోగతః ।**
**తావత్తావ త్సూక్ష్మదృష్టే ర్నిజానందోఽనుమీయతే ॥98॥**

*98. అట్లే అభ్యాసబలముచే ఎంతగా అహంకారమును విస్మరింపగలిగిన అంతగా సూక్ష్మమైన మనస్సునందు బ్రహ్మానందము అభివ్యక్తమగునని అనుమానింప గలము. దీనికే నిజానందమని పేరు.*

**సర్వాత్మనా విస్మృతః సన్సూక్ష్మతాం పరమాంవ్రజేత్ ।**
**అలీనత్వాన్న నిద్రైషా తతో దేహోఽపి నో పతేత్ ॥99॥**

*99.* అహంకారము సంపూర్ణముగా విస్మరింపబడినపుడు చిత్తము కూడా పరమ సూక్ష్మతను చెందును. అనగా చిత్తసూక్ష్మతకు బ్రహ్మసాక్షాత్కారమే అవధి. అపుడు చిత్తము లయము నొందకుండుటచే అది నిద్రకాదు. శరీరము కూడా పతనము చెందదు.

**న ద్వైతం భాసతే నాపి నిద్రా తత్రాస్తి యద్సుఖమ్ ।**
**స బ్రహ్మానంద ఇత్యాహ భగవానర్జునంప్రతి ॥100॥**

*100.* ఏ ఆనందమున ద్వైతానుభవము ఉండదో నిద్ర కూడా కాదో ఆ ఆనందమే బ్రహ్మానందమని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు చెప్పెను.

**శనైః శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥101॥**

*101.* ధైర్యముతో నియమింపబడిన బుద్ధిచే వివేకముచే మనస్సును మెల్లమెల్లగా ఉపసంహరింపవలెను. అట్లు ఉపసంహరింపబడిన మనస్సును ఆత్మయందే నిలిపి మరి ఇతరమును చింతింపక ఉండవలెను. శ్లో. *101* నుండి *108* వరకు చూ. భగవద్గీత *6. 25-27, 20-23, 28*

**యతో యతోనిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ ।**
**తతస్తోతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥102॥**

*102.* చంచలము అస్థిరము అయిన మనస్సు బహిర్ముఖమైనపుడెల్ల దానిని మరలించి మరల ఆత్మవశమునకు కొనిరావలెను.

**ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥103॥**

*103.* ఇట్లు నిరంతరాభ్యాసము వలన అత్యంతము ఉపశమించిన మనస్సుగల యోగి రజోగుణము శాంతించిన యోగి నిర్మల చిత్తుడైన యోగి బ్రహ్మభూతుడై బ్రహ్మానందమును అనుభవించును.

**యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।**
**యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥104॥**

*104.* యోగాభ్యాసముచే ఏకాగ్రమై నిరోధింపబడిన మనస్సు ఎచ్చట ఉపశమించునో అచ్చట ఆత్మ చేతనే ఆత్మను దర్శించుచు యోగి ఆత్మయందే సంతుష్టుడగును.

**సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్ ।**
**వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥105॥**

*105.* ఇంద్రియాతీతము బుద్ధిమాత్ర గ్రాహ్యమగు ఆ పరమానందమును అనుభవించిన యోగి ఆ తత్త్వమునందే సుస్థిరుడై అందుండి ఇక చలింపడు.

**యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతేనాధికం తతః ।**
**యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥106॥**

*106.* ఈ ఆనందమును పొందిన పిదప ఇక దేనినిగాని దీనికి మించిన ఆనందమని భావింపడు. దీనియందు స్థితుడై ఎంతటి ఘోరదుఃఖము చేతనైనను విచలితుడు కాడు.

**తం విద్యా ద్దుఃఖ సంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।**
**స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥107॥**

*107.* దుఃఖ సంపర్కము నుండి వియోగమొందుటయే యోగము అనబడినది. అట్టి యోగమును దృఢనిశ్చయముతో విషాదము నొందని మనస్సుతో అభ్యసించవలెను.

**వ్యాఖ్య:** ఇచ్చట యోగమనగా ద్వైతభావమునుండి వియోగము.

**యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మసంస్పర్శం అత్యంతం సుఖమశ్నుతే ॥108॥**

*108.* ఈ విధముగ పాపరహితుడై సదా ఆత్మ సంస్థితుడై ఉండే యోగి బ్రహ్మైక్యమునొంది బ్రహ్మానందమును అనుభవించును.

**ఉత్సేక ఉదధేర్యద్వత్కుశాగ్రేణైక బిందునా ।**
**మనసో నిగ్రహస్తద్వద్భవేదపరిఖేదతః ॥109॥**

*109.* దర్భ మొనచే ఒక్కొక్క బిందువుగా సముద్రజలమును తిరుగ దోడుటకు ఎట్టి పట్టుదల నిర్విరామమైన ప్రయత్నము ఆవశ్యకమో అట్టి ఖేదము లేని ప్రయత్నము వలన మనోనిగ్రహము సాధ్యమగును. *గౌడపాదకారిక 3.41.*

**బృహద్రథస్య రాజర్షేః శాకాయన్యో మునిః సుఖమ్ ।**
**ప్రాహ మైత్రాఖ్య శాఖాయం సమాధ్యుక్తి పురఃసరమ్ ॥110॥**

*110.* యజుర్వేదములోని మైత్రాయణి ఉపనిషత్తునందు శాకాయన్య మహర్షి బృహద్రథుడను రాజర్షితో సమాధిని గూర్చి చెప్పుచు అందలి పరమానందమును వర్ణించును.

**యథా నిరింధనో వహ్నిః స్వయోనావుపశామ్యతి ।**
**తథా వృత్తిక్షయాచ్ఛిత్తం స్వయోనావుపశామ్యతి ॥111॥**

*111.* ఇంధనము లేని అగ్ని అది పుట్టినచోటనే శాంతించినట్లు చిత్త వృత్తులు నశించినపుడు చిత్తము కూడా తన ఉత్పత్తి స్థానమునందు అనగా సత్తామాత్రమునందు ఉపశమించును. శ్లో. *111* నుండి *118* వరకు మైత్రాయణి ఉప. *4.3.1-6, 11.9.* మైత్రేయ. ఉప. *1.3-7.*

**స్వయోనావుపశాంతస్య మనసః సత్యకామినః ।**
**ఇంద్రియార్థవిమూఢస్యానృతాః కర్మవశానుగాః ॥112॥**

*112.* సత్తామాత్రమున ఉపశమించిన మనస్సుగల తత్త్వవేత్తకు ఇంద్రియ విషయములు వాని వలన సుఖదుఃఖములు, కర్మవశమున కలుగుచున్నను, మిథ్యగనే భాసించును.

**చిత్తమేవ హి సంసారస్తత్ప్రయత్నేన శోధయేత్ ।**
**యచ్చిత్తస్తన్మయో మర్త్యో గుహ్యమేత త్సనాతనమ్ ॥113॥**

*113.* చిత్తమే సంసారము. దానిని అతిప్రయత్నముతో అభ్యాస వైరాగ్యము లతో రజస్త మనస్సులను కల్మషములను తొలగించి ఏకాగ్రము చేయవలెను. ఏలన తన చిత్తము దేనియందు లగ్నమై ఉండునో తనను దానినిగనే మర్త్యుడు భావించుకొనును. ఇదే అనాది సిద్ధమైన రహస్యము.

**వ్యాఖ్య:** ఆత్మ స్వాభావికంగా పరిశుద్ధము. చిత్తముతోడి సంపర్కము చేత దానికి సంసారిత్వము ఆపాదించబడుచున్నది. కనుక చిత్తశుద్ధి వలన ఆత్మ దర్శనము సిద్ధించునని భావము.

**చిత్తస్య హి ప్రసాదేన హన్తి కర్మ శుభాశుభమ్ ।**
**ప్రసన్నాత్మాఽఽత్మని స్థిత్వా సుఖమక్షయ్యమశ్నుతే ॥114॥**

*114.* చిత్తము ప్రశాంతమైనపుడు పుణ్యాపాప కర్మలు నశించును. ఆత్మయందు సంలగ్నమైన ఉపశాంత చిత్తము అక్షయమైన సుఖమును అనుభవించును. చూ. ఛాందోగ్య ఉప. *5.24.3*

**సమాసక్తం యథాచిత్తం జంతోర్విషయగోచరే ।**
**యద్యేవం బ్రహ్మణి స్యాత్తత్కో న ముచ్యేత బంధనాత్ ॥115॥**

*115.* ఇంద్రియ విషయములందు మానవుని మనస్సు లగ్నమగునట్లు బ్రహ్మమునందే లగ్నమైనచో బంధము నుండి ఎవడు ముక్తి నొందడు? అందరును ముక్తులగుదురని భావము.

**మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ ।**
**అశుద్ధం కామసంపర్కాచ్ఛుద్ధం కామవివర్జితమ్ ॥116॥**

*116.* మనస్సు శుద్ధము, అశుద్ధము అని రెండు విధములుగ చెప్పబడినది. కోరికలతో కూడిన మనస్సు అశుద్ధము. కోరికలు లేని మనస్సు శుద్ధము. అమృతబిందు ఉప.*1*

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।**
**బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥117॥**

*117.* బంధమునకు గాని, మోక్షమునకు గాని కారణము మనస్సు మాత్రమే. మనస్సు విషయాసక్తమైనచో బంధము కలిగించును. విషయ రహితమైన మనస్సు ముక్తికి దారి చూపును. మైత్రా ఉప. *4.3.11;* అమృతబిందు ఉప.*2*

**సమాధి నిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ ।**
**న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే॥118॥**

*118.* సమాధిని అభ్యసించుట చేత నిర్మూలింపబడిన రజస్తమస్సులు గల చిత్తము ప్రత్యక్స్వరూపమైన ఆత్మయందే స్థితమైనపుడు కలిగే ఆనందము వర్ణింపనలవిగాదు. దానిని ఆ అంతఃకరణమే స్వయముగ గ్రహింపగలదు. మైత్రా. ఉప. *4. 3. 9.*

**యద్యప్యసౌ చిరం కాలం సమాధిర్దుర్లభో నృణామ్ ।**
**తథాపి క్షణికోబ్రహ్మానందం నిశ్చాయయత్యసౌ ॥119॥**

*119.* మనస్సును సమాధియందు చిరకాలము ఉంచుట మానవులకు దుర్లభమే. కాని ఒక క్షణమైనను సమాధి సిద్ధించినచో అది బ్రహ్మానందము గురించి దృఢనిశ్చయము కలిగించును.

**శ్రద్ధాలు ర్వ్యసనీ యోఽత్ర నిశ్చినోత్యేవ సర్వథా ।**
**నిశ్చితే తు సకృత్తస్మిన్విశ్వసిత్యన్యదాప్యయమ్ ॥120॥**

*120.* బ్రహ్మానందమునందు శ్రద్ధ కలిగి, దానికై సర్వవిధముల ప్రయత్నించేవాడు అల్పసమయమైనా దానిని అనుభవించును. దానిచే ఇతర సమయములందు కూడా అది వాస్తవమే అని యతడు గుర్తించును.

**తాదృక్ పుమానుదాసీనకాలేఽప్యానందవాసనామ్ ।**
**ఉపేక్ష్య ముఖ్యమానందం భావయత్యేవ తత్పరః ॥121॥**

అట్టి పురుషుడు ఉదాసీనత స్థితియందు కలిగే వాసనానందమును ఉపేక్షించి ముఖ్యమగు బ్రహ్మానందము నందే భావించుచు తత్పరుడై ధ్యానించుచుండును.

**పర వ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి ।**
**తదేవాస్వాదయత్యంతః పరసంగ రసాయనమ్ ॥122॥**

*122.* జారిణియైన స్త్రీ ఇంటిపనులయందు మునిగి ఉన్నప్పటికీ లోలోపల జారునితోడి సౌఖ్యమునే ఆస్వాదించుచుండును.

**ఏవం తత్త్వే పరే శుద్ధే ధీరో విశ్రాంతి మాగతః ।**
**తదేవాస్వాదయత్యంతర్బహిర్వ్యవహరన్నపి ॥123॥**

*123.* అట్లే పరతత్త్వమునందు శాంతి నొందిన ధీరుడు బాహ్యాభ్యంతరములందు వ్యవహరించుచున్నను ఆ శుద్ధమగు పరతత్త్వమునే ఆస్వాదించుచుండును.

**ధీరత్వమక్షప్రాబల్యేఽప్యానందాస్వాదవాంఛయా ।**
**తిరస్కృత్యాఖిలాక్షాణి తచ్చింతాయాం ప్రవర్తనమ్ ॥124॥**

*124.* ఇంద్రియములెంత తీవ్రముగ విషయములను వాంఛించినా వానిని తిరస్కరించి సకలేంద్రియాలను బ్రహ్మచింతయందే నిలుపుటను ధీరత్వమనబడును.

**భారవాహీ శిరోభారం ముక్త్వాఽఽస్తే విశ్రమం గతః ।**
**సంసార వ్యాపృతిత్యాగే తాదృగ్బుద్ధిస్తు విశ్రమః ॥125॥**

*125. బరువు మోయువాడు తలపైని బరువు దించి విశ్రాంతి నొందును. సంసార వ్యాపారముల నుండి ముక్తుడైన పురుషుడు అట్లే విశ్రాంతిని అనుభవించును.*

**విశ్రాంతిం పరమాం ప్రాప్తస్త్వౌదాసీన్యే యథా తథా ।**
**సుఖదుఃఖదశాయాం చ తదానందైక తత్పరః ॥126॥**

*126. ఆ విధముగ సంసారభారము నుండి విశ్రాంతినొంది తన మనస్సును బ్రహ్మమునందే లగ్నము చేయును. ఉదాసీన స్థితియందున్నను సుఖదుఃఖ హేతువులున్నను ఇక ఆ మనస్సు వానిపై ప్రసరింపదు.*

**అగ్నిప్రవేశహేతౌ ధీః శృంగారే యాదృశీ తథా ।**
**ధీరస్యోదేతి విషయేఽనుసంధాన విరోధిని ॥127॥**

*127. అగ్నిప్రవేశము చేయనున్న సతి అలంకారముల పట్ల అసహనము చూపునట్లే బ్రహ్మానంద తత్పరుడగు ధీరునకు ఆటంకములగు విషయముల పట్ల అసహనము కలుగును.*

**అవిరోధి సుఖే బుద్ధిః స్వానందే చ గమాగమౌ ।**
**కుర్వన్నాస్తే క్రమాదేషా కాకాక్షివదితస్తతః ॥128॥**

*128. ఆటంకములు కాని సుఖములను పరమానందమును ఒకటొకటిగ అనుభవించే తత్త్వవిదుడు ఇటునటు చూచుచుండే కాకి వలె ఉండును.*

**వ్యాఖ్య:** సాత్త్వికసుఖములు బ్రహ్మానందమునకు ఆటంకములు కావు. రాజసిక తామసిక సుఖములు బ్రహ్మానందమునకు శత్రువుల వంటివి.

**ఏకైవ దృష్టిః కాకస్య వామదక్షిణ నేత్రయోః ।**
**యాత్యాయాత్యేవ మానందద్వయే తత్త్వవిదో మతిః ॥129॥**

*129. కాకికి ఉన్న చూపు ఒకటియే. అది కుడికంటి నుండి ఎడమ కంటికి ఎడమ నుండి కుడికి వచ్చుచు పోవుచుండును. అట్లే తత్త్వవిదుని మనస్సు సాత్త్విక సుఖము బ్రహ్మసుఖములయందు తిరుగుచుండును.*

**భుంజానో విషయానందం బ్రహ్మానందం చ తత్త్వవిత్ ।**
**ద్విభాషాభిజ్ఞవద్విద్యాదుభౌ లౌకిక వైదికౌ ॥130॥**

*130.* అవిరోధియగు విషయానందమును, బ్రహ్మానందమును అనుభవించుచు తత్త్వవిదుడు లౌకికవైదిక ఆనందములనే, రెండు భాషల యందు పాండిత్యముగల వానివలె ఆస్వాదించును.

**దుఃఖప్రాప్తౌ న చోద్వేగో యథాయతోపూర్వం యతోద్విదృక్ ।**
**గంగామగ్నార్ధకాయస్య పుంసః శీతోష్ణధీర్యథా ॥131॥**

*131.* దుఃఖములు ప్రాప్తించినా తత్త్వవిదుడు పూర్వమువలె వ్యథితుడు కాడు. గంగయందు సగము మునిగిన పురుషుడు గంగాజల శైత్యమును, సూర్యతాపమును ఏకకాలమున అనుభవించినట్లే బ్రహ్మానందమును, లౌకిక దుఃఖమును తత్త్వవిదుడు ఏకకాలమున అనుభవించును.

**ఇత్థం జాగరేణే తత్త్వవిదో బ్రహ్మ సుఖం సదా ।**
**భాతి తద్వాసనాజన్యే స్వప్నే తద్భాసతే తథా ॥132॥**

*132.* ఈ విధముగ తత్త్వవిదునకు జాగ్రదవస్థయందు బ్రహ్మానందము సర్వదా భాసించును. ఆ జాగ్రద్వాసన వలన కలుగు స్వప్నములందు కూడా బ్రహ్మానందమే భాసించును.

**అవిద్యా వాసనాప్యస్తి త్యతస్తద్వాసనోత్థితే ।**
**స్వప్నే మూర్ఖవదేవైష సుఖం దుఃఖం చ వీక్షతే ॥133॥**

*133.* అజ్ఞానవాసనలు కూడా ఉండుటచేత దానివలన కలుగు స్వప్నము లందు సుఖదుఃఖములను కూడా అనుభవించునుగాని వానిచే లిప్తుడు కాడు.

**బ్రహ్మానందాభిధే గ్రంథే బ్రహ్మానంద ప్రకాశకమ్ ।**
**యోగి ప్రత్యక్షమధ్యాయే ప్రథమేఽస్మి న్నుదీరితమ్ ॥134॥**

*134.* బ్రహ్మానందమనే పేరుగల ఐదు అధ్యాయముల గ్రంథము నందు ఈ ప్రథమ అధ్యాయమున యోగిజనుల ప్రత్యక్షానుభవము చెప్పబడినది.

**వ్యాఖ్య:** సుషుప్తి, ఉదాసీనస్థితి, సమాధిస్థితి, సుఖదుఃఖస్థితులు అన్నింటి యందును స్వయంప్రకాశ చిద్రూపమగు బ్రహ్మానందమును ప్రకటించే యోగి జనుల అనుభవము చెప్పబడినది. ఈ పంచదశిలో చివరి ఐదు ప్రకరణములు ఒక ప్రత్యేక గ్రంథమని కొందరి మతము.

**ఏకాదశప్రకరణము: సమాప్తము**

# ద్వాదశము : బ్రహ్మానందమున ఆత్మానంద ప్రకరణము

**నన్వేవం వాసనానందా ద్బ్రహ్మానందాదపీతరమ్ ।**
**వేత్తు యోగీ నిజానందం మూఢస్యాత్రాస్తి కా గతిః ॥1॥**

*1. (సంశయము) ఇట్లు వాసనానంద బ్రహ్మానందముల కంటె భిన్నమగు నిజానందమును యోగి అనుభవించును. కాని మూఢజనుల గతియేమి?*

**వ్యాఖ్య:** సుషుప్తియందలి ఆనందము ఇచట బ్రహ్మానందమనబడినది. (11.45). వాసనానందము బ్రహ్మానంద సంస్కారము వలన కలుగును.

**ధర్మాధర్మవశాదేష జాయతాం మ్రియతామపి ।**
**పునః పునర్దేహలక్షైః కిం నో దాక్షిణ్యతో వద ॥2॥**

*2. (సమాధానము) మూఢులు ధర్మాధర్మవశులై పుణ్యాపాప ఫలమును అనుభవించుటకు లక్షలకొలది శరీరములలో పుట్టుచు చచ్చుచు ఉందురు. వారిపై సానుభూతి చూపిన కలిగే లాభమేమి?*

**అస్తి వోఽనుజిఘృక్షుత్వాద్దాక్షిణ్యేన ప్రయోజనమ్ ।**
**తర్హి బ్రూహి స మూఢః కిం జిజ్ఞాసుర్వా పరాఙ్ముఖః ॥3॥**

*3. (సంశయము) అనుగ్రహము కలిగినచో సానుభూతికి ప్రయోజనము ఉండును. మూర్ఖులకు కూడా ఒక దారి చూపబడును. (సమాధానము) అయినచో ఈ మూఢుడు జిజ్ఞాసువా లేక తత్త్వజ్ఞానమునకు విముఖుడా?*

**ఉపాస్తిం కర్మ వా బ్రూయాద్విముఖాయ యథోచితమ్ ।**
**మంద్రప్రజ్ఞం తు జిజ్ఞాసుమాత్మానందేన బోధయేత్ ॥4॥**

*4. విముఖుడై విషయాసక్తుడై ఉన్నచో తగినట్లుగా ఉపాసనముగాని*

కర్మముగాని ఉపదేశింపవచ్చును. జిజ్ఞాసుడైన మందబుద్ధిని ఆత్మానందము ద్వారా బోధింపవచ్చును.

**బోధయామాస మైత్రేయీం యాజ్ఞవల్క్యో నిజప్రియామ్ ।**
**న వా అరే పత్యురర్థే పతిః ప్రియ ఇతీరయన్ ॥5॥**

*5.* ప్రియభార్యయైన మైత్రేయికి యాజ్ఞవల్క్యుడు 'భార్య భర్తను భర్త కొరకుగా ప్రేమింపదు' అని దీనినే బోధించెను. బృహదారణ్యక ఉప. ***4.5.6***

**పతిర్జాయా పుత్రవిత్తే పశుబ్రాహ్మణ బాహుజాః ।**
**లోకా దేవా వేదభూతే సర్వం చాత్మార్థతః ప్రియమ్ ॥6॥**

*6.* భర్త, భార్య, పుత్రుడు, ధనము, పశువులు, బ్రాహ్మణత్వము, క్షత్రియత్వము, వివిధలోకములు, దేవతలు, వేదములు, పంచభూతములు - అన్నీ ఆత్మకొరకే ప్రియములగుచున్నవి.

**పత్యావిచ్ఛా యదా పత్న్యాస్తదా ప్రీతిం కరోతి సా ।**
**క్షుదనుష్ఠాన రోగాద్యైస్తదా నేచ్ఛతి తత్పతిః ॥7॥**

*7.* పతియందు ఇచ్ఛ కలిగినపుడు పత్ని అతనిని ప్రీతుని జేయును. పతి కూడా అట్లే. కాని ఆకలి, అనుష్ఠానము, వ్యాధి మొదలగువానికి వశుడైనపుడు అతడు పత్నికి సుముఖుడు కాడు.

**న పత్యురర్థే సా ప్రీతిః స్వార్థ ఏవ కరోతి తామ్ ।**
**పతిశ్చాత్మన ఏవార్థే న జాయార్థే కదాచన ॥8॥**

*8.* పతిపై ఆ ప్రీతి చూపుట పతి కొరకుగాక స్వార్థము కొరకే. పతి కూడా తన కొరకే పత్నియందు ప్రేమచూపునుగాని ఏనాటికిని పత్ని కొరకు కాదు.

**అన్యోన్య ప్రేరణేఽప్యేవం స్వేచ్ఛయైవ ప్రవర్తనమ్ ॥9॥**

*9.* పరస్పర ప్రేమయైనను ఇట్లే ఇరువురును తమతమ స్వప్రయోజన సిద్ధికై ప్రవర్తించుట యగును.

**శ్మశ్రుకంటకవేధేన బాలే రుదతి తత్పితా ।**
**చుంబత్యేవ న సా ప్రీతిర్బాలార్థే స్వార్థ ఏవ సా ॥10॥**

*10.* ముళ్ళవంటి మీసాలు గుచ్చుకొని బాలుడు ఏడుస్తున్నా తండ్రి వానిని ముద్దాడుచునే ఉండును. ఈ ప్రీతి బాలునిపై గాక తన స్వార్థముపైనే ఉన్నది.

**నిరిచ్ఛమపి రత్నాదివిత్త యత్నేన పాలయన్ ।**
**ప్రీతిం కరోతి స స్వార్థే విత్తార్థత్వం న శంకితమ్ ॥11॥**

*11. రత్నములు మొదలగు సంపదలను, వానికి ఎట్టి రాగద్వేషములు లేకున్నను, పురుషుడు మిక్కిలి ప్రీతితో రక్షించును. ఈ ప్రీతి తన స్వార్థమునందే గాని సంపదలయందు గాదనుటను ఎవరూ సంశయింపరు.*

**అనిచ్ఛతి బలీవర్దే వివాహయిషతే బలాత్ ।**
**ప్రీతిః సా వణిగర్థేవ బలీవర్దార్థతా కుతః ॥12॥**

*12. వణిజుడు ఎద్దుకు ఇష్టము లేకున్నా దానిచే బరువులు మోయించును. అతడు దానిని ప్రేమతో చూచుకొనుట తనకొరకే గాని ఎద్దు కొరకు కాగలదా? కాజాలదు.*

**బ్రాహ్మణ్యం మేఽస్తి పూజ్యోఽహమితి తుష్యతి పూజయా ।**
**అచేతనాయా జాతేర్నో సంతుష్టిః పుంస ఏవ సా ॥13॥**

*13. బ్రాహ్మణుడు 'నాకు బ్రాహ్మణ్యము కలదు. నేను పూజనీయుడను' అని భావించును. అట్టి పూజచే సంతుష్టుడగును. అచేతనమగు బ్రాహ్మణ్యమునకు సంతోషము లేదు. ఆ పురుషునియందే సంతోషము.*

**క్షత్రియోఽహం తేన రాజ్యం కరోమీత్యత్ర రాజతా ।**
**న జాతేర్వైశ్యజాత్యాదౌ యోజనాయేదమీరితమ్ ॥14॥**

*14. 'నేను క్షత్రియుడను. కనుక రాజ్యమేలుచున్నాను' అని ఆనందించుట జాతియందు కాదు, తనయందే. వైశ్యజాతి మొదలగువాని యందు అన్వయించుకొనుట కొరకిది చెప్పబడినది.*

**స్వర్గలోక బ్రహ్మలోకౌ స్తాం మమేత్యభివాంఛనమ్ ।**
**లోకయోర్నోపకారాయ స్వభోగాయైవ కేవలమ్ ॥15॥**

*15. స్వర్గలోకమును, బ్రహ్మలోకమును నేను పొందవలెననే వాంఛ ఆ లోకములకు ఉపకారము చేయుటకు కాదు. కేవలము తాను అనుభవించుటకే.*

**ఈశవిష్ణ్వాదయో దేవాః పూజ్యంతే పాపనష్టయే ।**
**న తన్నిష్పాపదేవార్థం తత్తు స్వార్థం ప్రయుజ్యతే ॥16॥**

*16. పాపములు నశించుటకై జనులు ఈశ్వరుడు, విష్ణువు మొదలగు దేవతలను పూజింతురు. ఈ పూజలు తమ స్వార్థమునకు వినియోగింతురే గాని పాపరహితులైన ఆ దేవతల కొరకు కాదు.*

**ఋగాదయో హ్యధీయంతే దుర్బ్రాహ్మణ్యానవాప్తయే ।**
**న తత్ప్రసక్తం వేదేషు మనుష్యేషు ప్రసజ్జతే ॥17॥**

*17. దు(దుష్ట)ర్బ్రాహ్మణుడనే పేరు రాకుండుటకు ఋగ్వేదాది అధ్యయనము చేయుదురు. ఈ చెడ్డపేరు ప్రసక్తి మనుష్యులకు వచ్చును గాని వేదములకు రాదు.*

**భూమ్యాది పంచభూతాని స్థానతృట్ పాకశోషణైః ।**
**హేతుభిశ్చావకాశేన వాంఛన్త్యేషాం న హేతవః ॥18॥**

*18. మానవులు భూమి మొదలగు పంచభూతములను, అవి వాసస్థానమునకు దాహము తీర్చుకొనుటకు వంట చేయుటకు శోషింపజేయుటకు కదలికకు అవకాశము నిచ్చుటకు, కోరుదురే గాని పంచభూతముల కొరకుగా వాంఛింపరు.*

**స్వామి భృత్యాదికం సర్వం స్వోపకారాయ వాంఛతి ।**
**తత్త త్కృతోపకారస్తు తస్య తస్య న విద్యతే ॥19॥**

*19. జనులు యజమానులను గాని సేవకులను గాని ఇతర విధములుగ గాని ఎన్నుకొనుట తమ లాభము కొరకేగాని వారి వారికి ఉపకారము చేయుటకు కాదు.*

**సర్వవ్యవహృతిష్వేవ మనుసంధాతుమీదృశమ్ ।**
**ఉదాహరణ బాహుల్యం తేన స్వాం వాసయేన్మతిమ్ ॥20॥**

*20. సకలవ్యవహారములందును ఈ విధముగ అన్వేషించుటకు అనేకములైన ఉదాహరణములు గలవు. వాని ద్వారా ప్రతిమానవునకు ఆత్మయే ప్రియమైనదనే నిశ్చయమునకు రావలెను.*

**వ్యాఖ్య:** అన్ని ఉదాహరణములను తన స్వార్థమునే నిరూపించును. ఈ 'తాను' ఎవరని అన్వేషించినపుడు 'ప్రత్యగాత్మ'యే అని తెలియును.

**అథ కేయం భవేత్ప్రీతిః శ్రూయతే యా నిజాత్మని ।**
**రాగో వధ్వాదివిషయే శ్రద్ధా యాగాదికర్మణి ।**
**భక్తిః స్యాద్గురుదేవాదా విచ్ఛాత్వప్రాప్తవస్తుని ॥21॥**

**తర్హ్యాస్తు సాత్త్వికీ వృత్తిః సుఖమాత్రానువర్తినీ ।**
**ప్రాప్తే నష్టేఽపి సద్భావాదిచ్ఛాతోః వ్యతిరిచ్యతే ॥22॥**

*21.22. (సంశయము) శ్రుతి చెప్పే ఈ ఆత్మయందలి ప్రీతి ఎట్టిదై ఉండును? భార్య మొదలగువాని పట్ల అనురాగమా, యజ్ఞయాగాది కర్మల యందలి శ్రద్ధయా? గురువు దైవము మొదలగు వాని పట్ల భక్తియా? లేక లభింపని వస్తువులపట్ల ఉండే ఇచ్ఛయా? (సమాధానము) ఇవి ఏవీ కాదు. సుఖమును మాత్రమే అనుసరించి ఉండు సాత్త్వికమైన అంతఃకరణ వృత్తియే ఆత్మయందలి ప్రీతి. విషయములు లభించినా నష్టపోయినా ఈ ప్రీతి ఉండునదే కనుక ఇది ఇచ్ఛ కంటె భిన్నము.*

**సుఖ సాధనతోపాధేరన్నపానాదయః ప్రియాః ॥23॥**

*23. (సంశయము) అన్నపానాదులు సుఖము నిచ్చుటచేత ప్రియములు అగుచున్నవి.(అట్లే ఆత్మ కూడా సుఖమునిచ్చు ఒకానొక విషయమై ఉండ వచ్చును కదా?)*

**ఆత్మానుకూల్యాదన్నపానాది సమశ్చేదమునాత్ర కః ।**
**అనుకూలయితవ్య స్యాన్నైకస్మిన్కర్మ కర్తృతా ॥24॥**

*24. సుఖమునిచ్చుటచే ఆత్మ కూడా అన్నపానాదుల వంటిదే అనినచో వీనిచే సుఖము పొందువాడెవడు? ఒక వస్తువే కర్మ, కర్త కాజాలదు కదా?*

**వ్యాఖ్య:** అన్నపానాదుల వలన ఆత్మ భోక్తృరూపమున సుఖము పొందును. ఆత్మయే ఆత్మచే సుఖము పొందుట అసిద్ధము. ఒక వస్తువే సుఖమును ఇచ్చునదీ సుఖము పొందునదీ అగుట అసంభవము కనుక. కనుక ఆత్మయే స్వయముగ సుఖస్వరూపము. అందుచేతనే ఆత్మ ఎల్లరకును ప్రియతమము.

**సుఖే వైషయికే ప్రతిమాత్రమాత్మా త్వతిప్రియః ।**
**సుఖే వ్యభిచరత్యేషా నాత్మని వ్యభిచారిణీ ॥25॥**

*25. సుఖసాధనములైన విషయముల పట్ల కొంత ప్రీతి ఉండును. ఆత్మ యందలి ప్రీతి అనంతమైనది. సుఖసాధనముల పట్ల ప్రీతి ఒకప్పుడున్నట్లు మరొకప్పుడుండదు. ఆత్మయందలి ప్రీతి మార్పులేక ఉండును.*

**ఏకం త్యక్త్వాఽన్యదాదత్తే సుఖం వైషయికం సదా ।**
**నాత్మా త్యాజ్యో న చాదేయస్తస్మిన్ వ్యభిచరేత్కథమ్ ॥26॥**

*26. సుఖసాధనములైన విషయములు సర్వదా ఒకటి వదలబడి మరొకటి గ్రహింపబడుచుండును. ఆత్మ త్యాజ్యము కాదు, గ్రాహ్యము కూడా కాదు. అందు మార్పు కలుగుట ఎట్లు? కలుగనే కలుగదు.*

**హానాదాన విహీనేఽస్మిన్నుపేక్షా చేత్తృణాదివత్ ।**

**ఉపేక్షితుః స్వరూపత్వాన్నోపేక్ష్యత్వం నిజాత్మనః ॥27॥**

*27. (సంశయము) త్యజింపబడునది స్వీకరింపబడునది కాకపోయినను గడ్డిపోచవలె ఆత్మ ఉపేక్షింపదగినది కావచ్చు కదా? (సమాధానము) ఉపేక్షించు వాని స్వరూపమే ఆత్మ అగుటచేత ఎవరుగాని తన ఆత్మను ఉపేక్షింపజాలరు.*

**రోగక్రోధాభిభూతానాం ముమూర్షా వీక్ష్యతే క్వచిత్ ।**

**తతో ద్వేషాద్భవేత్త్యాజ్య ఆత్మేతి యది తన్న హి ॥28॥**

*28. వ్యాధిగాని క్రోధముగాని ఆవేశించినపుడు కొందరు మరణింప ఇష్టము చూపుదురు. కనుక ద్వేషమువలన ఆత్మ త్యాజ్యమగుననినచో అట్లు కాదు.*

**త్యక్తుం యోగ్యస్య దేహస్య నాత్మతా త్యక్తురేవ సా ।**

**న త్యక్తర్యస్తి స ద్వేషస్త్యాజ్యే ద్వేషే తు కా క్షతిః ॥29॥**

*29. త్యజింపగలుగునది దేహమునే. దానికి ఆత్మత్వము లేదు. ఎవడు దేహమును త్యజించుచున్నాడో (త్యక్త) అతడే ఆత్మ. ఆ త్యక్తయగు ఆత్మయందెవరికిని ద్వేషము లేదు. త్యాజ్యమగు దేహమునందు ద్వేషముండిన ఏమి హాని? ఏమీ లేదు.*

**ఆత్మార్థత్వేన సర్వస్య ప్రీతేశ్చాత్మా హ్యతిప్రియః ।**

**సిద్ధో యథా పుత్రమిత్రాత్పుత్రః ప్రియతరస్తథా ॥30॥**

*30. స్వార్థమునకే అనగా ఆత్మకొరకే అన్నీ ప్రియములగుటచేత ఆత్మయే అత్యంతము ప్రియమనుట సిద్ధించును. పుత్రుని మిత్రుడు ప్రియుడే అయినా పుత్రుడు ఆ మిత్రుని కంటె ప్రియతముడు గదా.*

**మా న భూవమహం కిం తు భూయాసం సర్వదేత్యసౌ ।**

**అశీః సర్వస్య దృష్టేతి ప్రత్యక్షా ప్రీతిరాత్మని ॥31॥**

*31. నేను నశింపకుందును గాక, సర్వదా జీవింతునుగాక అనే ఆశ ఎల్లరయందును కన్పించుటచే ఆత్మయందలి ప్రీతి ప్రత్యక్షమే.*

**ఇత్యాదిభి స్త్రిభిః ప్రీతౌ సిద్ధాయామేవమాత్మని ।**

**పుత్రభార్యాది శేషత్వ మాత్మనః కైశ్చిదీరితమ్ ॥32॥**

*32.* ఇట్లు అనుభవము, యుక్తి, శ్రుతి అనే మూడింటి చేతను ఆత్మయే ప్రియతమమైనదని సిద్ధించుచుండగా కొందరు ఆత్మ కంటె పుత్రభార్యాదులే ప్రియతరములని వాదింతురు.

**ఏతద్వివక్షయా పుత్రే ముఖ్యాత్మత్వం శ్రుతీరితమ్ ।**
**ఆత్మా వై పుత్రనామేతి తచ్చోపనిషది స్ఫుటమ్ ॥33॥**

*33.* దీనిని బలపరచుటకై వారు 'పుత్రుడే ఆత్మ' అనే శ్రుతి వాక్యమును ఉదాహరించి పుత్రుడే ఆత్మ కంటెను ప్రియమందురు. కౌషీతకి ఉప. *2.11*

**సోఽస్యాయమాత్మా పుణ్యేభ్యః కర్మభ్యః ప్రతిధీయతే ।**
**అథాస్యేతర ఆత్మాఽయం కృతకృత్య ప్రమీయతే ॥34॥**

*34.* (తండ్రి యొక్క) ఆత్మ పుత్రుడై జన్మించి పుణ్యకర్మలయందు ప్రతినిధి అగును. తండ్రి యొక్క ఆత్మ (పుత్ర జన్మముచే) కర్తవ్యము నెరవేరినదై వృద్ధాప్యమును పొంది నిర్గమించును. ఐతరేయ ఉప. *2.1.1*

**సత్యప్యాత్మని లోకోఽస్తి నాపుత్రస్యాత ఏవ హి ।**
**అనుశిష్టం పుత్రమేవ లోక్యమాహుర్మనీషిణః ॥35॥**

*35.* ఆత్మ ఉన్నను పుత్రుడు లేనిచో అతనికి పుణ్యలోకములు కలుగవు. వేదమంత్రములచే సుశిక్షితుడైన పుత్రుడే ఉత్తమలోకములకు దారి కల్పించును. బృహదారణ్యక ఉప. *1.5.17*

**మనుష్యలోకో జయ్యః స్యాత్పుత్రేణేవేతరేణ నో ।**
**ముమూర్షుర్మంత్రయేత్పుత్రం త్వం బ్రహ్మేత్యాది మంత్రకైః ॥36॥**

*36.* మనుష్యలోకమునందలి సుఖములు పుత్రునిచే మాత్రము కలుగును గాని ఇతరములచే కలుగవు. కనుక మరణింపనున్న తండ్రి తన పుత్రునికి 'నీవే బ్రహ్మము' మొదలగు వేదమంత్రములచే ఉపదేశము చేయవలెను.

**ఇత్యాది శ్రుతయః ప్రాహుః పుత్రభార్యాది శేషతామ్ ।**
**లౌకికా అపి పుత్రస్య ప్రాధాన్యమనుమన్వతే ॥37॥**

*37.* ఇట్టి శ్రుతివాక్యములు పుత్రుడు భార్య మొదలగువాని ప్రాముఖ్యము సూచించును. లౌకికులు కూడా పుత్రుని ప్రాధాన్యమును అంగీకరింతురు.

**స్వస్మి మృతేఽపి పుత్రాది ర్జీవేద్విత్తాదినా యథా ।**
**తథైవ యత్నం కురుతే ముఖ్యాః పుత్రాదయస్తతః ॥38॥**

*38.* తాను మరణించినను పుత్రుడు మొదలగువారు ధనము మొదలగు వానిచే జీవింపగలుగునట్లు మానవుడు ప్రయత్నించును. దీనిని బట్టి పుత్ర భార్యాదులే ముఖ్యమని తెలియుచున్నది.

**బాఢమేతావతా నాత్మా శేషో భవతి కస్యచిత్ ।**
**గౌణ మిథ్యా ముఖ్యభేదై రాత్మాయం భవతి త్రిధా ॥39॥**

*39.* సరే! కాని దీనిచే ఆత్మ ఎవరికీ గౌణమని సిద్ధింపదు. ఆత్మ అనే పదం గౌణము, మిథ్య, ముఖ్యము అనే మూడర్థములలో ఉపయోగింప బడును.

**దేవదత్తస్తు సింహోఽయమిత్యైక్యం గౌణమేతయోః ।**
**భేదస్య భాసమానత్వా త్పుత్రాదేరాత్మతా తథా ॥40॥**

*40.* 'దేవదత్తుడు సింహము' అని వానికి ఏకత్వము చెప్పుట గౌణము వాని రెండింటియందలి భేదము స్పష్టముగా కన్పించుచున్నది గనుక. అట్లే పుత్రుడే ఆత్మ మొదలగు వానియందు పుత్రునకు, ఆత్మకు భేదము స్పష్టమగుటచే పుత్రాదుల ఆత్మత్వము గౌణము.

**భేదోస్తి పంచకోశేషు సాక్షిణో న తు భాత్యసౌ ।**
**మిథ్యాత్మతాతః కోశానాం స్థాణోశ్చోరాత్మతా యథా ॥41॥**

*41.* సాక్షికిని పంచకోశములకును భేదము కలదు కాని ఈ భేదము కన్పింపదు. కనుక ఈ కోశములు ఆత్మ అనుట మిథ్య. కంబము చోరుడని భావించుట మిథ్యయైనట్లే.

**న భాతి భేదో నాప్యస్తి సాక్షిణోఽప్రతియోగినః ।**
**సర్వాంతరత్వాత్తస్యైవ ముఖ్యమాత్మత్వ మిష్యతే ॥42॥**

*42.* సాక్షిచైతన్యము అద్వయమైనదగుటచే భేదము కన్పింపదు, అసలు లేదు కూడ. అన్ని కోశములకు లోపలనుండు తత్త్వమగుటచే అదే ముఖ్యార్థమున ఆత్మ అనబడుచున్నది.

**సత్యేవం వ్యవహారేషు యేషుయస్మాత్మతోచితా ।**
**తేషు తస్యైవ శేషిత్వం సర్వస్యాన్యస్య శేషతా ॥43॥**

*43.* ఇట్లు ఆత్మశబ్దమునకు మూడు అర్థములుండుటచే వ్యవహారమున ఏ అర్థము సరిపడునో ఆ అర్థము ముఖ్యమగును. ఇతరములు రెండూ గౌణములు అగును.

**ముమూర్షోర్గృహరక్షాదౌ గౌణాత్మైవోపయుజ్యతే ।**
**న ముఖ్యాత్మాన మిథ్యాత్మా పుత్రః శేషీ భవత్యతః ॥44॥**

*44.* *మరణింపనున్న వ్యక్తి సంపదను సంప్రదాయమును పుత్రునకు అప్పగించునపుడు గౌణార్థముననే ఆత్మశబ్దము సరిపడును. ముఖ్యార్థమున గాని మిథ్యార్థమున గాని సరిపడదు.*

**అధ్యేతా వహ్నిరిత్యత్ర సన్నప్యగ్నిర్న గృహ్యతే ।**
**అయోగ్యత్వేన యోగ్యత్వాద్వటురేవాత్ర గృహ్యతే ॥45॥**

*45.* *'అధ్యయనము చేయువాడు అగ్ని' అనునపుడు అగ్ని శబ్దమున్నను అగ్ని అనే అర్థమును ఎవడును స్వీకరింపడు, అగ్ని అధ్యయనము చేయజాలదు గనుక. అధ్యయనము చేయగలుగు బ్రహ్మచారియే అగ్ని శబ్దమునకు అర్థముగ స్వీకరింపబడును, యోగ్యత ఉండుటచేత.*

**కృశోఽహం పుష్టిమాప్స్యామీత్యాదౌ దేహాత్మతోచితా ।**
**న పుత్రం వినియుఙ్క్తేఽత్ర పుష్టి హేత్వన్నభక్షణే ॥46॥**

*46.* *'నేను సన్నగానున్నాను లావు కావలయును' మొదలగు ప్రయోగము లందు దేహమే (అన్నమయ కోశమే) ఆత్మయగుట ఉచితము. లావగుటకు కారణమగు అన్నము తినుటకు ఎవరును పుత్రుని నియోగింపరు.*

**తపసా స్వర్గమేష్యామీత్యాదౌ కర్త్రాత్మతోచితా ।**
**అనపేక్ష్య వపుర్భోగం చరేత్కృచ్ఛ్రాదికం తతః ॥47॥**

*47.* *'తపము చేసి స్వర్గమునకు పోవుదును' మొదలగు ప్రయోగము లందు కర్తయగు జీవుడు (విజ్ఞానమయ కోశము) ఆత్మయని తెలియవలెను. శరీర సుఖమును నిర్లక్ష్యము చేసి జనులు జీవునకు ఉపకారకములగు కఠిన తపములను చేయుదురు.*

**వ్యాఖ్య:** కృచ్ఛ్రమనునది పంద్రెండు దినములు చేయు తపస్సు. ముఖ్యముగ ఆహారనియమములను బట్టి ఇందు పంద్రెండు విధములు గలవు. చాంద్రాయణము ఒక నెలపర్యంతము చేయు తపస్సు. ఇందు రెండురకములు గలవు.

**మోక్ష్యేఽహమిత్యత్ర యుక్తం చిదాత్మత్వం తదాపుమాన్ ।**
**తద్వేత్తి గురుశాస్త్రాభ్యాం న తు కించి చ్చికీర్షతి ॥48॥**

*48.* *'నేను ముక్తుడనగుదును' అనునపుడు నేను అనేది చిదాత్మయే అని*

తెలియవలెను. ఇందు పురుషుడు దేనినిగాని వాంఛింపక గురువు నుండి శాస్త్రము నుండి ఆత్మను గూర్చిన జ్ఞానమును సంపాదించును.

**విప్రక్షత్రాదయో యద్వత్ బృహస్పతిసవాదిషు ।**
**వ్యవస్థితాస్తథా గౌణ మిథ్యాముఖ్యా యథోచితమ్ ॥49॥**

*49.* బ్రాహ్మణక్షత్రియవైశ్యులు క్రమముగా బృహస్పతి, రాజసూయ, వైశ్యస్తోమ యజ్ఞములకు అర్హతగలిగి ఉన్నట్లు వివిధ పరిస్థితులందు గౌణమిథ్యా ముఖ్యాత్మలు ఉద్దేశింపబడును.

**తత్ర తత్రోచితే ప్రీతిరాత్మన్యేవాతిశాయినీ ।**
**అనాత్మని తు తచ్ఛేషే ప్రీతిరన్యత్ర నోభయమ్ ॥50॥**

*50.* ఏ పరిస్థితియందైనను అనంతమగు ప్రీతి ముఖ్యాత్మయందే ఉండును. దానికి సంబంధపడిన ఇతరములందు తగుమాత్రము ప్రీతి ఉండును. అన్యములందు ప్రీతియే ఉండదు.

**ఉపేక్ష్యం ద్వేష్యమిత్యన్యద్ద్వేధా మార్గ తృణాదికమ్ ।**
**ఉపేక్ష్యం వ్యాఘ్ర సర్పాది ద్వేష్యమేవం చదుర్విధమ్ ॥51॥**

*51.* అన్యవిషయములు ఉపేక్ష్యములు ద్వేష్యములు అని రెండు విధములు. దారిలోపడి ఉండే గడ్డి మొదలగునవి ఉపేక్ష్యములు. పాము పులి మొదలగునవి ద్వేష్యములు. ఇట్లు వస్తువులు అతి ప్రియములు, ప్రియములు ఉపేక్ష్యములు ద్వేష్యములు అని నాలుగు విధములు.

**ఆత్మా శేష ఉపేక్ష్యం చ ద్వేష్యం చేతి చతుర్ష్వపి ।**
**న వ్యక్తి నియమః కిం తు తత్తత్కార్యాత్తథా తథా ॥52॥**

*52.* ముఖ్యాత్మ, దానికి సంబంధించినవి, ఉపేక్ష్యము, ద్వేష్యము అనే నాలుగింటియందూ ఈ వస్తువు సర్వదా ఇట్లుండునను వ్యక్తి నియమము లేదు. ఆ వస్తువు యొక్క కార్యమును బట్టి వివిధముగ భావింపబడును.

**స్యాద్ వ్యాఘ్రః సంముఖో ద్వేష్యో హ్యుపేక్ష్యస్తు పరాఙ్ముఖః ।**
**లాలనాదనుకూలశ్చే ద్వినోదాయేతి శేషతామ్ ॥53॥**

*53.* తన కెదురుగ వచ్చుచున్న పులి ద్వేష్యమగును. దూరముగ పోవుచున్న పులి ఉపేక్ష్యమగును. మచ్చికచేయబడి వినోదము నిచ్చినచో అది తనకు సంబంధపడి ప్రీతిపాత్రమగును.

**వ్యక్తీనాం నియమో మా భూల్లక్షణాత్తు వ్యవస్థితిః ।**
**అనుకూల్యం ప్రాతికూల్యం ద్వయాభావశ్చ లక్షణమ్ ॥54॥**

***54.*** *తనకు తానై ఏ వస్తువు కూడా ముఖ్యము గౌణము కాదు. లక్షణమును బట్టి వ్యవహారము నడచును. అనుకూలత ప్రతికూలత రెండును కాకపోవుట అనునవి లక్షణములు.*

**ఆత్మా ప్రేయాన్ప్రియః శేషో ద్వేషోపేక్షే తదన్యయోః ।**
**ఇతి వ్యవస్థితో లోకో యాజ్ఞవల్క్యమతం చ తత్ ॥55॥**

***55.*** *ఆత్మ ప్రియతమము, దానికి సంబంధపడినవి ప్రియములు, తదితరములు ద్వేష్యములు ఉపేక్ష్యములు అవి సామాన్య వ్యవస్థితి. యాజ్ఞవల్క్యుని అభిప్రాయము కూడా ఇదే.*

**అన్యత్రాపి శ్రుతిః ప్రాహ పుత్రాద్విత్తాత్తథాన్యతః ।**
**సర్వ స్మాదాంతరం తత్త్వం తదేతత్ప్రేత్య ఇష్యతామ్ ॥56॥**

***56.*** *శ్రుతి కూడా మరొక చోట 'ధన, పుత్రాదుల కంటే ఆత్మ ప్రియతమ మైనది అత్యంతము సన్నిహితమైనది' అని చెప్పును. బృహ. ఉప. **1.4.8***

**శ్రౌత్యా విచారదృష్ట్యాయం సాక్ష్యేవాత్మా న చేతరః ।**
**కోశాన్పంచ వివిచ్యాంతర్వస్తు దృష్టిర్విచారణా ॥57॥**

***57.*** *విచారణ దృష్టిచే శ్రుతిని పరిశీలించినచో సాక్షిచైతన్యమే ఆత్మయని తేటపడును. విచారణ దృష్టి అనగా పంచకోశములను వివేచించి ఆంతరమగు తత్త్వమును చూచుట.*

**జాగర స్వప్నసుప్తీనా మాగమాపాయ భాసనమ్ ।**
**యతో భవత్యసావాత్మా స్వప్రకాశ చిదాత్మకః ॥58॥**

***58.*** *జాగ్రత్-స్వప్న-సుషుప్తి అవస్థలు వచ్చుచుండుట పోవుచుండుట దేని వలన తెలియుచున్నదో ఆ స్వయంప్రకాశమగు సాక్షిచైతన్యమే ఆత్మ.*

**శేషాః ప్రాణాది విత్తాంతా ఆసన్నాస్తారతమ్యతః ।**
**ప్రీతిస్తథా తారతమ్యాత్తేషు సర్వేషు వీక్ష్యతే ॥59॥**

***59.*** *ఆత్మకు సంబంధించి సన్నిహితములైనవే ప్రాణము మొదలు సంపద వరకు గల వివిధ వస్తువులు. ఆ సాన్నిహిత్యపు తారతమ్యమును అనుసరించి ఆయా వస్తువుల పట్ల గల ప్రీతియందును తారతమ్యములు ఉండుట అన్నింటియందూ కన్పించును.*

**విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్పిండః పిండాత్తథేంద్రియమ్ ।**
**ఇంద్రియాచ్చ ప్రియః ప్రాణః ప్రాణాదాత్మా ప్రియః పరః ॥60॥**

*60. ధనము కంటే కుమారుడు ప్రియుడు. కుమారుని కంటే దేహము ప్రియతరము. దాని కంటే ఇంద్రియములు, ఇంద్రియముల కంటే ప్రాణము క్రమముగా ప్రియతరములు. ఇట్టి ప్రాణము కంటే ఆత్మ అత్యంతము ప్రియతమమైనదని విద్వదనుభవము.*

**ఏవం స్థితే వివాదోఽత్ర ప్రతిబుద్ధవిమూఢయోః ।**
**శ్రుత్యోదాహారి తత్రాత్మాప్రేయానిత్యేవ నిర్ణయః ॥61॥**

*61. ఇట్లుండ శ్రుతియందు ఉదహరింపబడిన జ్ఞాని మూర్ఖ వివాదము, అన్ని వస్తువులందూ ఆత్మే ప్రియతమమైనదని నిర్ధారించును. బృహ ఉప. **1.4.8***

**సాక్ష్యేవ దృశ్యాదన్యస్మాత్ప్రేయానిత్యాహ తత్త్వవిత్ ।**
**ప్రేయా న్పుత్రాదిరేవేమం భోక్తుం సాక్షీతి మూఢధీః ॥62॥**

*62. చూడబడునవగు అన్నింటి కంటే సాక్షియే ప్రియతమమని తత్త్వవిదుడు అనును. పుత్రాదులే ప్రియతరములనీ ఆ ఆనందము అనుభవించుటకే సాక్షియనీ మూర్ఖుడనును.*

**ఆత్మనోఽన్యం ప్రియం బ్రూతే శిష్యశ్చ ప్రతివాద్యపి ।**
**తస్యోత్తరం వచో బోధశాపౌ కుర్యాత్తయోః క్రమాత్ ॥63॥**

*63. ఆత్మ కంటే ఇతరము ప్రియమని శిష్యుడు, ప్రతివాది అందురు. దానికి ప్రత్యుత్తరము వారికి క్రమముగ ఉపదేశము, శాపము అగును.*

**ప్రియత్వాం రోత్స్యతీత్యేవముత్తరం వక్తి తత్త్వవిత్ ।**
**స్వోక్త ప్రియస్య దుష్టత్వం శిష్యో వేత్తివివేకతః ॥64॥**

*64. ప్రత్యుత్తరముగ తత్త్వవిదుడు శ్రుతిని ఉదాహరించును: 'నీకు ప్రియమగు వస్తువు నిన్ను శోకింపజేయును.' శిష్యుడు దీనిని వివేచించి ఆత్మేతరము ప్రియమనుటలో పొరపాటును తెలిసికొనును. బృహ ఉప. **1.4.8***

**అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్ ।**
**లబ్ధోఽపి గర్భపాతేన ప్రసవేన చ బాధతే ॥65॥**

*65. జన్మింపని పుత్రుడు తల్లిదండ్రులను చిరకాలము బాధించును. గర్భమైనను గర్భస్రావము వలనను ప్రసవవేదన వలనను బాధ కలుగును.*

**జాతస్య గ్రహరోగాది కుమారస్య చ మూర్ఖతా ।**
**ఉపనీతేఽప్యవిద్యత్వ మనుద్వాహశ్చ పండితే ॥66॥**

*66.* పుత్రుడు జన్మించినా గ్రహపీడ వలనా, వ్యాధుల వలనా బాధపడ వచ్చు. మూర్ఖుడు మొండివాడు కావచ్చు. ఏమియు చదువక పోవచ్చు. పండితుడైనా అవివాహితుడుగ ఉండవచ్చు.

**యూనశ్చ పరదారాది దారిద్ర్యం చ కుటుంబినః ।**
**పిత్రోర్దుఃఖస్య నాస్త్యంతో ధనీ చేన్మ్రియతే తదా ॥67॥**

*67.* లేదా పరదారాసక్తుడు కావచ్చు. బహుసంతానవంతుడై దరిద్రుడుగ ఉండవచ్చు. ధనవంతుడై యౌవనమునందే మరణింపవచ్చు. తల్లిదండ్రుల దుఃఖములకు అంతము లేదు కదా.

**ఏవం వివిచ్య పుత్రాదౌ ప్రీతిం త్యక్త్వా నిజాత్మని ।**
**నిశ్చిత్య పరమాం ప్రీతిం వీక్షతే తమహర్నిశమ్ ॥68॥**

*68.* ఇట్లు విచారించి శిష్యుడు పుత్రాదులయందు ప్రీతిని పరిత్యజించి తన యాత్మయందే పరమ ప్రీతిని నిలిపి రాత్రింబవళ్ళు దానినే ధ్యానింపవలెను.

**ఆగ్రహాద్ బ్రహ్మవిద్వేషాదపి పక్షమముంచతః ।**
**వాదినో నరకః ప్రోక్తో దోషశ్చ బహుయోనిషు ॥69॥**

*69.* తత్త్వవిదుని పట్ల ద్వేషము చేతా మొండితనము చేతా తన వాదము వదలని ప్రతివాది ఘోరనరకమున బడును. బహు జన్మములందు దుఃఖమును అనుభవించును.

**బ్రహ్మవిద్బ్రహ్మరూపత్వాదీశ్వరస్తేన వర్ణితమ్ ।**
**యద్యత్తత్తథైవ స్యాత్తచ్ఛిష్య ప్రతివాదినోః ॥70॥**

*70.* బ్రహ్మవిదుడు సాక్షాత్తు బ్రహ్మమే అనీ ఈశ్వరుడనీ వరింపబడెను. శిష్యుడు, ప్రతివాదుల విషయమున అతడు చెప్పినదంతా నెరవేరును. ముండక ఉప. *3.2.9*

**యస్తు సాక్షిణ మాత్మానం సేవతే ప్రియముత్తమమ్ ।**
**తస్య ప్రేయానసావాత్మా న నశ్యతి కదాచన ॥71॥**

*71.* సాక్షియగు ఆత్మే ప్రియతమముగ ఎవడు ధ్యానించునో అతడు ఈ ప్రియతమమైన ఆత్మ ఏనాటికీ నశింపదని తెలిసికొనును. బృహ. ఉప. *1.4.8*

**పరప్రేమాస్పదత్వేన పరమానంద రూపతా ।**
**సుఖవృద్ధిః ప్రీతివృద్ధౌ సార్వభౌమాదిషు శ్రుతా ॥72॥**

*72. పరమ ప్రేమాస్పదమగుట చేత ఆ పరమాత్మ పరమానందమునకు మూలకందము. సార్వభౌమత్వము నుండి హిరణ్య గర్భత్వము వరకు సర్వత్ర ఎంతెంత ప్రీతియుండునో అంతంతగా ఆనందముండునని శ్రుతి చెప్పును. బృహదారణ్యక ఉప. 4.3.3. తైత్తిరీయ ఉప. 2.8.1 చూ. ప్ర. 14.21-34*

**చైతన్యవత్సుఖం చాస్య స్వభావశ్చేచ్చిదాత్మనః ।**
**ధీవృత్తిష్వనువర్తేత సర్వాస్వపి చితిర్యథా ॥73॥**

*73. (సంశయము) ఆత్మ స్వరూపము చైతన్యమువలె ఆనందము కూడనైనచో అన్ని బుద్ధివృత్తులయందూ చైతన్యము వలె ఆనందము కూడా ఉండవలెను కదా.*

**మైవ ముష్ణప్రకాశాత్మా దీపస్తస్య ప్రభా గృహే ।**
**వ్యాప్నోతి నోష్ణతా తద్వచ్చితేరేవానువర్తనమ్ ॥74॥**

*74. అట్లు కాదు. దీపము కాంతివంతము, ఉష్ణవంతము అయినా గృహమున కాంతియే వ్యాపించినట్లు ఆత్మ యొక్క చైతన్యస్వరూపమే బుద్ధి వృత్తులందు అనువర్తించును.*

**గంధరూపరసస్పర్శేష్వపి సత్సు యథా పృథక్ ।**
**ఏకాక్షేణైక ఏవార్థో గృహ్యతే నేతరస్తథా ॥75॥**

*75. ఒక విషయమునందు రూప-రస-గంధ-స్పర్శ గుణములు నాలుగూ ఉన్నా ఒక్కొక్క ఇంద్రియము ఒక్కొక్క గుణమునే గ్రహింపగలదుగాని ఇతర గుణములను గ్రహింపజాలదు. ఆత్మయందలి ఆనందము కూడా అట్లే.*

**చిదానందౌ నైవ భిన్నౌ గంధాద్యాస్తు విలక్షణాః ।**
**ఇతి చేత్తదభేదోఽపి సాక్షిణ్యన్యత్ర వా వద ॥76॥**

*76. చైతన్యము ఆనందము భిన్నములు కావు, గంధము మొదలగునవి భిన్నవిభిన్నములుగాని అనినచో ఈ చిదానందైక్యత సాక్షియందో మరొక చోటనో చెప్పుము.*

**ఆద్యే గంధాదయోఽప్యేకమభిన్నాః పుష్పవర్తినః ।**
**అక్షభేదేన తద్భేదే వృత్తిభేదాత్తయోర్భిదా ॥77॥**

*77.* మొదటి పక్షమున గంధాదులు కూడా పుష్పమునందు ఒకటిగనే ఉండును. గ్రహించే ఇంద్రియములు విభిన్నములగుటచే ఆ గుణములు కూడా భిన్నములనినచో ఆత్మయందు కూడా అంతఃకరణవృత్తి భేదమును అనుసరించి చైతన్యము ఆనందము భిన్నములగుచున్నవి.

**సత్త్వవృత్తౌ చిత్సుఖైక్యం తద్వృత్తేర్నిర్మలత్వతః ।**
**రజోవృత్తేస్తుమాలిన్యా త్సుఖాంశోఽత్ర తిరస్కృతః ॥78॥**

*78.* అంతఃకరణవృత్తులందు సత్త్వగుణము ప్రధానముగ ఉండినచో ఆ వృత్తులు నిర్మలమగుట చేత చైతన్యము ఆనందముల ఐక్యత తెలియవచ్చును. రజోగుణము ప్రధానమైనచో ఆ వృత్తులు మలినములు అగుటచే ఆనందాంశము తెలియబడదు.

**తింత్రీణీ ఫలమత్యమ్లం లవణేన యుతం యదా ।**
**తదామ్లస్య తిరస్కారా దీషదమ్లం యథా తథా ॥79॥**

*79.* చింతపండు మిక్కిలి పుల్లగ ఉండును. కాని ఉప్పు కలిసినచో ఆ పులుపు అంతగా తెలియక కొంచెము పుల్లగ మాత్రమే ఉన్నట్లు తెలియును. అట్లే (రజోగుణము వలన ఆత్మ యొక్క ఆనందాంశము కూడా చాలా తక్కువగా తెలియబడును.)

**నను ప్రియతమత్వేన పరమానందతాత్మని ।**
**వివేక్తుం శక్యతామేవం వినా యోగేన కిం భవేత్ ॥80॥**

*80.* (సంశయము) ప్రియతమమగుటచే ఆత్మ పరమానంద స్వరూపమని ఇట్లు వివేచించి తెలిసికొనినను యోగము లేనిచో దాని వలన ఏమి ఫలము? (మోక్షము సిద్ధింపదని అనుమానము.)

**యద్యోగేన తదేవేతి వదామో జ్ఞానసిద్ధయే ।**
**యోగః ప్రోక్తో వివేకేన జ్ఞానం కిం నోపజాయతే ॥81॥**

*81.* (సమాధానము) యోగము ద్వారా చేరే గమ్యమము వివేకము ద్వారా కూడ చేరగలము. యోగము అపరోక్ష జ్ఞానమునకు (తద్వారా మోక్షమునకు) ఒక మార్గము. ఆ జ్ఞానము వివేకము ద్వారా కలుగదా? అవశ్యము కలుగును.

**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।**
**ఇతి స్మృతం ఫలైకత్వం యోగినాం చ వివేకినామ్ ॥82॥**

*82.* సాంఖ్యులచే పొందబడు స్థానము యోగులు కూడా చేరుదురు. అని యోగులకు వివేకులకు ఫలము ఒకటిగనే చెప్పబడినది. భగవద్గీత *5.6*

**అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిద్ జ్ఞాననిశ్చయః ।**
**ఇత్థం విచార్య మార్గౌ ద్వౌ జగాద పరమేశ్వరౌ ॥83॥**

*83.* కొందరికి యోగము అసాధ్యము. మరికొందరికి జ్ఞానము దుర్లభము. ఇట్లు ఆలోచించి పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడు రెండు మార్గములను ఉపదేశించెను.

**యోగే కోఽతిశయస్తత్ర జ్ఞానముక్తం సమం ద్వయోః ।**
**రాగద్వేషాద్యభావశ్చ తుల్యో యోగి వివేకినోః ॥84॥**

*84.* యోగమునకు వివేకమునకు సమముగనే జ్ఞానము ఫలమని చెప్పబడినది. రాగద్వేషాదులు లేకుండుట కూడా సమానమే. మరి యోగమునందేమి అతిశయము గలదు?

**న ప్రీతిర్విషయేష్వస్తి ప్రేయానాత్మేతి జానతః ।**
**కుతో రాగౌ కుతో ద్వేషః ప్రాతికూల్యమపశ్యతః ॥85॥**

*85.* ఆత్మయే ప్రియతమమని తెలిసికొనిన వివేకికి విషయములపై ప్రీతి ఉండదు. కనుక వానియందు రాగము (అనురాగము) ఏర్పడదు. ప్రతికూలమైన వస్తువునే చూడలేని వివేకికి ద్వేషము కూడా ఏర్పడదు.

**దేహాదేః ప్రతికూలేషు ద్వేషస్తుల్యో ద్వయోరపి ।**
**ద్వేషం కుర్వన్న యోగీ చేదవివేక్యపి తాదృశః ॥86॥**

*86.* మనశ్శరీరములకు ప్రతికూలములైన విషయములను యోగియు వివేకియు కూడ ద్వేషింతురు. అట్టి ద్వేషమున్న వ్యక్తి యోగి కాజాలడనినచో అట్టి వ్యక్తి వివేకి కూడా కాజాలడు.

**ద్వైతస్య ప్రతిభానం తు వ్యవహారే ద్వయోః సమమ్ ।**
**సమాధౌ నేతి చేత్తద్వన్నాద్వైతత్వ వివేకినః ॥87॥**

*87.* వ్యవహారమునందు ఇరువురకును ద్వైతము భాసించును. యోగికి సమాధియందు ద్వైతభానము లేనిచో వివేకికి అద్వైత తత్త్వమునందు ద్వైతభానముండదు.

**వివక్ష్యతే తదస్మాభిరద్వైతానంద నామకే ।**
**అధ్యాయే హి తృతీయోఽతః సర్వమప్యతి మంగలమ్ ॥88॥**

*88. అద్వైతానందమనే మూడవ ప్రకరణమున ఆ ద్వైతాభావము వివరింపబోవుచున్నాము. కనుక అంతయు శుభమే.*

**సదా పశ్యన్నిజానంద మపశ్యన్నిఖిలం జగత్ ।**
**అర్థా ద్యోగీతి చేత్తర్హి సంతుష్టో వర్ధతాం భవాన్ ॥89॥**

*89. సర్వదా నిజానందమునే దర్శించుచు నిఖిలజగత్తును విస్మరించి ఉండేవాడు నిజమైన యోగి అనినచో నీవు సంతుష్టుడవై వర్ధిల్లుము. (నిజమగు వివేకి కూడా అట్టివాడే అని భావము.)*

**బ్రహ్మానందా భిధే గ్రంథే మందానుగ్రహసిద్ధయే ।**
**ద్వితీయాధ్యాయ ఏతస్మిన్నాత్మానందో వివేచితః ॥90॥**

*90. బ్రహ్మానందమనే పేరుగల గ్రంథమునందు ఈ రెండవ అధ్యాయమున ఆత్మానందము మందబుద్ధుల ఉపకారమునకై వివేచింపబడినది.*

**ద్వాదశప్రకరణము: సమాప్తము**

# త్రయోదశము : బ్రహ్మానందమున అద్వైతానంద ప్రకరణము

**యోగానందః పురోక్తో యః స ఆత్మానంద ఇష్యతామ్ ।**
**కథం బ్రహ్మత్వమేతస్య సద్వయస్యేతి చేచ్ఛృణు ॥1॥**

*1. మునుపు వర్ణింపబడిన యోగానందమే ఆత్మానందము. సద్వయమగు ఆత్మ అద్వయమగు బ్రహ్మము ఎట్లగుననినచో వినుము.*

**వ్యాఖ్య:** బ్రహ్మానందము, విద్యానందము, విషయానందము అని ఆనందము మూడు విధములు మాత్రమే. ఇట్లు ఏకాదశ ప్రకరణమున చెప్పబడినది. ఇవిగాక ద్వాదశప్రకరణమున ఆత్మానందము మరొకటి చెప్పబడుటచేత ఇది నాలుగవదేమో అనే సంశయాన్ని పరిహరించుటకు యోగానందమే ఆత్మానందమని చెప్పబడినది.

ఒక్క బ్రహ్మానందమే యోగాభ్యాసము వలన సిద్ధించుటచే యోగానందమనీ, అది అహంకారము మొదలగు ఉపాధులు లేనిదగుటచే నిజానందమనీ, అదే గౌణ-మిథ్యా-ముఖ్య ఆత్మల వివేచన దృష్ట్యా ఆత్మానందమనీ వ్యవహృతమగును. కాని ముఖ్యమగు ఆత్మ గౌణమగు పుత్రాదులతోను, మిథ్యయగు దేహాదులతోను, సద్వయమగుటచే అట్టి ఆత్మానందము అద్వయమగు బ్రహ్మానందము ఎట్లగునని సంశయము.

**ఆకాశాది స్వదేహాంత తైత్తిరీయ శ్రుతీరితమ్ ।**
**జగన్నాస్త్యన్యదానందాదద్వైత బ్రహ్మతా తతః ॥2॥**

*2. తైత్తిరీయ ఉపనిషత్తునందు **(2.1.1; 2.7.1)** ఆకాశము మొదలు స్థూల దేహము వరకు అంతా జగత్తనీ, ఈ జగత్తంతా ఆనందము కంటే భిన్నం కాదనీ చెప్పబడినది. కనుక ఆత్మానందము అద్వయమగు బ్రహ్మానందమే అగును.*

**వ్యాఖ్య:** ఆత్మ నుండే ఆకాశము సంభవించి క్రమముగా మిథ్యా గౌణ ఆత్మలతో కూడా జగత్తంతా సంభవించెను. ఇట్లు జగత్కారణమైన ఆత్మానందము కంటే ఇతరము లేకపోవుటచే ఆత్మానందము యొక్క అద్వైతత్వము సిద్ధించుచున్నది.

**ఆనందాదేవ తజ్జాతం తిష్టత్యానంద ఏవ తత్ ।**
**ఆనంద ఏవ లీనం చేత్యుక్తానందా త్కథం పృథక్ ॥3॥**

*3. ఈ జగత్తు ఆనందము నుండే జనించినది. ఆనందమునందే ఉండును. ఆనందమునందే లీనమగును. ఇట్లు చెప్పబడిన జగత్తు ఆనందము కంటే భిన్నమెట్లగును? తైత్తిరీయ ఉప: 3.6.1*

**కులాలాద్ఘట ఉత్పన్నో భిన్నశ్చేతి న శంక్యతామ్ ।**
**మృద్వదేష ఉపాదానం నిమిత్తం న కులాలవత్ ॥4॥**

*4. కుమ్మరిచే చేయబడ్డ కుండ కుమ్మరి కంటే భిన్నం కదా అని శంకింప వలదు. కుండకు మట్టి ఉపాదానకారణమైనట్లు ఆనందము జగత్తునకు ఉపాదాన కారణము. కుండకు కుమ్మరి వలె నిమిత్త కారణము కాదు.*

**స్థితిర్లయశ్చ కుంభస్య కులాలే స్తో న హి క్వచిత్ ।**
**దృష్టౌ తౌ మృది తద్వత్స్యాదుపాదానం తయోః శ్రుతేః ॥5॥**

*5. కుమ్మరియందే కుండ ఉండుట గాని కుమ్మరియందే కుండ లీనమగుట గాని ఎక్కడా చూడము. ఈ స్థితిలయములు మట్టియందే చూడ గలము. అట్లే శ్రుత్యుక్తములైన జగత్తు యొక్క స్థితిలయములు ఉపాదానమైన ఆనందమునందే ఉండును.*

**ఉపాదానం త్రిధా భిన్నం వివర్తి పరిణామి చ ।**
**ఆరంభకం చ తత్రాంత్యౌ న నిరంశేఽవకాశినౌ ॥6॥**

*6. వివర్తము పరిణామము ఆరంభకము అని ఉపాదానము మూడు విధములు. చివరి రెండింటియందూ అంశములు, భాగములు, ఆవశ్యకము లగుటచే నిరంశము, నిరవయవము అగు బ్రహ్మమునకు అన్వయింపవు.*

**వ్యాఖ్య:** ఆరంభక ఉపాదాన కారణమనగా కార్యము కంటే భిన్నముగ ఉండేది. పరిణామ ఉపాదాన కారణమనగా కారణము యొక్క మరొక స్థితియే కార్యముగ ఉండేది. వివర్త ఉపాదాన కారణము అనగా కార్యము కారణము కంటే భిన్నము వాస్తవముగ కాకపోయినను భిన్నమైనట్లు కన్పించునది. ఇవి తరువాతి శ్లోకములలో వివరింపబడును.

**ఆరంభవాదినోఽ న్యస్మాదన్యస్యోత్పత్తి మూచిరే ।**
**తంతోః పటస్య నిష్పత్తేర్భిన్నౌ తంతుపటౌ ఖలు ॥7॥**

*7. ఆరంభవాదులు ఒక పదార్థము నుండి మరొక పదార్థము ఉత్పత్తి అగునని అంగీకరింతురు. నూలుపోగుల నుండి వస్త్రము ఉత్పత్తియైనట్లు (ఇది వైశేషికుల మతము.)*

**అవస్థాంతరతాపత్తి రేకస్య పరిణామితా ।**
**స్యాత్క్షీరం దధి మృత్కుంభః సువర్ణం కుండలం యథా ॥8॥**

*8. కారణము ఒక అవస్థ నుండి మరొక అవస్థను పొంది కార్యమగుట పరిణామము. పాలు పెరుగగుట, మట్టి రూపాంతరమునొంది కుండ అగుట, సువర్ణము కుండలము (ఒక ఆభరణము) అగుట ఉదాహరణములు.*

**అవస్థాంతరభానం తు వివర్తో రజ్జుసర్పవత్ ।**
**నిరంశేఽ ప్యస్త్యసౌ వ్యోమ్ని తలమాలిన్యకల్పనాత్ ॥9॥**

*9. నిజముగ అవస్థయందు మార్పులేక పోయినా ఉన్నట్లు భాసించుట వివర్తము. త్రాడు పామై కన్పించునట్లు. అవయవముల అంశములు లేని పదార్థములందు కూడా వివర్తము భాసించును. ఆకాశమునకు వాస్తవముగ రూపముగాని, వర్ణముగాని లేకున్నను అది నీలవర్ణపు గుడారము వలె కన్పించును. చూ. ప్ర. 2.50-53*

**తతో నిరంశ ఆనందే వివర్తో జగదిష్యతామ్ ।**
**మాయా శక్తిః కల్పికా స్యాదైంద్రజాలిక శక్తివత్ ॥10॥**

*10. కనుక అంశములు లేని ఆనందమునందు జగత్తు వివర్తమని చెప్పవచ్చును. ఇంద్రజాల శక్తి వలె ఆ వివర్తమును కల్పించునది మాయాశక్తి.*

**శక్తిః శక్తాత్పృథక్ నాస్తి తద్వద్ దృష్టేర్న చాభిదా ।**
**ప్రతిబంధస్య దృష్టత్వా చ్ఛక్త్యభావే తు కస్య సః ॥11॥**

*11. శక్తిగలవాని కంటె భిన్నముగ శక్తి లేదు. శక్తి ఎల్లప్పుడూ శక్తివంతునితో కూడియే కన్పించును. అయిననో శక్తి, శక్తివంతుడూ ఒకటి కాదు, శక్తివంతుని శక్తి ఒక్కొక్కప్పుడు ప్రతిబద్ధమగుట చేత. ఆ శక్తి భిన్నము కానిచో ఈ ప్రతిబంధము దేనిది కాగలదు?*

**వ్యాఖ్య:** ఆనందముతో కూడా వివర్తమును కల్పించు మాయను అంగీకరించి నచో ఆనందము సద్వయమగునను సంశయమును వారించుటకు మాయ భిన్నము అభిన్నము కూడా కానిదగు అనిర్వచనీయమని ప్రతిపాదింప బడుచున్నది.

**శక్తేః కార్యానుమేయత్వాదకార్యే ప్రతిబంధనమ్ ।**
**జ్వలతోఽగ్నేరదాహే స్యాన్మంత్రాది ప్రతిబంధతా ॥12॥**

*12. శక్తి దాని ఫలితమును బట్టి అనుమానింపబడును కనుక ఫలితములు కలుగనపుడు ప్రతిబంధము కలదని నిర్ణయింపబడును. జ్వలించుచున్న అగ్ని దహింపనిచో మంత్రములు మొదలగువాని వలన ప్రతిబంధము కలిగినదని అనుమానింతము.*

**దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం మునయోఽవిదన్ ।**
**పరాస్య శక్తిర్వివిధా క్రియా జ్ఞానబలాత్మికా ॥13॥**

*13. ద్యోతమానమగు స్వయంప్రకాశమైన చిదాత్మ యొక్క మాయా రూపమైన శక్తిని తన స్వంతగుణముల చేతనే గూఢమైన దానిని మునులు సాక్షాత్కరించుకొనిరి. ఈ ఉత్కృష్టమైన జగత్కారణమైన శక్తి వివిధములుగ ఇచ్ఛా-జ్ఞాన-క్రియాస్వరూపములుగ చెప్పబడుచున్నది. శ్వేతా. ఉప.1.3; 6.8*

**ఇతి వేదవచః ప్రాహ వసిష్ఠశ్చ తథాబ్రవీత్ ।**
**సర్వశక్తి పరం బ్రహ్మ నిత్యమాపూర్ణ మద్వయమ్ ॥14॥**

*14. పరబ్రహ్మము సర్వశక్తిమంతము, నిత్యము, పూర్ణము, అద్వయమని వేదవచనము. వసిష్ఠుడు కూడా ఇట్లే చెప్పును. (14 నుండి 27 వరకు గల శ్లోకములు యోగ వాసిష్ఠము నందలి ఉత్పత్తి ప్రకరణములోనివి.)*

**యయోల్లసతి శక్తాసౌ ప్రకాశమధిగచ్ఛతి ।**
**చ్ఛిక్తిర్బ్రహ్మణో రామ శరీరేషూపలభ్యతే ॥15॥**

*15. ఓ రామా! ఆ బ్రహ్మము ఏ శక్తితో క్రీడింపదలచిన ఆ శక్తి ప్రకాశిత మగును. చైతన్యరూపమున ఆ బ్రహ్మము యొక్క శక్తియే సకల ప్రాణుల దేహములందు అనుభూతమగుచున్నది.*

**స్పంద శక్తిశ్చ వాతేషు దార్ఢశక్తిస్తథోపలే ।**
**ద్రవశక్తిస్తథాంభస్సు దాహశక్తి స్తథానలే ॥16॥**

*16.* వాయువునందు స్పందనశక్తిగా, శిలలయందు కాఠిన్యశక్తిగా జలము నందు ద్రవశక్తిగా, అగ్నిలో దహనశక్తిగా ఆ బ్రహ్మము యొక్క శక్తియే కలదు.

**శూన్యశక్తిస్తథాకాశే నాశ శక్తిర్వినాశిని ।**
**యథాండేంతర్మహాసర్పో జగతస్తి తథాత్మని ॥17॥**

*17.* ఆకాశమునందు శూన్యశక్తిగా, వినాశశీలములగు వస్తువులందు నాశశక్తిగా ఆ బ్రహ్మము యొక్క శక్తియే గలదు. గ్రుడ్డునందు మహాసర్పము పొంచియున్నట్లు ఆత్మయందు జగత్తు నిగూఢమై ఉన్నది.

**ఫలపత్రలతాపుష్పశాఖావిటపమూలవాన్ ।**
**నను బీజే యథా వృక్షస్తథేదం బ్రహ్మణి స్థితమ్ ॥18॥**

*18.* పండ్లు ఆకులు తీగలు పూవులు కొమ్మలు వేర్లు కలిగిన మహా వృక్షము బీజమునందు గూఢమై ఉన్నట్లు ఈ దృశ్యమాన జగత్తంతా బ్రహ్మము నందు స్థితమై ఉన్నది.

**క్వచిత్కాచిత్కదాచిచ్చ తస్మాదుద్యంతి శక్తయః ।**
**దేశకాల విచిత్రత్వాత్ క్ష్మాతలాదివ శాలయః ॥19॥**

*19.* దేశకాల వైచిత్ర్యము వలన కొన్ని చోట్ల కొన్ని సమయములందు కొన్ని శక్తులు బ్రహ్మము నుండి ఉత్పన్నములగును, భూమిపై పైరులుత్పన్నము లైనట్లే.

**స ఆత్మా సర్వగో రామ నిత్యోదితే మహావపుః ।**
**యన్మనాఙ్మననీం శక్తిం ధత్తే తన్మన ఉచ్యతే ॥20॥**

*20.* ఓ రామా! సర్వవ్యాపకము సర్వదా ప్రకాశమానము దేశకాల పరిచ్ఛేద రహిత స్వరూపము అయిన ఆత్మ మననశక్తి రూపమును దాల్చినపుడు అది మనస్సనబడుచున్నది.

**ఆదౌ మనస్తదను బంధవిమోక్షదృష్టీ పశ్చాత్ప్రపంచరచనా భువనాభిధానా ।**
**ఇత్యాదికా స్థితిరియం హి గతా ప్రతిష్ఠామాఖ్యాయికా సుభగ బాలజనోదితేవ॥21**

*21.* మొదట మనస్సు దానిని అనుసరించి బంధము మోక్షము అనే దృక్పథములు ఆపై అనేక భువనములు గల ప్రపంచకల్పన. ఈ విధముగ దృశ్యమానమగు స్థితి అంతా (మానవులు మస్తిష్కములందు) బాలకుల వినోదార్థము చెప్పబడు కథల వలె స్థిరపడినది.

యోగవాసిష్ఠ కథ –

**బాలస్య హి వినోదాయ ధాత్రీ వక్తి శుభాం కథామ్ ।**
**క్వచి త్సంతి మహాబాహో రాజపుత్రా స్త్రయః శుభాః ।।22।।**

*22. బాలుని వినోదము కొరకే కదా ధాత్రి సుందరమైన కథనిట్లు చెప్పును: ఒకప్పుడు సుందరులైన మూవురు రాజకుమారులు ఉండిరి.*

**ద్వౌ న జాతౌ తథైకస్తు గర్భ ఏవ న చ స్థితః ।**
**వసంతి తే ధర్మయుక్తా అత్యంతాసతి పత్తనే ।।23।।**

*23. వారిలో ఇరువురు జన్మింపలేదు. మరొకడు మాతృగర్భమునందే ఉండలేదు. అట్టివారు ధర్మపరులై అసలు లేనే లేని నగరమునందు నివసించిరి.*

**స్వకీయాచ్ఛూన్యనగరాన్నిర్గత్య విమలాశయాః ।**
**గచ్ఛన్తో గగనే వృక్షాన్దదృశుః ఫలశాలినః ।।24।।**

*24. వారు తమ లేని పట్టణము నుండి వెలువడి పోవుచు ఆకాశమున ఫలసంభరితములైన వృక్షములను చూచిరి.*

**భవిష్యనగరే తత్ర రాజపుత్రాస్త్రయోఽపితే ।**
**సుఖమద్య స్థితాః పుత్ర మృగయా వ్యవహారిణః ।।25।।**

*25. ఓ పుత్రా! ఆపైన ఆ ముప్పురు రాజకుమారులు నిర్మింపబడనున్న నగరమునకు బోయి అందు వేటాడుచు సుఖముగ ఉండిరి.*

**ధాత్ర్యేతి కథితా రామ బాలకాఖ్యాయికా శుభా ।**
**నిశ్చయం స యయౌ బాలో నిర్విచారణయా ధియా ।।26।।**

*26. బాలకుని కథ సుందరముగా ధాత్రి చెప్పగా అది అంతా నిశ్చయముగ జరిగినట్లు వివేచనలేని బాలకుని తల కెక్కును.*

**ఇయం సంసార రచనా విచారోజ్ఝితచేతసామ్ ।**
**బాలకాఖ్యాయికేవేత్థమవస్థితిముపాగతా ।।27।।**

*27. ఈ దృశ్యమాన సంసార రచన కూడా అట్లే వివేకము లేని మనస్సులందు బాలకుల కథవలె ఇట్లు నిజమై భాసించును.*

**ఇత్యాదిభిరుపాఖ్యానైర్మాయాశక్తేశ్చ విస్తరమ్ ।**
**వసిష్ఠః కథయామాస సైవ శక్తిర్నిరూప్యతే ।।28।।**

*28.* వినోదము కలిగించే ఇట్టి కథలచే వసిష్ఠమహర్షి మాయాశక్తినే వర్ణించెను. ఆ శక్తియే ఇంకను ఇపుడు వివరింపబడుచున్నది.

**కార్యాదాశ్రయతశ్చైషా భవేచ్ఛక్తిర్విలక్షణా ।**
**స్ఫోటాంగారౌ దృశ్యమానౌ శక్తిస్తత్రానుమీయతే ॥29॥**

*29.* ఈ శక్తి కార్యము (ఫలితము) కంటే, ఆశ్రయము కంటే కూడా భిన్నము. కాలినపుడు కలుగు బొబ్బ, కాల్చు నిప్పురవ్వ రెండూ కన్పించే వస్తువులే. కాని రవ్వ యొక్క దహనశక్తి బొబ్బనుబట్టి అనుమేయము మాత్రమే.

**పృథు బుధ్నోదరాకారో ఘటః కార్యోఽత్ర మృత్తికా ।**
**శబ్దాదిభిః పంచగుణైర్యుక్తా శక్తిస్త్వతద్విధా ॥30॥**

*30.* మందము గుండ్రనితనము మొదలైన లక్షణములు గల ఘటము కార్యము. ఆశ్రయమైన మట్టి శబ్దాది పంచలక్షణములు గలది. కాని ఈ మట్టిపై పని చేసి ఘటమును కల్పించే శక్తి ఆ రెండింటి కంటే భిన్నము.

**న పృథ్వాదిర్న శబ్దాదిః శక్తావస్తు యథా తథా ।**
**అత ఏవ హ్యచింత్యైషా న నిర్వచనమర్హతి ॥31॥**

*31.* ఘటమును కల్పించే శక్తియందు మందము మొదలగు లక్షణములు గాని శబ్దము మొదలగు లక్షణములు గాని లేవు. అది ఎట్లుండెనో అట్లే ఉండును. కనుకనే అది అచింత్యము అనిర్వచనీయము.

**కార్యోత్పత్తేః పురా శక్తిర్నిగూఢా మృద్యవస్థితా ।**
**కులాలాదిసహాయేన వికారాకారతాం వ్రజేత్ ॥32॥**

*32.* కార్యమగు ఘటము ఉత్పన్నమగుటకు పూర్వము ఆ శక్తి మట్టి యందు గూఢమై ఉండెను. కుమ్మరి మొదలగువాని సహాయమున మట్టి ఘటమనే వికారాకారమును పొందెను.

**పృథుత్వాది వికారాంతం స్పర్శాదిం చాపి మృత్తికామ్ ।**
**ఏకీకృత్య ఘటం ప్రాహు ర్విచార వికలా జనాః ॥33॥**

*33.* మందము మొదలగు వికారములను స్పర్శ మొదలగు గుణములు గల మట్టిని ఒకటిగా చేసి విచారణ చేయజాలని జనులు ఘటమందురు.

**కులాల వ్యాపృతేః పూర్వో యావానంశః స నో ఘటః ।**
**పశ్చాత్తు పృథుబుధ్నాదిమత్వే యుక్తా హి కుంభతా ॥34॥**

*34.* కుమ్మరి పనిచేయుటకు పూర్వము ఉండిన వస్తువు ఘటము కాదు. అతడు పనిచేసి పిదప మందము డొల్ల తనము మొదలగు గుణములు కలిగి ఉండుటచే ఆ మట్టికి ఘటత్వము తగియుండును.

**న ఘటో న మృదో భిన్నో వియోగే సత్యనీక్షతాత్ ।**
**నా ప్యభిన్నః పురా పిండదశాయామనవేక్షణాత్ ॥35॥**

*35.* ఆ ఘటము మట్టి కంటే భిన్నము కాదు, మట్టి నుండి వియోగము కలిగినచో అది కన్పింపదు గనుక. కాని అభిన్నము కూడా కాదు మట్టి ముద్ద దశయందు ఘటము కన్పింపదు గనుక.

**అతోஉనిర్వచనియోஉయం శక్తివత్తేన శక్తిజః ।**
**అవ్యక్తత్వే శక్తిరుక్తా వ్యక్తత్వే ఘటనామభృత్ ॥36॥**

*36.* కనుక శక్తిచే కల్పితమగు ఘటము, దానిని కల్పించే శక్తి వలెనే అనిర్వచనీయము. కార్యము వ్యక్తము కానపుడు శక్తి అనబడును. వ్యక్తమైన పుడు ఆ శక్తికి ఘటమనే పేరు కలుగును.

**ఐంద్రజాలిక నిష్ఠాపి మాయా న వ్యజ్యతే పురా ।**
**పశ్చాద్గంధర్వ సేనాదిరూపేణ వ్యక్తి మాప్నుయాత్ ॥37॥**

*37.* ఇంద్రజాలికుని శక్తి మొదట కన్పింపదు. అతడు దానిని ఉపయోగించినపుడు మాత్రమే అది గంధర్వుల సైన్యము మొదలగు రూపములలో వ్యక్తమగును.

**ఏవం మాయామయత్వేన వికారస్యానృతాత్మతామ్ ।**
**వికారాధార మృద్వస్తు సత్యత్వం చాబ్రవీచ్ఛ్రుతిః ॥38॥**

*38.* ఇట్లు మాయామయములగుట చేత వికారములన్నీ మిథ్యయనీ వికారములకు ఆధారమగు మట్టివంటి వస్తువు మాత్రమే సత్యమనీ శ్రుతి అనెను. ఛాందోగ్య ఉప*: 6.1.4*

**వాఙ్నిపాద్యం నామ మాత్రం వికారో నాస్య సత్యతా ।**
**స్పర్శాదిగుణయుక్తాం తు సత్యా కేవలమృత్తికా ॥39॥**

*39.* మాటలచే సూచింపబడే వికారము నామమాత్రమే. దానికి సత్యత్వము లేదు. స్పర్శాది గుణములు గల మట్టి మాత్రము సత్యము.

**వ్యక్తావ్యక్తే తదాధార ఇతి త్రిష్వాద్యయోర్ద్వయోః ।**
**పర్యాయః కాలభేదేన తృతీయస్త్వనుగచ్ఛతి ॥40॥**

*40.* వ్యక్తము, అవ్యక్తము, వానికి ఆధారము అనే మూడింటిలో మొదటి రెండూ పూర్వాపర కాలభేదముచే మారుచుండును. మూడవది రెండింటి యందు (సర్వకాలమునందును) ఉండును. (కనుక ఇదియే సత్యము)

**నిస్తత్త్వం భాసమానం చ వ్యక్తముత్పత్తి నాశభాక్ ।**
**తదుత్పత్తౌ తస్య నామ వాచా నిష్పాద్యతే నృభిః ॥41॥**

*41.* తత్త్వము లేనిది అయినా కన్పించునది అగు వ్యక్తము, ఉత్పత్తి వినాశములు కలిగియుండును. ఉత్పత్తి అయినపుడు మాటలచే ప్రజలు దానికి పేరు కల్పింతురు.

**వ్యక్తే నష్టేఽపి నామైతన్నృవక్త్రేష్వనువర్తతే ।**
**తేన నామ్నా నిరూప్యత్వాద్వ్యక్తం తద్రూపముచ్యతే ॥42॥**

*42.* కార్యము వ్యక్తమైనా, నశించినా దాని పేరు మాత్రము జనులు వ్యవహరించుదురు. ఆ పేరు చేతనే సూచింపబడుట చేత రూపము కూడా నామ మాత్రమే.

**నిస్తత్త్వత్వాద్వినాశిత్వాద్వాచారంభణనామతః ।**
**వ్యక్తస్య న తు తద్రూపం సత్యం కించిన్మృదాదివత్ ॥43॥**

*43.* తత్త్వము లేకపోవుట చేతా, నాశశీలమగుట చేతా శబ్దములచే మాత్రము ఏర్పడు నామమగుట చేతా కార్యము యొక్క రూపము మట్టి మొదలగు వానివలె సత్యము కాదు.

**వ్యక్తకాలే తతః పూర్వమూర్ధ్వమప్యేకరూపభాక్ ।**
**సతత్త్వ మవినాశం చ సత్యం మృద్వస్తు కథ్యతే ॥44॥**

*44.* మట్టి, కార్యము వ్యక్తమగునపుడు దానికి పూర్వము తరువాత కూడా ఒక రూపముగనే ఉండును. దానికి తత్త్వము ఉండుట చేతను వినాశము లేకపోవుట చేతను అది సత్యమగు వస్తువు అనబడుచున్నది.

**వ్యక్తం ఘటో వికారశ్చే త్యేతైర్నామభిరీరితః ।**
**అర్థశ్చేదనృతః కస్మాన్న మృద్బోధే నివర్తతే ॥45॥**

*45. (సంశయము) వ్యక్తము, ఘటము, వికారము అనే పేర్లతో సూచింపబడే వస్తువు అసత్యమైనచో అది మట్టియని తెలిసినపుడు ఏల నశింపదు? (త్రాడని తెలిసినపుడు పాము నశించును. మట్టియని తెలిసినపుడు ఘటమేల నశింపదు?)*

**నివృత్త ఏవ యస్మాత్తే తత్సత్యత్వమతిర్గతా ।**
**ఈదృఙ్నివృత్తిరేవాత్ర బోధజా న త్వభాసనమ్ ॥46॥**

*46. (సమాధానము) అది నశించుట వలననే అది సత్యమనే భావము పోయినది. జ్ఞానము వలన కలుగునది ఇట్టి నాశనమే, నివృత్తియే. కాని కనుపింపక పోవుట కాదు.*

**వ్యాఖ్య:** ఆరోపము రెండు విధములు. సోపాధికము నిరుపాధికము అని. త్రాటిపై పాము, ముత్యపుచిప్పపై వెండి మొదలగు ఆరోపములు నిరుపాధికములు, ఉపాధి లేనివి. వీనియందు జ్ఞానఫలితముగ పాము వెండి మొదలగు భ్రాంతులు తొలగుటయే గాక ఆయా వస్తువులు కూడా కన్పింపవు. సోపాధికములగు ఆరోపములందు ఉపాధియున్నంత వరకు ఆయా వస్తువులు కన్పించును కాని అవి సత్యమనే బుద్ధి, భావన, నశించును. మట్టికుండ, బంగారు ఉంగరము, వీనియందు కుమ్మరివాని పని, కంసాలి వాని పని ఉపాధులుగ ఉండి ఆ వస్తువులు కన్పించు చునే ఉండును. కాని జ్ఞానము వలన కుండ, ఉంగరము అనే నామ రూపములు సత్యమనే భావము నశించి మట్టి, బంగారం మాత్రమే సత్యమనే బోధ కలుగును.

**పుమానధోముఖో నీరే భాతోఽప్యస్తి న వస్తుతః ।**
**తటస్థమర్త్యవత్తస్మిన్నైవాస్థా కస్యచిత్క్వచిత్ ॥47॥**

*47. నీటియందు తలక్రిందుగా పురుషుడు కన్పించుచున్నా అది గట్టున నిలబడి ఉన్న వ్యక్తి వలె సత్యము కాదు. ఆ ప్రతిఫలనము నందు ఎవరుగాని ఎచ్చటగాని విశ్వాసమును ఉంచరు.*

**వ్యాఖ్య:** స్వచ్ఛమైన నీటియందు పురుషుని ప్రతిఫలనము చూచినపుడు అది పురుషుడే అని భ్రాంతి కలుగును. అనగా ప్రతిబింబముపై పురుషత్వము సత్యత్వము ఆరోపింపబడును. కాని అది ప్రతిబింబమనే బోధ కలుగగనే అందలి సత్యత్వ, పురుషత్వ బోధ నశించును. అయినా ప్రతిఫలనము కన్పించుచునే ఉండును గదా! అట్లే ఈ జగత్తు సత్యమనే భ్రాంతి నశించినా అది కన్పించుచునే

ఉండును. ఈ భ్రాంతికి ఆధారమగు బ్రహ్మము సత్యమని బోధపడినపుడు దానిపై వివర్తమైన జగత్తు కన్పించుచున్నను అసత్యమని బోధపడును, దాని యందలి సత్యత్వబుద్ధి నశించును.

**ఈదృగ్బోధే పుమర్థత్వం మతమద్వైత వాదినామ్ ।**
**మృద్రూపస్యాపరిత్యాగాద్వివర్తత్వం ఘటే స్థితమ్ ॥48॥**

*48. ఇట్టి బోధయే అద్వైతమతమున పురుషార్థమగు మోక్షము నిచ్చును. కుండకు ఆధారమగు మట్టిని నిరాకరింపకపోవుటచే అందు కుండ కనిపించుట అంగీకారమే. వివర్తముగ.*

**పరిణామే పూర్వరూపం త్యజేత్తత్క్షీరరూపవత్ ।**
**మృత్సువర్ణే నివర్తేతే ఘటకుండల యోర్న హి ॥49॥**

*49. పరిణామమున పూర్వరూపం నశించును. పాలు పెరుగుగ పరిణమించినపుడు ఆధారమగు పాలు ఇక లభించవు. కాని మట్టికుండ స్వర్ణ కుండలము లందలి మట్టి, సువర్ణము నశింపక ఎప్పుడు కావలసిన అప్పుడు లభించును. అనగా ఆధారము నశింపదు.*

**ఘటే భగ్నే న మృద్భావః కపాలానామవేక్షణాత్ ।**
**మైవం చూర్ణేఽస్తి మృద్రూపం స్వర్ణరూపం త్వతిస్ఫుటమ్ ॥50॥**

*50. కుండ పగిలినపుడు మట్టి కన్పింపదు పెంకులు మాత్రమే కన్పించుననినచో అట్లు కాదు. పెంకుల పొడియందు మట్టియే కన్పించును. ఈ విషయము బంగారు రూపమున స్పష్టముగ తెలియును. (బంగారు ఉంగరము విరిగినను కరిగినను అది బంగారం అనుటలో ఎవరికిని సంశయము లేదని భావము.)*

**క్షీరాదౌ పరిణామోఽస్తు పునస్తద్భావ వర్జనాత్ ।**
**ఏతావతా మృదాదీనాం దృష్టాంతత్వం న హీయతే ॥51॥**

*51. పాలు మొదలగువానియందు, అవి మరల తమ పూర్వరూపమును పొందజాలకపోవుట చేత, పరిణామముండును. దాని వలన మట్టి మొదలగునవి వివర్తమునకు దృష్టాంతములగుటకు ఎట్టి బాధయు లేదు. (వీనియందు పరిణామము వివర్తము కూడా ఉండునని భావము.)*

**ఆరంభ వాదినః కార్యే మృదో ద్వైగుణ్యమాపతేత్ ।**
**రూప స్పర్శాదయః ప్రోక్తాః కార్యకారణయోః పృథక్ ॥52॥**

*52.* ఆరంభవాదుల మతమున కార్యము కారణము కంటే భిన్నము. అందువలన కారణమగు మట్టియందు దాని గుణములే కాక కార్యమగు ఘటగుణములు కూడా ఉండవలసి వచ్చును. ఇది సత్యము కాదనుట స్పష్టమే.

**మృత్సువర్ణమయశ్చేతి దృష్టాంతత్రయ మారుణిః ।**
**ప్రాహాతో వాసయేత్కార్యానృతత్వం సర్వవస్తుషు ॥53॥**

*53.* అరుణఋషి పుత్రుడగు ఉద్దాలకమహర్షి కార్యములన్నీ మిథ్యయని చూపుటకు మూడు ఉదాహరణములను మృత్తిక, సువర్ణము, ఇనుము అని చూపును. కనుక అన్ని కార్యములూ అనృతములని నిశ్చయింపవలెను. ఛాందోగ్య ఉప: *6.1.4*

**కారణ జ్ఞానతః కార్యవిజ్ఞానం చాపి సోఽవదత్ ।**
**సత్యజ్ఞానేఽనృతజ్ఞానం కథమత్రోపపద్యతే ॥54॥**

*54.* అరుణిమతమున కారణమును తెలిసికొనిన దాని కార్యములన్నీ తెలియబడును. కాని సత్యమగు కారణమును తెలిసికొనిన మిథ్యయగు కార్యములన్నీ ఎట్లు తెలియబడును?

**సమృత్కస్య వికారస్య కార్యతా లోకదృష్టితః ।**
**వాస్తవోఽత్ర మృదంశోఽస్య బోధః కారణబోధతః ॥55॥**

*55.* లౌకిక దృష్టియందు కార్యమగు ఘటము కారణమగు మట్టి యొక్క పరిణామము. కారణమగు మట్టిని తెలిసికొనినచో కార్యమునందలి సత్యమగు మట్టి అంశము కూడా తెలియబడును. (కుండయను వస్తువునందు సత్యమగు మట్టి అంశము అసత్యములగు నామరూపాంశములు కలవు.)

**అనృతాంశో న బోద్ధవ్యస్తద్బోధానుపయోగతః ।**
**తత్త్వజ్ఞానం పుమర్థం స్యాన్నానృతాంశావబోధనమ్ ॥56॥**

*56.* అనృతాంశములను తెలిసికొనుట వలన ఉపయోగము లేకపోవుటచే వానిని తెలిసికొననక్కరలేదు. తత్త్వజ్ఞానముచే పురుషార్థమగు మోక్షము సిద్ధించును. అనృతాంశములను తెలిసికొనుట వలన మోక్షము కలుగదు.

**తర్హి కారణవిజ్ఞానాత్కార్యజ్ఞానమితీరితే ।**
**మృద్బోధాన్మృత్తికా బుద్ధేత్యుక్తం స్యాత్కోఽత్ర విస్మయః ॥57॥**

*57. (సంశయము) అయినచో కారణ జ్ఞానము వలన దాని కార్యజ్ఞానము కలుగుననిన మట్టిని తెలిసికొనినచో మట్టియే తెలియునని ఏర్పడును. అది యుక్తమే. దీనియందు అద్భుతమేమి కలదు?*

**సత్యం కార్యేషు వస్త్వంశః కారణాత్మేతి జానతః ।**
**విస్మయో మాస్త్విహాజ్ఞస్య విస్మయః కేన వార్యతే ॥58॥**

*58. (సమాధానము) కార్యములోని సత్యాంశము కారణమే. ఈ విషయము తెలిసిన విజ్ఞులకు ఆశ్చర్యము లేకపోయినను, అజ్ఞులు దీనిని జూచి ఆశ్చర్యపడుటను ఎవరు అడ్డగింపగలరు?*

**ఆరంభీ పరిణామీ చ లౌకికశ్చైక కారణే ।**
**జ్ఞాతే సర్వమతిం శ్రుత్వా ప్రాప్నువంత్యేవ విస్మయమ్ ॥59॥**

*59. ఆరంభవాదులు, పరిణామవాదులు, లౌకికులు కారణమును తెలిసి కొనుటచే దాని కార్యములన్నీ తెలియబడునని విని ఆశ్చర్యమును పొందుచునే ఉందురు.*

**అద్వైతేఽభిముఖీకర్తుమేవాత్రైకస్య బోధతః ।**
**సర్వబోధః శ్రుతౌనైవ నానాత్వస్య వివక్షయా ॥60॥**

*60. శిష్యుని మనస్సును అద్వైతము వైపు మరలించుటకు మాత్రమే శ్రుతి ఏకమును తెలిసికొనినచో సర్వము తెలియబడుననినది గాని నానాత్వమును ఉద్దేశించి కాదు.*

**వ్యాఖ్య:** ఇంద్రియవిషయాలను తెలిసికొనుటకు ప్రత్యక్షము, అనుమానము అనునవి ప్రమాణములు. ఇంద్రియాతీత విషయములను తెలిసికొనుటకు శ్రుతి ఒక్కటియే ప్రమాణము.

**ఏకమృత్పిండ విజ్ఞానా త్సర్వమృన్మయధీర్యథా ।**
**తథైక బ్రహ్మబోధేన జగద్బుద్ధిర్విభావ్యతామ్ ॥61॥**

*61. ఒక్క మట్టిముద్దను తెలిసికొనుట చేత మట్టితో చేయబడినవన్నీ తెలియబడునట్లే ఒక్క బ్రహ్మమును తెలిసికొనుట చేత జగత్తంతా తెలియబడును.*

**వ్యాఖ్య:** జగత్తునందలి సత్యాంశమగు బ్రహ్మము తెలియబడునని అర్థము. జగత్తునందలి నామరూపములు మట్టి యొక్క ఘటాది నామరూపముల వలె మిథ్య అగుటచే వానిని తెలిసికొని ప్రయోజనము లేదు. అవి తెలియబడవు కూడా.

**సచ్చిత్సుఖాత్మకం బ్రహ్మ నామరూపాత్మకం జగత్ ।**
**తాపనీయే శ్రుతం బ్రహ్మ సచ్చిదానందలక్షణమ్ ॥62॥**

*62. బ్రహ్మము సత్ చిత్ ఆనంద స్వరూపము. జగత్తు నామరూపాత్మకము. నృసింహ ఉత్తరతాపినీయోపనిషత్తు (7) నందు బ్రహ్మమునకు సత్ చిత్ ఆనందములు లక్షణములని చెప్పబడినది.*

**సద్రూప మారుణిః ప్రాహ ప్రజ్ఞానం బ్రహ్మ బహ్వృచః ।**
**సనత్కుమార ఆనందమేవమన్యత్ర గమ్యతామ్ ॥63॥**

*63. బ్రహ్మమును ఆరుణి సత్స్వరూపమని వర్ణించెను. ఋగ్వేదము నందు బహ్వృచమహర్షి ప్రజ్ఞానమని చెప్పెను. సనత్కుమార మహర్షి ఆనందమని అనెను. ఇతరత్ర కూడా ఇట్లే వర్ణింపబడినది.*

**వ్యాఖ్య:** చూ. ఛాందోగ్య ఉప. 6.2.1–2; ఐతరేయ ఉప. 5.3; ఛాందోగ్య ఉప: 2.3.1; తైత్తిరీయ ఉప: 2.11, 3.6. ఇట్లు ఒక్కొక్కరొక్కొక్క విధమున చెప్పుట అభిప్రాయభేదముతో కాదు. మూడు లక్షణములు చేర్చి గ్రహింపవలెనని ఉద్దేశము. బ్రహ్మసూత్రములందు ఈ విషయము స్పష్టము చేయబడినది. అంతేగాక ఆత్మ బ్రహ్మము అనే లక్షణములను కూడా చేర్చవలెనని బ్రహ్మసూత్రములు చెప్పును.

**వివిచ్య సర్వరూపాణి కృత్వా నామాని తిష్ఠతి ।**
**అహం వ్యాకరవాణీమే నామరూపే ఇతి శ్రుతేః ॥64॥**

*64. నానావిధ రూపములను ఏర్పరచి వానికి నామములను పెట్టి బ్రహ్మము నిర్వికారముగనే స్థితమై ఉండును. మరొకశ్రుతి ఆత్మయై బ్రహ్మము నామరూపములను ప్రకటించును. తైత్తిరీయ పురుషసూక్తము 15.1; ఋగ్వేదము 10.90; ఛాందోగ్య ఉప: 6.3.2; చూ. బృహదారణ్యక ఉప: 1.4.7*

**అవ్యాకృతం పురా సృష్టే రూర్ధ్వం వ్యాక్రియతే ద్విధా ।**
**అచింత్యశక్తిర్మాయైషా బ్రహ్మణ్యవ్యాకృతాభిధా ॥65॥**

*65. మరొక శ్రుతి సృష్టికి పూర్వము అవ్యాకృతము ఉండెననీ అదే సృష్టి యందు నామరూపములుగ వ్యాకృతమయ్యెననీ చెప్పును. ఇచ్చట బ్రహ్మము*

*యొక్క అచింత్యమైన శక్తియే, మాయయే, అవ్యాకృతమనబడినది. బృహదారణ్యాక ఉపనిషత్తు. 1.4.7*

**అవిక్రియ బ్రహ్మ నిష్ఠా వికారం యాత్యనేకధా ।**
**మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్ ॥66॥**

*66. అవికార్యమగు బ్రహ్మమునందుండే మాయ అనేక విధములగు వికారములను పొందును. మాయయే ప్రకృతి (జగత్తుకు ఉపాదాన కారణము). మహేశ్వరుడే మాయాధీశ్వరుడు (ఆధారము). శ్వేతాశ్వతర ఉప: 4.10*

**ఆద్యో వికార ఆకాశః సోఽస్తి భాత్యపి చ ప్రియః ।**
**అవకాశస్తస్య రూపం తన్మిథ్యా న తు తత్త్రయమ్ ॥67॥**

*67. మాయ యొక్క మొదటి వికారము ఆకాశము. అది ఉండును, కనిపించును, ప్రియమగును. ఆకాశము యొక్క విశేష లక్షణము అవకాశము. ఈ అవకాశము మిథ్య. కాని కారణమగు బ్రహ్మము నుండి అనువర్తించిన మిగిలిన మూడు లక్షణములు మిథ్య కావు, సత్యమే.*

**న వ్యక్తేః పూర్వమస్త్యేవ న పశ్చాచ్చాపి నాశతః ।**
**ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా ॥68॥**

*68. అవకాశమను విశేష లక్షణము సృష్టికి పూర్వము లేదు. ప్రళయము తరువాత కూడా ఉండదు. ఆది యందూ అంతమునందూ లేనిది మధ్య కాలమున కూడా (సృష్టియందు కూడా) లేనట్లే.*

**అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।**
**అవ్యక్తనిధనాన్యేవేత్యాహ కృష్ణోర్జునం ప్రతి ॥69॥**

*69. 'ఓ అర్జునా! సకలభూతములు అవ్యక్తము నుండే జనించినవి. మధ్య కాలమున మాత్రము వ్యక్తములై ఉండి అవ్యక్తమునందే లయము నొందుచున్నవి' అని శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పెను.*

**వ్యాఖ్య:** భగవద్గీత 2.28. సందర్భమును బట్టి వ్యక్తమై ఉండే స్థితి మిథ్యా మాత్రమని స్పష్టపడును.

**మృద్వత్తే సచ్చిదానందా అనుగచ్ఛంతి సర్వదా ।**
**నిరాకాశే సదాదీనామనుభూతిర్నిజాత్మని ॥70॥**

*70.* ఘటాదివికారములందు మృత్తిక వలె సచ్చిదానందములు సర్వదా ఆకాశమునందు ఉండును. ఆకాశము కూడా లేనపుడే అవి ప్రత్యగాత్మయందే అనుభూతములగును. చూ. బ్రహ్మసూత్రములందు ఆకాశాధికరణము.

**అవకాశే విస్మృతేఽథ తత్ర కిం భాతి తే వద ।**
**శూన్యమేవేతి చేదస్తు నామ తాదృగ్విభాతి హి ॥71॥**

*71.* ఆకాశము నుండి అవకాశమును తొలగించినచో మిగులునదేమో చెప్పుము. శూన్యమే మిగులుననినచో అట్లే కానిమ్ము. శూన్యముగనైనను ప్రకాశించును గదా.

**వ్యాఖ్య:** ఆకాశము ఉన్నది. అది లేనిచో శూన్యము ఉన్నది. ఏదో ఒకటి ఉండనేవలయును. ఉండక తప్పదు. ఆ ఉనికియే సత్తయనబడు చున్నది.

**తాదృక్త్వాదేవ తత్సత్త్వమౌదాసీన్యేన తత్సుఖమ్ ।**
**ఆనుకూల్య ప్రాతికూల్యహీనం యత్తన్నిజం సుఖమ్ ॥72॥**

*72.* అట్లు మిగిలి ఉండి ప్రకాశించుట చేతనే అది సత్తయగుచున్నది. దాని వలన దుఃఖము కలుగక పోవుట చేత అదే ఆనందము. సుఖదుఃఖములు లేకుండుటయే ఆత్మానందము. చూ. ప్ర.11.93-75

**ఆనుకూల్యే హర్షధీః స్యాత్ప్రాతికూల్యే తు దుఃఖధీః ।**
**ద్వయాభావే నిజానందో నిజదుఃఖం న తు క్వచిత్ ॥73॥**

*73.* అనుకూలమైన విషయము వలన సుఖభావము కలుగును. ప్రతికూల విషయము వలన దుఃఖ భావము కలుగును. ఇవి రెండూ లేనప్పుడు నిజానందము, ఆత్మానందము సిద్ధించును. ఎచ్చట గాని ఆత్మ దుఃఖమనేది లేదు కదా.

**వ్యాఖ్య:** సుఖదుఃఖములు మనోభావములు మాత్రమే. ఆత్మయందు కేవలము ఆనందమే ఉండును. దానిని సుఖదుఃఖములు స్పర్శింపజాలవు.

**నిజానందే స్థిరే హర్షశోకయోర్వ్యత్యయః క్షణాత్ ।**
**మనసః క్షణికత్వేన తయోర్మానసతేష్యతామ్ ॥74॥**

*74.* నిజానందము నిశ్చలము సుస్థిరము. కాని హర్షశోకములు క్షణ క్షణమునకు మారుచుండును. మనస్సు కూడా క్షణిక చంచలమగుట చేత అవి మనోవికారములని తెలియవలెను.

**ఆకాశేఽప్యేవమానందః సత్తాభానే తు సమ్మతే ।**
**వాయ్వాది దేహపర్యంతం వస్తుష్వేవం విభావ్యతామ్ ॥75॥**

*75.* ఆకాశమున కూడా నిజమునకు సత్త ప్రకాశించుచు ఆనంద స్వరూపముగ ఉండుట అంగీకరించినపుడు వాయువు మొదలు దేహము వరకు సకల పదార్థములందూ వాస్తవముగ ఉన్నది ఆ సత్త ఆనందములే అని సిద్ధించును.

**గతి స్పర్శౌవాయురూపం వహ్నేర్దాహప్రకాశనే ।**
**జలస్య ద్రవతా భూమేః కాఠిన్యం చేతి నిర్ణయః ॥76॥**

*76.* వాయువు యొక్క విశేష గుణములు చలనము స్పర్శయని నిర్ణయింపబడినది అట్లే అగ్నికి దహనము ప్రకావము, జలమునకు ద్రవత్వము, భూమికి కాఠిన్యము విశేషలక్షణములని నిర్ణయము.

**అసాధారణ ఆకార ఓషధ్యన్నవపుష్యపి ।**
**ఏవం విభావ్యం మనసా తత్తద్రూపం యథోచితమ్ ॥77॥**

*77.* ఇట్లే ఓషధులు శరీరములు అన్నములు అన్ని విషయములకు కూడా వానివానికి తగినట్లు విశేష గుణములను మనస్సు భావించి ఏర్పరుప గలదు.

**అనేకధా విభిన్నేషు నామరూపేషు చైకధా ।**
**తిష్ఠంతి సచ్చిదానందా విసంవాదో న కస్యచిత్ ॥78॥**

*78.* ఈ విధముగ అనేక విధములుగ భిన్నవిభిన్నములైన నామరూపములందు ఒకే విధముగ అన్నింటియందూ సచ్చిదానందములు ఉండుచున్నవి. ఇందు విప్రతిపత్తి లేదు.

**నిస్తత్త్వే నామ రూపే ద్వే జన్మనాశయుతే చ తే ।**
**బుద్ధ్యా బ్రహ్మణి వీక్షస్వ సముద్రే బుద్బుదాదివత్ ॥79॥**

*79.* జన్మనాశములు కలిగి ఉండుటచే నామరూపములు రెండూ నిస్సారములు. సముద్రముపై బుడగల వలె అవి బ్రహ్మముపై బుద్ధిచే ఆరోపింపబడినవి.

**సచ్చిదానందరూపేఽస్మిన్పూర్ణే బ్రహ్మణి వీక్షితే ।**
**స్వయమేవావజానాతి నామరూపే శనైః శనైః ॥80॥**

*80.* సచ్చిదానందము సంపూర్ణము అగు బ్రహ్మమును అపరోక్షముగ తెలిసికొనినపుడు నామరూపములు క్రమముగ తామే తిరస్కరింపబడును.

**యావద్యావదవజ్ఞా స్యాత్తావత్తావత్తదీక్షణమ్ ।**
**యావద్యావద్వీక్ష్యతే తత్తావత్తావదుభే త్యజేత్ ॥81॥**

*81.* ఎంతెంతగా అట్టి తిరస్కారము కలుగునో అంతంతగా అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారము స్థిరపడును. ఇది ఎంతెంతగా స్థిరపడునో అంతంతగా నామరూపములు త్యజింపబడును.

**తదభ్యాసేన విద్యాయాం సుస్థితాయామయం పుమాన్ ।**
**జీవన్నేవ భవేన్ముక్తో వపురస్తు యథా తథా ॥82॥**

*82.* అభ్యాసముచే అట్టి బ్రహ్మవిద్యయందు సుస్థితుడైన పురుషుడు జీవించి ఉండగనే ముక్తుడగును. ఇక అతని శరీరము ఎట్లుండిన నేమి?

**తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్ ।**
**ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥83॥**

*83.* బ్రహ్మము గూర్చియే ఆలోచించుట, దానిని గూర్చే మాటలాడుట, దానినే పరస్పరము హెచ్చరించుకొనుట, అందే తత్పరులై ఉండుట. దీనినే బుధజనులు బ్రహ్మాభ్యాసమందురు. చూ. ప్ర. *7.106*

**వాసనానేక కాలీనా దీర్ఘకాలం నిరంతరమ్ ।**
**సాదరం చాభ్యస్యమానే సర్వథైవ నివర్తతే ॥84॥**

*84.* బ్రహ్మాభ్యాసమును శ్రద్ధతో నిరంతరం దీర్ఘకాలం అభ్యసించినచో బహుకాలం నుండి మనస్సునందున్న ప్రాపంచికవాసన సర్వదా నశించును.

**మృచ్ఛక్తి వద్బ్రహ్మశక్తిరనేకాననృతాన్సృజేత్ ।**
**యద్వా జీవగతా నిద్రా స్వప్నశ్చాత్ర నిదర్శనమ్ ॥85॥**

*85.* మృత్తికయందు సహజముగనున్న శక్తి కుండను కల్పించినట్లు బ్రహ్మమునందు సహజముగనున్న శక్తి అనేకములగు అనృతములను సృష్టించును. లేదా జీవుని నిద్ర నుండి అనేకములగు స్వప్నములు కలుగుటయే దీనికి నిదర్శనము.

**నిద్రాశక్తిర్యథా జీవే దుర్ఘట స్వప్నకారిణీ ।**
**బ్రహ్మణ్యేషా స్థితా మాయా సృష్టి స్థిత్యంతకారిణీ ॥86॥**

*86.* జీవునియందలి నిద్రాశక్తి దుర్ఘటములైన స్వప్నములను కల్పించి నట్లే బ్రహ్మమునందలి మాయాశక్తి సృష్టిస్థితి ప్రళయములను కల్పించును.

**స్వప్నే వియద్గతిం పశ్యేత్స్వమూర్ధచ్ఛేదనం యథా ।**
**ముహూర్తే వత్సరౌఘం చ మృతపుత్రాదికం పునః ॥87॥**

*87.* స్వప్నమునందు తాను ఆకాశమార్గమున పయనించుచున్నట్లును తన తల నరికివేయబడినట్లును చూడవచ్చును. క్షణములో అనేక సంవత్సరములు గడిచిపోయినట్లును పుత్ర మిత్రాదులు చనిపోయినట్లును చూడవచ్చు.

**ఇదం యుక్తమిదం నేతి వ్యవస్థా తత్ర దుర్లభా ।**
**యథా యథేక్ష్యతే యద్యత్తత్తద్యుక్తం తథా తథా ॥88॥**

*88.* ఇది సంభవము, ఇది అసంభవము అనే వ్యవస్థ స్వప్నమున లభించదు. కలయందు ఎట్లు కనబడితే అట్లే అది సంభవమగుచుండును.

**ఈదృశో మహిమా దృష్టో నిద్రాశక్తేర్యదా తదా ।**
**మాయాశక్తేరచింత్యోయం మహిమేతి కిమద్భుతమ్ ॥89॥**

*89.* నిద్రాశక్తికే ఇట్టి మహిమ కన్పించుచుండగా అచింత్యమైన మాయా శక్తి మహిమయే ఈ ప్రపంచమనుటలో ఆశ్చర్యమేమి గలదు? ఏమీ లేదు.

**శయానే పురుషే నిద్రా స్వప్నం బహువిధం సృజేత్ ।**
**బ్రహ్మణ్యేవం నిర్వికారే వికారాస్కల్పయత్యసౌ ॥90॥**

*90.* నిశ్చలముగ పరుండి ఉన్న పురుషునియందు నిద్ర అనేక విధములైన స్వప్నములను సృజించును. అట్లే నిర్వికారమగు బ్రహ్మమునందు మాయ అనేక విధములైన వికారములను కల్పించును.

**ఖానిలాగ్ని జలోర్వ్యండలోకప్రాణి శిలాదికాః ।**
**వికారాః ప్రాణిధీష్వంతశ్చిచ్ఛాయా ప్రతిబింబితా ॥91॥**

*91.* ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి జగత్తు వివిధలోకములు చరాచరాది విషయములన్నీ మాయావికారములు. ప్రాణుల అంతఃకరణమునందు శుద్ధ చైతన్యము ప్రతిబింబితమగుచుండును.

**చేతనాచేతనేష్వేషు సచ్చిదానంద లక్షణమ్ ।**
**సమానం బ్రహ్మ భిద్యేతే నామరూపే పృథక్ పృథక్ ॥92॥**

*92.* చేతనములు అచేతనములు అన్నింటియందూ సచ్చిదానందమగు బ్రహ్మము సమానముగనే ఉండును. కాని వివిధ నామరూపములచే అవి పరస్పరము భేదించుచుండును.

**బ్రహ్మణ్యేతే నామరూపే పటే చిత్రమివ స్థితే ।**
**ఉపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానందధీర్భవేత్ ॥93॥**

*93.* పటములో వివిధ విషయములున్నట్లు బ్రహ్మములో వివిధ నామ రూపాలు గలవు. ఆ నామ రూపాలను ఉపేక్షించిన బ్రహ్మభావము కలుగును.

**జలస్థేఽధోముఖే స్వస్య దేహే దృష్టేఽప్యుపేక్ష్య తమ్ ।**
**తీరస్థ ఏవ దేహే స్వే తాత్పర్యం స్యాద్యథా తథా ॥94॥**

*94.* నదీతీరముననున్న పురుషుడు జలమునందు అధోముఖమై కన్పించుచున్న తన దేహమును (ప్రతిబింబమును) ఉపేక్షించి తీరముననున్న స్వీయదేహమునందే తాత్పర్యము నుంచును. (అట్లే సాధకుడు తాను బ్రహ్మమని తెలియవలెను.)

**సహస్రశో మనోరాజ్యే వర్తమానే సదైవ తత్ ।**
**సర్వైరుపేక్ష్యతే తద్వదుపేక్షా నామరూపయోః ॥95॥**

*95.* వేలకొలది పగటికలలు కనుచున్నను వ్యవహారమున సర్వదా వానిని సర్వులను ఉపేక్షించునట్లే నామరూపములను కూడా సర్వదా ఉపేక్షింపవలెను.

**క్షణే క్షణే మనోరాజ్యం భవత్యేవాన్యథాన్యథా ।**
**గతం గతం పునర్నాస్తి వ్యవహారో బహిస్తథా ॥96॥**

*96.* క్షణక్షణమునకు ఊహాప్రపంచము మారిపోవుచుండును. గతించిన ఊహలు గతించినట్లే మరలరావు. బాహ్యమగు లోకవ్యవహారము కూడా అట్టిదే.

**న బాల్యం యౌవనే లబ్ధం యౌవనం స్థావిరే తథా ।**
**మృతః పితా పునర్నాస్తి నాయాత్యేవ గతం దినమ్ ॥97॥**

*97.* యౌవనమున బాల్యముండదు. వృద్ధాప్యమున యౌవనము ఉండదు. చనిపోయిన తండ్రి తిరిగిరాడు. గతించిన దినము మరల రాదు.

**మనోరాజ్యాద్విశేషః కః క్షణధ్వంసిని లౌకికే ।**
**అతోఽస్మిన్భాసమానేపి తత్సత్యత్వధియం త్యజేత్ ॥98॥**

*98.* క్షణములో నశించే ప్రాపంచిక విషయములలో ఊహా ప్రపంచము కంటే విశేషమేమున్నది? కనుక అవి కనిపించుచున్నను వానియందు సత్యత్వ బుద్ధిని పరిత్యజింపవలెను.

**ఉపేక్షితే లౌకికే ధీర్నిర్విఘ్నా బ్రహ్మచింతనే ।**
**నటవత్కృత్రిమాస్థాయాం నిర్వహత్యేవ లౌకికమ్ ॥99॥**

*99. లౌకిక విషయములను ఉపేక్షించినపుడు మనస్సు నిర్విఘ్నముగ బ్రహ్మచింతనయందు లగ్నమగును. అపుడు జ్ఞాని నటుని వలె లౌకిక వ్యవహారములను కృత్రిమమగు ఆసక్తితో నిర్వహించును.*

**ప్రవహత్యపి నీరేఽధః స్థిరా ప్రౌఢశిలా యథా ।**
**నామరూపాన్యథాత్వేఽపి కూటస్థం బ్రహ్మనాన్యథా ।100॥**

*100. నదీజలము వేగముగ ప్రవహించుచున్నను అడుగుననున్న మహాశిల నిశ్చలముగ ఉండునట్లు నామరూపములు వివిధములుగ మారుచున్నను బ్రహ్మము ఎట్టి మార్పును లేక ఒక విధముగనే కూటస్థముగ ఉండును.*

**నిశ్ఛిద్రే దర్పణే భాతి వస్తుగర్భం బృహద్వియత్ ।**
**సచ్చిద్ఘనే తథా నానా జగద్గర్భమిదం వియత్ ॥101॥**

*101. నిష్కళంకమైన యద్దమునందు విశాలమగు ఆకాశము అందుండు వస్తువులతో ప్రతిఫలించునట్లు సత్‌చిత్ ఘనమగు బ్రహ్మము నందు వివిధ లోకములు గలిగిన ఈ ఆకాశము ప్రతిఫలించును.*

**అదృష్ట్వా దర్పణం నైవ తదంతస్థేక్షణం తథా ।**
**అమత్వా సచ్చిదానందం నామరూప మతిః కుతః ॥102॥**

*102. అద్దమును చూడకయే దానియందు ప్రతిఫలించే మేఘనక్షత్రాదులను చూచుట సాధ్యము కాదు. అట్లే సచ్చిదానంద బ్రహ్మమును గ్రహింపక నామరూపములను గ్రహించుట కూడా అసాధ్యము.*

**ప్రథమం సచ్చిదానందే భాసమానేఽథ తావతా ।**
**బుద్ధిం నియమ్య నైవోర్ధ్వం ధారయేన్నామరూపయోః ॥103॥**

*103. మొదట సచ్చిదానంద సద్భావమును తెలిసికొని ఆపై బుద్ధిని దానిపై స్థిరముగ నిలిపి ఇక అది నామరూపములపై సంచరింపకుండ నిగ్రహింపవలెను.*

**ఏవం చ నిర్జగద్బ్రహ్మ సచ్చిదానంద లక్షణమ్ ।**
**అద్వైతానంద ఏతస్మిన్విశ్రామ్యంతు జనాశ్చిరమ్ ॥104॥**

*104.* ఇట్లు జగద్రహితమైన సచ్చిదానందమే బ్రహ్మము. అదే అద్వైతానందము. జనులు దీనియందు చిరకాలము విశ్రమింతురు గాక.

**బ్రహ్మానందాభిధే గ్రంథే తృతీయోఽధ్యాయ ఈరితః ।**
**అద్వైతానంద ఏవ స్యాజ్జగన్మిథ్యాత్వ చింతయా ॥105॥**

*105.* బ్రహ్మానందమనే గ్రంథము నందలి ఈ తృతీయాధ్యాయమున వర్ణింపబడిన అద్వైతానందము జగన్మిథ్యాత్వమును గూర్చి చింతించుట చేతనే సిద్ధించును.

## త్రయోదశప్రకరణము: సమాప్తము

# చతుర్దశము : బ్రహ్మానందమున విద్యానంద ప్రకరణము

**యోగేనాత్మవివేకేన ద్వైతమిథ్యాత్వచింతయా ।**
**బ్రహ్మానందం పశ్యతోఽథ విద్యానందో నిరూప్యతే ॥1॥**

*1. యోగము చేతను ఆత్మవివేకము చేతను ద్వైతమిథ్యాత్వచింతనచే తను బ్రహ్మానందమును సాక్షాత్కరించుకొనిన వారికి కలిగే విద్యానందము ఇపుడు వర్ణింపబడుచున్నది.*

**వ్యాఖ్య:** యోగము మొదలైన మూడు సాధనములు మునుపటి మూడు ప్రకరణములలో వర్ణింపబడినవి.

**విషయానందవద్విద్యానందో ధీవృత్తిరూపకః ।**
**దుఃఖాభావాదిరూపేణ ప్రోక్త ఏష చతుర్విధః ॥2॥**

*2. విషయానందము వలె విద్యానందము కూడా ఒక అంతఃకరణవృత్తి. ఇది దుఃఖము లేకుండుట మొదలగు రూపములతో నాలుగు విధములుగ చెప్పబడినది.*

**దుఃఖాభావశ్చ కామాప్తిః కృతకృత్యోఽహమిత్యసౌ ।**
**ప్రాప్తప్రాప్యోఽహమిత్యేవ చాతుర్విధ్యముదాహృతమ్ ॥3॥**

*3. దుఃఖము లేకుండుట, కోరికలన్నీ తీరిపోవుట, చేయవలసినదంతా చేసితిననే భావము, పొందదగినదంతా పొందితిననే భావము. ఇవే ఆ నాలుగు విధములు.*

**ఐహికం చాముష్మికం చేత్యేవం దుఃఖం ద్విధేరితమ్ ।**
**నివృత్తిమైహికస్యాహ బృహదారణ్యకం వచః ॥4॥**

*4.* ఇహలోకమునందలిది, పరలోకసంబంధమైనది అని దుఃఖము రెండు విధములు. ఇహలోక దుఃఖములు నశించుట బృహదారణ్యకోపనిషత్తున చెప్పబడినది.

**ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః ।**
**కిమిచ్ఛన్కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్ ॥5॥**

*5.* ఈ పరమాత్మయే నేను (ప్రత్యగాత్మ) అని తెలిసికొనిన పురుషుడు ఇక దేనిని కోరి దేని కొరకు మనశ్శరీరములను అనుసరించి పరితపించును? చూ. ప్ర.*7.1;* బృహదారణ్యక ఉప: *4.4.12*

**జీవాత్మా పరమాత్మా చేత్యాత్మా ద్వివిధ ఈరితః ।**
**చిత్తాదాత్మ్యాత్త్రిభిర్దేహైర్జీవః సన్భోక్తృతాం వ్రజేత్ ॥6॥**

*6.* జీవాత్మ పరమాత్మ అని ఆత్మ రెండు విధములుగ చెప్పబడినది. శరీరత్రయములతో తాదాత్మ్యమునొందిన చైతన్యము జీవుడై భోక్తయగును. చూ. శ్వేతాశ్వతర ఉప: *1.8,9; 5.12*

**పరాత్మా సచ్చిదానందస్తాదాత్మ్యం నామరూపయోః ।**
**గత్వా భోగ్యత్వ మాపన్నస్తద్వివేకే తు నోభయమ్ ॥7॥**

*7.* సచ్చిదానంద బ్రహ్మమగు పరమాత్మ నామరూపములతో తాదాత్మ్యము నొంది భోగ్య విషయములగుచున్నది. దీనిని తెలిసికొనినచో భోక్తయు భోగ్యము రెండును మిగులవు. చూ. కైవల్య ఉప. *18*

**భోగ్యమిచ్ఛన్ భోక్తురర్థే శరీరమనుసంజ్వరేత్ ।**
**జ్వరాస్త్రిషు శరీరేషు స్థితా న త్వాత్మనో జ్వరాః ॥8॥**

*8.* భోక్త కొరకై భోగ్యములను కోరుచు జీవుడు శరీరతాపము ననుసరించి పరితపించును. సంతాపములన్నీ మూడు శరీరములందు మాత్రమే ఉన్నవి. ఆత్మయందు ఏ తాపములూ లేవు. చూ. *7.223-4*

**వ్యాధయో ధాతువైషమ్యే స్థూలదేహే స్థితా జ్వరాః ।**
**కామక్రోధాదయః సూక్ష్మే ద్వయోర్బీజం తు కారణే ॥9॥**

*9.* స్థూలదేహపు సంతాపములే వ్యాధులు. ఇవి శరీరములో ధాతువుల హెచ్చుతగ్గుల వల్ల కలుగును. సూక్ష్మదేహపు సంతాపములే కామక్రోధాది వికారములు. ఈ రెండింటికీ కారణమగు అజ్ఞానము కారణశరీరపు సంతాపము.

**అద్వైతానంద మార్గేణ పరాత్మని వివేచితే ।**
**అపశ్యన్వాస్తవం భోగ్యం కిన్నామేచ్ఛేత్పరాత్మవిత్ ॥10॥**

*10. అద్వైతానంద ప్రకరణమున వివరించినట్లు పరమాత్మను వివేచించి తెలిసికొనిన బ్రహ్మవిదునకు వాస్తవమైన భోగ్యవిషయమేమీ కన్పింపదు. ఇక అతడు దేనిని వాంఛింపగలడు?*

**ఆత్మానందోక్తరీత్యాస్మిన్జీవాత్మన్యవధారితే ।**
**భోక్తా నైవాస్తి కోఽప్యత్ర శరీరే తు జ్వరః కుతః ॥11॥**

*11. ఆత్మానందప్రకరణమున చెప్పబడినట్లు జీవాత్మయే పరమాత్మయని తెలిసికొనినపుడు ఈ శరీరమున భోక్తయే ఉండడు. ఇక శరీరమున సంతాపములు ఎట్లు కలుగును?*

**పుణ్యాపాపద్వయే చింతా దుఃఖమాముష్మికం భవేత్ ।**
**ప్రథమాధ్యాయ ఏవోక్తం చింతానైనం తపేదితి ॥12॥**

*12. పుణ్యాపాపములను గూర్చిన చింతయే పరలోకమునందలి దుఃఖము. (బ్రహ్మానంద పంచకమునందు) ప్రథమాధ్యాయముననే బ్రహ్మవిదునకు ఇట్టి సంతాపము కలుగదని వివరింపబడినది. చూ. ప్ర.11.1, 5-9; కైవల్య ఉప.22*

**యథా పుష్కరపర్ణేఽస్మిన్నపామశ్లేషణం తథా ।**
**వేదనాదూర్ధ్వమాగామికర్మణోఽశ్లేషణం బుధే ॥13॥**

*13. పద్మపత్రములకు నీరు అంటనట్లే బ్రహ్మసాక్షాత్కారమైన పిదప బ్రహ్మవేత్తకు ఆగామికర్మలు అంటవు. చూ. ఛాందోగ్య ఉప: 4.14.3*

**ఇషీ కాతృణతూలస్య వహ్నిదాహః క్షణాద్యథా ।**
**తథా సంచితకర్మాస్య దగ్ధం భవతి వేదనాత్ ॥14॥**

*14. ఇషీకమనే గడ్డియొక్క పూవులు అగ్నిలోబడినపుడు క్షణములో భస్మమగునట్లు బ్రహ్మసాక్షాత్కారము వలన సంచిత కర్మలన్నీ తత్క్షణమే దగ్ధమై పోవును. చూ. ఛాందోగ్య ఉప. 5.24.3*

**యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥15॥**

*15. జ్వలించుచున్న అగ్ని ఇంధనమును బూడిద చేసివేయునట్లు, ఓ అర్జునా, జ్ఞానమనే అగ్ని సర్వకర్మలను భస్మీభూతము చేయును. గీత 4.37*

**యస్య నాహం కృతోభావో బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వాపి స ఇమాన్ లోకాన్న హంతి న నిబధ్యతే ॥16॥**

*16. 'నేను' అనే అహం బుద్ధిహీనుడు కర్మఫలమునందలి ఆశచే లిప్తము కాని మనస్సు కలవాడు ఈ లోకమునంతటిని సంహరించినను అతడు సంహరింపనట్లే. అతడు కర్మచే బద్ధుడు కాడు. భగవద్గీత 18.17*

**మాతాపిత్రోర్వధః స్తేయం భ్రూణహత్యాన్యదీదృశమ్ ।**
**న ముక్తిం నాశయేత్పాపం ముఖకాంతిర్న నశ్యతి ॥17॥**

*17. తల్లిదండ్రులను చంపుట, దొంగతనము, భ్రూణహత్య తదితరమగు ఇట్టి పాపము బ్రహ్మవేత్త యొక్క ముక్తిని నశింపజేయజాలదు. అతని ముఖ కాంతిని మలినము చేయజాలదు. కౌషీతకి ఉప: 3.1; చూ. కైవల్య ఉప: 24*

**దుఃఖాభావవదేవాస్య సర్వకామాప్తిరీరితా ।**
**సర్వాన్కామానసావాప్త్వా హ్యమృతోఽభవదిత్యతః ॥18॥**

*18. దుఃఖములు లేకపోవుట వలెనే అతని సకల కామనలును నెరవేరును. అన్ని కోరికలు తీరి అతడు అమరుడగునని చెప్పబడినది. ఐతరేయ ఉప. 2.1.6(3.1.4)*

**జక్షన్క్రీడన్రతిం ప్రాప్తః స్త్రీభిర్యానైస్తథేతరైః ।**
**శరీరం న స్మరేత్ప్రాణః కర్మణా జీవయేదముమ్ ॥19॥**

*19. ఆరగించుచు ఆడుకొనుచు స్త్రీలతో వినోదించుచు వాహనములతో తదితరములతో సుఖించుచున్నను బ్రహ్మవేత్తకు శరీరస్పృహ ఉండదు. ప్రారబ్ధ కర్మననుసరించి ప్రాణమే అతనిని జీవింపజేయును. ఛాందోగ్య ఉప: 8.12.3*

**సర్వాన్కామాన్సహాప్నోతి నాన్యవజ్జన్మకర్మభిః ।**
**వర్తంతే శ్రోత్రియే భోగా యుగపత్క్రమవర్జితాః ॥20॥**

*20. బ్రహ్మవిదుని సకల కామనలును ఒక్కసారిగనే నెరవేరును. ఇతరుల వలె జన్మ కర్మల ద్వారా కాదు. అతని విషయమున భోగములు ఏకకాలముననే కలుగును. ముందు వెనుకలనే క్రమము ఉండదు. తైత్తిరీయ ఉప: 2.1.1*

**యువా రూపీ చ విద్యావాన్నీరోగో దృఢ చిత్తవాన్ ।**
**సైన్యోపేతః సర్వపృథ్వీం విత్తపూర్ణాం ప్రపాలయన్ ॥21॥**

**సర్వైర్మానుష్యకైర్భోగైః సంపన్నస్తృప్త భూమిపః ।**
**యమానందమవాప్నోతి బ్రహ్మవిచ్చ తమశ్నుతే ॥22॥**

*21-22.* యువకుడు, అందగాడు, విద్యావంతుడు, ఆరోగ్యవంతుడు దృఢచిత్తుడు, సైన్యసమేతుడు, అయిన మహారాజు ఐశ్వర్యపూర్ణమైన సకల భూమండలమును పరిపాలించుచు మానవులు అనుభవింపదగిన భోగము లన్నింటిని సమృద్ధిగా అనుభవించి సంతృప్తుడై ఎట్టి ఆనందమును అనుభవించునో బ్రహ్మవేత్త కూడా అట్టి ఆనందమునే అనుభవించును. *(21 నుండి 33* వరకు గల శ్లోకములు తైత్తిరీయ ఉప.*2.8.1* పై ఆధారపడినవి.*)* చూ. బృహదారణ్యక ఉప*: 4.3.33*

**మర్త్యభోగే ద్వయోర్నాస్తి కామస్తృప్తి రతః సమా ।**
**భోగాన్నిష్కామతైకస్య పరస్యాపి వివేకతః ॥23॥**

*23.* మహారాజునకు జ్ఞానికి ఇరువురకు మర్త్యభోగములందు కోరిక లేదు కనుక తృప్తి ఇరువురికీ సమానమే. మహారాజునకు భోగము వలన నిష్కామత కలుగగా జ్ఞానికి వివేకము వలన నిష్కామత కలుగును.

**శ్రోత్రియత్వాద్వేదశాస్త్రై ర్భోగ దోషానవేక్షతే ।**
**రాజా బృహద్రథో దోషాంస్తాన్గాథాభిరుదాహరత్ ॥24॥**

*24.* వేదపారంగుడగుట చేత బ్రహ్మవేత్త భోగవిషయము లందలి దోషములను గుర్తించును. బృహద్రథమహారాజు ఈ దోషములను కొన్ని గాథలయందు ఉదాహరించెను. మైత్రేయ *1-3* మైత్రాయణి ఉప*: 1.2-4*

**దేహదోషాంశ్చిత్తదోషాన్భోగ్యదోషాననేకశః ।**
**శునా వాంతే పాయసే నో కామస్తద్వద్వివేకినః ॥25॥**

*25.* దేహమునందలి దోషములను మనస్సునందలి దోషములను భోగ్య విషయములందలి దోషములను అనేక విధములుగ బృహద్రథుడు వర్ణించెను. కుక్క వాంతి చేసిన పాయసముపై ఎవరికి కోరిక ఉండనట్లే వివేకియగు పురుషునకు దేహాదులయందు కోరిక ఉండదు.

**నిష్కామత్వే సమేఽప్యత్ర రాజ్ఞః సాధనసంచయే ।**
**దుఃఖమాసీద్భావినాశాదతిభీరనువర్తతే ॥26॥**

*26.* కోరికలు లేకుండుట సమానమే అయినా రాజుకు ఆ భోగ

సాధనములను సమకూర్చుకొనుటకు పూర్వము దుఃఖము అనుభవింప వలసివచ్చెను. అవి భావి కాలమున నశించే భీతి ఉండనే ఉండును. బ్రహ్మవిదునకు అవి రెండూ లేవని భావము.

**నోభయం శ్రోత్రియస్యాంతస్తదానందోఽధికోఽన్యతః ।**
**గంధర్వానంద ఆశాస్తి రాజ్ఞో నాస్తి వివేకినః ॥27॥**

*27. ఇవి రెండూ బ్రహ్మవేత్తకు లేవు కనుక అతని ఆనందము రెండవ ఆనందము కంటే అధికము. కాగా, రాజునకు గంధర్వుల ఆనందముపై ఆశ ఉండును. వివేకికి అదీ లేదు.*

**అస్మిన్కల్పే మనుష్యః సన్పుణ్యపాకవిశేషతః ।**
**గంధర్వత్వం సమాపన్నో మర్త్య గంధర్వ ఉచ్యతే ॥28॥**

*28. ఈ కల్పమున మనుష్యుడుగ నుండి పుణ్యావశమున గంధర్వత్వము పొందినవాడు మనుష్య గంధర్వుడనబడును.*

**పూర్వకల్పే కృతాత్పుణ్యాత్కల్పాదావేవ చేద్భవేత్ ।**
**గంధర్వత్వం తాదృశోఽత్ర దేవగంధర్వ ఉచ్యతే ॥29॥**

*29. పూర్వకల్పమునందు చేసిన పుణ్యాఫలముగ ఈ కల్పారంభము నందే గంధర్వత్వము పొందిన పురుషుడు దేవగంధర్వుడనబడును.*

**అగ్నిష్వాత్తాదయో లోకే పితరశ్చిరవాసినః ।**
**కల్పాదావేవ దేవత్వం గతా ఆజానదేవతా ః ॥30॥**

*30. అగ్నిష్వాత్తము మొదలగు లోకములందు చిరకాలము నివసించే వారు పితరులనబడుదురు. కల్పాదియందే దేవత్వము నొందినవారు ఆజాన దేవతలనబడుదురు.*

**అస్మి న్కల్పేఽశ్వమేధాది కర్మకృత్వా మహత్పదమ్ ।**
**అవాప్యాజానదేవైర్యాః పూజ్యాః తాః కర్మదేవతాః ॥31॥**

*31. ఈ కల్పమునందు అశ్వమేధాది యజ్ఞకర్మలు నిర్వర్తించి గొప్ప పదవిని పొంది ఆజానదేవతలచే పూజింపబడువారు కర్మదేవతలన బడుదురు.*

**యమాగ్ని ముఖ్యా దేవాః స్యుః జ్ఞాతావింద్రబృహస్పతీ ।**
**ప్రజాపతిర్విరాట్ ప్రోక్తో బ్రహ్మ సూత్రాత్మనామకః ॥32॥**

*32.* యముడు అగ్ని మొదలైనవారు దేవతలు. ఇంద్ర బృహస్పతు లిరువురు ప్రసిద్ధులే. ప్రజాపతి విరాట్టు అనబడెను. బ్రహ్మకు సూత్రాత్మ అని పేరు. చూ. ప్ర.*6.2,4*

**సార్వభౌమాది సూత్రాంతా ఉత్తరోత్తరకామినః ।**
**అవాఙ్మనసగమ్యోయమాత్మానందస్తతః పరః ॥33॥**

*33.* సార్వభౌముడు మొదలు సూత్రాత్మ వరకు ఎల్లరును తరువాతి ఆనందమును కోరుచుందురు. అవాఙ్మానసగోచరమైన ఆత్మానందము సూత్రాత్మ ఆనందమును మించి ఉండును.

**వ్యాఖ్య:** ఈ వివిధ స్థితులలో ఒక్కొక్క దాని ఆనందము ముందటిస్థితిలోని ఆనందము కంటే నూరు రెట్లు అధికమని తైత్తిరీయోపనిషత్తు చెప్పును.

**తైస్తైః కామ్యేషు సర్వేషు సుఖేషు శ్రోత్రియో యతః ।**
**నిస్స్పృహస్తేన సర్వేషామానందాః సన్తి తస్య తే ॥34॥**

*34.* శ్రోత్రియుడగు బ్రహ్మవేత్తకు ఈ ఆనందములపై ఇచ్ఛలేదు కనుక ఎల్లరి ఆనందములును అతనివే అగును.

**సర్వకామాప్తి రేషోక్తా యద్వా సాక్షి చిదాత్మనా ।**
**స్వదేహవ త్సర్వదేహేష్వపి భోగానవేక్షతే ॥35॥**

*35.* ఇదే సర్వకామాప్తి, అన్ని కోరికలు తీరుట. లేదా సాక్షియగు చిదాత్మ తన దేహమునందు వలెనే సర్వప్రాణి దేహములందూ భోగానుభవమును చూచుట కూడా సర్వకామాప్తి అనవచ్చును.

**అజ్ఞస్యాప్యేతదస్త్యేవ న తు తృప్తిరబోధతః ।**
**యో వేద సోఽశ్నుతే సర్వాన్కామా నిత్యబ్రవీచ్ఛ్రుతిః ॥36॥**

*36.* అజ్ఞానియందు కూడా సాక్షిచైతన్యముండుటచే ఈ సర్వకామాప్తి అతనికి కూడా కలుగవలెను కదా అనినచో అట్లు కాదు. జ్ఞానము లేకపోవుటచే అజ్ఞానికి ఇట్టి తృప్తి ఉండదు. శ్రుతి కూడా, ఎవడు తెలిసికొనునో అతడే సర్వకామనలను పొందునని చెప్పెను. తైత్తిరీయ ఉప: *2.1.1*

**యద్వా సర్వాత్మతాం స్వస్య సామ్నా గాయతి సర్వదా ।**
**అహమన్నం తథాన్నాదశ్చేతి సామ హ్యధీయతే ॥37॥**

*37. లేదా బ్రహ్మవిదుడు అంతా తానే అగుటచే అంతటిని కూడా అనుభవించును. నేనే అన్నము. అన్నము తినేవాడను కూడా నేనే అని బ్రహ్మవిదుని సర్వాత్మత గానము చేయబడినది. తైత్తిరీయ ఉప: 3.10.5-7*

**వ్యాఖ్య:** ఈ సందర్భమున సామమనగా బ్రహ్మమని అర్థము. సర్వత్ర సమముగా ఉండునది గనుక సామము. అదే బ్రహ్మము.

**దుఃఖా భావశ్చ కామాప్తిరుభే హ్యేవం నిరూపితే ।**
**కృతకృత్యత్వమన్యచ్చ ప్రాప్తప్రాప్యత్వ మీక్షతామ్ ॥38॥**

*38. ఈ విధముగ దుఃఖములు లేకుండుట సర్వకామనలు నెరవేరుట అనే రెండు లక్షణములు నిరూపింపబడినవి. ఇక కృత్యకృత్యత్వము ప్రాప్త ప్రాప్యత్వము (ప్ర.14.3) మరొకచోట చూడవచ్చును.*

**ఉభయం తృప్తిదీపే హి సమ్యగస్మాభిరీరితమ్ ।**
**త ఏవాత్రాను సంధేయాః శ్లోకా బుద్ధి విశుద్ధయే ॥39॥**

*39. ఆ రెండు విషయములును తృప్తిదీప ప్రకరణమున మాచే చక్కగ వివరింపబడినవి. చిత్తశుద్ధికై వానినే ఇచ్చట అనుసంధానము చేయవలెను.*

**గమనిక:** 40 నుండి 57 వరకు 58 నుండి 64వరకు గల శ్లోకములు 7వ ప్రకరణమున 253 నుండి 270 వరకు 291 నుండి 297 వరకు గలవు.

**ఐహికాముష్మిక వ్రాతసిద్ధ్యై ముక్తేశ్చ సిద్ధయే ।**
**బహు కృత్యం పురాస్యాభూత్తత్సర్వమధునా కృతమ్ ॥40॥**

**తదేతత్కృతకృత్యత్వం ప్రతియోగిపురః సరమ్ ।**
**అనుసందధదేవాయ మేవం తృప్యతి నిత్యశః ॥51॥**

**దుఃఖినోऽజ్ఞాః సంసరంతు కామం పుత్రాద్య పేక్షయా ।**
**పరమానంద పూర్ణోऽహం సంసరామి కిమిచ్ఛయా ॥42॥**

**అనుతిష్ఠంతు కర్మాణి పరలోక యియాసవః ।**
**సర్వలోకాత్మకః కస్మాదనుతిష్ఠామి కిం కథమ్ ॥43॥**

**వ్యాచక్షతాం తే శాస్త్రాణి వేదానధ్యాపయంతు వా ।**
**యేऽత్రాధికారిణో మే తు నాధికారోऽక్రియత్వతః ॥44॥**

నిద్రాభిక్షే స్నానశౌచే నేచ్ఛామి న కరోమి చ ।
ద్రష్టారశ్చే త్కల్పయంతి కిం మే స్యాదన్య కల్పనాత్ ॥45॥

గుంజా పుంజాది దహ్యేత నాన్యారోపిత వహ్నినా ।
నాన్యారోపిత సంసారధర్మానేవ మహం భజే ॥46॥

శృణ్వం త్వజ్ఞాతతత్త్వాస్తే జానన్కస్మాచ్ఛృణోమ్యహమ్ ।
మన్యతాం సంశయాపన్నా న మన్యేఽ హ మసంశయః ॥47॥

విపర్యస్తో నిధిధ్యాసేత్కిం ధ్యానమవిపర్యయే ।
దేహాత్మ త్వ విపర్యాసం న కదాచి ద్భజామ్యహమ్ ॥48॥

అహం మనుష్య ఇత్యాదివ్యవహారో వినాప్యముమ్ ।
విపర్యాసం చిరాభ్యస్త వాసనాతోఽ వకల్పతే ॥49॥

ఆరబ్ధ కర్మాణి క్షీణే వ్యవహారో నివర్తతే ।
కర్మాక్షయే త్వసౌ నైవ శామ్యేద్ధ్యాన సహస్రతః ॥50॥

విరలత్వం వ్యవహృతేరిష్టం చేద్ధ్యానమస్తు తే ।
అబాధికాం వ్యవహృతిం పశ్యన్ధ్యామ్యహం కుతః ॥51॥

విక్షేపో నాస్తి యస్మాన్మే న సమాధిస్తతో మమ ।
విక్షేపో వా సమాధిర్వా మనసః స్యాద్వికారిణః ॥52॥

నిత్యానుభవ రూపస్య కో మేఽ త్రానుభవః పృథక్ ।
కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ నిశ్చయః ॥53॥

వ్యవహారో లౌకికో వా శాస్త్రీయో వాన్యథాపి వా ।
మమాకర్తురలేపస్య యథారబ్ధం ప్రవర్తతామ్ ॥54॥

అథవా కృత కృత్యోఽ పి లోకానుగ్రహ కామ్యయా ।
శాస్త్రీయేణైవ మార్గేణ వర్తేఽ హం కా మమ క్షతిః ॥55॥

దేవార్చన స్నానశౌచభిక్షాదౌ వర్తతాం వపుః ।
తారం జపతు వాక్ తద్వత్పఠత్వామ్నాయ మస్తకమ్ ॥56॥

విష్ణుం ధ్యాయతు ధీర్యద్వా బ్రహ్మానందే విలీయతామ్ ।
సాక్ష్యహం కించిదప్యత్ర న కుర్వే నాఽ పి కారయే ॥57॥

కృత కృత్యతయా తృప్తః ప్రాప్తప్రాప్యతయా పునః ।
తృప్యన్నేవం స్వమనసా మన్యతేఽసౌ నిరంతరమ్ ॥58॥

ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి ।
ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్ ॥59॥

ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం న వీక్షేఽద్య ।
ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాపి ॥60॥

ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కించిత్ ।
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్ ॥61॥

ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే ।
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః ॥62॥

అహో పుణ్య మహో పుణ్యం ఫలితం ఫలితం దృఢమ్ ।
అస్య పుణ్యస్య సంపత్తేరహో వయమహో వయమ్ ॥63॥

అహో శాస్త్రమహో శాస్త్రమహో గురురహో గురుః ।
అహో జ్ఞానమహో జ్ఞానమహో సుఖమహో సుఖమ్ ॥64॥

బ్రహ్మానందాభిధే గ్రంథే చతుర్థోఽధ్యాయ ఈరితః ।
విద్యానందస్తదుత్పత్తి పర్యంతోఽభ్యాస ఇష్యతామ్ ॥65॥

*65. బ్రహ్మానందమనే గ్రంథమున చతుర్థాధ్యాయ విద్యానందము వర్ణింపబడినది. అది సిద్ధించు వరకు పురుషుడు బ్రహ్మాభ్యాస తత్పరుడు కావలెను.*

**చతుర్దశ ప్రకరణము: సమాప్తము**

# పంచదశము: బ్రహ్మానందమున విషయానంద ప్రకరణము

**అథాత్ర విషయానందో బ్రహ్మానందాంశరూపభాక్ ।**
**నిరూప్యతే ద్వారభూతస్తదంశత్వం శ్రుతిర్జగౌ ॥1॥**

*1.* ఇచ్చట బ్రహ్మానందపు అంశము, బ్రహ్మానందానుభవమునకు ద్వారతుల్యము అయిన విషయానందము వర్ణింపబడుచున్నది. విషయానందము బ్రహ్మానందపు అంశమే అని శ్రుతి చెప్పును.

**ఏషోఽస్య పరమానందో యోఽఖండైక రసాత్మకః ।**
**అన్యాని భూతాన్యేతస్య మాత్రామేవోపభుంజతే ॥2॥**

*2.* అఖండము ఏకరసము అయిన బ్రహ్మమే పరమానందము. అజ్ఞానముచే కల్పింపబడిన ఇతర జీవములన్నీ ఈ ఆనందమునందొక కణమును మాత్రమే అనుభవించును. అని శ్రుతి చెప్పును. బృహదారణ్యక ఉప. *4.3.32*

**శాంతా ఘోరస్తథా మూఢా మనసోవృత్తయ స్త్రిధా ।**
**వైరాగ్యం క్షాంతిరౌదార్యమిత్యాద్యాః శాంతవృత్తయః ॥3॥**

*3.* శాంతములు ఘోరములు మూఢములు అని మనస్సు యొక్క వృత్తులు మూడు విధములు. అందు వైరాగ్యము క్షమ ఔదార్యము మొదలగునవి శాంతవృత్తులు. చూ. ప్ర.*2.14-15*

**తృష్ణా స్నేహో రాగలోభావిత్యాద్యా ఘోరవృత్తయః ।**
**సమ్మోహో భయమిత్యాద్యాః కథితా మూఢ వృత్తయః ॥4॥**

*4.* విషయముల కొరకు దాహము వాని పట్ల ప్రీతి అనురక్తి వాని కొరకు లోభము మొదలైనవి ఘోరవృత్తులు. భ్రాంతి భయము మొదలైనవి మూఢ వృత్తులని చెప్పబడినవి.

**వృత్తిష్వేతాసు సర్వాసు బ్రహ్మణశ్చిత్స్వభావతా ।**
**ప్రతిబింబతి శాంతాసు సుఖం చ ప్రతిబింబతి ॥5॥**

*5. ఈ వృత్తులన్నింటియందూ బ్రహ్మము యొక్క చైతన్యస్వరూపము ప్రతిబింబించును.*

**రూపం రూపం బభూవాసౌ ప్రతిరూప ఇతి శ్రుతిః ।**
**ఉపమా సూర్యకేత్యాది సూత్రయామాస సూత్రకృత్ ॥6॥**

*6. వివిధ శరీరములందు ప్రవేశించి పరమాత్మ వివిధరూపములను దాల్చునని శ్రుతియనును. బ్రహ్మసూత్రాలను రచించిన వ్యాసుడు, సూర్యుడు వివిధ రూపములు గల జలపాత్రలందు ప్రతిఫలించి వివిధ రూపములను పొందునట్లు బ్రహ్మము వివిధ శరీరములందు ప్రవేశించునని ఒక సూత్రమును కూడా రచించెను. కఠ ఉప: 2.2.9-10; బ్రహ్మసూత్రములు 3.2.28*

**ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః ।**
**ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ ॥7॥**

*7. పరమాత్మ ఒక్కటియే. అయినను అది ప్రతిజీవి యందూ అవస్థితమై ఉన్నది. జలమునందు ప్రతిఫలించిన చంద్రుని వలె ఒక విధముగను అనేక విధములుగను అది భాసించును. అమృతబిందు ఉప: 12*

**జలే ప్రవిష్టశ్చంద్రోఽయమస్పష్టః కలుషే జలే ।**
**విస్పష్టో నిర్మలే తద్వద్ద్వేధా బ్రహ్మాపి వృత్తిషు ॥8॥**

*8. నీటియందు ప్రతిఫలించిన చంద్రుడు మురికి నీటియందు అస్పష్టముగ కనిపించును. శుద్ధజలమునందు విస్పష్టముగ కనిపించును. అట్లే బ్రహ్మము కూడా మనోవృత్తుల లక్షణములను బట్టి రెండు విధములు.*

**ఘోర మూఢాసు మాలిన్యాత్సుఖాంశశ్చ తిరోహితః ।**
**ఈషన్నైర్మల్యతస్తత్ర చిదంశ ప్రతిబింబనమ్ ॥9॥**

*9. ఘోరములు మూఢములు అగు మానసిక వృత్తులందు మాలిన్యమధికమగుట చేత ఆనందాంశము ప్రతిఫలించదు. అల్పముగ నైర్మల్యముందు ఉండుట చేత అందు చైతన్యాంశము మాత్రము ప్రతిఫలించును.*

**యద్వాపి నిర్మలే నీరే వహ్నేరౌష్ణ్యస్య సంక్రమః ।**
**న ప్రకాశస్య తద్వ త్స్యాచ్ఛిన్మాత్రోద్భూతిరేవ ॥10॥**

*10.* లేదా నీరు స్వచ్ఛమైను అందు అగ్ని యొక్క ఉష్ణత మాత్రమే సంక్రమించి ప్రకాశము సంక్రమింపనట్లు ఆ మానసిక వృత్తులందు చైతన్యము మాత్రమే ప్రతిఫలించును.

**కాష్ఠే త్వౌష్ణ్యప్రకాశౌ ద్వావుద్భవం గచ్ఛతో యథా ।**
**శాంతాసు సుఖచైతన్యే తథైవోద్భూతిమాప్నుతః ॥11॥**

*11.* కాని కట్టెయందు అగ్ని యొక్క ఉష్ణత ప్రకాశము కూడా ప్రవేశించునట్లు శాంతవృత్తులందు చైతన్యము ఆనందము కూడా ప్రతిఫలించును.

**వస్తుస్వభావమాశ్రిత్య వ్యవస్థా తూభయోః సమా ।**
**అనుభూత్యనుసారేణ కల్ప్యతే హి నియామకమ్ ॥12॥**

*12.* వస్తుస్వభావమును బట్టి ఏ అంశములు ఎచ్చట వ్యక్తములగునో నిర్ణయింపబడుట రెండింటికిని సమానము. అట్టి నియమము అనుభవమును బట్టియే కల్పింపబడును.

**న ఘోరాసు న మూఢాసు సుఖానుభవ ఈక్ష్యతే ।**
**శాంతాస్వపి క్వచికశ్చిత్సుఖాతిశయ ఈక్ష్యతామ్ ॥13॥**

*13.* ఘోరవృత్తులందుగాని మూఢవృత్తులందుగాని ఆనందానుభవము కన్పింపదు. శాంతవృత్తులందు మాత్రము ఆనందానుభవము ఎక్కువగను తక్కువగను వివిధ సమయములందు కన్పించును.

**గృహక్షేత్రాది విషయే యదా కామో భవేత్తదా ।**
**రాజసస్యాస్య కామస్య ఘోరత్వాత్తత్ర నో సుఖమ్ ॥14॥**

*14.* ఇల్లు భూమి మొదలగు విషయములందు కోరిక గలిగినపుడు ఇట్టి రాజసములగు కోరికలు ఘోరమానసిక వృత్తులను కల్పించుట చేత అందు ఆనందము ఉండదు.

**సిద్ధ్యేన్న వేత్యస్తి దుఃఖమసిద్ధౌ తద్వివర్ధతే ।**
**ప్రతిబంధే భవేత్క్రోధో ద్వేషో వా ప్రాతికూలతః ॥15॥**

*15.* అందు ఆ కోరిక తీరునో తీరదో అనే దుఃఖము ఉండనే ఉండును. తీరనిచో ఆ దుఃఖము మరింత అధికమగును. ఆ కోరిక తీరుటకు ఆటంకము కలిగినచో క్రోధము కలుగును. ప్రతికూల పరిస్థితి ఏర్పడినచో ద్వేషము కూడా కలుగును.

**అశక్యశ్చేత్ప్రతీకారో విషాదః స్యాత్స తామసః ।**
**క్రోధాదిషు మహద్దుఃఖం సుఖశంకాపి దూరతః ॥16॥**

*16.* ఆటంకములకు ప్రాతికూల్యములకు ప్రతీకారము చేయగల శక్తి లేనిచో విషాదము కలుగును. అది తమోగుణ ఫలితము, మూఢవృత్తి. క్రోధము మొదలగువానియందు మహాదుఃఖము. ఆనందపు వాసన కూడా అతిదూరము.

**కామ్యలాభే హర్షవృత్తిః శాంతా తత్ర మహత్సుఖమ్ ।**
**భోగే మహత్తరం లాభప్రసక్తావీషదేవ హి ॥17॥**

*17.* కోరిక తీరి ఆ విషయము లభించినచో హర్షము కలుగును. అది శాంతవృత్తి అగుటచే మహానందము కలుగును. ఆ విషయమును అనుభవించుటలో ఇంకా మహత్తరమైన ఆనందము కలుగును. అది లభించుననే ఆశ ఉన్నప్పుడే కొంత ఆనందము కలుగును గదా.

**మహత్తమం విరక్తౌ తు విద్యానందే తదీరితమ్ ।**
**ఏవం క్షాంతౌ తథౌదార్యేక్రోధలోభనివారణాత్ ॥18॥**

*18.* కాని సర్వోత్తమమైన ఆనందము విరక్తియందే కలుగును. అది విద్యానంద ప్రకరణమున వివరింపబడినది. అట్లే క్షమయందును ఔదార్యము నందును క్రోధలోభములు లేకపోవుట చేత మహత్తరమమైన ఆనందము కలుగును. *ప్ర.14.21-34*

**యద్యత్సుఖం భవేత్తత్తద్బ్రహ్మైవ ప్రతిబింబనాత్ ।**
**వృత్తిష్వంతర్ముఖాస్వస్య నిర్విఘ్నం ప్రతిబింబనమ్ ॥19॥**

*19.* ఏ యే ఆనందమును అభవించినను అది అంతా బ్రహ్మానంద ప్రతిఫలనమే. మానసిక వృత్తులు అంతర్ముఖములైనపుడు బ్రహ్మానంద ప్రతిఫలనము నిర్విఘ్నముగ జరుగును.

**సత్తా చితిః సుఖం చేతి స్వభావా బ్రహ్మణస్త్రయః ।**
**మృచ్ఛిలాదిషు సత్తైవ వ్యజ్యతే నేతరద్ద్వయమ్ ॥20॥**

*20.* సత్త, చైతన్యము, ఆనందము అని బ్రహ్మమునకు మూడు రూపములు. మట్టి రాయి మొదలగువాని యందు సత్తమాత్రమే వ్యక్తమగును. మిగిలిన రెండూ ప్రకటితములు కావు.

**సత్తాచితిర్ద్వయం వ్యక్తం ధీవృత్త్యోర్ఘోరమూఢయోః ।**
**శాంతవృత్తౌ త్రయం వ్యక్తం మిశ్రం బ్రహ్మేత్థమీరితమ్ ॥21॥**

*21.* బుద్ధి యొక్క ఘోరమూఢ వృత్తులందు రెండింటియందూ సత్త చైతన్యము రెండూ వ్యక్తములగును. శాంతవృత్తులందు సత్‌చిత్ ఆనందములు మూడూ వ్యక్తములగును. ఇట్లు బుద్ధివృత్తులతో కూడి జగత్తుతో సంపర్కము నొందిన బ్రహ్మము వర్ణింపబడినది. అదే మిశ్రబ్రహ్మము.

**అమిశ్రం జ్ఞానయోగాభ్యాం తౌ చ పూర్వముదీరితౌ ।**
**ఆద్యేఽధ్యాయే యోగచింతా జ్ఞానమధ్యాయయోర్ద్వయోః ॥22॥**

*22.* జగత్సంపర్కము లేని బ్రహ్మము యోగము చేతను జ్ఞానము చేతను గ్రాహ్యమగును. ప్రథమాధ్యాయ (ఏకాదశ ప్రకరణమున) యోగము రెండవ మూడవ అధ్యాయ (ద్వాదశ త్రయోదశ ప్రకరణ) ములందు జ్ఞానము చర్చింపబడినవి.

**అసత్తా జాడ్యదుఃఖే ద్వే మాయారూపం త్రయం త్విదమ్ ।**
**అసత్తా నరశృంగాదౌ జాడ్యం కాష్ఠశిలాదిషు ॥23॥**

*23.* అసత్త, జాడ్యము, దుఃఖము అని మాయారూపము మూడు విధములు. 'మానవుని కొమ్ము' మొదలగునువి అసత్తను సూచించును. కట్టె శిల మొదలగునవి జడత్వమును సూచించును.

**ఘోరమూఢధియోర్దుఃఖమేవం మాయా విజృంభితా ।**
**శాంతాది బుద్ధివృత్త్యైక్యాన్మిశ్రం బ్రహ్మేతి కీర్తితమ్ ॥24॥**

*24.* బుద్ధి యొక్క ఘోరమూఢవృత్తులందలి దుఃఖము, విజృంభిస్తే మాయను ప్రకటించును. శాంతవృత్తులతో కూడ మూడు వృత్తులందును బ్రహ్మము కలిసి ఉండుటచేత అది మిశ్రబ్రహ్మ మనబడినది.

**ఏవం స్థితేఽత్ర యో బ్రహ్మ ధ్యాతుమిచ్ఛేత్పుమానసౌ ।**
**నృ శృంగాదిముపేక్షేత శిష్టం ధ్యాయేద్యథాయథమ్ ॥25॥**

*25.* బ్రహ్మము మాయల స్వరూపము ఇట్టిదగుట చేత బ్రహ్మమును ధ్యానింపగోరే పురుషుడు అసత్తయగు నృశృంగము మొదలగువానిని ఉపేక్షించి మిగిలిన రెండింటిపై తగిన విధముగ లక్ష్యము ఉంచవలెను.

**శిలదౌ నామరూపే ద్వే త్వక్త్వా సన్మాత్రచింతనమ్ ।**
**త్వక్త్వా దుఃఖం ఘోరమూఢధియోః సచ్చిద్విచింతనమ్ ॥26॥**

*26. శిలాదులయందలి నామరూపములను ఉపేక్షించి సత్తామాత్రమును ధ్యానింపవలెను. ఘోరమూఢవృత్తులయందు దుఃఖమును వదలి సత్‌చిత్ స్వరూపములను ధ్యానింపవలెను.*

**శాంతాసు సచ్చిదానందాం స్త్రీనప్యేవం విచింతయేత్ ।**
**కనిష్ఠ మధ్య మోత్కృష్టాస్తిస్రశ్చింతాః క్రమాదిమాః ॥27॥**

*27. శాంతవృత్తులందు సత్ చిత్ ఆనందములను మూడింటిని ధ్యానింపవలెను. ఇవి క్రమముగా కనిష్ఠ మధ్యమ ఉత్కృష్ట ధ్యానములు అనబడినవి.*

**మందస్య వ్యవహారేఽపి మిశ్రబ్రహ్మణి చింతనమ్ ।**
**ఉత్కృష్టం వక్తుమేవాత్ర విషయానంద ఈరితః ॥28॥**

*28. మందబుద్ధుల వ్యవహారమున కూడా మిశ్రబ్రహ్మమునైనా ధ్యానించుట శ్రేష్ఠము. అట్టి వారి ఉపయోగార్థమే విషయానందము వర్ణింప బడినది.*

**ఔదాసీన్యే తు ధీవృత్తేః శైథిల్యాదుత్తమోత్తమమ్ ।**
**చింతనం వాసనానందే ధ్యానముక్తం చతుర్విధమ్ ॥29॥**

*29. ఈ మూడు విధములైన బుద్ధివృత్తులు గాక, విషయముల పట్ల అంతఃకరణం ఉదాసీనమైనపుడు విషయసంపర్కము లేనందున ఉత్తమోత్తమ మగు ధ్యానము (బ్రహ్మానందపు) వాసనానందము గూర్చి కలుగును. ఇట్లు ధ్యానము నాలుగు విధములు.*

**న ధ్యానం జ్ఞానయోగాభ్యాం బ్రహ్మ విద్యైవ సా ఖలు ।**
**ధ్యానేనైకాగ్ర్యమాపన్నే చిత్తే విద్యా స్థిరీభవేత్ ॥30॥**

*30. ఈ నాలుగు విధములైన ధ్యానములందు జ్ఞానము యోగముల మిశ్రమము ఉండుట చేత అవి బ్రహ్మవిద్య అనే భావింపవలెను. ధ్యానముచే చిత్తము ఏకాగ్రమైనపుడు ఆ విద్య సుస్థిరమగును.*

**విద్యాయాం సచ్చిదానందా అఖండైకరసాత్మతామ్ ।**
**ప్రాప్య భాంతి న భేదేన భేదకోపాధి వర్జనాత్ ॥31॥**

*31. స్థిరమగు బ్రహ్మవిద్య (జ్ఞానము) నందు సచ్చిదానందములు*

ఖండము ఏకరసమునై భేదములు కలిగించు ఉపాధులు లేనందున వేరువేరుగ కాక ఒకటియై భాసించును.

**శాంతా ఘోరాః శిలాద్యాశ్చ భేదకోపాధయో మతాః ।**
**యోగా ద్వివేకతో వైషా ముపాధీనామపాకృతిః ॥32॥**

*32.* శాంతవృత్తులు ఘోరవృత్తులు మూఢవృత్తులు శిలాదులు అట్టి భేదమును కలిగించు ఉపాధులని చెప్పబడినవి. యోగ వివేకములచే వానిని తొలగింపవలెను.

**నిరుపాధిబ్రహ్మతత్త్వే భాసమానే స్వయంప్రభే ।**
**అద్వైతే త్రిపుటీ నాస్తి భూమానందోఽత ఉచ్యతే ॥33॥**

*33.* నిరుపాధికము అద్వయము స్వయంప్రకాశము అగు బ్రహ్మతత్త్వము భాసించునపుడు జ్ఞానజ్ఞాతజ్ఞేయము లనెడి త్రిపుటి ఉండదు. కనుకనే అది భూమానందమనబడినది.

**బ్రహ్మానందాభిధే గ్రంథే పంచమోఽధ్యాయ ఈరితః ।**
**విషయానంద ఏతేన ద్వారేణాంతః ప్రవిశ్యతామ్ ॥34॥**

*34.* బ్రహ్మానందమనే పేరుగల ఈ గ్రంథమున పంచమాధ్యాయమగు విషయానందము వివరింపబడినది. దీనిని ద్వారము చేసికొని బ్రహ్మానందము లోనికి ప్రవేశించినపుడు.

**ప్రీయాద్ధరిర్హరోఽనేన బ్రహ్మానందేన సర్వదా ।**
**పాయాచ్ఛరీరిణః సర్వాన్స్వాశ్రితాన్ శుద్ధమానసాన్ ॥35॥**

*35.* ఈ 'బ్రహ్మానందము'చే హరీ, హరుడూ అగు భగవంతుడు సంప్రీతుడగు గాక. తనను ఆశ్రయించిన శుద్ధ చిత్తులనందరినీ ఆయన రక్షించుగాక.

**పంచదశ ప్రకరణము: సమాప్తము**

**పంచదశి పరిసమాప్తము**

ఏవమాదిషు శాస్త్రేషు దోషాః సమ్యక్ ప్రపంచితాః ।
విమృశన్ననిశం తాని కథం దుఃఖేషు మజ్జతి ॥

ఇట్టి శాస్త్రములందు విషయభోగమునందలి దోషములు చక్కగా వివరింపబడినవి. నిరంతరము వానిని పర్యాలోచించుచుండగా దుఃఖములందెట్లు మునుగ గలడు? మునుగడని భావము.

పుట: 220, VII:141


10114

రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాదు - 500 029
email : rktelugubook@gmail.com
www.rkmath.org

10114 Vedanta Panchadasi ₹ 75.00